# దేవ రహస్యం

Description and Interpretation
Of Indian mythology



కోవెల సంతోష్ కుమార్

# DEVA RAHASYAM

**KOVELA SANTOSH KUMAR**
Senior Journalist



ISBN: 978-81-924128-5-6
Vasireddy publications No: 6

**e-book Price: Rs. 150/-**

*First Edition:* 2nd November 2014

*For copies:* All leading book stores
*For e-book: www.kinige.com*

*Author Contact:*
email: kovelas@gmail.com
Phone: 9052116463

*Cover Design*
**Kiran Dasari**

*Page Layout*
**Venkatesh**

*Printed at*
**Om Sai Graphics,**
Narayanaguda, Hyderabad.

# ఇదీ రహస్యం...


- ఎవరీ గణపతి? ........................................ 15
- వీణావరదదండ మండితకరా ........................................ 19
- మూడో కన్ను ........................................ 22
- మాయ ........................................ 26
- త్రిమూర్తులు ........................................ 30
- కైలాసంపై శివుడున్నాడా? ........................................ 35
- ఆది కైలాసం ........................................ 39
- పంచశిఖరాలపై పరమశివుడు ........................................ 41
- కిన్నెర కైలాసం ........................................ 45
- మణిమహేశ ........................................ 50
- మంచుకొండల్లో మహాదేవుడు ........................................ 54
- అన్నపూర్ణ ........................................ 59
- మోక్షం ........................................ 64
- గుప్త మహాదేవుడు ........................................ 69
- మనుషులు చేసిన దేవుడు ........................................ 73
- దశావతారం ........................................ 78
- మథనమర్మం ........................................ 81
- దేవుడు శరీరాన్ని త్యాగం చేస్తాడా? ........................................ 86
- కృష్ణుడు నిజమా? అబద్ధమా? ........................................ 91
- మహాసాగరంలో మహానగరం ........................................ 96
- సత్యభామ ........................................ 101
- నరకాసుర ........................................ 106

- రాముడు ఎప్పుడు పుట్టాడు? ............................ 110
- రాముడికి సీత ఏమవుతుంది? ............................ 117
- సేతువు కట్టిందెవరు? ............................ 122
- రాముడు ఎలా గెలిచాడు? ............................ 127
- రావణ రహస్యం ............................ 132
- రాయలవారి కిష్కింధ ............................ 141
- మహాభారతం మహారహస్యం ............................ 145
- 18 రోజులు ............................ 149
- ఎలా గెలిచారు? ............................ 159
- పద్మవ్యూహం ............................ 164
- మందాకిని ............................ 167
- నరకం ద్వారాలు ............................ 174
- నాగా ............................ 178
- భూతలిపి ............................ 182
- బుద్ధుడు విష్ణువు అవతారమా? ............................ 186
- ప్రవాహ సరస్వతి ............................ 189
- ఆంజనేయుడి పెళ్లి ............................ 193
- అమ్మోరు ............................ 197
- యజ్ఞం ............................ 201
- దేవుని రథం ............................ 206
- దేవుడి ఇల్లు ............................ 213
- దేవరహస్యం ............................ 216

# ఆమోదము



ఈ అనేక వ్యాసముల సంపుటి శ్రీ కోవెల సంతోష్‌కుమార్ అనేక విషయముల గురించి వ్రాసిన రచనల సంకలనము. ఈ వ్యాసములు బహుముఖములైనవి. ఈ రచయిత రామాయణ భారతములను వాటియొక్క దేశవిదేశీయ స్థానములతో వాటికి గల సంబంధములను ఎంతో ప్రత్యక్ష ఆధారములతో చర్చించి మనకు తెలియచేసినారు. కైలాసము నుండి సత్యభామ వరకు, భారత యుద్ధ తంత్రముల వరకు ఇహానికి పరానికి సంబంధించిన విషయములతో సహా ఈ వ్యాసములు ఎంతో ఆసక్తికరముగా వున్నవి. బహుముఖ గ్రంథపఠనము ఊహాపోహాల సమర్థత కలిగిన ఈ రచనలు అన్ని రకాల అభిరుచులు, ఆసక్తి కలిగిన చదువరులు చదివి తీరవలసినదే. ఈ రచయితను మనసారా అభినందిస్తున్నాను.

మహామహోపాధ్యాయ

**డా॥ కందుకూరి శివానందమూర్తి**

పీఠాధిపతి, శ్రీశైవ మహాపీఠము

# భూమిక



దేవ రహస్యం అనే పేర వెలువడుతున్న ఈ గ్రంథం ప్రత్యక్షంగా మనం చూసే జగత్తునకు, మనం భావించి, నిర్మించుకున్న ఆధ్యాత్మిక జగత్తునకు నడుమ ఒక సంబంధాన్ని ఒక ఆత్మీయతను, ఒక అనుస్యూతిని నిర్మించే ప్రయత్నం చేస్తున్నది. ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో పురాగాథలు వ్యాపించి ఉన్నాయి. ముఖ్యంగా మన దేశంలో పురాగాథలు పురాణ ఇతిహాస రూపంలో వేల సంవత్సరాలుగా వ్యాప్తిలో ఉన్నాయి. పురాణ పురుషులు ఈ నేల మీదకు దిగివచ్చినట్టు, అవతార రూపాన్ని పొందినట్టు మనం విశ్వసిస్తున్నాం.

భగవద్గీతలో అవతార వాదం చెప్పబడటం, విభూతియోగంలో ఎక్కడెక్కడ సామాన్య జీవనానికి అతీతమైన శక్తి ప్రజ్వరిల్లుతూ ఉంటుందో, ఆ శక్తి అంతా ఈశ్వర తత్త్వమే అయినట్లు చెప్పబడింది. అవతార వాదంలో ఈశ్వరాంశ దిగివచ్చినట్టు చెప్పబడితే, వ్యక్తమైన సర్వ సృష్టిలోనూ, నిగూఢంగా ఉన్న దైవ దీప్తిని గూర్చి విభూతి యోగం చెప్తుంది. సృష్టిలో నిహితమై ఉన్న ఈశ్వర దీప్తి వ్యక్తమైన సృష్టి పరిణామాన్ని దైవోన్ముఖం చేసి దీన్ని దివ్య భూమికగా పరివర్తింపచేస్తుంది.

**ఏపున మంటినుండి యుదయించిన మైథిలి, మింటినుండి యా**
**వాపముఁగన్న రాఘవుఁడు వచ్చి ఋగధ్వములందు నుంచి ద్యా**
**వాపృథువుల్ సమాహరణభావము పొందిన రీతి సంగమ**
**వ్యాపృతిఁ బండు వెన్నెలమయంబుగఁ జేయుదు రాత్మ రోదసిన్**

(రామాయణ కల్పవృక్షము, బాలకాండ)

ద్యావాపృథువుల సమాగమం, సృష్టి రహస్యం, దేవరహస్యం. భారతీయుల భావనలో అంతర్గతంగా ఉన్న దైవాన్ని వెలికి తెచ్చి మృత్యుగ్రస్తమైన జరాత్రస్తమైన రుజావ్యస్తమైన ఈ ప్రకృతిని ఈ పరిమితుల నుంచి విముక్తంచేసి నూతన సృష్టిని

ఆవహింపజేయటం లక్ష్యం. రాముడి కథను గూర్చి చెప్పే సందర్భంలో ఈ రచయిత ఈ విషయాన్ని స్పష్టంగానే చెప్పాడు.

"సీత అంటే నాగటి చాలు అని అర్థం. భూమి అధోజగత్తుకు ప్రతీక.. అంటే కింది లోకాలకు ఉపరితలం భూమి.. వికసిస్తున్న చైతన్యానికి భూమిని సింబాలిక్‌గా భావిస్తారు. ఈ చైతన్యమే జనక మహారాజు అన్నది వాల్మీకి కథాంశంలో ప్రధాన అర్థం. ఈయన తన నాగలితో భూమిలో దారి ఏర్పాటు చేసి అందులో దాగి వున్న కుండలిని శక్తిని పైకి తీసుకువచ్చాడు.. ఆమే సీత అయింది. మనిషిలో మూలాధారం నుంచి తల దాకా ఆరు చక్రాలు ఉంటాయని అంటారు. ఇందులో మూలాధారం నుంచి సహస్రారం దాకా కుండలిని సర్పరూపంలో ప్రయాణిస్తుందిట.. ఇందులో సీత మూలాధారం అయితే.. రాముడు సహస్రారం.."

ఈ కాలంలో హేతువాదం కూడా కొన్ని పరిమితులకు లోబడి ఒక మూఢ విశ్వాసంగా మారిపోయి చాలా విలువైన జీవన పార్శ్వాలను అసత్యాలని తోసిరాజంటున్నది. ఈ సందర్భంలో ఈ పురాణ గాథలను చారిత్రక ఆధారాల మీదుగా పురాతన శిథిలాల మీదుగా సముద్ర గర్భాల్లో లభించిన అవశేషాల మీదుగా సత్యాలను నిరూపించే ప్రయత్నం జరిగింది. ఈ ప్రయత్నం ఈనాటి పాఠకుడిని, విశ్వాసం వైపు కొంతవరకు పయనింపజేస్తుంది. పురాగాథల్ని చర్చించే సందర్భంలో ఫ్రేజర్" ది గోల్డెన్‌బో" అనే గ్రంథంలో ప్రపంచ వ్యాప్త పురాగాథలలోని సమానాంశాలు పేర్చి చూపెట్టడం జరిగింది. ఇక్కడ ఈ గ్రంథంలో రచయిత




**దేవ రహస్యం అనే ఈ గ్రంథం దృశ్యమాధ్యమానికి అనుకూలంగా నిర్మింపబడ్డది. దీని పాఠకులు తమకు తాము తెలియకుండానే వక్తవ్యాన్ని అంగీకరించే దశలోకి చేరుకుంటారు. ఒక సమ్మోహన స్థితిలో సామాన్యులు ఇంద్రియ ద్వారాల నుండి సాగిపోతూ అతీంద్రియ స్థాయికి చేరుకుంటారు.**

ఆధునిక శాస్త్రీయ అంశాల ఆధారంగా పురాగాథాంశాలను నిజాలుగా నిశ్చయించే ప్రయత్నం చేశాడు.

భారతీయ పునరుజ్జీవన ఉద్యమంలో 19వ శతాబ్దం ఆరంభం నుంచి ఈ ప్రయత్నం ముమ్మరంగానే జరుగుతూ వచ్చింది. రామ్మోహన్ రాయ్, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద ఎమెదలైన మహనీయులు ఈ ప్రయత్నంలో అనుకూల వ్యతిరేక పార్శ్వాలలో మథించి భారత జాతికి ఒక ఆత్మ విశ్వాసాన్ని కలిగించి తరువాత ఉప్పొంగిన స్వాతంత్ర్య ఉద్యమానికి అనుకూలమైన భూమికను సిద్ధం చేశారు. శ్రీఅరవిందులు, రవీంద్రులు, తిలక్ మొదలైన మహానుభావులు ఈ దారిని తేజోవంతం చేశారు. మహాత్ముడు ఈ మొత్తం ప్రయత్నానికి మహాఫలంగా శిఖరస్థానంలో నిలబడ్డాడు.

దేవ రహస్యం అనే ఈ గ్రంథం దృశ్యమాధ్యమానికి అనుకూలంగా నిర్మింపబడ్డది. దీని పాఠకులు తమకు తాము తెలియకుండానే వక్తవ్యాన్ని అంగీకరించే దశలోకి చేరుకుంటారు. ఒక సమ్మోహన స్థితిలో సామాన్యులు ఇంద్రియ ద్వారాల నుండి సాగిపోతూ అతీంద్రియ స్థాయికి చేరుకుంటారు.

చిరంజీవి సంతోష్‌కుమార్ ఈ మార్గంలో శ్రద్ధతో తన జిజ్ఞాసను కొనసాగించి భారతీయ సాంస్కృతిక చైతన్య వికాసానికి దోహదం చేయగలడని ఆశిస్తున్నాను. శుభమస్తు.

– కోవెల సుప్రసన్నాచార్య

# నేను... నా కథలు

సరిగ్గా అయిదున్నరేళ్ల క్రితం ఇండియాటీవీ అనే ఓ హిందీ టెలివిజన్ చానల్‌లో ఓ ఉత్కంఠ రేపే కార్యక్రమం వస్తోంది. దాని శీర్షిక 'బిల్లీ కో కైసే బచాయే జాయ్' (పిల్లిని ఎలా రక్షించాలి?) సహజంగానే ఎవరికైనా ఏమిటీ కథ అన్న ఆసక్తి రేగుతుంది. వెనుక వాయిస్ ఓవర్ ఆర్టిస్ట్ థ్రిల్లింగ్‌గా కథ చెప్తున్నాడు. 'ముంబయిలోని ఓ అపార్ట్‌మెంట్‌లో చెలరేగిన మంటల్లో ఓ పిల్లి చిక్కుకుంది. అపార్ట్‌మెంట్ కిటికీ నుంచి బయటకు వచ్చిన పిల్లి కింద పడితే చనిపోతుంది తనను ఎవరైనా వచ్చి రక్షిస్తారా అని ఆర్తిగా ఎదురుచూస్తోంది. దాన్ని ఎవరు ఎలా రక్షిస్తారన్న ఆసక్తితో అపార్ట్‌మెంట్ కింద జనం గుమిగూడారు. పిల్లిని కాపాడేందుకు పెద్ద ఎత్తున ఫైర్ బ్రిగేడ్ సంఘటనా స్థలానికి చేరుకుంది. క్రేన్‌తో సిబ్బంది పిల్లి ఉన్న కిటికీ దగ్గరకు చేరుకున్నారు.. అంతటా ఒకటే ఉత్కంఠ.. ఎలా రక్షిస్తారు? అంతా ఎదురుచూస్తున్నారు.... తన దగ్గరకు వస్తున్న ఫైర్ సిబ్బంది కేసి పిల్లి భయం భయంగా చూస్తోంది.. వాళ్లు తనను రక్షించడానికే వస్తున్నారా అని అనుమాన పడుతోంది. ఒక్కసారిగా సైలెన్స్ .. అందరిలోనూ ఒకటే ఉత్కంఠ. అప్పటికే దాదాపు పదిహేను నిమిషాలు గడిచిపోయాయి. తెగ ఉత్కంఠ. తీరా సిబ్బంది సదరు కిటికీ దగ్గరకు వచ్చేసరికి పిల్లి భయపడి పక్కనే ఉన్న మరో కిటికీ పైకి పిల్లి జంప్‌చేసి వెళ్లిపోయింది. ఇంతవరకు బాగానే ఉంది.. ఇంతకీ ఈ కథలో లాజిక్కేమిటంటే వాయిస్ ఓవర్ ఆర్టిస్ట్ కూల్‌గా అసలు సంగతి చెప్పి శుభం కార్డు వేశాడు. ఏమిటా అసలు సంగతి అంటే.. సదరు అపార్ట్‌మెంట్‌లో అగ్నిప్రమాదం జరిగింది. అపార్ట్‌మెంట్‌లో చిక్కుకున్న వారికోసం ఫైర్ బ్రిగేడ్ వచ్చింది. ఆ సమయంలో కిటికీ బయటకు వచ్చిన ఓ పిల్లి ఇండియాటీవీ కెమెరామెన్ కంట పడింది. కేవలం 40 క్షణాల పాటు ఉన్న ఆ దృశ్యాన్ని అరగంట కార్యక్రమంగా రూపొందించారు. ఈ దృశ్య కార్యక్రమం జీ 24గంటలు చానల్‌లో జీ స్టోరీస్ అన్న వినూత్న కార్యక్రమానికి నాంది పలికింది. ఇందులో శైలి వేరు.. సాధారణ కథనాల మాదిరిగానో.. వార్తల మాదిరిగానో సాధారణంగా రాసే శైలికి పూర్తి భిన్నంగా కథనం ఉంటుంది. నిర్హేతువుతో ప్రారంభమై హేతువుతో ముగిసే కార్యక్రమం ఇది. దాదాపు 500 ఎపిసోడ్లు నిర్నిరోధంగా సాగిన అపురూపమైన కార్యక్రమం. రెండు దశాబ్దాల నా పాత్రికేయ వృత్తిలో నేనంటూ ఒకణ్ణి ఉన్నానని తెలుగు మీడియా ప్రపంచంలో గుర్తింపును తెచ్చిపెట్టిన కార్యక్రమం. రాత్రి 8.30 గంటల అరగంట సమయంలో వీక్షకుల రేటింగ్‌ను (టీఆర్పీ) పెంచుకోవాలని చేసిన ప్రయత్నం మొత్తం ప్రైమ్‌టైమ్ రేటింగ్‌పై సానుకూల ప్రభావం

**హిందూ ఆధ్యాత్మిక భావజాలాన్ని ఈ తరానికి అర్థమయ్యే రీతిలో.. వారి పరిభాషలోనే చెప్పటానికి ప్రయత్నించాను. పౌరాణిక గాథలు, పవిత్ర ప్రదేశాలతో పాటు, దేవీదేవతల రూప విశేషాల వెనుక దాగి ఉన్న శాస్త్రీయతను సహేతుకంగా, ఆధారభూతంగా నిరూపణ చేసే ప్రయత్నం జరిగింది. హిందూ ఆధ్యాత్మిక తత్త్వవేత్తలకున్నంత జ్ఞానం నాకు లేదు. ఈ తరానికి అంత లోతైన శాస్త్ర విశ్లేషణను అర్థం చేసుకునేంత సమర్థత లేదు. అందుకే.. సూటిగా, స్పష్టంగా, క్లుప్తంగా. దైవమనే భావన వెనుక చారిత్రక, సాంస్కృతిక, విజ్ఞాన శాస్త్ర విషయాలను, సృష్టి పరిణామ క్రమాన్ని వివరించటం జరిగింది.**

పడింది. ఆనాటి జీ24గంటలు చానల్ సీఈఓ, బిజినెస్ ఎడిటర్, ప్రస్తుతం స్టూడియో ఎన్ చానల్ డైరెక్టర్ ఆర్.శైలేష్‌రెడ్డి స్వయంగా నన్ను అభినందించడం మరుపురాని విషయం. ఈ కార్యక్రమం విషయంలోనే కాదు.. నాలుగున్నర సంవత్సరాల పాటు చానల్‌లో కీలకమైన అన్ని సందర్భాలలోనూ నాకు ముఖ్యమైన బాధ్యతల్ని అప్పగించి వృత్తిలో నన్ను పురోగమించేలా చేశారు. మేడారం జాతర జరిగిన సమయంలో దానిపై రూపొందించిన లఘు చిత్ర రూపకల్పనకూ ఆయనే ప్రేరణ. ఆయనకు ఎన్ని కృతజ్ఞతలు చెప్పుకున్నా తక్కువే.

జీస్టోరీస్ అన్నది నిర్వేతు వాదనతోనే మొదలైంది. కానీ కొన్ని ఎపిసోడ్లు పూర్తయ్యేసరికి కథాంశం మారుతూ వచ్చింది. రావణ రహస్యం ఎపిసోడ్ నా జీస్టోరీస్‌కు మాత్రమే కాదు.. నాకూ తిరుగులేని గుర్తింపును తెచ్చిపెట్టింది. రెండు భాగాలుగా ప్రసారమైన రావణ రహస్యం కార్యక్రమం కనీసం 20 సార్లు ప్రసారం కావటం తెలుగు టెలివిజన్ చరిత్రలోనే సంచలనం. హిందూ ధార్మికత, ఆధ్యాత్మికత, పౌరాణిక గాథలపై వారానికి ఒకటిగా దాదాపు వందకు పైగా ఎపిసోడ్లు చేశాను. హిందూ ఆధ్యాత్మిక భావజాలాన్ని ఈ తరానికి అర్థమయ్యే రీతిలో.. వారి పరిభాషలోనే చెప్పటానికి ప్రయత్నించాను. పౌరాణిక గాథలు, పవిత్ర ప్రదేశాలతో పాటు, దేవీదేవతల రూప విశేషాల వెనుక దాగి ఉన్న శాస్త్రీయతను సహేతుకంగా, ఆధారభూతంగా నిరూపణ చేసే ప్రయత్నం జరిగింది. హిందూ ఆధ్యాత్మిక తత్త్వవేత్తలకున్నంత జ్ఞానం నాకు లేదు. అంత లోతుల్లోకి వెళ్లి చర్చించేంత శక్తి సామర్థ్యాలు లేవు. ఈ తరానికి అంత లోతైన శాస్త్ర విశ్లేషణను అర్థం చేసుకునేంత సమర్థత లేదు. అందుకే.. సూటిగా, స్పష్టంగా, క్లుప్తంగా. దైవమనే భావన వెనుక చారిత్రక, సాంస్కృతిక, విజ్ఞాన శాస్త్ర విషయాలను, సృష్టి పరిణామ క్రమాన్ని వివరించటం జరిగింది. ఈ కథల్లో సంపూర్ణమైన సనాతన ధర్మంలోని పురాణాలు, ఇతిహాసాల్లోని అంశాల కంటే కూడా ఈ తరానికి దైవాన్ని దగ్గర చేయటం ఎలా అన్న కోణంలోనే కథనం సాగింది. ఇందులో హేతుబద్ధత కోసం దుర్భిణీ పెట్టి వెతకటం

కంటే.. ఇందులోని ఆసక్తికర అంశాలను చదివి ఆ కథనం లక్ష్యాన్ని గుర్తిస్తే చాలు. ఈ పరంపరలో నాకు సహచరులుగా పనిచేసిన వారు దినేష్.. సురేశ్‌లు, కథనాలకు హావ భావ గాత్రాలనిచ్చి వీక్షకుల దరిచేర్చిన ఈశ్వర్, శ్రీరామ్, రఘు, నాగలక్ష్మి, మానస, సుజిత, స్వర్ణలత..వాటికి దృశ్యరూపాన్నిచ్చి అద్భుతంగా ప్రజెంట్ చేసిన వాసు, కిషోర్, కృష్ణ, అనిల్, రఘు.. ఒకరా ఇద్దరా నా ఈ ధారావాహికా ప్రస్థానంలో సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు. దృశ్యరూపంలో అశేష తెలుగు జనావళి ఆదరణ పొందిన నా కథలు ఇప్పుడు దేవరహస్యంగా గ్రంథ రూపంలో రావటం అదృష్టం. సాధారణ వ్యాసపరంపరల శైలికి పూర్తి భిన్నంగా.. వినూత్న పంథాలో సాగిన కథాకథన దొంతర ఇది. మీలో ప్రశ్నలు సంధిస్తూ, ఆలోచనలు రేకెత్తిస్తూ, సమాధానం వెతికేందుకు ఆసక్తితో చదివేలా చేసే శైలిలో రాసిన కథనాలు ఇవి. మీకు తెలియకుండానే మిమ్మల్ని కథనంలోకి లాక్కుపోగల "ప్రసన్న కథాస్రవంతి" ఇది.

ఈ గ్రంథాన్ని చూచిన వెంటనే గురువుగారు సద్గురు శివానందమూర్తి గారు తమ సంపూర్ణమైన ఆమోదాన్ని తెలిపారు. ఆయన మధుర సాక్షాత్కార భాగ్యంతోనే నా జన్మ ధన్యమైంది. తన, మన, ధన, ప్రాణాలన్నింటికీ ఆధారభూమికైన దైవస్వరూపులు ఆశీస్సులు అందించటం కంటే ఇంక కావలసిందేముంది?

నా పుట్టుకే పూర్వజన్మ సుకృతం. ఏమి తపస్సు చేసి జన్మించానో నాకైతే తెలియదు కానీ, సాక్షాత్తూ విద్యాసరస్వతి కడుపున పుట్టాను.

**"నిజమునకు భావుకుండని**
**సృజనన్ పదివేల మంది నెవ్వడొయొక్కం**
**డు జనించు, మెరయువానికి**
**రజనీపతి కాంతి భ్రూభరమ్మపుడపుడై"**

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ విరచితమైన పద్యమిది. తెలుగుదేశంలో విశ్వనాథ సాహిత్యానికి ఈరోజు సాధికారత ఉన్న సారస్వత మూర్తి ఎవరైనా ఉన్నారంటే.. వారు మా నాన్నగారు.. ఆచార్య కోవెల సుపసన్నాచార్య. తెలుగు సాహిత్యంలో నవ్యసంప్రదాయవాదానికి నాంది పలికి, చేతనావర్తంతో అరాచక అధిక్షేపాన్ని నిరసించిన ఈ పుంభావ సరస్వతికి విశ్వనాథవారి ఈ పద్యం సంపూర్ణంగా వర్తిస్తుంది. సద్గురువులన్నట్లు సౌమ్య, గంభీర, మిత భాషాద్యనేక శుభలక్షణ సంపన్నులైన ఆ సరస్వతీ తీర్థులకు కుమారుడిగా పుట్టడం కంటే ఈ జన్మకు సార్థకత ఏముంటుంది? ఆయన సాహిత్య సాగరంలో నేను నీటిబొట్టునైనా కాలేకపోవచ్చు.. కానీ, సాహిత్యమైనా, సాంఘికమైనా రాయటమన్నదే వృత్తిగా మలచుకుని ఈషణ్మాత్రమైనా ఆయన మార్గంలో

నడిచే ప్రయత్నం చేయగలుగుతున్నానంటే ఆయన సంపూర్ణ కరుణా కటాక్షాలవల్లే. నా జీవితంలోని ప్రతి మలుపులోనూ.. నా రాతలోని ప్రతి పదంలోనూ ఆయన ముద్ర తప్ప అన్యథా కనిపించదు. నాకు అస్తిత్వం.. ఉనికి.. మనుగడ.. అంతా ఆ "కోవెల"నే.

అమ్మ.. వరంగల్లుకు కాకతి భద్రకాళి ఎలాగో.. మా కుటుంబానికి అమ్మే అమ్మలగన్నయమ్మ. జీవించి ఉన్నప్పుడు ఏమీ చేసిన వాడను కాను. చేద్దామనుకున్నప్పుడు కంటిముందు లేకుండా పోయి కఠినంగా శిక్షిస్తోంది. 28 ఏళ్ల వయసులో ఊరొదిలి పెట్టి హైదరాబాద్ వచ్చి చేరినవాణ్ణి.. పెద్దవాడు తప్ప చిన్నవాణ్ణి... ఎప్పుడూ దగ్గర ఉన్నవాణ్ణి కాను. గత 20 ఏళ్లలో చుట్టపు చూపుగానే వరంగల్లుకు వెళ్లి వచ్చిన వాణ్ణి.. అయినా ఆమె ముగురమ్మల మూలపుటమ్మ.. ఏనాడూ నన్ను వేరు చేయలేదు.. చేసి దూరం చేయలేదు. వరంగల్లుకు వెళ్లి తిరిగి హైదరాబాద్ బయలుదేరేప్పుడు తప్పనిసరిగా ఆమె చేతులమీదుగా కొంత నగదు తీసుకొని రావలసిందే. అది పది రూపాయలైనా కావచ్చు.. వంద రూపాయలైనా కావచ్చు. పెద్దవాడికైనా, నాకైనా తప్పనిసరిగా ఇచ్చి పంపించేది. ఆమె దిండుకింది నుంచి తీసి ఇచ్చే ఆ డబ్బులు నాకు అష్టైశ్వర్యాలతో సమానం.. రెండేళ్లు దాటింది. ఇప్పుడూ వరంగల్లుకు వెళ్తున్నా.. వస్తున్నా.. కానీ.. వచ్చేప్పుడు ఎవరిని డబ్బులడగాలి.. ఏమని అడగాలి? వరంగల్లు నుంచి బయలుదేరిన ప్రతిసారీ శరీరంలోని కండరాలన్నీ ఒక్కుదుటున కదిలిపోతాయి.. ఒళ్లు గగుర్పొడుస్తుంది. అమ్మ కనీసం మంచంపైనైనా సరే అలాగే ఉంటే బాగుండుననిపిస్తుంది. ఆమె పడుకున్న మంచం అమ్మ ఉన్నప్పటిలాగానే మౌనంగా పలకరిస్తుంది.. ఆమె కూర్చున్న కుర్చీ యథాతథ స్థానంలో అలాగే ఉండిపోయింది. అందులో ఆమె మాత్రం లేదు. వాటి స్థానం మారిస్తే ఆమె జ్ఞాపకం మాసిపోతుంది. అందుకే వాటిని నాన్నగారు కదల్చలేదు..

జీ స్టోరీస్ కథనాల పరంపరలో ఒక ఎపిసోడ్ "మీరు మీ అమ్మతో మాట్లాడుతున్నారా" అన్న శీర్షికతో ప్రసారం చేస్తే.. అమ్మ ఆందోళన చెందింది. నన్ను దృష్టిలో ఉంచుకుని రాశావా అని నిలదీసింది. రోజూ ఒకసారి ఫోన్‌చేసి పలకరించకపోతే నిష్ఠూరమాడింది. రెండేళ్లనుంచి ఆమె పలకరింపులు లేవు.. నిష్ఠూరాలు లేవు.. ఆప్యాయతలు లేవు.. కానీ, మౌనంగానే ఆమె సజీవమై నా వెన్నంటే ఉండి, వెన్ను తట్టి నడిపిస్తోంది. ఇదేమీ భావోద్వేగం కాదు. వాస్తవం. జీవితంలో ఎవరికీ ఎదురుకాని అపూర్వ అనుభవం. అమ్మ అస్తమించిన తరువాత అంత్యక్రియలలో భాగంగా కొత్త చీర, ఆకుపచ్చ గాజులు...పసుపు, కుంకుమలతో సాగనంపాము. రెండవరోజున ఉత్తరక్రియలు నిర్వహించటానికి వెళ్లిన నాకు అమ్మ చేతి గాజు ఒకే ఒక్కటి.. పగుల

కుండా, కరగకుండా చితాభస్మంలోంచి పునీతమై నా చేతికి చిక్కింది. సాధారణంగా మట్టిగాజులు అంత వేడిలో కరిగిపోకుండా ఉండటం అసాధ్యం. కనీసం పగిలిపోవాలి. అన్ని గాజులూ అలాగే కరిగిపోయాయి, కానీ, నేనున్నానంటూ నిండు ముత్తైదువతనానికి ఆదర్శమైన గాజుగా అమ్మ మళ్లీ తిరిగి వచ్చింది. నన్ను సంపూర్ణంగా కటాక్షిస్తోంది.. ఈ గ్రంథాన్ని ఆమెకు సభక్తికంగా అర్పించుకుంటున్నాను.

మనిషికి పంచప్రాణాలంటారు. కానీ, నాకూ పంచ ప్రాణాలున్నాయి. నా కష్టంలో, సుఖంలో, తొందరపాటులో, తొట్రుబాటులో, తప్పొప్పుల్లో నావెంటే ఉండి..వెన్నుదన్నై నిలిచి నడిపిస్తున్న ప్రాణాలివి. వెంకటరెడ్డి, విష్ణుదాస్ శ్రీకాంత్, వీరభద్రుడు. మొదటి ఇద్దరు సీనియర్ మోస్ట్ జర్నలిస్టులు.. మూడవ వారు వ్యాపారవేత్త. ఇక నాలుగో ప్రాణం ప్రముఖ కథారచయిత, కవి, కార్టూనిస్టు ఓదెల వెంకటేశ్వర్లు. ఈ గ్రంథ ప్రచురణలో ఆద్యంతం ప్రేరణ, ప్రోత్సాహం ఓదెల వెంకటేశ్వర్లుదే. నా తప్పుల్ని, ఆగ్రహాన్ని, తొందరపాటును అన్నింటినీ భరిస్తూ చివరకు దీనికి పూర్ణత్వం సాధించి పెట్టారు. వీళ్లకు కృతజ్ఞతలు చెప్పటమనేది చాలా చిన్నమాట. ఇక నా ఐదో ప్రాణం నా కుటుంబం. నా ప్రయాణంలో ముందుకు వెళ్లటానికి తన వంతుగా సహకరిస్తున్న స్వాతి, ఆనంద వల్లభ, ఆనంద లక్ష్మి లకు ఆశీస్సులు. నా మిగతా కుటుంబం ప్రపంచంలోని ప్రేమనంతా పోతపోసుకున్న ఒక అపురూపమైన శ్రీరంగధామం. వదిన, అనిరుధ్, చెల్లెళ్లు శ్రీవాణి, శ్రీలత.. వాళ్ల పిల్లలు. ప్రస్తుత సమాజంలో భారతీయ కుటుంబ వ్యవస్థ సజీవంగా నిలుచుందనటానికి మా కుటుంబమే ఉదాహరణ. మా అమ్మానాన్నలందించిన సంస్కారమది.

ఇంతకీ అసలైన వ్యక్తి గురించి ప్రస్తావించలేదు. తెలుగునాట ఆయన అపార అనుభవం ఉన్న పాత్రికేయుడు. ఆయన వాసిరెడ్డి వేణుగోపాల్. ఈ పుస్తకం ఇలా పాఠకుల ముందుకు వచ్చిందంటే కేవలం ఆయనే కారణం. ప్రచురణ బాధ్యత నుంచి సమస్తం ఆయన తన భుజస్కంధాలపై వేసుకుని నాకూ ఓ రచయితగా గుర్తింపునకు కారకులైన వేణుగోపాల్ గారికి ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా తక్కువే.

అలాగే.. ఈ పుస్తకం ముద్రణకు సహకరించిన రమణారావు పోకూరి,Project Manager,Wipro Technologies,USA గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ రచన అందరి ఆదరాన్ని చూరగొంటుందని ఆశిస్తున్నాను.

**–కోవెల సంతోష్‌కుమార్**



పూజకై తెచ్చినాడ, నీ పుస్తకమ్ము
నీ మనస్సునకెక్కుత, నీ మహస్సు
నీ వచస్సీమా వెలుగుల త్రోవయగుత
తనయు మన్నింపవమ్మ దీవెనల కురిసి



# ఎవరీ గణపతి?

*ప్రపంచంలో తొలి సర్జన్ ఎవరు?*
*చనిపోయిన వాళ్లను బతికించటం సాధ్యమేనా?*
*ప్లాస్టిక్ సర్జరీ అతిపురాతనమైనదేనా?*
*వినాయకుడి సృష్టి వెనుక రహస్యం ఏమిటి?*
*తొలిపూజలు గణేశుడికే ఎందుకు?*

మనిషి శరీరం.. ఏనుగు తల.. బాన పొట్ట.. చేటంత చెవులు.. భారీ కాయానికి చిన్నారి చిట్టెలుక వాహనం.. వింత రూపం.. అంతకంటే వింతైన వాహనం.. ఇలలో తొలి పూజలందుకునే పరమేష్టి. సకల విఘ్నాలను సమూలంగా హరించేసే పరమాత్మ.. వినాయకుడు.. గణేశుడు, గణపతి, విఘ్నేశ్వరుడు.. పేర్లు సహస్రం.. ఒకటే రూపం.. అదీ విచిత్ర రూపం.. ప్రాణం పోసుకున్న వెంటనే ఉసురు పోయిన రూపం.. ఏనుగు తలతో దైవత్వం పొందిన రూపం.. ఇదంతా ఎలా సాధ్యమైంది? సైన్స్‌కు, మెడికల్ సైన్స్‌కు అందని పరిజ్ఞానమా? లేక పుక్కిటి పురాణమేనా? దీని వెనుక కారణమింకేదైనా ఉందా? అందరికీ తేలిగ్గా అందుబాటులో ఉండే దేవుడు గణనాథుడు.. ఇవాళ్టి యూత్‌కు ఎంతో ఇష్టమైన దైవం వినాయకుడు.. గాళ్స్‌కి మరింత లవ్‌లీ గాడ్ గణేశ.. మరిలాంటి దేవుడు బేసిగ్గా ఏనుగు ఆకారంలో ఎందుకు ఉన్నాడు? తల్లి పార్వతీదేవి నలుగుపిండితో చేసి ప్రాణం పోసిన బాలుడి తల నరికి ఏనుగు తలను శివుడు పెట్టి అతికించాడన్నది కథనం.. మామూలుగా అయితే అది సాధ్యమయ్యే పనేనా? ఏమిటీ సీక్రెట్.. వాట్ ఈజ్ ది లాజిక్?

అంటే అన్నారు కానీండి.. హిందూ దేవతలందరికీ అందమైన రూపాలు ఉన్నాయి.. అంతకంటే అందమైన వాహనాలూ ఉంటాయి. క్షణాల్లో ఎక్కడికైనా తీసుకెళ్లే ఫెసిలిటీలూ ఉన్నాయి. కానీ, వినాయకుడికి మాత్రం చిట్టెలుకే వాహనం. ఎందుకిలా? మనందరి తొలిపూజలను అందుకుంటాడే.. మనకు ఎలాంటి అడ్డంకులు ఎదురుకాకుండా చూస్తాడే.. అలాంటి దేవుడి విషయంలో ఏమిటిది?

శాస్త్ర సాంకేతికతకు, పరిజ్ఞానానికి ఇది అసంభవమైన విషయం.. కానీ, ఎలాంటి ఆధారం లేకుండా, లాజిక్‌లెస్‌గా ఇన్ని కథలు ఎలా పుట్టాయి? పార్వతీదేవి తాను నలుగు పిండితో బొమ్మనుచేసి ప్రాణంపోసింది. ఆ బాలుడు అమ్మ స్నానం చేస్తుంటే ఎవరూ లోపలికి వెళ్లకుండా బయట కాపలా ఉన్నాడు.. చివరకు పరమేశ్వరుణ్ణే అడ్డగించాడు..

ఆయనేమో ఈ పిల్లోడి తల నరికేశాడు.. అదేమిటని తల్లి ఏడిస్తే సేవకులను పంపించి ఏనుగు తలను తెప్పించి అతికించాడు. ఒకసారి తల నరికిన తరువాత మరో జీవి తలను తెచ్చి అతికించి ప్రాణం పోయటం సాధ్యమేనా? ఒక మనిషి గుండెను మరో మనిషి గుండెకు అమర్చటం మనకు తెలుసు. శరీరంలోని వివిధ భాగాలను ఒక జీవిలోంచి మరో జీవికి మార్చి అమర్చటమూ తెలుసు. కానీ, ఏకంగా విగతజీవుని తిరిగి బతికించటం కోసం తలల ట్రాన్స్‌ప్లాంటేషన్ జరిగింది. అంటే విశ్వంలో తొలి సర్జరీ చేసింది ప్రకృతిలో మమేకమైన ఈశ్వరుడు. ప్రపంచానికి తొలి కంటి ఆపరేషన్ చేసిన శుశ్రుతుడి గురించి విన్నాం. ఇది చరిత్ర. అలాగే పౌరాణిక గాథల్లో ఉన్న గణపతి కథలోని రహస్య కథాకథనం భారతదేశంలో వైద్య శాస్త్రపు మూలాలను గురించి సంకేతప్రాయంగా చెప్పటమే.

గజాననునికి గజముఖం ఉండటం వెనుక అర్థం ఇంకేముంది? హిందూ మైథాలజీలో పేర్కొన్న కథలన్నింటి వెనుక మన సమాజానికి అందుబాటులో ఉండే సైంటిఫిక్ రీజన్స్ అన్నీ ఉన్నాయి. కుండలినీ శక్తి స్వరూపుడైన మహాగణపతి సూచించే పరమార్థం వేరే వుంది.. దేవుడు లేడని గుడ్డిగా వాదించేవారికి, ఉన్నాడని విశ్వాసంతో ఆరాధించే వారికీ అంతుపట్టని రహస్యార్థాన్ని గణపతి తానే విప్పి చెప్తున్నాడు..

తొలి పూజలను అందుకునే దేవుడు మహాగణాధిపతి అన్నది అందరికీ తెలిసిన విషయమే.. భాద్రపద మాసంలో పూజలను చేస్తాం. దేనికి? సాధారణంగా మనకు ఉగాదితో, అంటే చైత్ర మాసంతో సంవత్సరం మొదలవుతుంది. సంవత్సరం మధ్యలో వినాయక చవితి వస్తుంది. అది కూడా తొలి పూజ వినాయకుడికి చేస్తున్నామంటున్నాం. ఇదెలా సాధ్యం? చైత్రమాసం ప్రారంభమైన తరువాత, శ్రీరామనవమి వస్తుంది.. ఆ తరువాత శ్రావణంలో వరలక్ష్మి వ్రతం చేసుకుంటాం.. అలాంటప్పుడు గణపతికి చేసేది తొలి పూజ ఎలా అవుతుంది? ఇక్కడే అసలు రహస్యం దాగి ఉంది. భారతదేశం మొదట్నుంచీ మట్టిని నమ్ముకున్నది. 80 పర్సెంట్ ప్రజలు వ్యవసాయం మీద ఆధారపడ్డ దేశం మనది. వ్యవసాయ సంవత్సరం, అంటే ఖరీఫ్ సీజన్ భాద్రపద మాసంలోనే ప్రారంభం అవుతుంది. ఈ నెల మొదలు కాగానే నాలుగో రోజునే వినాయక చవితి వస్తుంది. ఈ సొసైటీలో మనిషి పూర్తిగా ఆధారపడ్డ ఒకానొక వ్యవస్థను... ఉత్పాదక రంగాన్ని, జీవనాధారాన్ని మహాగణపతి సాధికారికంగా సూచిస్తున్నాడు. అది వ్యవసాయం. దానికి ఆయన నిలువెత్తు ప్రతీక.. ఆ వ్యవసాయం ప్రారంభించేందుకు ముందు ఎలాంటి విఘ్నాలు రాకుండా వుండాలని కోరుకుంటూ స్వామికి తొలి పూజలను అందిస్తారు.. ఈ పూజ కూడా విశిష్టమైన పద్ధతిలో జరుగుతుంది. పూజ ప్రారంభం నుంచి, చివరి దాకా వ్యవసాయాధారితంగానే జరుగుతుంది. మిగతా ఏ దేవుళ్లకూ లేని ప్రత్యేకత అది. ఎవరికీ అందని ప్రత్యేక భక్తి సేవ అది. గణపతి మన మూలాధారం.. మరి వ్యవసాయానికి ఎలా ఆధారమయ్యాడు? మనం చేసే ప్రతి పనిలోనూ ఏదో ఒక వ్యవసాయ సంబంధ అంశాలు చోటు చేసుకోవటం బాగా గమనిస్తే అర్థమవుతుంది. వినాయక చవితి కూడా అలాంటిదే.. సరిగ్గా ఖరీఫ్

**గణపతి అక్షరాలా పంటల దేవుడు. ఆ ఆకారం భూమికి ప్రతీక. గజముఖం జీవశక్తికి గుర్తు. ఆయనకు ఉన్న ఏకదంతం నాగలికి గుర్తు. గణపతికి ఉన్న పెద్ద చెవులు పంట చేతికి వచ్చాక తూర్పారబట్టే చేటలకు సింబల్. మహాగణాధిపతికి ఉన్న తోరపు బొజ్జ.. ధాన్యాన్ని దాచే గాదెకు గుర్తు. అంత భారీకాయానికి చిట్టెలుక వాహనంగా ఉండటమూ వ్యవసాయ సంబంధమే.. పంటపొలాల్లో మొక్కలను నాశనం చేసేది ఎలుక. దాన్ని అణచివేయటానికి ప్రతీకే ఎలుకను వాహనంగా చేసుకోవటం. బొజ్జపై పామును బంధించటమూ దీన్ని సూచించటమే.**

సీజన్ ప్రారంభమయ్యే సమయం. రైతులు నాట్లు వేయటానికి సిద్ధంగా ఉండే సమయం. అందుకే విఘ్నేశ్వరుడిని పూజించి పంటలు సమృద్ధిగా పండాలని కోరుకుంటూ నాట్లు వేసే కార్యక్రమాన్ని ప్రారంభిస్తారు. భాద్రపద చవితి వ్యవసాయ సంవత్సరం ఖరీఫ్ సీజన్ ప్రారంభంలో తొలి దేవరకు వేల మొక్కులు ప్రారంభిస్తారు.

గణపతి అక్షరాలా పంటల దేవుడు. ఆయన ఆకారం భూమికి ప్రతీక. గజముఖం జీవశక్తికి గుర్తు. ఆయనకు ఉన్న ఏక దంతం వ్యవసాయంలో నాగలికి గుర్తు. గణపతికి ఉన్న అతి పెద్ద చెవులు పంట చేతికి వచ్చాక తూర్పారబట్టే చేటలకు సింబల్. మహా గణాధిపతికి ఉన్న తోరపు బొజ్జ పండిన వడ్లను పోసేందుకు ఉపయోగించే గాదెకు గుర్తు. అంత భారీకాయానికి చిట్టెలుక వాహనంగా ఉండటమూ వ్యవసాయ సంబంధమే.. పంటపొలాల్లో మొక్కలను నాశనం చేసేది ఎలుక.. దాన్ని అణచివేయటానికి ప్రతీకే ఎలుకను వాహనంగా చేసుకోవటం. బొజ్జపై పామును బంధించటమూ దీన్ని సూచించటమే. అన్నింటికీ మించి వినాయకుడి వ్రతంలో మొత్తం 21 పత్రాలను ఉంచి పూజిస్తాం. జాజి, మాచీపతి, మారేడు, తులసి, విష్ణుక్రాంత లాంటి పత్రాలను ఇందులో ఉపయోగిస్తాం. ఇవన్నీ పంటపొలాల పరిసర ప్రాంతాల్లో లభించేవే. విచిత్రమేమంటే ఈ పత్రాలన్నీ ఔషధ మొక్కలు. వినాయకుడికి ఉండ్రాళ్లను నైవేద్యంగా పెడతాం.. వీటిని బియ్యంతో చేస్తారు. మన ప్రధాన పంట వరి. వినాయకుణ్ణి పూజించటం అంటే మన కన్నతల్లిని, కన్న భూమిని, అన్నం పెట్టే పొలాన్ని, సేద్యాన్ని, నీటిని పూజించినట్లే.. మన జీవనాధార పనుల్లో ఎలాంటి ఆటంకాలు కలగకుండా ఉండేవాడు కాబట్టే గణపతికి తొలిపూజ. ఆయన తొలి దేవర.

గణనాథుడి ఆవిర్భావమే ఒక విశేషం.. ఆయన అవతారం వెనుక అనేక అంశాలు వున్నాయి. ఆయన గజముఖం కూడా అలాంటి సింబాలిక్‌గానే భావించాలి. గణపతి ఓంకార స్వరూపం. బృహస్పతి, బ్రహ్మణస్పతి కూడా గణపతియేనని వేదాలు చెప్తున్నాయి. పరతత్వం, గాణాపత్య మార్గంలో గణపతిని పరబ్రహ్మ స్వరూపంగా భావించి పూజిస్తారు. జానపదులు పంటల దేవుడిగా పూజిస్తారు. ఖగోళశాస్త్రంలో కూడా గణపతిని గూర్చిన ప్రస్తావన ఉంది. గణపతి తత్వాన్ని గురించి ఎన్ని రకాలుగా విశ్లేషించినా, సంపూర్ణంగా అర్థం చేసుకోవటం కష్టసాధ్యం. ఒక్కమాటలో చెప్పాలంటే సంపూర్ణమైన సృష్టికి గణపతి

ప్రతిబింబం. ఆయన జీవుడికి, దేహాత్మ భావనకు ప్రతీక. ఎందుకంటే గణపతి మూలాధారంలో ఉంటాడు. సమస్త శరీర భారాన్ని మోసేది మూలాధారం. మరో మాటలో చెప్తే, సమస్త జీవకోటికి ఆధారభూతమైంది భూమి. గణపతి ఈ పృథ్వీతత్వానికి ప్రతీక. కాబట్టే గణపతి స్వరూపం మనకు స్థూలంగా కనిపిస్తుంది. పదార్థం.. (మ్యాటర్) ఎప్పుడూ స్థూలంగానే ఉంటుంది. అందుకే గణపతి శరీరం భారీగా ఉంటుంది. పెద్ద జంతువు ముఖం, బాన పొట్ట, భారీ కాయం వెరసి గణపతి స్వరూపం. అనంతమైన శూన్యం నుంచి మొదట పదార్థం ఉద్భవించింది. దాని నుంచి ప్రకృతి ఆవిర్భవించింది. ఆ ప్రకృతికి ప్రాణశక్తి లభించింది. దాని నుంచి జలచర, భూచరాలతో కూడిన జీవజాలం పుట్టాయి. ఆ తరువాత మనస్సు కలిగిన మనిషి పుట్టాడు. ఈ పరిణామ క్రమానికంతటికీ గణపతి ప్రతిరూపంగా కనిపిస్తాడు. స్థూలకాయం పదార్థమైతే, గజముఖం విశ్వంలోని జీవజాలానికి చిహ్నం. అందుకే గణపతికి జంతువులలో అతి పెద్దదైన ఏనుగు ముఖం ఉంటుంది. తద్వారా ఆయన గజముఖుడయ్యాడు. దానితో పాటే మానవ శరీరాన్నీ గణపతి కలిగి వున్నాడు. ప్రకృతితో మమేకం అయ్యాడు కాబట్టి ఆయనను ప్రకృతిలోని సమస్తమైన పత్రాలతో, పూవులతో పూజిస్తారు. దైవత్వాన్ని సిద్ధించుకోవటం అనేది భారతీయ సంస్కృతిలోని విశేషమైన సంప్రదాయానికి, ఆధ్యాత్మిక భావ సంపదకు సంకేతం. ప్రతి మనిషి పుట్టుకకు ఒక పరమార్థం ఉంటుంది. ఇదంతా అంగీకరించవలసిందే. పుట్టడం, కష్ట సుఖాలను అనుభవించటం, నిర్లిప్తంగా లోకంనుంచి నిష్క్రమించటం జన్మ వృథా చేసుకోవటమే. సమస్త జీవజాలంలో మనిషి మాత్రమే దివ్యచైతన్యాన్ని సాధించే దిశగా ఎదిగే సమర్థుడు. మానవుడిగా మాత్రమే కాక, దైవత్వాన్ని సాధించడం లక్ష్యంగా జీవించాలని గణపతి సూచిస్తున్నాడు. ఇదే లక్షణాన్ని సమన్వయపరుస్తూ గజాసుర వృత్తాంతం మన పురాణాల్లో ఉంది. గజాసుర సంహారార్థం పరమశివుడు కైలాసంనుంచి తరలివెళ్లిన సమయంలో పార్వతీదేవి నలుగుపిండితో బాలుడి బొమ్మను చేసి దానికి ప్రాణం పోసింది.. గజాసురుని వధించి తిరిగి వచ్చిన స్వామి బాలుడితో తగువు పడి అతడి శిరసును ఖండిస్తే, గజముఖాన్ని తీసుకువచ్చి తిరిగి ప్రాణం పోశాడు. పార్వతీ పరమేశ్వరులు ప్రకృతి పురుషులు. నలుగుపిండి పదార్థానికి, గజముఖం జీవశక్తికి ప్రతిరూపాలు.

సృష్టి ప్రారంభ స్థానమైన మూలాధారానికి అధిపతి కావటం వల్లనే గణపతి తొలి పూజలందుకుంటున్నాడు. గణపతి సంపూర్ణమైన కుండలినీ శక్తికి ప్రతీక.. కుండలినీ శక్తి మూలాధారం నుంచి ప్రారంభమై సహస్రారం దాకా పైపైకి ఎదుగుతూ వస్తుంటుంది. చిత్తూరు జిల్లా కాణిపాకంలోని వినాయకుడు ఈ కుండలినిశక్తికి గుర్తు. ఆయన నీటి లోంచి క్రమక్రమంగా పైకి ఎదుగుతూ వస్తుండటం ప్రత్యక్ష ఉదాహరణ.

# వీణావరదండ మండితకరా

ఈ దేశంలో అనంతకాలంగా కొనసాగుతూ వస్తున్న సనాతన ధర్మం చెప్తున్న ప్రకారం దైవీభావం అమూర్తమైనది. సనాతన ధర్మం చెప్తున్న ప్రకారం దేవీ దేవతలు నిరాకార నిరంజనులు. ఇది నిస్సందేహమయినప్పుడు నామరూపాలు లేని ఒక వస్తువును, ఒక గుణాన్ని ఊహించటం, భావన చేయటం సామాన్యుడికి అసాధ్యమైన అంశం. ఒక వస్తువును చూసినప్పుడో.. దాని రూపాన్ని ఆవాహన చేసినప్పుడో, ఒక గుణం అనుభవంలోకి వచ్చినప్పుడో కానీ, సామాన్యుడైన వాడికి దానిపై ఏకాగ్రత కుదరదు. ఒక అవ్యక్తమైన వస్తువుకు, లేక గుణానికి, లేక శక్తికి నామరూపాలు కల్పించుకుని దాన్ని భావించినప్పు డు మాత్రమే దానిపై ఏకాగ్రత కుదరటం సాధ్యపడుతుంది. ఈ భావన, ఈ అనుభూతి ఉ న్నత స్థాయికి చేరుకున్నప్పుడు నామరహితమైన, రూపరహితమైన ఆ వస్తువు సాక్షాత్కరిస్తుంది. ఆ వస్తువును, ఆ రూపాన్ని, గుణాన్ని సాధించేందుకు ఉపాసన ఒక మార్గం. భారతీయ హిందూ సంప్రదాయం చెప్తున్న పురాణ గాథలు, దేవీతత్త్వం అంతా ఈ నిర్గుణోపాసనను ఆధారం చేసుకున్నదే. ఒక శ్లోకాన్ని తీసుకున్నా.. ఒక కథను పరికించినా.. ఒక భక్తి క్షేత్రాన్ని సందర్శించినా.. అన్నింటా కనిపించేది ఒకటి.. దాని వెనుక దాగి ఉన్న రహస్య కథనం మరొకటి ఉంటుంది. అందులోని పరమార్థం ప్రజలకు.. ప్రజాక్షేమానికి... సంబంధించి.. అనుబంధించి ఉంటుంది.

ఈ కింది శ్లోకం చదవండి..

***యాకుందేందు తుషార హార ధవళా, యా శుభ్ర వస్త్రాన్వితా***
***యా వీణా వరదండ మండితకరా యాశ్వేత పద్మాసనా***
***యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతి భిర్దేవైస్సదా పూజితా***
***సా మాంపాతు సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా***

ఈ శ్లోకానికి అర్థం ఏమిటి?

ప్రపంచంలోని సమస్తమైన సారస్వత సంపదే సరస్వతి. సరస్వతి అంటే వాక్కు. ఆమె చాలా స్వచ్ఛమైనది. వీణా వరదండం చేతపట్టుకుని ప్రకాశిస్తున్నది. తెల్లని తామరపూవుపై కూర్చున్నది. హంసవాహనంపై ఉంది. ఇదంతా సరస్వతిదేవికి ఒక యోగ్యమైన మూర్తి కల్పన. దీని వెనుక ఉన్న అసలు అర్థం ఏమిటి? భావప్రకటనా శక్తికి... సరస్వతి సంకేతం. మరి ఈ సరస్వతి హంసపై ఉండటం ఏమిటి? వీణను చేతిలో పట్టుకోవటం ఏమిటి? దీని వెనుక ఉన్న రహస్యం ఏమిటి?

మనం పలికే ప్రతి శబ్దం.. దాని ధ్వని, ఉచ్చారణల వెనుక ఉన్న పరమార్థమే ఈ వీణా వరదండ మండితకరా అన్న పదంలో నిక్షిప్తమై ఉంది. మనిషి పుట్టినప్పటి నుంచి

మాట్లాడుతూనే ఉన్నాడు. మన నోటి వెంట మాట ఎలా బయటకు వస్తున్నదన్న దానిపై భాషా శాస్త్రవేత్తలు లోతైన పరిశోధనలు చేశారు. మాట అనేది మన నాభిస్థానం వద్ద మొదట ఉద్భవిస్తుందనేది భాషా శాస్త్రవేత్తల నిరూపణ. వైజ్ఞానికంగా రుజువైన వాస్తవమిది. నాభిస్థానంలో జన్మించిన శబ్దం వెన్నుపూస ద్వారా ఊర్ధ్వ ముఖంగా పయాణించి, కంఠం చేరుకుని అటు నుంచి ముఖతః అభివ్యక్తమవుతుంది. మనం రోజూ పీలుస్తున్న ప్రాణవాయువుకు, శబ్దానికి ఉన్న సంబంధం ఇక్కడ బయటపడుతుంది. వీణ లోని నాభి వద్ద తీగ మీటితే అక్కడ పుట్టిన శబ్దం తీగల మెట్ల మీదుగా ప్రయాణం చేసి ముఖం నుంచి పలుకుతుంది. ఇక్కడ తీగల మెట్లే వెన్నుపూస. వెన్నుపూసలో ఎముకల నిర్మాణం అచ్చంగా వీణలోని తీగల మెట్లను పోలి ఉంటుంది. అందులోని ఎముకల సంఖ్యకు.. ఇందులోని తీగల మెట్ల సంఖ్య కూడా దాదాపుగా సరిపోలుతుంది. మన శరీర ధర్మానికి సరిగ్గా సరిపోయే కల్పన ఇది. అంటే సరస్వతి మనలోనే ఉన్నదన్నమాట. అంతే కాదు.. వీణ వాదన మన వీనులకు సోకినప్పుడు శరీరం ఎంత ఆహ్లాదాన్ని పొందుతుందో.. శబ్దం ఉచ్చారణ వల్ల కూడా శరీరానికి ఉల్లాసం కలుగుతుంది. అందుకే శబ్దాలను స్పష్టంగా ఉచ్చరించాలని సూచించేది. నాభి నుంచి ప్రయాణించే శబ్దం కంఠం వరకూ.. ఆ తరువాత ముఖంలోని అనేక అవయవాలను స్పృశిస్తూ వస్తుంది. ఊపిరితిత్తులు, గొంతులో కండరాలు, నాలుక, దంతాలు, పెదవులు, ముఖంలోని కండరాలు.. ఇలా శరీరంలోని అన్ని అవయవాలను కదిలించి కానీ శబ్దం బయటకు రాదు. ఈ కండరాలకు తగిలిన తరువాత కానీ శబ్దానికి అక్షరాకృతి రాదు. భాషను విస్పష్టంగా పలుకుతున్న కొద్దీ దాని ప్రభావం, ఆయుర్దాయం మీద కూడా తీవ్రంగా ఉంటుంది. ఊపిరితిత్తులకు ప్రాణవాయువుతో పాటు శబ్దమూ ఆధారమే. ప్రాణాయామానికి మూలాధారమైన ప్రణవనాదానికి ఉన్న పరమ ప్రయోజనం ఇదే. ప్రాణానికి, ఊపిరితిత్తులకు బలాన్ని, శక్తిని సమకూర్చే అక్షరం ఓం కారం. ఈరోజు ప్రపంచమంతా ప్రాణాయామం వెంట పడుతోందంటే, వెంపర్లా డుతోందంటే.. కారణం ఈ ఓంకారమే. మన ధర్మం మనకు ఏనాడో దీని గురించి చెప్పు కుంటూ వస్తోంది.

అంతే కాదు. సరస్వతి బ్రహ్మలోకంలో ఉంటుంది. అక్కడ బ్రహ్మసరస్సు ఉందన్నది మరో భావన. ఈ సరస్సును ఆశ్రయించే సరస్వతి నదీరూపంలో ప్రవహిస్తున్నది. బ్రహ్మలోకం అంటే ఏమిటి? బ్రహ్మ శబ్దానికి అర్థాలు ఎన్నైనా ఉండవచ్చు. కానీ బ్రహ్మపదార్థం అనే అందరికీ సామాన్యంగా తెలిసిన మాట ఒకటుంది. ఎవరికీ అంతుపట్టనిది బ్రహ్మపదార్థం అన్నది వాడుక. అంటే అనంతమైన చైతన్య స్థానం ఇది. ఇదే చైతన్యం ఒక లోకం నుంచి మరో లోకానికి విస్తరిస్తూ వస్తోంది. ఆ చైతన్యం పేరే సరస్వతి. సరస్వతిని ప్రవాహరూపంగా అభివర్ణించటానికి మరో కారణమూ ఉంది. నదిలో ప్రవహించే నీరు ఎప్పటికప్పుడు తాజాగా ఉంటుంది. పాతనీరు సముద్రంలో విలీనమవుతుంటే.. కొత్తనీరు చేరి నదిని నిత్యనూతనంగా ఉంచుతుంది. అదే విధంగా ప్రజలు వాడే భాష ఎప్పటికప్పుడు





**మాట మన నాభిస్థానంవద్ద మొదట ఉద్భవిస్తుందనేది భాషా శాస్త్రవేత్తల నిరూపణ. వైజ్ఞానికంగా రుజువైన వాస్తవమిది. నాభిస్థానంలో జన్మించిన శబ్దం వెన్నుపూస ద్వారా ఊర్ధ్వ ముఖంగా పయాణించి, కంఠం చేరుకుని అటు నుంచి ముఖతః అభివ్యక్తమవుతుంది. పీలుస్తున్న ప్రాణవాయువుకు, శబ్దానికి ఉన్న సంబంధం ఇక్కడ బయటపడుతుంది. వీణ లోని నాభి వద్ద తీగ మీటితే అక్కడ పుట్టిన శబ్దం తీగల మెట్ల మీదుగా ప్రయాణం చేసి ముఖం నుంచి పలుకుతుంది. ఇక్కడ తీగల మెట్లే వెన్నుపూస. వెన్నుపూసలో ఎముకల నిర్మాణం అచ్చంగా వీణలోని తీగల మెట్లను పోలి ఉంటుంది. అందులోని ఎముకల సంఖ్యకు.. ఇందులోని తీగల మెట్ల సంఖ్య కూడా దాదాపుగా సరిపోలుతుంది. మన శరీర ధర్మానికి సరిగ్గా సరిపోయే కల్పన ఇది. అంటే సరస్వతి మనలోనే ఉన్నదన్నమాట.**

కొత్త సొబగులను సంతరించుకుంటూ పరిణామక్రమంగా ఎదుగుతూ ముందుకు సాగుతుంది. కాల ప్రవాహంలో ముందుకు సాగుతున్న కొద్దీ కొన్ని శబ్దాలను భాష వదిలేస్తుంది. మరి కొన్ని కొత్త శబ్దాలను జత చేసుకుంటూ పురోగమిస్తుంది. ఒకరి అంగీకారానంగీకారాలతో దానికి నిమిత్తం లేదు. ఈ పరిణామమే భాషలో మార్పునకు కారణమవుతుంది. భాషకు ఈ మార్పు ఒక సరికొత్త అలంకారం లాంటిది. వెయ్యేళ్లుగా తెలుగు భాషలో, భావనలో, భావుకతలో, అభివ్యక్తిలో వచ్చిన మార్పులు అనేకం. ప్రాజ్ఞన్నయ్య కాలం నాటి భాషకు, ఇప్పుడు మనం వాడుతున్న భాషకు మధ్య ఉన్న అంతరం అనంతం. మార్పులకు లోను కాకుండా ఏ భాషా మనజాలదన్నది నిర్వివాదం. భాష జీవనది కాబట్టే సరస్వతిని ప్రవాహమూర్తి అని పిలిచేది.

ఇక హంసవాహనం ఎందుకంటే.. హంస పాలను, నీళ్లను వేరు చేస్తుంది. విజ్ఞానం మంచిని, చెడును వేరు చేసి చూపి విజ్ఞతను పెంచుతుంది. ఆ విజ్ఞతకు మూర్తిమంతమే సరస్వతి. ఒక్కమాటలో చెప్పాలంటే స్పష్టమైన శబ్దం, అనుభవం పండిన విజ్ఞానం, ధర్మసహితమైన భావనాత్మకత ఈ మూడూ కలిస్తేనే సరస్వతి. ఆమె వ్యక్తి కాదు. వాగ్వ్యాపారంపైనే ఆధారపడి మనగలుగుతున్న ఈ జగత్తుకు ప్రాణశక్తి.

# మూడో కన్ను



*లోకాన్ని భస్మరాశిగా మార్చిన కన్ను*
*మన్మథుని బూడిద కుప్పగా మార్చిన కన్ను*
*అగ్ని గోళాలను విరజిమ్మిన కన్ను*
*మహేశ్వరుని ముక్కంటిని చేసిన కన్ను*
*మహా ప్రళయాన్ని సృష్టించే కన్ను*
*ఈశ్వరుడికి మాత్రమే ఉందా?*
*పరమేశ్వరుడి పరమార్థం ఏమిటి?*
*అంతుచిక్కని ఆధ్యాత్మిక రహస్యం ఏమిటి?*

ఒక రెప్ప తెరిచినంత మాత్రాన్నే మన్మథుడు బూడిద కుప్పగా మారిపోయాడు. ఒక రెప్ప తెరిచినంత మాత్రాన్నే మహాప్రళయమే వచ్చింది. అది మహాదేవుడి మూడో కన్ను.. పరమేశ్వరుడి త్రినేత్రం లోకాన్నే భస్మరాశిగా మార్చేస్తుంది. ఏమిటీ త్రినేత్రం..? మనకు ముక్కోటి దేవతలున్నారు.. త్రిమూర్తులున్నారు.. ఏడేడు లోకాల్లో ఉన్న వాళ్లు చాలామందే ఉన్నారు. వీళ్లలో ఏ ఒక్కరికీ లేని త్రినేత్రం మహాశివుడికే ఎందుకు ఉంది? ఆ కన్ను అగ్ని జ్వాలలనే ఎందుకు విరజిమ్ముతోంది? ఇలా ఉండటం సాధ్యమేనా? త్రినేత్రం నిజం అంతుచిక్కని దేవరహస్యం.

శివుడు స్మశానవాసి, చర్మాంబరధారి, బూడిద రాసుకుని తిరిగేవాడు, అన్నింటినీ వదిలేసినవాడు, అన్నింటికీ అతీతుడు, పేరు బోళాశంకరుడు, అడిగినంతనే వరాలిచ్చే దేవుడే కోపమొస్తే భస్మం చేయగలవాడు మూడు కన్నులవాడు. ఆ కన్ను తెరిస్తే మిగిలేది భస్మరాశులే.. అదే మూడో కన్ను. ఎందుకంటే పుట్టుక ఆయనే.. మరణం ఆయనే. ప్రకృతి పురుషుల్లో ఆది పురుషుడు ఆయన.. సృష్టికి కారకుడు ఆయనే.. లయకారుడూ ఆయనే. అందుకే ఆయన పరమ ఈశ్వరుడు అయినాడు.. దేవుళ్లలో మహాదేవుడు అయినాడు. ఆయన ఎంతగా అనుగ్రహాన్ని చూపిస్తాడో.. అంతకు వెయ్యిరెట్లు ఆగ్రహాన్ని ప్రదర్శించగలడు.. ఆ కన్ను తెరవనంత వరకు బోళా శంకరుడు.. కన్ను తెరిస్తే మహా ప్రళయకారుడు.. సమస్త విశ్వాన్ని తనలో లయం చేసుకోగల రుద్రుడు.

దేవతలందరిలో మూడు కన్నులు కలవాడు ఈశ్వరుడే.. ఈయనలోనే మరో విశేషం ఉంది. లింగరూపంలో దర్శనమివ్వడం.. ప్రపంచంలో మరే దేవుడికీ లేని రూపం..

పరమ ప్రత్యేకం. శివుడికి ఎందుకు ఇలాంటి రూపం ఉంది. ఏమిటీ ప్రత్యేకం. మూడో కంటికీ, లింగ రూపానికి మధ్య పోలికేదైనా ఉందా? శివుడి మూడో కన్నే శివలింగమా? అసలు మూడో కన్ను దేనికి సంకేతం? దానికీ, శివ లింగానికి మధ్య సంబంధం ఏమిటి?

పరమేశ్వరుడిలో మూడో కన్ను అంతర్లీనంగా ఉంటుంది. అది చాలా శక్తిమంతమైంది. దాన్ని ఓ అగ్ని పర్వతం అని పురాణాలు వ్యాఖ్యానించాయి. అందులోంచి వచ్చే అగ్ని శిఖలు సూర్యుడి కిరణాలకంటే వేల రెట్లు వేడిగా ఉంటాయిట. సాక్షాత్తూ ఆది సూర్యుడే మూడో కన్నుగా శివుడి భృకుటిపై కొలువై ఉన్నాడని మరో కథనం. దేవుడు లేడని నమ్మేవాళ్లకు మూడో కన్ను గురించిన మీమాంసే ఉండదు. దేవుడిని నమ్మేవాళ్లలో దీనిపై వివాదమే లేదు. ఎందుకంటే ఆయన దేవుడు కాబట్టి.. లయకారుడు కాబట్టి.. ప్రళయకాలంలో సమస్త విశ్వాన్ని అంతమొందించే బాధ్యతను తనపై మోస్తున్నాడు కాబట్టి ఆయనకు మూడో కన్ను ఉంటుంది. ఈశ్వరుడి అనంతమైన శక్తికి అది ఒక ప్రతీక.

పురాణాల సంగతి కాసేపు పక్కన పెడదాం. మూడో కన్ను నిజంగా కన్నేనా? దీని వెనుక మర్మమేదైనా ఉందా? అన్న సందేహమూ రావటం సహజమే. మిగతా దేవుళ్లే కాదు.. మనుషులకూ మూడో కన్ను ఉండే అవకాశం లేదా? ఉంది. మనలోనే శివుడున్నాడు. నిజం. మనలోనే మూడో కన్నూ ఉంది. ఇది ఇప్పటి దాకా అంతుచిక్కని దేవ రహస్యం.. సైన్సు లెక్కలకు జవాబు తేలని ప్రాబ్లమ్. మన శరీరంలోనే, మూడోకన్ను దాగి ఉంది. మన నడకను, నడతను, జీవిత మార్గాన్ని నిర్దేశించి అడుగడుగునా ఆదేశాలిస్తూ ముందుకు నడిచేలా చేస్తుంది. మనకి జ్ఞానాన్నిస్తుంది. మన సబ్‌కాన్షియస్ మైండ్‌ను కంట్రోల్‌లో వుంచుతుంది. అదే పీనియల్ గ్లాండ్.. సాక్షాత్తూ పరమేశ్వరుడి మహాలింగ స్వరూపం.. ఆయన త్రినేత్రం. సమస్త విశ్వాన్ని తనలో కలుపుకునే సామర్థ్యం ఉన్న మేధ. ఒక్క మాటలో చెప్పాలంటే మన లోపల నివసిస్తున్న మహాశివుడు... పీనియల్ గ్లాండ్.. ఏమిటిది? ఎలా ఉంటుంది? మనిషిలో ఉండే ఈ విభాగానికి, శివుడి మూడో కంటికి సంబంధం వున్నదేమిటి? మన భారతీయ సంస్కృతిలో ఉన్న విశేషమే అది. భగవంతుడితో భక్తుడు అనుసంధానమై ఉంటాడు.. భక్తుడితో భగవంతుడు మమేకమై ఉంటాడు. పరమేశ్వరుడి స్వరూపం వెనుక ఉన్న అంతుచిక్కని రహస్యం కూడా ఇలాంటిదే. శివుడి మూడో కన్నుకు, మన మేధస్సులోని పీనియల్ గ్లాండ్‌కు దగ్గరి సంబంధం ఉంది. మన మెదడులో సరిగ్గా మధ్యభాగంలో ధాన్యపు గింజ ఆకారంలో ఒక గ్రంథి ఉంటుంది. అన్ని రకాల కనెక్టివ్ కణాలన్నీ ఈ గ్రంథిని చుట్టుముట్టి ఉంటాయి. దీని ఉపరితల భాగం ప్రియల్ కాప్స్యూల్‌చే చుట్టి ఉంటుంది. ఇది సరిగ్గా మిడ్ బ్రెయిన్‌లో ఉంటుంది. చాలా నరాల ఫైబర్లు ఇందులోకి చొరబడి ఉంటాయి. దీని వల్ల మన శరీరంలోని అన్ని రకాల చర్యలను పీనియల్‌గ్రంథి నియంత్రిస్తుంది. మీరు ఒక్కసారి రెండు కళ్లూ మూసుకుని ధ్యాన ముద్రలో ఉండండి. మీ దృష్టిని రెండు కళ్ల మధ్య ఉన్న భృకుటిపై ఉంచండి.. మనసులో మీరు కోరుకున్న రూపం

**ఆగ్రహం వచ్చినప్పుడు మన భృకుటి ముడిపడటం మీరెప్పుడైనా చూశారా? ఖచ్చితంగా రెండు కళ్ల మధ్యనున్న భాగం ముడిపడుతుంది. మనలోని మూడో కంటికి ఇదే తార్కాణం. మెలటోనియన్ ఉత్పత్తిని పీనియల్ గ్రంథి చేస్తుంది. దీని కాంతిని రెటీనాలోని సెన్సిటివ్ కణాలు కనిపెడతాయి. ఈ కాంతిని శరీరంలోని అన్ని భాగాలకు వివిధ రూపాలలో, మార్గాలలో ప్రసరింపచేస్తుంది. పైకి కనిపించే రెండు కళ్లు బయటకు కనిపించే దృశ్యాలనే ప్రతిబింబిస్తాయి. పీనియల్ గ్లాండ్ అనేది అంతర్గత కాంతిని శక్తిమంతం చేస్తుంది. అందుకే దీన్ని మూడో కన్ను అన్నారు.**



మీ భృకుటిపై సాక్షాత్కరిస్తుంది. మీరు మనసును, మెదడును పూర్తిగా కంట్రోల్‌లో వుంచేందుకు ఇదే ఉపయోగపడుతుంది. మనలోని ఆగ్రహాన్ని, అనుగ్రహాన్ని ఇదే నిర్ణయిస్తుంది. ఆగ్రహం వచ్చినప్పుడు మన భృకుటి ముడిపడటం మీరెప్పుడైనా చూశారా? ఖచ్చితంగా రెండు కళ్ల మధ్యనున్న భాగం ముడిపడుతుంది. మనలోని మూడో కంటికి ఇదే తార్కాణం. మెలటోనియన్ ఉత్పత్తిని పీనియల్ గ్రంథి చేస్తుంది. దీని కాంతిని రెటీనాలోని సెన్సిటివ్ కణాలు కనిపెడతాయి. ఈ కాంతిని శరీరంలోని అన్ని భాగాలకు వివిధ రూపాలలో, మార్గాలలో ప్రసరింపచేస్తుంది. పైకి కనిపించే రెండు కళ్లు బయటకు కనిపించే దృశ్యాలనే ప్రతిబింబిస్తాయి. పీనియల్ గ్లాండ్ అనేది అంతర్గత కాంతిని శక్తిమంతం చేస్తుంది. అందుకే దీన్ని మూడో కన్ను అన్నారు. పీనియల్ గ్లాండ్ ఎలాంటి విధులను నిర్వహిస్తుందన్న దానిపై మనిషికి, అతని సైన్స్‌కు ఇంతవరకూ పూర్తిగా అర్థం కాలేదు. దాని స్థానం మెదడులోపల ఉంటుందని, దీనికి మంచి ప్రాధాన్యం ఉంటుందని మాత్రమే అర్థం చేసుకున్నారు. కానీ, దాని రహస్యాన్ని పూర్తిగా ఛేదించలేకపోయారు. కానీ, మన పూర్వికులు మాత్రం ముందే దీన్ని నిరూపించారు. మనలోని జ్ఞానచక్షువే త్రినేత్రంగా తేల్చారు. ఇందుకు మూల స్థానం మన రెండు కళ్ల మధ్యభాగం. దాన్ని కూల్‌గా వుంచేందుకే మనం అక్కడ బొట్టును ఉంచుతాం.. ఈశ్వర విభూతిని, వైష్ణవ తిరుమణిని అక్కడే వుంచుతాం. ఎందుకంటే అదే మన కేంద్ర స్థానం.. ఈశ్వర స్థానం.

నాదం – నకారం.. మంత్రం – మకారం.. స్తోత్రం – శికారం .. వేదం – వకారం.. యజ్ఞం – యకారం.. ఇది పంచాక్షరి రహస్యం. శివుడు ఈ మూల మంత్రానికి అధిపతి. శివపార్వతులు పురాణ దంపతులు. అందుకే మనలో శివతత్త్వం సంపూర్ణంగా ఉంటుంది. అందుకే పీనియల్ గ్లాండ్ పరమేశ్వరుని మూడో కన్ను మాత్రమే కాదు.. ఆయన లింగస్వరూపం కూడా అని నిర్వచిస్తోంది. శివలింగం వెనుక ఉన్న రహస్యం కూడా

ఇదేనని పురాణాలు వివరిస్తున్నాయి. అక్షరం ఆయన, ఆహారం ఆయన, ఆభరణం ఆయన, ఔషధం ఆయన, ఆనందం ఆయన. ఇది ఈశ్వరుడి పూర్ణ స్వరూప రహస్యం. మనిషి, ఆయన వేరు కాదు. ఆయన మూడో కన్ను..మనలోనూ దాగుందన్నది అందుకే. అదే పీనియల్‌గ్లాండ్.. మన మేధస్సును, మన పనితీరు క్రమాన్ని నిర్ణయించే హార్మోన్. దేవదారు చెట్టు శంకువు ఆకారంలో ఉంటుంది... మన శరీరంలోనే నెలకొని ఉన్న లింగ స్వరూపం. శివలింగం ఆత్మకు గుర్తు. పరమేశ్వరుడి ఆత్మకు ప్రతిరూపమే శివలింగం. ఆయన త్రినేత్రమే శివలింగంగా ఆవిర్భవించింది.

మనిషి మెదడులో పీనియల్ గ్లాండ్‌ది ఆత్మస్థానం అని పాశ్చాత్య ఫిలాసఫర్లు సైతం ఒప్పుకున్నారు. ముందుగానే చెప్పుకున్నట్లు భౌతిక రూపంలో ఇది మాస్టర్ గ్రంథిగా ఉపయోగపడుతుంది. స్పిర్చ్యువల్ లెవల్స్‌లో మూడో కన్నుగా తెరుచుకుంటుంది. వైద్యశాస్త్రం ప్రకారం పీనియల్ గ్లాండ్ చీకటినుంచి కాంతిని ఉత్పత్తి చేస్తుంది. మన దేవాలయాల్లో గర్భగుడి చీకట్లోనే ఉంటుంది. దీపాల వెలుగులోనే స్వామి దర్శనం చేసుకోవలసి వుంటుంది. పీనియల్ గ్లాండ్ ఇలాంటిదే. ఇందులోని ఆత్మలింగం నుంచే కాంతి పుంజాలు మనల్ని ముందుకు నడిపిస్తాయి. మనలో ఆరు చైతన్య చక్రాలు ఉంటాయి. సహస్రార చక్రం పీనియల్ గ్లాండ్‌లో ఉంటుంది. ఈ గ్రంథి మనకు కావలసిన సమస్త శక్తిని ఇస్తుంది. దేవతలకు అమృతం, సోమరసం ఎలాగో, మనకు కావలసిన మెలటోనిన్, సెరోటోనిన్, డిఎంటి5లను పీనియల్ గ్లాండే ఉత్పత్తి చేస్తుంది. మనకు ప్రాణాధారం ఇవే.

హిందూ దేవాలయాల్ని గమనించినా పీనియల్ గ్లాండ్ గురించి స్పష్టంగా అవగాహన కలుగుతుంది. మన దేవాలయ వాస్తును జాగ్రత్తగా పరిశీలిస్తే మనిషికీ, మనిషి లోపలి శక్తి చైతన్య కేంద్రాలకు మధ్య ఉన్న సంబంధం స్పష్టంగా కనిపిస్తుంది. మనిషి చనిపోయినప్పుడు కపాలమోక్షం జరుగుతుందని చెప్తారు. దహనం సమయంలో తలలో ప్రధానభాగం పగిలి శబ్దం వస్తుంది. అది వేరే ఏదో కాదు. పీనియల్ గ్రంథి ముక్కలై పోవటమే కపాలమోక్షమని అంటారు. స్పిర్చ్యువల్ లెవల్స్‌లో ఇది చివరి సన్నివేశం. పీనియల్ గ్లాండ్ స్మశానంలో పగిలిపోతుంది. ఈశ్వరుడు స్మశానంలో ఉంటాడు. మన లోపల మరో మనిషి ఉన్నాడని, అతణ్ణి కనుగొంటే దేవుణ్ణి కనుగొన్నట్లేనని భారతీయ తత్త్వవేత్తలు మొదట్నుంచీ చెప్తున్నారు. ఇస్లాం, క్రిస్టియానిటీల్లోనూ, బౌద్ధ, జైన మతాల్లోనూ ఈ అభిప్రాయమే బలంగా ఉంది. దాన్ని మనసు అన్నారు.. ఆత్మ అన్నారు.. జీవుడు అన్నారు.. వీటన్నింటినీ మించి ఆ లోపల ఉన్నది వేరెవరో కాదు ఈశ్వరుడే.. పరమేశ్వరుడే.. ఆయన ఆత్మలింగమే మనలోపల ఉన్నది. అది తెరిచే కన్నే త్రినేత్రం.

# మాయ

అనంత విశ్వంలో మనం ఎక్కడ ఉన్నాం? ఎలా ఉన్నాం? మనల్ని సృష్టించింది ఎవరు? ఎవరికీ అంతు పట్టని ఓ మిస్టరీ.. సైన్స్ అంతరిక్షంలో తెగ షికారు చేసేస్తోంది. అన్ని గ్రహాల ఆంతర్యాన్ని కనిపెట్టి తీరుతానని సవాలు చేసింది.. కానీ, సృష్టిలో తొలి జీవి ఎలా ఉద్భవించిందన్నది దానికి ఇంతవరకు అర్థం కాలేదు.. మొదలు తెలవటం లేదు.. తుది ఏమిటో కనిపించటం లేదు.. ఏదో అంతు తెలియని శక్తి మనల్ని నడిపిస్తోందని అన్ని మతాలూ చెప్తున్నాయి. దేవుడు ఉన్నాడని, ఆ దేవుడే ఈ సృష్టిస్థితి లయలకు కారణమని ఘంటాపథంగా చెప్తున్నాయి. ఇదే నిజమా? దేవుడు ఉన్నాడా? ఆ దేవుడే ఈ అనంత విశ్వానికి నాయకుడా?

మనిషి ఎలా పుట్టాడు.. ? వేల సంవత్సరాల నుంచి ఒకతరాన్ని మరో తరం అడుగుతున్న ప్రశ్న ఇది.. కోతిలో కొన్ని పోలికలున్నాయని కోతి నుంచి మనిషి పుట్టాడన్నారు. కానీ ఆ కోతి ఎలా పుట్టింది? అసలు భూమిపై జీవి ఎలా పుట్టింది? ఎలా పెరుగుతోంది? ఎలా చనిపోతోంది? ఈ సృష్టి వెనుక దాగున్న రహస్యం ఏమిటి? అన్నీ సందేహాలే.. ఈ సృష్టిని నడిపిస్తున్నదీ, నాశనం చేస్తున్నదీ ఒక మహాశక్తి.. ఏమిటా శక్తి.. దైవమాయేనా? మరేదైనా ఉందా? ఈ భూమిపై జరుగుతున్న అన్ని పరిణామాలకు, మార్పులకు అంతరిక్షంలో ఏదో ఒక మీట కారణమవుతోంది.. ఆ మీటను అనంత రోదసిలో కూర్చుని ఎవరో నొక్కుతున్నారు.. దాని కారణంగానే ఈ భూమిపై సృష్టి స్థితి లయలు జరుగుతున్నాయి. ఆ మీట నొక్కుతున్నదెవరు? బ్రహ్మా? విష్ణువా? మహేశ్వరుడా? లేక ఆదిశక్తా.. విశ్వంలో మనకు తెలియని మహాలోకాల్లో వీరు ఉన్నారా?

విశ్వంలో భూమి పరిమాణం ఎంత? సౌర మండలం ఎలా ఏర్పడింది? గ్రహాలు



తిరుగుతున్నాయి.. సూర్యుడు కదలటం లేదు. సూర్యుడి చుట్టూనే గ్రహాలన్నీ ఎలా తిరుగుతున్నాయి? మిల్కీవే అంటే ఏమిటి? పాలసముద్రమే పాలపుంతా? సూర్యుడే శ్రీమన్నారాయణుడా? ఈ విశ్వాన్ని నడిపిస్తున్నది ఆయనేనా?

అన్నీసందేహాలే.. దేనికీ సమాధానం దొరకటం లేదు.. ఎవరి విశ్లేషణలు వారు చేస్తున్నారు. ఎవరి వ్యాఖ్యానాలు వారు చేస్తున్నారు. కానీ, అన్నింటిలోనూ ఒక అంతసూత్రం ఏమంటే.. భూమిని దాని పైనుంచి ఏదో ఒక శక్తి ప్రభావితం చేస్తున్నదని. లక్షల సంవత్సరాలుగా భూమిపై సృష్టి జరుగుతోంది.. మనిషి పుడుతున్నాడు.. చనిపోతున్నాడు.. అదే సమయంలో భూ వాతావరణంలో అనుకోని మార్పులు అనేకం జరుగుతున్నాయి. భూమి లోపలి పొరల్లో కలిగే కదలికలు..భూమి అంతరాలల్లో పలకల మధ్య, అణువులు, పరమాణువుల మధ్య కలిగే సంఘర్షణల వల్ల విపత్తులు సంభవిస్తాయన్నది సైన్స్ చెప్తుంది. కానీ ఈ సంఘర్షణకు సైతం కారణం పైన అన్నింటికీ అతీతంగా ఉండే ఒకానొక శక్తి అన్నది మతాలు చెప్తున్నాయి. ఈ శక్తే దైవశక్తి అన్నది అన్ని మతాలు అంగీకరిస్తున్న సత్యం.. ఈ రెంటిలో ఏది నిజం? దేవుడు ఎక్కడున్నాడో మనకు తెలియదు. కానీ, రోదసిలో ఎవరికీ తెలియని ఒక శక్తి మాత్రం సమస్త విశ్వాన్ని నిర్వహిస్తోంది. ఇది అనంతమైన శక్తి.. వేల సూర్యుల వేడి దీని ముందు కొరగాదు. అంతటి మహాశక్తి ఎలా ఏర్పడింది? అది సృష్టిని ఎలా నిర్వహిస్తోంది? దాని రహస్యం ఏమిటన్నది ఛేదించటం సైన్స్ తరం కావటం లేదు. భూమి రోదసిలో ఒక భాగం. భూమిపై ఎలాంటి వాతావరణ మార్పులు జరిగినా స్పేస్ ఇంపాక్ట్ వాటిపై ఉంటుంది. ఈ స్పేస్ ఇంపాక్టే రోదసిలో ఎవరికీ కనిపించని శక్తి. అదే మహాశక్తి.. దైవశక్తి. అంతరిక్షంలో భూమికి ఉన్న స్థానం ఏమిటి? మనకు తెలిసిన ఈ ప్రపంచం యూనివర్స్‌లో ఓ చిన్న బిందువు మాత్రమే.. భూమిని మించిన గ్రహాలు, అగ్ని గోళాలు, నక్షత్రాలు కోట్ల కొలది రోదసిలో ఉన్నాయి. సూర్యుడి కంటే వేల రెట్లు ఎక్కువున్న గ్రహాలు ఉన్నాయి. కృష్ణబిలం అంటే బ్లాక్‌హోల్ లోతుల్లోపల ఏముంది.. దానికి అంతం అంటూ ఉందా? వేల కోట్ల మిల్కీవేలు యూనివర్స్‌లో ఉన్నాయి. అవి ఎన్ని ఉన్నాయి? ఇవే దేవలోకాలా? వీటినుంచే ఎనర్జీ మన భూమిపైకి వస్తోందా అన్న ప్రశ్నలకు జవాబు ఇప్పటికైతే లేదు. దైవశక్తి మాటెలా ఉన్నా రోదసినుంచి వచ్చే ఎనర్జీ మనిషి మనుగడపై తీవ్ర ప్రభావం చూపుతోందన్నది వాస్తవం. అతి వేడి.. అతి చల్లదనం, ఉరుములు.. మెరుపులు అన్నింటి వెనుకా ఈ ఎనర్జీయే ప్రధాన భూమిక నిర్వహిస్తోందన్నది నిజం. మనిషి చుట్టూ ఈ ఎనర్జీ ఆవరించి ఉంది. ఇదే కాస్మిక్ ఎనర్జీ.. భూమిపైన జీవి మనుగడ అంతా ఆధారపడి ఉన్న ఎనర్జీ. అణువు నుంచి పరమాణువును మనం ఛేదించాం.. భూమిపైన అతి పెద్ద విస్ఫోటనం అణ్వస్త్ర ప్రయోగం.. మనం కష్టపడి పరిశోధనలు చేసి నిర్వహించిన భారీ పరీక్ష. కానీ, మన ప్రయత్నం లేకుండానే.. వివిధ ప్రాంతాల్లో, వివిధ డిగ్రీల్లో, వివిధ తీవ్రతల్లో వేల విస్ఫోటనాలు రోదసిలో ప్రతిక్షణం జరుగుతుంటాయి. వీటిలోంచి వెలువడే ఎనర్జీ అత్యంత తీవ్రంగా ఉంటుంది.. ఈ ఎనర్జీ మిగతా రోదసితోపాటే,

జీవజాలం ఉన్న భూమినీ తాకుతుంది. ఈ ఎనర్జీ లెవల్స్ అంతుపట్టకుండా ఉంటాయి. ఇవి మన సైన్స్‌ను సవాలు చేస్తున్నాయి. స్పేస్‌లో వెలువడే ఈ శక్తి అతి గొప్ప కాస్మిక్ శక్తి.. గోళాల్లా ఉండే గ్రహాలు పిన్‌బాల్ గేమ్‌లో మాదిరిగా మూవ్ అవుతుంటాయి. ఈ మూమెంట్ నుంచి రోదసిలో కనీవినీ ఎరుగని శక్తి వెలువడుతుంది.. ఇది కాస్మిక్ ఎనర్జీ.. ఈ ఎనర్జీ మనం మన మనుగడ కోసం వినియోగిస్తున్న ఎనర్జీకి లక్షల రెట్లు ఎక్కువ. లక్షల పేలుళ్లు ఎలా సంభవిస్తున్నాయి. వీటి నుంచి వెలువడుతున్న కాస్మిక్ కిరణాలు భూమిపై ఎలాంటి ప్రభావాన్ని చూపిస్తున్నాయి? మనిషికి అంతుపట్టని ఈ మహాశక్తి తీవ్రత ఏమిటి? ఇవాళ మనిషి మేధస్సు ప్రధానంగా ఆలోచించేది ఎనర్జీ... మన సమాజానికి, ప్రజల అవసరాలకు ఎనర్జీ అనేది ఓ నిత్యావసరం. కానీ ఇది ఎక్కడి నుంచి వస్తుంది? అనంత రోదసిలో లక్షల రెట్లు వెలువడుతున్న శక్తి కేంద్రాల మధ్యలో మనం ఎక్కడ వున్నాం? ఎనర్జీ అంటే యాక్టివిటీ.. ఎనర్జీ అంటే వర్క్. నిరంతరం పని చేసేది, చైతన్యాన్నిచ్చేది. అది ఏ రూపంలోనైనా ఉండవచ్చు. థర్మల్ పవర్, కెనటిక్, విండ్ పవర్, ఎలక్ట్రో మాగ్నటిక్, కెమికల్, గ్రావిటేషనల్... ఇలా రూపాలు వేరైనా శక్తి రూపాలు ఒక్కటే. ఇది మార్పిడికి గురవుతుంది. తీవ్రంగా ఉంటుంది.. కానీ, నష్టం కాదు. కాస్మిక్ కిరణాల ప్రభావం ఇంతకంటే తీవ్రంగా ఉంటుంది. భూమిపైకి ప్రోటాన్ల రూపంలో, హీలియమ్ రూపంలో మరో రూపంలో కాస్మిక్ కిరణాలు వస్తున్నాయి. వాతావరణంలో అనేక మార్పులకు కారణమవుతున్నాయి. మనిషి చుట్టూనే కాదు.. భూమి చుట్టూ కాస్మిక్ ఎనర్జీ స్పెక్ట్రమ్ ఆవరించి ఉంది.

రెండు వందల కార్ల నుంచి వెలువడే ఎనర్జీ 20వేల వాట్లు ఉంటుంది. అదే ఒక రైలు నుంచి అయిదువేల వాట్ల ఎనర్జీ వస్తుంది.. ఒక ఎయిర్ క్రాఫ్ట్ నుంచి 200 మిలియన్ వాట్స్.. మనిషి అత్యంత అధికంగా ప్రొడ్యూస్ చేస్తున్న హైడ్రో ఎలక్ట్రిక్ పవర్ నుంచి పది బిలియన్ వాట్ల ఎనర్జీ కంటే ఎక్కువ ఉండదు.. రాకెట్ ప్రయోగంలో సెకన్‌కు 15 టన్నుల ఇంధన వినియోగంతో 190 బిలియన్ వాట్ల శక్తి విడుదలవుతుంది.

నిజానికి మానవ సమాజానికి ఎంత శక్తి అవసరం అవుతోంది? మనం ఎంత వినియోగిస్తున్నాం? ఒక్కసారి మనల్ని మనం ప్రశ్నించుకుంటే అర్థం అవుతుంది. సూర్యుడి నుంచి భూమికి చేరుతున్న ఎనర్జీ 170 క్వాడ్రా బిలియన్ వాట్లు.. మీకు తెలుసా? సముద్ర తరంగం ఒక్కటి పైకి ఎగిసిపడితే అందులో నుంచి వంద వాట్ల శక్తి వెలువడుతుందట. మనం రోజూ తీవ్ర స్థాయిలో చేసే ఎక్సర్‌సైజ్‌ల వల్ల సుమారు వెయ్యి వాట్ల శక్తి వెలువడుతుంది.. అదే కాస్మిక్ కిరణాల నుంచి వెలువడే ఎనర్జీ బిలియన్ల బిలియన్ వాట్లు. ఇంత ఎనర్జీతో కొన్ని లక్షల భూగోళాలపై జీవ సమాజం అవసరాలు తీర్చవచ్చు. ఉపగ్రహాల ప్రయోగాలు అవసరం లేదు..సహజ వాయువు కోసం తాపత్రయపడనవసరం లేదు. ప్రత్యామ్నాయ ఇంధన వనరులు అక్కర్లేదు. కల్పాంతం వరకు భూమి దిగుల్లేకుండా

ఉండవచ్చు. ఎనర్జీ.. ఇవాళ మనకు చాలా కీలకమైన అవసరం.. ఇది లేకుండా భూమి మనుగడే కష్టమైన దశలో మనం ఉన్నాం. లైఫ్ ఫోర్స్‌కు ఎనర్జీ ఆక్సీజన్ లాంటిది. కాస్మిక్ ఎనర్జీ ఇందుకు భిన్నం. సాధారణ శక్తి చైతన్యానికి, అన్నింటికీ అతీతమైన శక్తి చైతన్యానికి మధ్య ఉన్న అంతరం కాస్మిక్ ఎనర్జీ.. విజ్ఞాన శాస్త్రానికి, ఆధ్యాత్మిక చింతనకు మధ్య ఉన్న తేడా కాస్మిక్ ఎనర్జీ. విజ్ఞాన పరంగా చూస్తే ఒక విధంగా, స్పిర్చ్యువల్ దారిలో మరో విధంగా కనిపించినా.. మనిషిని శక్తిమంతుణ్ణి చేసేది కాస్మిక్ ఎనర్జీ అన్న అంశాన్ని రెండూ ఒప్పుకున్నవే. గ్రావిటేషన్ అనేది భూమిపైనే ఉందా? రోదసిలో మరెక్కడైనా ఉందా? వుందని రోదసిలో బ్లాక్‌హోల్ నిరూపిస్తోంది. అంతరిక్షంలో గ్రహాలను మింగేసే స్థాయిలో బ్లాక్‌హోల్స్ ఉన్నాయి. ఇవి ఆవిర్భవించటంలోనూ కాస్మిక్ ఎనర్జీయే కారణం. స్పేస్‌లో కాస్మిక్ ఎనర్జీ అత్యంత తీవ్ర స్థాయిలో ఉంటుంది.. నక్షత్రాల మధ్య సంఘర్షణ కావచ్చు... లైఫ్ అయిపోయిన నక్షత్రాలు పేలిపోవటం వల్ల కావచ్చు, కాస్మిక్ ఎనర్జీ అనేది స్పేస్‌లో ఊహించని స్థాయిలో ఉంటుంది.

కాస్మిక్ ఎనర్జీ అనేది అన్ని శక్తులను మించిన శక్తి. మహాశక్తి... మనిషికి అన్ని విధాలా అత్యవసరమైన శక్తి. ఇది కేవలం స్పేస్ ఏరియాలోనే లేదు.. కాస్మోస్‌లోని అన్ని ప్రాంతాల్లో ఉంది. గేలక్సీలలో, గ్రహాలలో, మనుషుల్లో, అణువుల్లో, పరమాణువుల్లో అంతటా కాస్మిక్ ఎనర్జీ విస్తరించి ఉంది. ఇది రకరకాల రూపాల్లో వెలువడుతుంటుందని సైన్స్ ఇప్పటికే నిరూపించింది. రోదసిలో రకరకాల విస్ఫోటనాల నుంచి అంతర్లీనంగా వెలువడే ఈ శక్తి క్రమంగా విశ్వాన్ని ఆవరించింది. అంతరిక్షం నుంచి భూమిని ఒక వలయాకారంలో కాపాడుతున్న ఆదిశక్తి ఇదే.

మన జీవితానికి అత్యంత అవసరమైన శక్తి కాస్మిక్ ఎనర్జీ.. మేధస్సును పూర్తి స్థాయిలో యాక్టివేట్ చేస్తుంది.. మన ప్రతి పనికీ పునాది ఈ కాస్మిక్ ఎనర్జీయే. పూర్తి నిద్రలో వున్నప్పుడు మనకు ఈ శక్తి అందుతుంటుంది. మన చూపులో, మాటలో, వినటంలో, ఆలోచనల్లో అన్నింటా ఈ ఎనర్జీ ప్రభావం ఉంటుంది. పిన్‌డ్రాప్ సైలెన్స్‌లో ఉన్నప్పుడు సైతం మనిషి కాస్మిక్ ఎనర్జీని అందుకుంటాడు.  నిశ్శబ్ద వాతావరణంలో వినిపించే శబ్దం ప్రణవం.. అంటే ఓంకారం.. సైంటిఫిక్‌గా రుజువైన సత్యం ఇది. కాస్మిక్ ఎనర్జీకి ఈ ప్రణవమే ప్రతీక. ఈ ఎనర్జీ మనలో విల్‌పవర్‌ను పెంచుతుంది. అందుకే కాస్మిక్ ఎనర్జీని పొందేందుకు మనవాళ్లు ధ్యానాన్ని మార్గంగా ఎంచుకున్నారు. దీని గురించి హిందూ ధర్మంతో పాటు ప్రపంచంలోని అన్ని మతాలూ గ్రహించాయి. చర్చించాయి. సాధించమని ప్రబోధించాయి. దీనికే మనవాళ్లు మాయ అని పేరు పెట్టారు.. మహాశక్తి అన్నారు.. ఆదిశక్తి అన్నారు.. దైవం అన్నారు.

# త్రిమూర్తులు



**ము**గ్గురు భర్తలున్నారు.. అంతా వాళ్లను దేవ దేవుళ్లని కొలుస్తారు.. కోరిన కోరికలను తీర్చమంటారు.. తమ సొమ్మేం బోయిందంటూ వీళ్లూ ఉదారంగా అడిగిన వారికి లేదన కుండా ఇచ్చేస్తుంటారు. గమ్మత్తేమిటంటే వీళ్లు మాత్రం పెళ్లాలు గీసిన గీటు దాటరు.. వాళ్ల మాట తు.చ. తప్పక పాటిస్తారు. నిజానికి వీళ్ల దగ్గర ఏమీ లేదు.. ఉన్నదంతా వీళ్ల శ్రీమతుల దగ్గరే.. వాళ్లు నడిపిస్తే వీరు నడుస్తారు.. వాళ్లు అండగా నిలిస్తే వీళ్లు విజయం సాధిస్తారు.. వాళ్లు తోడుగా ఉంటేనే వీళ్లు తమ విధులను నిర్వహించగలరు. వీళ్లు ప్రపంచాన్ని శాసిస్తారు. వీళ్లు శాసనలో పాలుపంచుకుంటారు. ఇంతకీ ఎవరు వాళ్లు. వాళ్ల వెనుక వున్న వీళ్ల కథేమిటి? ఎవరీ ముగ్గురు మొగుళ్లు? ఏం చేస్తుంటారు? భార్య చాటు భర్తలను చాలామందిని చూశాం. ఇల్లరికానికి వెళ్లి అత్తవారింటి ఆస్తిపాస్తుల్ని అనుభవించి భార్య చెప్పినట్టల్లా నడుచుకునే వాళ్ల గురించీ కన్నాం, విన్నాం. కానీ, ఈ ముగ్గురు మొగుళ్ల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవలసిందేముంది చెప్పండి? అదే మరి.. ఈ ముగ్గురూ స్పెషల్ కేటగిరీకి చెందిన వాళ్లు.. మనందరికీ అతీతులు.. ప్రపంచానికి అతీతులు.. అన్ని లోకాలకు అతీతులు.. అయినా వాళ్లు తమ పెళ్లాలు గీసిన గీటు మాత్రం దాటలేరు.

మనది మేల్ డామినెంట్ సొసైటీ.. మామూలుగా అయితే పెళ్లాం చాటు మొగుళ్లంటే

ఎవరికైనా కాసింత ఈసడింపే. ఇల్లరికం వెళ్లిన అల్లుడయితే వాడేం మగాడురా బుజ్జీ అని నిందించే వాళ్లే ఎక్కువ. భార్యను అదుపులో పెట్టుకుని అజమాయిషీ చేసే మొగుళ్లకు మన సమాజంలో గౌరవం కాసింత ఎక్కువే. కానీ, ఈ సొసైటీ ఏళ్ల తరబడి పూజిస్తున్నది ఎవరినో తెలుసా? భార్యచాటు భర్తల్ని.. ఆరాధిస్తున్నది ఎవరినో తెలుసా? పెళ్లాలు చెబితే వినే మగాళ్లని..?

***ఒకాయనేమో క్రియేటర్.. క్రియేటివిటీ మాత్రం ఆయన భార్యది..***

***మరొకాయన అడ్మినిస్ట్రేటర్.. ట్రెజరీ మాత్రం ఆయన భార్యది..***

***మూడో ఆయన డిస్ట్రాయర్.. పవర్ మాత్రం ఆయన భార్యది..***

***ముగ్గురూ భార్యచాటు భర్తలు.. వాళ్ల సాయం లేకుండా ఏమీ చేయలేని నిస్సహాయులు..***

***ఆమె నేర్పితే ఈయన సృష్టించాలి.***

***ఆమె సొమ్ములిస్తే.. ఈయన పరిపాలించాలి***

***ఆమె పవర్‌తో ఈయన శిక్షించాలి***

వాళ్లు ముగ్గురూ ఈ ప్రపంచానికి తండ్రులు.. వీళ్లు ముగురమ్మలు.. వాళ్లు త్రిమూర్తులు.. వీళ్లు త్రిదేవతలు.. ప్రపంచాన్ని పాలించేది త్రిమూర్తులు.. వాళ్ల చేత పరిపాలింపచేసేది మాత్రం ముగురమ్మలే.. మనకున్న ముక్కోటి దేవతల్లో త్రిమూర్తులను మించిన వాళ్లు లేరు కదా.. అలాంటి వారికి సొంతంగా శక్తిసామర్థ్యాలు లేకపోవటం ఏమిటి? వాళ్లు పూర్తిగా భార్యలపై ఆధారపడటం దేనికి? ఇంత నిస్సహాయులా మన దేవుళ్లు?

## బ్రహ్మ

కామన్‌గా అయితే మనది పురుషాధిక్య సమాజం. కానీ దేవుళ్లది మాత్రం ఇందుకు రివర్స్‌లా కనిపిస్తుంది. అక్కడ స్త్రీలే పవర్‌ఫుల్.. ఇందుకు త్రిమూర్తుల సంసారాలే ఉదాహరణ.

సత్యలోకం అన్నింటికంటే చాలా పైన ఉంటుందిట. బ్రహ్మదేవుడి ఇల్లూ, ఆఫీసూ ఇక్కడే ఉంటాయి. చదువుల తల్లి సరస్వతీదేవికి అత్తవారిల్లు కూడా ఇదే. భూమ్మీద బ్రహ్మకు పూజలు.. పునస్కారాలు చేసే వాళ్లు ఎవరూ లేరు కాబట్టి, ఉదయాన్నే కాసింత వేదపఠనం నాలుగు తలలతో చేసేసి తన మెయిన్ పనైన సృష్టిని స్టార్ట్ చేసేస్తాడు. మనిషి, జంతువు తేడా లేకుండా జీవజాలాన్ని తెగ సృష్టించేస్తుంటాడు. శరీరం అందంగా ఉండాలన్నా, వికారంగా ఉండాలన్నా డిసైడ్ చేయాల్సింది ఈయనే.. తాను పుట్టించిన ప్రాణి కేరెక్టర్‌ను డిసైడ్ చేయాల్సిందీ ఈయనే. ప్రపోర్షనేట్‌గా ఆడా, మగా సృష్టించాల్సిన డ్యూటీ కూడా ఈయనదే. ముఖం గుండ్రంగా ఉండాలా, కోలగా ఉండాలా? నల్లగా ఉండాలా? ఎరుపురంగులో ఉండాలా? అన్నది ఫిక్స్ చేసేదీ బ్రహ్మదేవుడే..

అంతా బాగానే ఉంది.. కానీ, ఈయనకు ఆ క్రియేటివిటీ ఎక్కడినుంచి వచ్చింది?

ఫోటోషాప్‌లో ఒక బొమ్మను తయారు చేయాలంటే దానికి సంబంధించిన టెక్నాలజీ తెలుసుకోవాలి. అసలు.. ఏ పని చేయాలన్నా దానికి సంబంధించి ఎంతో కొంత పరిజ్ఞానం అవసరం. కానీ, ఈ జ్ఞానం ఆయనకు ఎక్కడినుంచి వచ్చింది? మన పురాణాల ప్రకారం.. వేదాల ప్రకారం.. కథల ప్రకారం ఏ రకంగా చూసినా చదువుకు, విజ్ఞానానికి అన్ని విద్యలకు మూలం, అధిపతి సరస్వతి కదా.. ఆమె చదువు చెప్తేనే.. ఆమె విజ్ఞానాన్ని అందిస్తేనే.. ఆమె క్రియేటివిటీ టూల్స్ ఇస్తేనే బ్రహ్మకు ఈ సృష్టి నిర్మాణం సాధ్యమయ్యేది. బ్రహ్మ పదార్థం అనేది అంతుపట్టనిదని అందరికీ తెలుసు.. ఈ పదార్థం వెనుక సీక్రెట్‌ను అరటి ఒలచినట్లు చెప్పేది.. గుట్టు విప్పేది.. విజ్ఞానమే.. ఆ విజ్ఞానానికి అధిపతి సరస్వతి.. అందుకే సరస్వతిని సృష్టికర్తకు సహధర్మచారిణిగా చేశారు.

బ్రహ్మ సంగతి తెలిసింది కదా.. ఆయన తన భార్య చెప్పకుండా ఒక్క మాట కూడా మాట్లాడడు.. చివరకు తన దగ్గరున్న వేదాలు కూడా ఆమె చెప్తే రాసుకున్నవే మరి..

## విష్ణువు

ఇక రెండో ఆయన సంగతి.. భార్యావిధేయతకు పెట్టింది పేరు.. పేరుకు ఆమె, ఆయన కాళ్లు పట్టుకున్నట్లు కనిపిస్తుంది కానీ, ఆమెను ప్రసన్నం చేసుకోవటానికి ఆయన రకరకాల అవతారాల్లో పడని పాట్లు లేవు.. ఆయనే నారాయణుడు.. ఆమె మహాలక్ష్మీదేవి.

విష్ణుమూర్తి ఇల్లు టిపికల్‌గా ఉంటుంది. జూబ్లీహిల్స్‌లో డబ్బున్నోళ్లు చిత్రవిచిత్రంగా అద్భుతమైన ఇళ్లు కట్టుకుంటారు.. ఇవన్నీ ఆయన ఇంటి ముందు బలాదూరు. ఆయన ఇంట్లోకి ఎంటర్ కావాలంటే ఏడు ద్వారాలు దాటి కానీ వెళ్లలేరు. అంత బందోబస్తుగా వుంటుంది. లాస్ట్ డోర్ దగ్గర ఇద్దరు సెక్యూరిటీ గార్డులు ఉంటారు. వాళ్లను దాటుకుని ముందుకు వెళ్తే.. సీన్ వేరేలా ఉంటుంది. చుట్టూ పాలు.. పాలసముద్రం మధ్యలో అతి పెద్ద పాము.. దానికో వేయి పడగలు. ఆ పాము చుట్ట చుట్టుకుని ఉంటే.. దానిపై ఈ స్వామి పవళింపు సీన్‌లో మనకు కనిపిస్తారు. ఆయన పాదాల దగ్గర లక్ష్మీదేవి దర్శనమిస్తుంది.

నారాయణుడి వైభోగమే వేరు.. ఫుల్లు క్యాష్‌పార్టీ.. తన లోకంలోనే కాదు.. భూలోకంలో కూడా ఆయన సంపన్న దేవుడే.. నిత్యోత్సవ, వారోత్సవ.. పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవాలంటూ ఏ..ప్పుడూ ఏవో ఒక ఉత్సవాలు.. వేడుకలు.. ఊరేగింపులు.. అబ్బో.. ఎంత చెప్పినా సరిపోదు... ఈయనకు ఇవన్నీ ఎలా వచ్చాయంటారు? సింపుల్.. ఆయన లక్ష్మీపతి కావటం వల్లనే. ఇంకో సంగతేమిటంటే.. ఏ పాలసముద్రాన్నైతే ఆయన ఇంటిగా చేసుకున్నాడో.. ఆ సముద్రంలోనుంచే లక్ష్మీదేవి పుట్టింది. దేవరాక్షసులు సముద్రమథనం చేసింది ఇక్కడే.. అంటే నారాయణుడు ఇల్లరికపు అల్లుడనుకోవాలన్నమాట. లక్ష్మీదేవి కూడా సామాన్యురాలా? అష్టైశ్వర్యాలకూ ఆమే అధిపతి.. ఆలాంటి తల్లి తన భర్తకు ఆ మాత్రం వైభవాన్నివ్వకుండా ఉంటుందా? ఆమె ప్రిస్టేజి ఇష్యూ కాదూ...!



**మహాదేవుడు మృత్యుంజయుడే. తానే మృత్యువై లోకాలను నశింపచేసేవాడు. బ్రహ్మ చేసిన సృష్టి అంతంలో ప్రళయాన్ని సృష్టించి నూతన సృష్టికి నాంది పలికించే వాడు శివుడు. ఈయన పంచాక్షరి ఓం నమఃశివాయ పంచభూతాలకు ప్రతిరూపాలు. భూమి, నీరు, గాలి, ఆకాశం, నిప్పు ఇవన్నీ ఈయన అధీనంలో ఉండేవే. భూమి కంపిస్తుంది..నీరు ఉప్పెనవుతుంది..గాలి సుడులు తిరుగుతుంది..ఆకాశం ఉరుముతుంది..నిప్పు దహించేస్తుంది**

ఈ స్వామి మనకు పరిపాలకుడు.. ప్రజలను పరిపాలించాలంటే సొమ్ములు లేందే కుదరదు కదా.. ఆ మధ్య పైసలు చెట్లక్కాయటం లేదంటూ ఒకప్పటి ప్రధాన మంత్రే మైకు పట్టుకుని నిష్ఠూరాలాడాడు గుర్తుందా.. విష్ణుమూర్తికి కూడా అంతే కదా.. అమ్మ ఇస్తేనే అయ్యవారు ఆ సొమ్ములను వాడేసుకుని ఎలాంటి ప్రాబ్లమ్ లేకుండా పరిపాలన సాగిస్తాడన్నమాట. పరిపాలన సక్రమంగా సాగాలంటే లక్ష్మీకటాక్షం తప్పనిసరి. విశ్వాన్నంతటినీ పరిపాలించేవాడు కాబట్టే విష్ణుమూర్తికి ధర్మపత్నిగా మహాలక్ష్మీదేవి అవతరించింది.

ప్రపంచంలో ఎవరికి కష్టం వచ్చినా చూసుకోవలసింది విష్ణువే. వాళ్లకు కావలసిన సంపదను పంపిణీ చేసి సుఖ సౌఖ్యాలను అందించాల్సిన బాధ్యత విష్ణుమూర్తిదే. ఈ విధులను నిర్వర్తించటానికి కేశవమూర్తికి లక్ష్మీదేవి నిరంతరం చేదోడువాదోడుగా సహకరిస్తుంది. అష్ట రూపాలలో ఆమె సృష్టి పరిపాలనా కార్యక్రమాల్లో తనదైన పాత్ర పోషిస్తుంది.

## శివుడు

ముచ్చటగా మూడో మూర్తి పరమేశ్వరుడు.. ఈయన బోళాశంకరుడు. కాసింత పొగిడేస్తే చాలు.. కొండంత పొంగిపోతాడు. ఏదడిగితే అదిచ్చేస్తాడు.. అదే కోపం వచ్చిందంటే ఆయన్ను పట్టడం ఎవరితరం కాదు.. మోస్ట్ పవర్‌ఫుల్ గాడ్ ఎవర్ వుయ్ హేడ్ ఇన్ దిస్ వరల్డ్.. ఈయనేమో కూరగాయల కత్తి పట్టుకోవాలన్నా మహాశక్తి చేతిసాయం కావలసిందే మరి.. ఎందుకంటారా? ఆమే యూనివర్సల్ పవర్ కాబట్టి..

త్రిమూర్తులలో మిగతా ఇద్దరికంటే సీదాసాదా లైఫ్ గడిపేవాడు మహాదేవుడే.. ఈయనకు

ఇల్లు అక్కర్లేదు..నీడ అక్కర్లేదు.. కట్టుకోవటానికి చీనీచీనాంబరాలు అంతకంటే అవసరం లేదు.. ఏదో పులి చర్మం కట్టుకుంటారు.. విభూతి ధారణ.. రుద్రాక్షమాల.. అలంకారం కోసం ఓ నెలవంక.. ఈయనకు పంచభక్ష్య పరమాన్నాలు అవసరం లేదు.. రాజభోగాలు అంతకంటే అక్కర్లేదు.. కానీ, ఈయన లయకారుడు.. శిక్షకుడు.. దుష్టులను శిక్షించి.. మంచివాళ్లను రక్షించేవాడు.

మహాదేవుడు మృత్యుంజయుడే. తానే మృత్యువై లోకాలను నశింపచేసేవాడు. బ్రహ్మ చేసిన సృష్టి అంతంలో ప్రళయాన్ని సృష్టించి నూతన సృష్టికి నాంది పలికించే వాడు శివుడు. ఈయన పంచాక్షరి ఓం నమఃశివాయ పంచభూతాలకు ప్రతిరూపాలు. భూమి, నీరు, గాలి, ఆకాశం, నిప్పు ఇవన్నీ ఈయన అధీనంలో ఉండేవే. భూమి కంపిస్తుంది.. నీరు ఉప్పెనవుతుంది.. గాలి సుడులు తిరుగుతుంది.. ఆకాశం ఉరుముతుంది.. నిప్పు దహించేస్తుంది. ఈ అయిదూ మనిషికి ప్రాణాధారాలు.. మనిషికి వినాశక శక్తులూ ఈ అయిదే.. వీటిలో ఏ ఒక్కటిని ప్రేరేపించినా వినాశనం తప్పదు. ఈ అయిదింటికీ అధిపతి మహేశ్వరుడు. లోకాలను నశింపజేయాలని ఆయన భావించినప్పుడు ప్రళయాన్ని సృష్టించగలడు.

వీటన్నింటికీ కావలసిన పవర్ ఈశ్వరుడికి ఎలా సంక్రమించింది? ఆయన సతి వల్ల.. పార్వతీదేవి వల్ల.. మహాశక్తిస్వరూపిణి అయిన జగదంబ వల్ల.. ఈ విశ్వమంతటా ప్రభవిస్తున్న శక్తికంతటికీ ఆమే కారణం. ఈశ్వరుడి చేతిలో త్రిశూలం ఆమె.. విష్ణుమూర్తి చేతిలోని సుదర్శనం ఆమె. అందువల్లే ఆమె లయకారకుడి సహభాగిని అయింది. ఈశ్వరుడి శరీరంలో సగం పార్వతీదేవి ఆక్రమించింది. అందుకే ఆయన అర్ధనారీశ్వరుడయ్యాడు. ఆమె ప్రకృతి.. ఈయన పురుషుడు. ఈ ఇద్దరి నుంచి అనంతమైన శక్తి ఆవిర్భవించింది. లోకంలో దాంపత్య బంధానికి ఉన్న పవర్‌కు ప్రతీక పార్వతీపరమేశ్వరులు. ఆమె శక్తినిస్తుంది.. ఈయన లయింపజేస్తాడు.. ఈ ఇద్దరి కలయికతో సృష్టి పరిణామ క్రమం నియమం తప్పకుండా సాగుతుంది. త్రిమూర్తులు.. దేవతలు.. వాళ్లకు భార్యలు అన్న వాటిని హేతువాదులు ఖచ్చితంగా అంగీకరించరు. కానీ, ఈ కాన్సెప్ట్‌నే ఇప్పటికీ మన వాళ్లు వాడుతున్నారు. మన డెమొక్రసీలో మూడు ఎస్టేట్‌లు ఉన్నాయి. ఒకటి లెజిస్లేచర్.. రెండు జ్యుడిషియరీ.. మూడు ఎగ్జిక్యూటివ్.. ఒకటి చట్టాల్ని క్రియేట్ చేస్తుంది. రెండు వాటిని సక్రమంగా అమలవుతున్నాయా లేదా అని పరిశీలించి తప్పొప్పులను నిర్ణయిస్తుంది. మూడు చట్టాలను అమలు చేసి.. తప్పుచేసిన వారిని దండిస్తుంది.. త్రిమూర్తుల కాన్సెప్ట్ కూడా అదే. కాకపోతే వారికి నాలుగో ఎస్టేట్‌గా నారదుడున్నాడు.. మనదగ్గర మీడియా ఉంది. అంతే తేడా..!

# కైలాసంపై శివుడున్నాడా?

*మంచుకొండల్లో.. వెండి వెన్నెల*
*అతీంద్రియ మహాశక్తులు..*
*అంతు పట్టని వెలుగు దివ్వెలు*
*సముద్ర మట్టానికి వేల అడుగుల ఎత్తులో*
*సైన్స్‌కు అందని అసాధారణ వ్యవస్థ*
*కైలాస పర్వతం పైభాగంలో ఏముంది?*
*ఎవరికీ తెలియని అంతులేని రహస్యం ఏమిటి?*
*భూమిపైనే ఈశ్వరుడి ఉనికి నిజమేనా?*



అవును ఇది అక్షరాలా నిజం.. ఇక్కడే.. ఈ గాలిలో, ఈ నేలలో ఈ మట్టిపైనే ఆయన ఉన్నాడు.. భక్తులకు సాక్షాత్కరిస్తున్నాడు.. వారి మనోరథాల్ని నెరవేరుస్తున్నాడు.. శివుడి కైలాసం భూమిని దాటి మరెక్కడో లేదు. ఆయన కైలాసం ఇక్కడే ఉంది.. మన దేశానికి కూతవేటు దూరంలో ఉంది.. సిద్ధ పురుషులకు ఆవాసమైన మంచుకొండల నడుమ ఉంది. ఈ కైలాసంపైనే శివుడు ఉన్నాడు.. ఆయన ఉనికి అక్కడ స్పష్టంగా వుంది. సైన్స్‌కు అంతుపట్టని అపురూప శక్తి ఏదో అక్కడ దాగి ఉంది. ఏమిటది?

కైలాసం.. పరమ శివుడి ఆవాసం.. ఆదిశక్తి పార్వతి నివాసం.. రావణుడు పది తలలతో ఎత్తిన కైలాసం.. ఈ భూమిపైనే ఉంది.. మన కళ్ల ముందు ఉంది.. మనకు కనిపిస్తోంది.. భూమిపైనే దేవుడు కొలువై ఉన్నాడు.. సముద్ర మట్టానికి 21,778 అడుగుల ఎత్తులో 52 కిలోమీటర్ల విస్తీర్ణంలో మంచుకొండల నడుమ కైలాస పర్వతం. ఈ కొండపైనే రుద్రతాండవం చేశాడు.. త్రినేత్రుడి సాక్షాత్కారం ఇక్కడ లభిస్తోంది.. కైలాసంపై ఈశ్వరుడి ఉనికి నిజం.. దైవత్వానికి మహాదేవుని నిర్వచనం కైలాసం.

అంతా బాగానే ఉంది. కానీ, భూమిపై దేవుడు ఉండటం ఏమిటి? అసలు దేవుడనే వాడు ఉన్నాడా అన్న సందేహంతోనే సతమతమవుతుంటే.. కైలాసం భూమిపై ఉండటం.. శివుడు ఆ భూమిపై ఉన్న కైలాసంపై కొలువై ఉన్నాడనటం.. విచిత్రమే మరి.. కానీ, ఇది

నిజం.. హిమాలయ పర్వత శ్రేణుల్లో అత్యంత ఎత్తున ఆక్సీజన్ కూడా సరిగా అందని చోట నెలకొని ఉన్న కైలాస్ పర్వతం ఒక అపూర్వమైంది.. దీని పైన శివుడు కొలువై వున్నాడు.. అక్కడి నుంచి భక్తులను అనుగ్రహిస్తున్నాడు.. కోరిన కోర్కెలు తీరుస్తున్నాడు.

మౌంట్ కైలాస్.. మానస్ సరోవర్‌లు. కైలాస్ పర్వతాన్ని చూసిన ప్రతివారికి శివ దర్శనం కలుగుతోంది. అద్భుతమైన అనుభూతిని ఇస్తోంది. సశరీరంతో కైలాసానికి వెళ్లటం గురించి కథల్లో విన్నాం. కానీ, ఇప్పుడు ఇది వాస్తవం. కైలాసానికి మనం బొందితోనే వెళ్లవచ్చు.. తిరిగి రానూ వచ్చు. కాకపోతే కొద్దిగా ఫిట్‌నెస్ అవసరం. ఫిట్‌నెస్ ఉంటే కైలాసానికి వెళ్లి పరమ శివుని చూసి చక్కగా తిరిగి రావచ్చు. కైలాసానికి శరీరంతో ఎలా వెళ్లగలమని ఆలోచించకండి.. కైలాసం మన భూమిపైనే ఉంది. హిమాలయ పర్వతాలలో ఉంది. టిబెట్ భూభాగంలో ఉన్నది. ఈ కైలాసంపైనే శివపార్వతులు కొలువై ఉన్నారు.. వేలాది భక్తులకు దర్శనమిస్తున్నారు.. ఇదేం విచిత్రం కాదు.. పుక్కిటి పురాణం అంతకంటే కాదు.. హేతువాదానికి అంతుచిక్కనిది.. సైన్స్‌కు అర్థం కానిది.. మౌంట్ కైలాస్ ప్రపంచంలో స్పిర్చ్యువాలిటీ సంపూర్ణంగా వ్యాపించిన ఏకైక ప్రాంతం. ఇక్కడికి వెళ్లి వచ్చిన ప్రతి భక్తుడికి ఒక విచిత్రమైన అనుభూతి కలుగుతోంది. ఏదో ఒక రూపంలో ఉమాశంకరుల దర్శనం జరుగుతోంది.

ఉమాశంకరులే కాదు.. శివపార్వతుల ఫ్యామిలీ అంతా ఇక్కడ కొలువై ఉన్నది. కైలాస పర్వతం చుట్టూ ట్రెకింగ్ చేస్తున్న కొద్దీ ఒక్కో రూపం మనకు దర్శనమిస్తుంది. నందీశ్వరుడు, విఘ్నేశ్వరుడు, కుమారస్వామి ఒక్కో చోట ఒక్కో రూపంలో భక్తులకు కనిపిస్తారు..

మౌంట్ కైలాస్ ఎవరికీ తెలియని ఓ రహస్యం. ఇది మామూలు పర్వతం కాదు.. హిమాలయ శ్రేణుల్లో ఏ పర్వతానికీ లేని ప్రత్యేకతలు ఇక్కడ చాలా కనిపిస్తాయి. అర్థం కాని రహస్యాలు అనేకం ఇక్కడ దాగున్నాయి. ఇది నాలుగు వైపులా నాలుగు రూపాల్లో వుంటుంది. నాలుగు రత్నాల్లో, నాలుగు రంగుల్లో దర్శనమిస్తుంది. ప్రపంచంలోని వండర్స్ అన్నింటికీ వండర్‌– మౌంట్ కైలాస్.

దేవుణ్ణి దర్శించాలంటే కఠినమైన నియమాలు పాటించాలి. తపస్సు చేయాలి. ఉపాసన చేయాలి. యజ్ఞ యాగాదులు చేయాలి.. ఇంకా ఏవేవో చెప్తారు మన పెద్దలు.. దేవుణ్ణి చూడటం అంటే అంత తేలికైన వ్యవహారం ఏమీ కాదు.. ఎంతో కష్టపడితే తప్ప.. సాధ్యం కాదని చెప్పటమే వీటన్నింటి ఉద్దేశం..

కైలాస్ మానస్ సరోవర్ యాత్ర అచ్చంగా అలాంటిదే.. అన్ని కష్టాలకూ పరాకాష్ట.. ఊపిరి కూడా తీసుకోవటం కష్టమైన యాత్ర.. సముద్ర మట్టానికి ఎన్నో వేల అడుగుల ఎత్తు.. ఆక్సీజన్ అంతంత మాత్రం.. అసలు వేడి అంటే ఏమిటో మచ్చుకైనా తెలియని వాతావరణం.. శరీరం రాయిలా బిగుసుకుపోయేంత చలి.. ఇతర తీర్థయాత్రా స్థలాల్లో

కనిపించే కనీస సౌకర్యాలు ఉండవు.. ఇలాంటి చోట 52 కిలోమీటర్లు ట్రెకింగ్ చేయాలి.. ఈ యాత్ర ఒక జీవిత కాలం తపస్సు కంటే ఎన్నో రెట్లు ఎక్కువ. ఖాట్మండు మీదుగా ప్రారంభమయ్యే యాత్ర తారాపీఠ్, గౌరీకుండం మీదుగా కైలాస్ చేరుకుంటారు. ఇక్కడికి వెళ్లాలంటే ముందుగానే ఫిట్‌నెస్ చెక్ చేయించుకోవలసి ఉంటుంది. అన్ని విధాలా ఆరోగ్యం సరిగ్గా ఉంటేనే కైలాస్ యాత్రకు అనుమతిస్తారు. కైలాస్ పర్వతానికి చేరుకోవటం అంటే మృత్యువును ఎదిరించి ముందుకు పోయినంత సాహసమే. పర్వతాన్ని ఒకసారి చుట్టి రావటానికి కనీసం నాలుగు రోజుల సమయం పడుతుంది. ఆక్సీజన్ అతి తక్కువగా ఉన్న ప్రదేశంలో నాలుగు రోజుల పాటు నడవటం ఎంత కష్టమో వేరే చెప్పేదేముంది? శరీర కష్టం కంటే మానసిక స్థైర్యంపైనే, ఆధ్యాత్మిక బలంపైనే కైలాస్ పర్యటన కొనసాగుతుంది. కైలాసం శివుడి పూర్ణస్వరూపమని విశ్వాసం. అక్కడకు వెళ్లిన అనేక మంది భక్తులకు పర్వతం ఆసాంతం శివరూపంగా దర్శనమిచ్చిన తార్కాణాలు ఉన్నాయి. విచిత్రమేమంటే కైలాస పర్వతం దగ్గరకు వెళ్లిన యాత్రికులు, పర్వతాన్ని మాత్రం అధిరోహించే ప్రయత్నం చేయరు.. వెళ్లేందుకు ఎవరు సాహసించినా అంతే సంగతులని చెప్తారు. ఇది ఎంతవరకు నిజం? ఎవరెస్టును సైతం అధిరోహించిన మనిషి కైలాస పర్వతంపైకి మాత్రం ఎందుకు వెళ్లలేకపోతున్నాడు? కైలాస పర్వతంపైకి అధిరోహించటం అంత తేలికైన సంగతేం కాదు.. పర్వతం చుట్టూ ప్రదక్షిణలు చేయటం, దాని పాదపీఠం స్పర్శిస్తే చాలనుకుంటారు.

ఈ భూమిపై హిమాలయాలు ఏర్పడి సుమారు పది మిలియన్ల సంవత్సరాలు అయినట్లు సైంటిస్టులు చెప్తారు. కైలాస్ పర్వతం వయసు కూడా బహుశా అంతే అయి ఉండవచ్చు. అయితే మిగతా హిమాలయ పర్వతాలకు, కైలాసానికి స్పష్టమైన తేడా ఉంటుంది. కైలాస్ పర్వతం ఒకప్పటి అఖండ భారతానికి సెంటర్ పాయింట్‌లో ఉంది. గురుత్వాకర్షణ శక్తికి గరిమనాభి ఎలాంటిదో.. అఖండభారతానికి సెంటర్ పాయింట్ కైలాసం.. ఆరు హిమాలయ పర్వత శ్రేణులకు మధ్యలో కైలాస పర్వతం ఉంది.. ఒక విధంగా చూస్తే కమలం ఆకారంలో కనిపిస్తుంది.. కైలాస్ పర్వతం నాలుగు వైపుల నాలుగు రంగుల్లో కనిపిస్తుంది. ఒక వైపు నుంచి చూస్తే పూర్తిగా స్ఫటికంలా కనిపిస్తుంది. ఇంకో వైపు నుంచి చూస్తే బంగారు వర్ణం గోచరిస్తుంది.. మూడో వైపు రూబీలాగా, నాలుగో వైపు నీలం రాయిగా గోచరిస్తుంది. అంతే కాదు.. కైలాసానికి నాలుగు రూపాలూ ఉన్నాయి. ఒకవైపు గుర్రంగా, ఇంకోవైపు సింహంగా, మూడో వైపు ఏనుగుగా, నాలుగో వైపు నెమలిగా కనిపిస్తుంది.. ఇందులో గుర్రం హయగ్రీవ రూపం కాగా, సింహం పార్వతీదేవి వాహనం, ఏనుగు విఘ్నేశ్వరుడికి ప్రతీక అయితే, నెమలి కుమారస్వామికి వాహనం.. ఇవన్నీ ఈశ్వర స్వరూపానికి ప్రతీకలుగా పురాణాలు చెప్తాయి.

కైలాస్ పర్వతంలో అత్యంత కీలకమైన విషయం దక్షిణ ఆసియాను సస్యశ్యామలం చేస్తున్న నాలుగు పవిత్ర నదులు ఈ ప్రాంతం నుంచే ఉద్భవించటం.. గంగ, సింధు,

బ్రహ్మపుత్ర, సట్లెజ్ నదులు ఇక్కడి నుంచే కిందకు ప్రవహిస్తాయి.. మంచు పూర్తిగా కప్పు కున్నప్పుడు వెండికొండలా మిలమిల మెరిసే కైలాస దర్శనం అద్భుతం. ఈ పర్వత పాదపీఠంలో బ్రహ్మమానస సరోవరం మరో అపురూపం.. స్వచ్ఛమైన నీటికి రంగు, రుచి ఉండదని చెప్పే సైన్స్ మాటను నిజం చేసే సరస్సు ఇది. నీటికి ఇంత స్వచ్ఛత ఈ భూమిపై కన్ను పొడుచుకుని చూసినా కనిపించదు. పరమేశ్వరుడు ఈ సరస్సులో స్నానం చేస్తాడని భక్తుల విశ్వాసం..కైలాసం మీదుగా సరస్సులోకి ఒక జ్యోతి ప్రవేశించటం ఇక్కడికి వచ్చిన చాలా మందికి అనుభవమే.

కైలాసం పైకి అధిరోహించటం ఇప్పటికి ఎవరి వల్లా సాధ్యం కాలేదు. పదవ శతాబ్దంలో బౌద్ధ మతగురువు మిర్లెపా కైలాస పర్వతాన్ని ఎక్కినట్లు చెప్తారు. అంతకు ముందుకానీ, ఆ తరువాత కానీ, ఎవరూ దీన్ని స్పృశించేందుకు కూడా సాహసించలేదు.. సాహసించిన వారు కనిపించకుండా అదృశ్యమైపోయారని చెప్తారు. 1954లో కైలాస్ యాత్రను నిషేధించిన చైనా కూడా  దీనిపై ప్రయోగం చేసి విఫలమైంది. రెండుసార్లు హెలికాప్టర్లు పంపిస్తే అవి తిరిగి రాలేదు. ఆ తరువాత ఎవరూ సాహసించలేదు... ఎన్నో ప్రయోగాలు జరిగాయి.. ఏమీ తేలలేదు.. ఇప్పటి వరకు కైలాస్ పర్వతం అవుటర్ సర్కిల్‌లో తిరిగిన తరువాత ఇన్నర్ సర్కిల్‌లో కైలాసగిరి పదక్షిణం చేయాలి. ఇన్నర్ సర్కిల్‌లోకి ప్రవేశించిన తరువాత కానీ, కైలాస గిరి పాదపీఠం స్పర్శించటం సాధ్యం కాదు. అవుటర్ సర్కిల్ తిరగటానికే చాలా కష్టపడాలి. ఆ తరువాత కదా.. ఇన్నర్ సర్కిల్‌లోకి ప్రవేశించేది? అది అంత తేలిక కాదు. 21సార్లు అవుటర్, ఇన్నర్ సర్కిల్‌లను ప్రదక్షిణం చేసిన తరువాత కానీ, పరమేశ్వరుడు సంపూర్ణంగా అనుగ్రహిస్తాడని విశ్వాసం. ప్రతికూల వాతావరణంలో ఈ విధంగా సంపూర్ణమైన ప్రదక్షిణ చేయటం సామాన్య భక్తులకు తేలికైన పని కాదు. అఘోరాల్లాంటి వాళ్లకు కానీ సాధ్యం కాదు. అందుకేనేమో.. ఇంత క్లిష్టమైన పర్వతం ఉపరిభాగంపై ఏమున్నదన్నది సైన్స్‌కు మాత్రం అందలేదు.. భక్తులకు మాత్రం కైలాసంపై శివుడు సాకారంగా సాక్షాత్కరిస్తున్నాడు.. ధ్యానముద్రలో కనిపిస్తున్నాడు. లింగరూపుడై దర్శనమిస్తున్నాడు. కోరిన కోరికలన్నీ తీరుస్తున్నాడు.. ఇది విశ్వాసానికి, ఆధ్యాత్మికతకు అతీతమైంది.. అంతు చిక్కనిది. కైలాస్ దర్శనం భక్తులకు ఒక అపూర్వ అనుభూతి.. హిమాలయ సానువుల్లో సువర్ణభాండం.. పరమేశ్వరుడి దివ్యధామం.. పార్వతిదేవీ కొలువైన పవిత్ర క్షేత్రం. అణువణువులోనూ శివస్వరూపాన్ని నింపుకున్న ప్రాంతం. మాటల్లో వర్ణించలేని భావమది. పదాలకు అందని పవిత్రత అది. అందుకే భక్తులు మానస సరోవరాన్ని భూలోక కైలాసంగా పిలుచుకుంటారు.

# ఆది కైలాసం

*భూమ్మీద మొదటిసారి వినిపించిన శబ్దం ఏమిటో తెలుసా?*

*తొలి అక్షరం ఎలా పుట్టిందో తెలుసా?*

*ఈ ధ్వని ఎలా వినిపించింది?*

*ఎక్కడ వినిపించింది?*

*దాన్ని సృష్టించింది ఎవరు?*



మనం పుట్టాం.. పెరిగాం.. మాట్లాడుతున్నాం.. కానీ మనం మాట్లాడుతున్న ఆ మాటకు సృష్టికర్త ఎవరు..? మరేదో కాదు. అది పరమేశ్వరుడి ఢమరుకం.. ఆ ఢమరుకం నుంచి వెలువడిన మొదటి ధ్వని ప్రణవం. ప్రణవ నాదాన్ని మహాశివుడు మోగించిన ప్రదేశం.. కైలాసాన్ని మరిపించిన మరో కైలాసం.. ఈశ్వరుడు జ్యోతి స్వరూపుడై ఆవిర్భవించిన మహాకైలాసం.. ఆది కైలాసం. ఆ నాదమూర్తి నుంచి విశ్వమంతా తరంగమైన ధ్వని.. ఓం..

ప్రణవనాదం ఓంకారాన్ని మనం ఆధ్యాత్మిక పరిభాషలో పిలుచుకునే మాట.. ఇది అన్ని మంత్రాలకూ మూల మంత్రం. అన్ని స్వరాలకు ఆది స్వరం. ఆది కైలాసంలో జనించిన మహాశబ్దం. మహామౌనాన్ని సైతం జయించిన విశ్వనాదం. మహేశ్వరుడి మహాసృష్టి. ఈశ్వర ఢమరుకం నుంచి వెలువడిన ధ్వనితరంగం ఓం. విశ్వంలో తొలి కమ్యునికేషన్ స్వరం ఓం.. అన్ని భాషలకు.. అన్ని అక్షరమాలలకు ఊపిరులిచ్చిన ప్రణవం ఓం...

ప్రణవం గురించి ప్రపంచంలో ప్రాథమికంగా తెలియని వాళ్లు ఉండరు. కానీ, ఆ ప్రణవం ఎలా పుట్టిందన్నది చాలామందికి తెలియదు.. శబ్దం ఒకచోట పుట్టడం ఏమిటన్నది చాలామందికి వచ్చే అనుమానమే. సైన్స్‌కయితే ఇది ఓ వెర్రి ప్రశ్న. కానీ, భారతీయ ఆధ్యాత్మిక భావభూమికలలో ప్రణవం పరమేశ్వరుడి సృష్టి. ఆయన చేతిలోని ఢమరుకం నుంచి ధ్వనించిన తొలి స్వరమది. ఇందుకు హేతుబద్ధత చాలానే ఉంది.

27 మహాయుగాలకు ముందు భూమి ఆవిర్భవించింది. ఈ భూమి మీద జీవికంటే ముందు శబ్దం పుట్టింది. ఆ శబ్దమే ఓంకారం.. ప్రణవ నాదం. ఇది ఒక చోట పుట్టడమేమిటన్న ప్రశ్న మళ్లీ ఉదయిస్తుంది. కానీ, ఇది ఒకచోట ఆవిర్భవించింది.

మహాశివుడి కరుణతో అవతరించింది. ఉమాపతి కైలాసంలో పుట్టుకొచ్చింది. రుద్ర తాండవమూర్తి నాదసాధనం నుంచి ఆవిర్భవించిన ప్రణవం.

ఇంతకీ ఈ ఓంకారం పుట్టిందెక్కడ..? ఈశ్వరుడి నిజనివాసం కైలాసం అని తెలిసిందే. మనకు తెలిసిన కైలాసం మౌంట్ కైలాస్. మానస సరోవరం సమీపంలో ఉన్న కైలాసం.. శివుడు కైలాసంలోనే ఉంటాడు. ప్రణవం కైలాసంలోనే జన్మించింది. కానీ, అది మౌంట్ కైలాస్‌లో కాదు. పరమ మహేశ్వరుడు మొట్టమొదట జ్యోతిస్వరూపుడిగా ఉద్భవించిన ఆది కైలాసంలో.. ఆయన త్రిశూలం.. ఢమరుకం జ్వాలాముఖి నుంచి పుట్టుకొచ్చిన కైలాసంలో.. అది ఈ అసలైన కైలాసానికి దూరంగా ఉంది. దాని పేరు ఆది కైలాసం. ఓం పర్వతం. ప్రాణాయామానికి ప్రాణాధార పర్వతం. ఈశ్వరుడి తపోభూమి. శివతాండవానికి ఆది పర్వతం. త్రినేత్రుడి దివ్యధామం.

పురాణాల కథనం ప్రకారం శివుడు అయిదు కైలాసాలను సృష్టించాడు. అందులో మౌంట్ కైలాస్ ఆయన నిజనివాసం. మిగతా నాలుగు కైలాసాలు ఆయన వేర్వేరు సందర్భాల్లో సృష్టించినవి. అందులో ఒకటి ఆది కైలాసం.. ఆయన భూమిపై జ్యోతి స్వరూపంగా ఆవిర్భవించిన ప్రదేశం. ఈ భూమిపైన అవతరించిన హిమాలయ శిఖరాలలో ఆది కైలాసం శివస్వరూపానికి ప్రతీక.

ఉత్తరాఖండ్.. హిమాలయాల తూర్పు కనుమలు ఉన్న ప్రాంతం. పితోర్‌గఢ్ జిల్లా సిన్లా పాస్‌లో ఈ ఆదికైలాసం ఉంది. సముద్ర మట్టానికి 6191 మీటర్ల ఎత్తులో 20 వేల 312 అడుగుల ఎత్తైన పర్వతం ఇది. ఇదే ఓం పర్వతం. ఓంకారాన్ని అక్షరరూపంలో ప్రతిబింబించిన పర్వతం.

హిందువులకు అతి పవిత్రమైన పర్వతాలలో ఓం పర్వతం ఒకటి. పర్వతం ఎలా ఏర్పడిందో తెలియదు. ఎత్తులో, ఆకారంలో మిగతా హిమాలయ సానువుల్లాగానే ఇదీ వుంటుంది. కానీ, దీనిని చూడగానే పవిత్ర మూల మంత్రం గుర్తుకువస్తుంది. మనిషికి, దేవుడికి మధ్య అనుసంధానం కనిపిస్తుంది. నాదం శబ్దమై.. శబ్దం అక్షరంగా మారిన పరిణామ ప్రక్రియ గోచరిస్తుంది. ఆధ్యాత్మిక అత్యున్నత స్వరధుని వినిపిస్తుంది. ఓం పర్వతాన్ని శివుడి చేతిలో ఢమరుకంగా భక్తులు విశ్వసిస్తారు. అక్షరమాల అంతా ఆ ఢమరుకంనుంచే పుట్టిందని శివపురాణం చెప్తుంది. పర్వతంపై కనిపించే ప్రణవ రూపం దీన్ని నిజం చేస్తోంది. చిత్రంలో చూస్తే అర్థమవుతుంది ఈ పర్వతం తన రూపంలోనే ఓంకారం అచ్చంగా కనిపిస్తుంది.

ఓంకారాన్ని హిందువులు సగుణ బ్రహ్మమని అంటారు. అంటే రూపం లేని దేవుడు కావలసిన ఆకారంలో కనిపించటం.. ఓం పర్వతం అచ్చంగా ఆ సగుణ బ్రహ్మానికి ప్రతీక. దేవుడికి పేరంటూ ఉంటే ఆ పేరు ఓం.. దానికి రూపం ఈశ్వరుడి ఆత్మలింగం. అదే ఇక్కడి ఓం పర్వతం.. ఆది కైలాసం.. చోటా కైలాస్..

# పంచశిఖరాలపై పరమశివుడు

**అయిదు ముఖాలు..అయిదు భూతాలు**
**ఆదిపురుషుడి అనాది స్వరూపం**
**పంచాక్షరి తొలిసారి**
**ప్రతిధ్వనించిన పంచశిఖరం**



ఆది లేదు..అంతు లేదు..ఆయనకు ఆది ఎక్కడో విష్ణువుకే తెలియలేదు. అంతం ఎక్కడో సృష్టికర్తకే అర్థం కాలేదు. విశ్వమంతటా ఆవరించిన వాడు. విశ్వమే తానై అవతరించిన వాడు, పరమేశ్వరుడు పంచముఖాలలో సాక్షాత్కరిస్తున్నాడు. ఒక శరీరం.. అయిదు ముఖాలు, పంచభూతాలను తనలో సంలీనం చేసుకున్నాడు

సముద్ర మట్టానికి 28వేల అడుగుల ఎత్తున అయిదు శిఖరాలపై అయిదు రూపాల అవిర్భావం జరిగింది. అయిదు గుణాల ఆవిష్కారం అయింది. పంచాక్షరీ అవతరించిన ఆధ్యాత్మిక శిఖరం అది. మంచుకొండలపై అయిదు నిధులు, ఆధ్యాత్మిక సన్నిధులై అలరారుతున్నాయి. మ'హిమాలయం'లో మహేశ్వరుడి విరాడ్రూపం దర్శనమిస్తున్నది. ఈ అయిదూ కలిసిన ఈశ్వరుడిని సాకారంగా సాక్షాత్కరింపచేస్తున్న ఆధ్యాత్మిక ఉన్నత శిఖరం కంచెన్‌జంగా. అయిదు శిఖరాలతో కూడిన అనాది నాధుడి దివ్యధామం. నిజానికి ఆదిపురుషుడి అనాది స్వరూపం ఏమిటో మీకు తెలుసా? మొదలు తుది లేని ఈశ్వరుడి విశ్వరూపాన్ని ఎప్పుడైనా చూశారా? పరమేశ్వరుడి పంచముఖాలు ఎలా ఉంటాయి? మహేశ్వరుడి పంచాక్షరీ మంత్రం ఓం నమఃశివాయ.. ఈశ్వరుడు లోకానికి ఎక్కడ ప్రసాదించాడు? పంచముఖాలతో.. పంచభూతాలను సంలీనం చేసుకుని పంచ శిఖరాలను ఆవరించి మహా శివుడు పంచాక్షరిని ప్రబోధించాడు..దేవభూమి అది.. విశ్వాన్ని లయకారుడు అంతులేని కరుణతో కటాక్షించిన దివ్యధామమది. పంచశిఖరాలతో అలరారుతున్న మహా పర్వత రూపంలోని మరో కైలాసమది. వామనుడు త్రివిక్రముడై భూమ్యాకాశాలను ఆక్రమించాడంటారు.. దేవదేవుడు సర్వాంతర్యామి అంటారు.. ఈ అంశాన్ని నిరూపిస్తున్నది కంచెన్‌జంగా.. మహాదేవుడు అసురులను సంహరించిన తరువాత పంచముఖ ఈశ్వరుడిగా ఇక్కడ దర్శనమిస్తున్నాడు.. దేవభూమిలో నాలుగు దిక్కులకూ విస్తరించి ఉన్నాడు. పవిత్రమైన పంచాక్షరి మంత్రాన్ని ప్రబోధిస్తున్నాడు. మహేశ్వరుడు కైలాసంపై కొలువున్నాడు.. కిన్నెర కైలాసంలో త్రినేత్రుడై కనిపిస్తున్నాడు.. మణిమహేశంపై మణికాంతులతో విరాజిల్లుతున్నాడు. అమరనాథ్‌లో మృత్యుంజయుడిగా కరుణిస్తున్నాడు.. ఆది కైలాసంలో ఆదిశబ్దం ఓంకారాన్ని లోకానికి అందించిన ఈశ్వరుడు మోక్షానికి ఏకైక మార్గంగా.. సమస్త సమస్యలకు ఏకైక

పరిష్కారంగా చెప్పే పంచాక్షరిని ఇదిగో ఇక్కడ.. కంచెన్‌జంగాలో ప్రబోధించాడు.

సముద్ర మట్టానికి 28,169 అడుగుల ఎత్తున పంచముఖ శివుడు సాక్షాత్కరిస్తున్నాడు. భారతదేశం నుంచి నేపాల్ దాకా కంచన్‌జంగా పర్వత రూపంలో ఆయన అయిదు ముఖాలు విస్తరించి ఉన్నాయి. అఘోర, ఈశాన, తత్పురుష, వామదేవ, రుద్ర రూపాలలో అత్యద్భుతంగా భూమ్యాకాశాలను కలుపుతూ మహాశివుడి దర్శనం జరుగుతోంది. వేలాది భక్తులు... కైలాసానికి వెళ్లలేని వాళ్లు... అమర్‌నాథ్‌ను సందర్శించలేని వాళ్లకు తానే దివి నుంచి భూమికి దిగి వచ్చినట్లుగా వచ్చి అపురూప దర్శనాన్ని ఇస్తున్నాడు.

కంచెన్ జంగ పర్వతాన్ని చూడటమే జీవితంలో ఒక సాఫల్యంగా వేల మంది భక్తులు భావిస్తారు. ఒకే ఒక పర్వతం.. అయిదు శిఖరాలు.. ఎలా సాధ్యం? అదీ ఆకాశాన్ని తాకుతూ... ఒక్కో శిఖరం ఒక్కో రూపంలో.. ఒక్కో వర్ణంలో.. కనీవినీ ఎరుగని అద్భుతం.... ప్రతి ఒక్కరికీ శివదర్శనం ఒక్కో రూపంలో జరుగుతోంది.. ఒక్కో శిఖరం ఒక్కో రూపంలో కనిపిస్తుంది.. ఒక్కో రూపం నుంచి ఒక్కో ధ్వని తరంగం వెలువడుతోంది... అన్నీ కలిసి పంచాక్షరిగా ప్రతిధ్వనిస్తోంది. సైన్స్‌కు.. హేతువాదులకు అంతు చిక్కని వ్యవహారం ఇది.. మౌంట్ కైలాస్‌కి ఏమీ తీసిపోని విధంగా స్పిర్చ్యువాలిటీని వ్యాప్తి చేస్తున్న అపూర్వ శివలీలా విలాసం కంచెన్‌జంగా.

ఇదెలా సాధ్యమని సహజంగానే ప్రశ్న వస్తుంది. హిమాలయాల గొప్పతనమే అది.. దేవతలకు నివాసం.. సిద్ధులకు తపోభూమి.. అఘోరులకు రుద్రభూమి.. నాగాలకు నాదభూమి.. తూర్పున బంగ్లాదేశ్ నుంచి ఉత్తరాన నేపాల్ మీదుగా చైనా వరకు విస్తరించిన మహిమాలయ ఆధ్యాత్మిక లోకం.. అందులో నిలువెత్తు శివస్వరూపం కంచెన్‌జంగా..

ఏమిటీ కాంచెన్‌జంగా ప్రత్యేకత? ఇక్కడ పంచముఖ శివుడు ఎలా దర్శనమిస్తున్నాడు? పంచాక్షరి ఇక్కడెలా పుట్టింది? అన్నీ ప్రశ్నలే.. జవాబులేమిటి? ఇక్కడ పరివ్యాప్తమైన ఆధ్యాత్మికతే దీనికి సమాధానం. ఒక్కో శిఖరం నుంచి వినవస్తున్న ధ్వని తరంగాలే సాక్ష్యం.

సిక్కింలోని ఉత్తరభాగం నుంచి నేపాల్‌లోని తాప్లేజంగ్ ప్రాంతందాకా విస్తరించిన అతి పెద్ద పర్వతం కంచెన్‌జంగా. ప్రపంచంలో మూడో అతి పెద్ద పర్వతం ఇది. పర్వతరాజు ఎవరెస్టు తరువాత రెండవ అతి పెద్ద పర్వతంగా కె2 ఉండగా మూడో పర్వతం కంచన్ జంగా. మంచు ప్రపంచంలో దొరికిన అయిదు నిధులుగా ఈ పర్వతాన్ని పేర్కొంటారు.

ఇదొక విచిత్రమైన పర్వతం. ఏడాది పొడవునా మంచు కప్పి ఉండే పర్వతం.. ఎనిమిది వేల అడుగుల ఎత్తున అయిదు శిఖరాలు అత్యద్భుతంగా కనిపిస్తాయి. అయిదు శిఖరాలు శివుడిని పంచముఖాకారుడిగా ఆవిష్కరిస్తున్నాయని భక్తులు విశ్వసిస్తారు. 8586 అడుగుల ఎత్తున రుద్రుడిగా, 8505 అడుగుల ఎత్తున వామదేవుడిగా, 8482 అడుగుల ఎత్తున ఆదిదేవుడైన తత్పురుషుడిగా, 8494 అడుగుల ఎత్తున ఈశానుడిగా, 7903 అడుగుల ఎత్తున అఘోరుడిగా కనిపిస్తాడు.



**కంచెన్ జంగ పర్వతాన్ని చూడటమే జీవితంలో ఒక సాఫల్యంగా వేల మంది భక్తులు భావిస్తారు.. ఒకే ఒక పర్వతం.. అయిదు శిఖరాలు.. ఎలా సాధ్యం? అదీ ఆకాశాన్ని తాకుతూ... ఒక్కో శిఖరం ఒక్కో రూపంలో.. ఒక్కో వర్ణంలో.. కనీవినీ ఎరుగని అద్భుతం....ప్రతి ఒక్కరికీ శివదర్శనం ఒక్కో రూపంలో జరుగుతోంది.. ఒక్కో శిఖరం ఒక్కో రూపంలో కనిపిస్తుంది.. ఒక్కో రూపం నుంచి ఒక్కో ధ్వని తరంగం వెలువడుతోంది... అన్నీ కలిసి పంచాక్షరిగా ప్రతిధ్వనిస్తోంది. దేవతలకు నివాసం.. సిద్ధులకు తపోభూమి.. అఘోరులకు రుద్రభూమి.. నాగాలకు నాదభూమి.**

ఇందులో మూడు శిఖరాలు భారత భూభాగంలో ఉన్నాయి. మిగతా రెండు శిఖరాలు నేపాల్‌లో ఉన్నాయి. కానీ ఈ శిఖరాలన్నీ శివముఖంగా కనిపించటం నిజమేనా? ఒక పర్వతానికి పలు శిఖరాలు ఉండవచ్చేమో కానీ, ఇన్ని రూపాలలో.. ఇన్ని వర్ణాలలో.. కనిపించటం కంచెన్‌జంగాలో మాత్రమే సాధ్యమయింది. విచిత్రమేమంటే.. ఇక్కడ అయిదు ఉన్నత శిఖరాల నుంచి శివపంచాక్షరీ శబ్దాలు ఉద్భవించాయిట. అందుకు అనుగుణంగానే ఆయా శిఖరాలనుంచి ధ్వనితరంగాలు వెలువడుతున్నట్లు 1955లో శిఖరాలను అధిరోహించిన బ్రిటన్ పర్వతారోహకులు జోయ్ బౌన్, జార్జ్ బాండ్‌లు తమ ఎక్స్‌పీరియెన్సెస్‌లో చెప్పుకొచ్చారు. పంచాక్షరి శబ్దాలు అయిదు రూపాలలో వ్యక్తమయ్యాయని పురాణాలు చెప్తున్నాయి. అయిదు అక్షరాలు.. అయిదు ఆధ్యాత్మిక మార్గాలు.. అయిదు శిఖరాలలోని అయిదు శివముఖాల నుంచి ఓం నమఃశివాయ పంచాక్షరీ మంత్రంగా ఉత్పన్నమవుతున్నాయి. ఓం నమఃశివాయ.. పంచాక్షరి మంత్రాన్ని ప్రబోధిస్తున్న పర్వతశిఖరం కంచెన్‌జంగాపై శివశిఖర దర్శనం భక్తసులభమైంది. మౌంట్ కైలాస్ లాగానో, అమర్‌నాథ్ లాగానో కష్టమైంది కాదు. అందరికీ తేలిగ్గా దర్శనమిచ్చేది. దీన్ని అధిరోహించటమూ కష్టం కాదు. ఇప్పటికి చాలా మంది ఈ పర్వత శిఖరాలపై ట్రెకింగ్ చేశారు. శంకరుడు ఎవరికి ఎలా కావాలంటే అలా అందుబాటులో ఉండే పర్వత ప్రాంతం కంచెన్‌జంగా. కంచెన్‌జంగా కేవలం హిందువులకు మాత్రమే కాదు.. బౌద్ధులకు కూడా చాలా పవిత్రమైన

**ఈ పర్వతంలోని అయిదు శిఖరాలను బౌద్ధులు అయిదింటికి ప్రతీకలుగా భావిస్తారు. బంగారం, వెండి, రత్నం, ఆహారం, ఆధ్యాత్మిక పవిత్ర గ్రంథాలు.. ఈ అయిదూ అయిదు శిఖరాలని బౌద్ధుల విశ్వాసం. అంతే కాదు.. బుద్ధులు ప్రగాఢంగా నమ్మే వాటిలో రజస్సు, తమస్సు, సత్వం, మనోనిగ్రహం, శబ్దభేది గుణాలకూ ఈ పర్వతాన్ని సింబల్‌గా భావిస్తారు.**

పర్వతం.. టిబెట్‌లో కైలాస పర్వతం తరువాత హిందువులతో సమానంగా ఆధ్యాత్మిక పరంగా బౌద్ధులు పవిత్రంగా భావించే పర్వతం ఇది. వాళ్ల దృష్టిలో అయిదు అపూర్వ నిధులను ప్రపంచానికి అందిస్తున్న పర్వతం ఇది. ఈ పర్వతంలోని అయిదు శిఖరాలను బౌద్ధులు అయిదింటికి ప్రతీకలుగా భావిస్తారు. బంగారం, వెండి, రత్నం, ఆహారం, ఆధ్యాత్మిక పవిత్ర గ్రంథాలు.. ఈ అయిదూ అయిదు శిఖరాలని బౌద్ధుల విశ్వాసం. అంతే కాదు.. బుద్ధులు ప్రగాఢంగా నమ్మే వాటిలో రజస్సు, తమస్సు, సత్వం, మనోనిగ్రహం, శబ్దభేది గుణాలకూ ఈ పర్వతాన్ని సింబల్‌గా భావిస్తారు. ప్రతి ఒక్కరికీ కంచెన్‌జంగాలో ఒక్కో విశిష్టమైన అనుభవం కలుగుతుంది. ఎందుకంటే శివభక్తులందరికీ శివుడే అక్షరం.. శివుడే ఆహారం.. శివుడే ఆభరణం.. శివుడే ఔషధం.. శివుడే ఆనందం.. అంతా ఆయన్ను అలాగే ఆరాధిస్తారు. కంచెన్ జంగాలో ఆయన్ను దర్శనం చేసుకుని అదే అనుభూతిని పొందుతున్నారు.

హిమాలయాలన్నింటిలోనూ ఇన్ని రకాల విశిష్టతలు ఉన్న పర్వతం కంచెన్‌జంగా.. ఇది అలాంటిలాంటి పర్వతం కాదు.. ఈ పర్వతంలో ప్రధానంగా కనిపించేది అయిదు శిఖరాలు.. ఇవన్నీ ఎనిమిది వేల అడుగుల ఎత్తున్నవి.. కానీ, ఏడు వేల అడుగుల ఎత్తున్న శిఖరాలు ఇదే పర్వతంపై పన్నెండు ఉన్నాయి. వీటిని ద్వాదశ జ్యోతిర్లింగాలని భావించే సంప్రదాయమూ ఇక్కడి ఆచారాల్లో ఒకటిగా ఉంది. గమ్మత్తేమిటంటే ముప్ఫైమూడు కోట్ల దేవతలూ ఇక్కడే కొలువై ఉన్నారట.. ఇందుకు గుర్తుగానే ఇక్కడ ఆరువేల మీటర్ల ఎత్తైన శిఖరాలు 33 ఉన్నాయని భక్తుల విశ్వాసం. సూర్యోదయం వేళలో ఈ పర్వతాన్ని చూసేందుకు ఎన్ని కళ్లున్నా చాలదు. ఏటా దాదాపు అయిదు లక్షల మందికి పైగా కంచెన్‌జంగాను దర్శించుకోవటానికి వస్తుంటారు. ఒక్కసారి అక్కడికి వెళ్తే.. మహాశివుడి సంపూర్ణ స్వరూపం సాక్షాత్కరిస్తుందనటంలో సందేహం లేదు.

ఏ వాదానికీ అంతుపట్టని అద్భుతమైన పర్వత పరిక్రమ కంచెన్‌జంగ. ఆధ్యాత్మికంగా ఇన్ని కథనాలు ఉన్న ప్రాంతం ప్రపంచంలో మరొకటి లేదంటే అతిశయోక్తి కాదు.. దేవుడు ఉన్నాడా లేదా అన్న మీమాంసను, వాదోపవాదాలను పక్కన పెడితే..హిమాలయాల్లో ఈ పర్వతాన్ని మించిన అద్భుతం మరొకటి ఉండదు.

# కిన్నెర కైలాసం



*హిమాలయాల్లో మరో కైలాసం..*
*లింగరూపంలో మహాదేవుడు*
*త్రివర్ణాలలో త్రినేత్రుడి దివ్య దర్శనం*
*ఉమాపతి రెండో కైలాసం*
*మహాదేవుడికి మరో కైలాసం*
*దేవభూమిలో దివ్యధామం*
*లింగరూపుడై దర్శనమిస్తున్న పరమేశ్వరుడు*

త్రివర్ణాలలో త్రినేత్రుడి మహాదర్శనం.. అపురూపం.. అపూర్వం. భూమి ఆకాశాలను కలుపుతున్నట్లుగా ఉమాశంకరుడు స్వయంభువుగా అవతరించి భక్తుల మనోరథాలు ఈడేరుస్తున్నాడు. మన భూమిపైన మనకు అందుబాటులో సాక్షాత్కరిస్తున్నాడు. ఇది వింత కాదు.. విడ్డూరం అంతకంటే కాదు.. పుక్కిటి పురాణం ఎంతమాత్రం కాదు. నిజం. ఒకటి కాదు, రెండు కాదు..మూడు రంగుల్లో ముక్కంటి తన భక్తుల ముచ్చట తీరుస్తున్న వాస్తవం.

భూమిపై కైలాసాలు ఎన్ని ఉన్నాయి, మహాదేవుడి అసలు నివాసం ఎక్కడ, టిబెట్‌లోని మానస సరోవరం పాదతీర్థంగా ఉన్న కైలాస పర్వతం కాకుండా, మరో కైలాసం ఉందా? అవును.. దేవదేవుడు హిమాలయ శ్రేణులనిండా విస్తరించి ఉన్నాడు. హిమాలయాలకు అన్ని వైపులా కైలాస పర్వతాలు నెలకొని ఉన్నాయి. ప్రతిచోటా పలు రూపాల్లో పరమేష్టి భక్తులను అనుగ్రహిస్తున్నాడు. మహాదేవుడు మూడు రంగుల్లో భక్తులకు దర్శనమిస్తున్న వైనం ఇది. హిమాలయాల్లో శివుడు మరో కైలాసంలో దర్శనమిస్తున్నాడు. మూడు రంగుల్లో త్రినేత్రుడు తొంభై అడుగుల ఎత్తైన సహజసిద్ధ శివలింగంగా కనిపిస్తున్నాడు.. ఒక రోజులో మూడు వర్ణాలు మారే శివలింగం.. దేవభూమిలో మహాద్భుత దృశ్యం ఆవిష్కారమైంది. అత్యంత ఎత్తైన మంచు కొండల పైన, నిటారుగా, నిరాకారంగా వెలసిన మహాద్భుత అవతారం. 17,500 అడుగుల చుట్టు కొలత... 18వేల అడుగుల ఎత్తున మహా శివలింగం.

ఉదయం రజతం...మధ్యాహ్నం సువర్ణం... సాయంత్రం నీలమేఘం... మూడు వర్ణాల్లో ముక్కంటి.. ఆధ్యాత్మిక క్షేత్రంలో అపురూప సన్నివేశం. బోళా శంకరుడికి రెండో కైలాసం ఏమిటని ఆశ్చర్యపోకండి.. ఇది వాస్తవం.. ఆయన నిజంగానే బోళా శంకరుడు.. అందుకే

**కిన్నెర కైలాసం. పరమేశ్వరుడి నిజ కైలాసాన్ని మరిపించే కైలాసం..చూస్తున్న కొద్దీ చూడాలనిపించే కైలాసం.. అణువణువునా ఆధ్యాత్మికత నిలువునా కమ్మేసే అపురూప ప్రదేశం.. అక్కడ శివలింగం రంగులు మారటం విశేషం.. ఒకే ప్రాంతంలో.. ఒకే చోట.. నిశ్చలంగా ఉన్న శివలింగం ఏ విధంగా రంగులు మారుతోంది.. ఇదెలా సాధ్యపడుతోంది?**



భక్తులను ఇబ్బంది పెట్టకుండా సులభ సాధ్యుడయ్యాడు. కోరుకున్న చోటనే దర్శన మిస్తున్నాడు. అదే ఈ రెండో కైలాసం. మౌంట్ కైలాస పర్వతం మాత్రమే కాదు.. అది ఆయన నిజనివాసం కావచ్చు. కానీ, శివుడికి రెండో కైలాసం హిమాచలంలోనే ఉంది. సముద్రమట్టానికి వేల అడుగుల ఎత్తున ఉంది. భక్తులను పలు వర్ణాల్లో అలరిస్తోంది. వారికి అందుబాటులో ఉంది. కొంచెం కష్టపడితే లయకారుడి దివ్యదర్శనం లభ్యమ వుతోంది.

కిన్నెర కైలాసం. పరమేశ్వరుడి నిజ కైలాసాన్ని మరిపించే కైలాసం..చూస్తున్న కొద్దీ చూడాలనిపించే కైలాసం. అణువణువునా ఆధ్యాత్మికత నిలువునా కమ్మేసే అపురూప ప్రదేశం. అక్కడ శివలింగం రంగులు మారటం విశేషం. ఒకే ప్రాంతంలో.. ఒకే చోట.. నిశ్చలంగా ఉన్న శివలింగం ఏ విధంగా రంగులు మారుతోంది.. ఇదెలా సాధ్యపడుతోంది? శివలింగం రంగులు మారటం ఏమిటి? శివుడి మాహాత్మ్యమా? మాయా? నిజంగా ఈశ్వరుడి లీలలు అక్కడ కనిపిస్తున్నాయా? అంటే అవుననే చెప్పాలి.

హిమాచల ప్రదేశ్‌లో కిన్నౌర్ ప్రాంతం.. టిబెట్‌కు తూర్పున హిమాచల్ ప్రదేశ్ దాకా కొనసాగే హిమాలయ శ్రేణి అంతా దేవ భూమి.. ఒక అద్భుతమైన వాతావరణం.. మౌనంగా ఉన్నా, గాలిలో ఈశ్వరుడి పేరు ప్రతిధ్వనించే పాంతం. హిమాచల్ ప్రదేశ్ రాజధాని సిమ్లాకు సరిగ్గా 235 కిలోమీటర్ల దూరంలో కిన్నౌర్ జిల్లా ఉంది. కిన్నౌర్ జిల్లా హిమాలయ పర్వత సానువుల్లో.. నిజంగా అందాల కోన.. మూడు హిమాలయ పర్వతాలు పక్కపక్కనే పేర్చినట్లు ఉంటాయి. జన్‌స్కర్, గ్రేటర్ హిమాలయ, దౌలంధర్ శ్రేణులు సట్లైజ్, స్పిటి, బాస్పా వంటి జీవనదులకు పుట్టినిళ్లు. వీటి మధ్యలోనే అన్నింటికంటే అత్యంత ఎత్తుగా కిన్నెర కైలాస్ పర్వతం కొలువుదీరి ఉంది. సట్లైజ్ నదీతీరంలో అందమైన జలపాతాల నడుమ 18వేల అడుగుల ఎత్తులో ఈ పర్వతాన్ని చూడటానికి వేయి కన్నులున్నా సరిపోవు.



**సైన్స్‌కు ఎంతమాత్రం అందని, అంతుపట్టని ప్రకృతి విన్యాసం ఇది. కేవలం శివలింగం మాత్రమే కాదు.. మొత్తం కిన్నెర కైలాస్ పర్వతం అంతా శివుడి ఉనికిని, అస్తిత్వాన్ని, ఆయన తేజస్సును విరజిమ్ముతున్నది.. అక్కడికి వెళ్లే భక్తులందరికీ ఇదే అనుభూతి కలుగుతోంది.. హేతువాదులకు సైతం ఆధ్యాత్మిక భావనను కల్పించే వాతావరణం అక్కడిది.**

ఈ కొండపైనే సహజ సిద్ధమైన శివలింగం ఆవిర్భవించి ఉంది. యోగులకు, సిద్ధులకు మాత్రమే కాదు.. సామాన్యులకు కూడా సాక్షాత్కరించే అతి గొప్ప శివలింగం. తొంభై అడుగుల ఎత్తైన శివలింగం. ఇది అలాంటిలాంటి శివలింగం కాదు.. మనం సాధారణంగా చూసే మాదిరిలో దీని ఆకారం ఉండదు.. కిన్నెర కైలాసం పీక్ స్టేజ్‌లో నిటారుగా నిలుచుని ఉన్న రాతినే శివలింగంగా భక్తులు భావిస్తారు. కేవలం రాయిని శివలింగంగా ఎందుకు భావించారు? అదే ఇక్కడి ప్రత్యేకత. ఇది కేవలం రాయి కాదు.. ఇందులో జీవశక్తి వుందని ఇక్కడ ఉపాసించే సిద్ధుల దృఢమైన అభిప్రాయం. ఎందుకంటే ఈ శివలింగం రోజులో మూడు కాలాల్లో మూడు రంగుల్లో కనిపిస్తుంది. నిర్దిష్ట సమయానికి శివలింగం రంగు మారుతుంది. అత్యంత ఎత్తైన ప్రాంతంలో ఉన్న ఈ శివలింగం ఉదయం భానుడి లేలేత కిరణాల స్పర్శతో మిలమిలా మెరిసిపోతుంది.. వెండి రాశి పోతపోసుకున్నట్లుగా తెల్లగా ఈ శివలింగం దర్శనమిస్తుంది. మధ్యాహ్నానికి సూర్యుడు నడినెత్తిమీదకు వచ్చేసరికి పసిడి వన్నెలోకి మారిపోతుంది. ఇదే మహాలింగం సాయంత్రం అయ్యేవేళకు నీలిరంగులో ధగధగలాడుతుంది. ప్రపంచంలో అతి గొప్ప పరిణామ క్రమం ఇది. శివలింగం ఉన్న ప్రాంతంలో మాత్రమే ఈ రంగులు మారుతున్నాయి. ముక్కంటి మాత్రమే ఈ విధంగా దర్శనమిస్తున్నాడు.. ఇది ఆయన లీలా విలాసమే. ప్రపంచంలో కిన్నెర కైలాసంలో మాత్రమే ఈ అద్భుతమైన సన్నివేశం కనిపిస్తుంది. అదీ ఈ శివలింగం నెలకొని ఉన్న ప్రాంతంలో మాత్రమే ఇలా రంగులు మారుతాయి. ఈ పరిణామం దేనికి సంకేతం? శివలింగం మాత్రమే కాదు. కిన్నెర కైలాస పర్వతానిదే ఒక ప్రత్యేకత. మౌంట్ కైలాసాన్ని మరిపించేది ఈ కిన్నెర కైలాసం మర్మం.

కిన్నెర కైలాసంలో సహజసిద్ధంగా ఏర్పడిన శివలింగం మూడు వర్ణాల్లో కనిపించేందుకు ఇక్కడ ఉపాసకులు ఆసక్తికరమైన కథనాలను వినిపిస్తారు. ఉదయం వెండిరంగులో శివలింగం కనిపిస్తుంది. సూర్యుని కిరణాలు శివుడి తలపైవున్న జాబిల్లిని తాకుతాయి.



**శివుడి నిజనివాసం టిబెట్‌లోని కైలాస పర్వతం.. దాని చుట్టూ బయటి నుంచి ప్రదక్షిణ చేయటమే గొప్ప సాహసం.. కిన్నెర కైలాసం అలాంటిది కాదు.. ఇక్కడికి శివలింగం వరకు వెళ్లి స్పృశించి వచ్చే అవకాశం ఉంది.. కాకపోతే కిన్నెర కైలాసం ఒక్కోసారి మౌంట్ కైలాస్‌నే తలపిస్తుంది. కొన్ని వేళల్లో కిన్నెర కైలాసాన్ని చూస్తే, మౌంట్ కైలాస్‌కు, దీనికి అస్సలు తేడా కనిపించదు.**

జాబిల్లి నుంచి వెలువడే వెన్నెలే ఈ తెలుపు రంగుకు కారణం.. ఈ వెన్నెలకు భూతనాథుడి ఒంటిపై ఉండే విభూతి తోడై అద్భుతంగా విరాజిల్లుతుందని శివభక్తులు చెప్తారు. మధ్యాహ్నానికి కిన్నెర శివలింగం పసిడి వన్నెలోకి మారిపోతుంది. శివుడు ధరించిన పులిచర్మం, పట్టపగలు తనపై నేరుగా పడే సూర్యుడి కిరణాలకు బంగారు రంగులో మెరిసిపోతుందిట. ఈ రంగు చుట్టూ ఉన్న మేఘాలపై ప్రసరించి మరింత అద్భుత దృశ్యం ఆవిష్కారమవుతుంది. సాయంకాలానికి ఈశ్వరుడి లయవిన్యాసం విశ్వరూపం దాలుస్తుంది. ఆయన కంఠంలో ఉన్న గరళం ఒక్కసారిగా చైతన్యవంతం అవుతుంది. గరళం నుంచి వెలువడే సెగలు ఒక్కసారిగా శివలింగాన్ని నీలివర్ణంలోకి మార్చేస్తాయి. ఇదొక అద్భుత సన్నివేశం.. అపురూప ప్రకృతి స్వరూపం.

పురాణాలు చెప్పే కథనాలు ఆధ్యాత్మిక భావనను వెల్లడి చేస్తున్నాయి. ఈ కథలు, కథనాలు సైన్స్‌కు అంతుపట్టవు. ఉదయం నుంచి సాయంత్రం వరకు ప్రకృతిలో, సూర్యుడి ప్రస్థానంలో, వాతావరణంలో, హిమాలయ శ్రేణుల్లో సాగే మేఘాలు ఈ శివలింగాన్ని తాకుతూ వెళ్తాయి. అందువల్లే ఇక్కడ ప్రకృతిలో రంగుల మార్పులు జరుగుతాయని సైంటిస్టులు ఒకరకమైన అంచనా వేస్తుంటారు.

సైంటిస్టులు చెప్పిన మాటలో లాజిక్ లేకపోలేదు. కానీ, ఇక్కడే అసలు ప్రశ్న ఎలాంటి జవాబుకూ చిక్కడం లేదు. ఎందుకంటే నిజంగా ప్రకృతిలో, వాతావరణంలో మార్పులవల్ల ఇలాంటివి ఏవైనా జరుగుతుంటే ఆ ప్రాంతం అంతటా అదే విధంగా రంగులు మారుతూ ఉండాలి.. కానీ, ఒక్క శివలింగం ఉన్న పరిసర ప్రాంతంలోనే ఇలా జరుగుతోంది.. కిన్నెర కైలాస పర్వత శ్రేణిలోనే ఈ వర్ణాల మార్పు జరుగుతోంది.. దీనికి మాత్రం ఇప్పటివరకు ఎవరూ జవాబు చెప్పలేకపోతున్నారు.. మరి ఇది నిజంగా ఈశ్వరుడి మాయా.. ఏమో?

సముద్ర మట్టానికి 18వేల అడుగుల ఎత్తున జరుగుతున్న అద్భుతం ఇది. సైన్స్‌కు ఎంతమాత్రం అందని, అంతుపట్టని ప్రకృతి విన్యాసం ఇది. కేవలం శివలింగం మాత్రమే

కాదు.. మొత్తం కిన్నెర కైలాస్ పర్వతం అంతా శివుడి ఉనికిని, అస్తిత్వాన్ని, ఆయన తేజస్సును విరజిమ్ముతున్నది. అక్కడికి వెళ్లే భక్తులందరికీ ఇదే అనుభూతి కలుగుతోంది. హేతువాదులకు సైతం ఆధ్యాత్మిక భావనను కల్పించే వాతావరణం అక్కడిది.

కైలాసాలు ఒకటి కంటే ఎక్కువ ఉండటం ఏమిటి? ఎలా ఏర్పడ్డాయి ఇవి? వీటికి స్థానిక కథనాలు చాలానే ఉన్నాయి. రుద్రుడు హిమాలయాలను సృష్టించినప్పుడు ఆయన తన గణాలకోసం ప్రత్యేక స్థానాలను ఏర్పాటు చేశాడు. అందులో కిన్నెరులకోసం ఏర్పాటు చేసిన ఆవాసస్థలమే కిన్నెర కైలాసం. ఇక్కడ కిన్నెరులు తనను ఆరాధించటం కోసం స్వయంభువుగా లింగరూపుడై అవతరించాడని ఇక్కడికి వచ్చే భక్తుల విశ్వాసం..

శివుడి నిజనివాసం టిబెట్‌లోని కైలాస పర్వతం.. దాని చుట్టూ బయటి నుంచి ప్రదక్షిణ చేయటమే గొప్ప సాహసం.. కిన్నెర కైలాసం అలాంటిది కాదు.. ఇక్కడికి శివలింగం వరకు వెళ్లి స్పృశించి వచ్చే అవకాశం ఉంది.. కాకపోతే కిన్నెర కైలాసం ఒక్కోసారి మౌంట్ కైలాస్‌నే తలపిస్తుంది. కొన్ని వేళల్లో కిన్నెర కైలాసాన్ని చూస్తే, మౌంట్ కైలాస్‌కు, దీనికి అస్సలు తేడా కనిపించదు.. కైలాస పర్వతం, కిన్నెరకు వచ్చేసిందా? అన్నంత కన్ఫ్యూజన్‌ను క్రియేట్ చేస్తుంది. ఈ ప్రకృతి వింతను చూసి తీరాల్సిందే.

శివుడికి కైలాసాలు కేవలం రెండే కాదు.. మొత్తం అయిదు కైలాసాలు ఉన్నాయని చెప్తారు.. వీటిలో మొదటిది మౌంట్ కైలాస్..ఇది టిబెట్‌లో ఉంది. రెండవది కిన్నెర కైలాస్.. హిమాచల్ ప్రదేశ్‌లోని కిన్నౌర్ జిల్లాలో ఉన్న గొప్ప పర్వతం ఇది. ఇక మూడవది మౌంట్ ఆది కైలాస్.. ఇది ఉత్తరాఖండ్‌లోని పితోర్‌గఢ్ జిల్లాలో ఉంది. దీన్ని చోటా కైలాస్ అని కూడా పిలుస్తారు. హిమాచల్ ప్రదేశ్‌లోనే రాంపూర్ జిల్లాలో శ్రీఖండ్ కైలాసం ఉంది. ఇది నాలుగో కైలాసం. ఇదే రాష్ట్రంలో చంబా జిల్లాలో మణిమహేశ్ కైలాసం వుంది. మొత్తం అయిదు కైలాసాల్లో శివుడు ఆదిపురుషుడిగా, ఈశ్వరుడిగా నెలకొని వున్నాడు.

భారత దేశ ఆధ్యాత్మిక క్షేత్రాల్లో హిమాలయాలకు ఉన్న ప్రాధాన్యం అంతా ఇంతా కాదు.. మన దేశానికి సంబంధించి భక్తి ఉద్యమం అంతా కూడా హిమాలయాలనుంచే ప్రారంభం అవుతుంది.. అక్కడే ముగుస్తుంది కూడా. హిమాలయ పర్వత శ్రేణులు విస్తరించిన ప్రాంతం అంతా దేవతల భూమిగా, దేవలోకంగా భారతీయులు గట్టిగా నమ్ముతారు. అక్కడి వాతావరణం కూడా అదే విధంగా ఆధ్యాత్మిక వాసనలను వెదజల్లుతుంటుంది. కిన్నెర కైలాసం అందులో పీక్ లెవల్‌లో ఉంది. దేవుణ్ణి నమ్మినా, నమ్మకపోయినా ఒక్కసారి అక్కడికి వెళ్లి వస్తే మానసికంగా మనిషిలో కలిగే మార్పు మాత్రం తిరుగులేనిది.

# మణిమహేశ

*మహాదేవుని త్రినేత్ర సందర్శనం*

*దివ్యకాంతులలో దేవ దేవుడు*

*ధగధగలు విరజిమ్ముతున్న గరళం*

*మణి రూపంలో మహేశ్వరుడు*

*మహాదేవుడి మరో కైలాసం*



శివుడి త్రినేత్రాన్ని చూశారా? ముక్కంటి మూడో కన్ను తెరిస్తే అందులోంచి వచ్చే అగ్నికీలలకు అంతా బూడిద కావలిసిందే.. అలాంటప్పుడు ఆ మూడో కన్నును చూడటం సాధ్యమేనా? అంటే సాధ్యమే. ఆ మూడో కంటిలో ఎంత సూర్యుడి నిప్పులు ఎంత వున్నాయో.. చంద్రుడి వెన్నెల అంతే ఉంది. బోళా శంకరుడు ఆ వెన్నెలను ప్రేమతో మనకు అందిస్తున్నాడు. మనల్ని అనుగ్రహిస్తున్నాడు.. పరమ శివుడు మణికాంతులతో దర్శనమిస్తున్నాడు..

ఉమాపతి నిజంగా బోళా దేవుడు.. ఎక్కడో కైలాసంలో తనను చూసేందుకు భక్తులు పడే కష్టాల్ని చూడలేక... తానే దిగి వచ్చాడు.. భక్తుల దగ్గరకు తానే వస్తున్నాడు.. భక్తులు ఎంతదూరం రాగలిగితే అక్కడే దర్శనమిస్తున్నాడు.. కొన్ని చోట్ల లింగరూపంలో, మరి కొన్ని చోట్ల విగ్రహంగా కనిపించే దేవుడు.. ఇక్కడ మాత్రం ప్రత్యక్షంగా దర్శనమిస్తున్నాడు.. మణికాంతులతో ధగధగమంటున్నాడు. వెండి పరచుకున్న కొండపై వేయి వెలుగులు విరజిమ్ముతున్నాయి.. నవరత్నాల మిసమిసల్లో నీలకంఠుడి నిజదర్శనం జరుగుతోంది.

ఈ వెలుతురు సామాన్యమైంది కాదు.. మామూలుగా కనిపించే సూర్యకాంతి కానే కాదు.. ఇది ఈశ్వరుడి ఉనికి.. గౌరీపతి తానుగా కైలాసం నుంచి దిగి వచ్చి భక్తులకు సాకారంగా దర్శనమిస్తున్న కాంతిపుంజం.. ఆశ్చర్యం కాదు.. అద్భుతం.. దైవత్వానికి ప్రత్యక్ష నిదర్శనం ఇది.. దేవభూమిలో పరమేశ్వరుడు మనల్ని వెలుగుమొగ్గై కరుణిస్తున్నాడు. త్రినేత్రం లోని వెలుగురవ్వలు మిమ్మల్ని అనుగ్రహిస్తాయి. గరళకంఠుడి విషం మిమ్మల్ని కరుణిస్తుంది. ఇది నిజం. దేవభూమి హిమాచలంలో ఒక అద్భుత దృశ్యం కానవస్తోంది. పరమేశ్వరుడు అపూర్వంగా కనిపిస్తున్నాడు.. అపురూపంగా సాక్షాత్కరిస్తున్నాడు.. మణి కాంతులలో దర్శనమిస్తున్నాడు. రత్నకాంతులన్నీ ఒకేచోట కలగలిస్తే.. వాటిలోంచి వచ్చే

వెలుగు ఎంత అపూర్వంగా ఉంటుందో అలాంటి వెలుగురూపంలో ఈశ్వరుడి దర్శనం కలుగుతోంది. ఆయన మూడో కంటి నుంచి వెన్నెల కురిపించే ఏకైక ప్రాంతం అది. దేవదేవుడు నిజరూపంలో భక్తులను ఆదరిస్తున్న ఆధ్యాత్మిక పర్వతప్రాంతం. హిమాలయాల్లో కొలువైన మహాదేవుడి దివ్యధామం ఇది.

శివుడేమిటి? మణి రూపంలో దర్శనమివ్వటం ఏమిటనుకోవద్దు. నిజంగా పరమశివుడు మణికాంతులతో దర్శనమిస్తున్నాడు. ఈశ్వరుడు మణిరూపంలో భక్తులను అనుగ్రహి స్తున్నాడు. అత్యంత అరుదైన దృశ్యం అది. హిమాచలప్రదేశ్.. చంబా జిల్లా.. పీర్ పంజల్ రేంజ్‌లో మణిమహేశ పర్వతం... అది మరో కైలాసం. మానస సరోవరం దగ్గరి కైలాస పర్వతానికి అచ్చంగా రెప్లికా. సముద్ర మట్టానికి 13,390 అడుగుల ఎత్తున వున్న మణిమహేశ్ పర్వతం.. మౌంట్ కైలాస్‌కు కవల పిల్లలా ఉంటుంది. మౌంట్ కైలాస్ ఏ విధంగా కనిపిస్తుందో.. అదే విధంగా మణిమహేశ్ కూడా కనిపిస్తుంది. కైలాస్ పాదం దగ్గర మానస సరోవరం స్వచ్ఛంగా ఉంటుంది. మణిమహేశ్ పర్వత పాదం దగ్గర శివకుండ్ సరస్సు ఉంటుంది. మానస సరోవరంలో నీరు ఎంత స్వచ్ఛంగా ఉంటుందో. శివకుండ్‌లో కూడా అదే విధంగా ఉంటుంది.

ఇది అలాంటిలాంటి కొండ కాదు.. శివుడి తపోభూమి. ఈ పర్వత శిఖరంపై స్వామి మణిరూపంలో దర్శనమిస్తాడు. శివుడి కిరీటంలోని మణికాంతులపై, ఆయన తలపై కొలువైన చంద్రుడి వెన్నెల జత కలిసి మణి మహేశుడిగా దర్శనమిస్తాడని ఇక్కడి ప్రజల్లో ఉన్న విశ్వాసం. నిండు పౌర్ణమి నాడు మహేశ పర్వతం శిఖరభాగంపై వెలువడే కాంతులు, కింద సరస్సులో మణిరూపంలో రిఫ్లెక్ట్ అవుతాయి. ఇది చాలా అరుదుగా జరిగే సంఘటన.

శివుడిని మనం లింగరూపంలో చూశాం.. విగ్రహంగా దర్శించుకున్నాం.. ఇదిగో ఈ పర్వతం దగ్గర మణిరూపంలో దర్శించుకుంటున్నాం. దిగంబరుడు, చర్మాంబరధారి, విభూతి ప్రియుడు, స్మశాన సంచారి.. అన్నీ వదిలేసుకున్న మహాదేవుడు మణిరూపంలో కనిపిస్తున్నాడు. అదే ఇక్కడి గొప్పతనం. బోళాశంకరుడి అనంతమైన కాంతిపుంజానికి నిదర్శనం. సూర్యుడి తొలికిరణం మణిమహేశ శిఖరాన్ని తాకి, కింద ఉన్న సరస్సులో రిఫ్లెక్ట్ అయినప్పుడు అది కాషాయం రంగులో ముక్కంటి మూడో కంటిని చూపిస్తుంది. ఇది ఇక్కడ మాత్రమే జరిగే సన్నివేశం.. ఈశ్వరుడి శక్తిని నిరూపిస్తున్న సత్యం ఇది.

సూర్యుడి కిరణాలు నీళ్లలో కనిపించినప్పుడు రకరకాలుగా రిఫ్లెక్ట్ కావటం అందరికీ తెలిసిన విషయమే. ఇందులో దేవుడి గొప్పతనం ఏముంది? మణిమహేశ్ పర్వతంలో అంత స్పెషల్‌గా చెప్పుకోవలసింది ఏముంటుంది? అందరిలోనూ సహజంగా కలిగే ప్రశ్నే ఇది..అక్కడే ఉంది అసలు సంగతి.. శివుడి కైలాసం కంటే మణిమహేశ్‌కు ఉన్న ప్రత్యేకత వేరు.. ఇక్కడ మాత్రమే కనిపించే అద్భుతం మణి మహేశ్‌పై శివుడి ఉనికిని చాటుతోంది.

**మానససరోవర ప్రాంతంలో గౌరీకుండం వద్ద శివపార్వతులు ఆదిదంపతులుగా అవతరించిన తరువాత ఈ మణిమహేశ్‌ను మరో కైలాసంగా సృష్టించాడు. మానస సరోవరం లాగానే ఇక్కడా శివకుండాన్ని నెలకొల్పాడు. తన గణాలలో ఒకరుగా ఉన్న గద్ది గణానికి మణిమహేశ్‌ను బహుమానంగా ఇచ్చాడట. ఈ పర్వత ప్రాంతంలో నివసించే గిరిజన తెగల్లో గద్ది వర్గం ప్రముఖమైంది.. ఈ వర్గం గురించి శివపురాణం ప్రముఖంగా ప్రస్తావించింది. దక్ష వినాశనం టైమ్‌లో వీరభద్రుడికి పూర్తి తోడుగా నిలిచిన సైన్యమిది.**

మణి మహేశ్ కైలాస పర్వతం హిమాచలంలో చాలా ఎత్తైన కొండల్లో ఒకటి. టిబెట్‌లోని మౌంట్ కైలాసాన్ని పోలి ఉంటుందని ఇంతకు ముందే చెప్పుకున్నాం. మౌంట్ కైలాస్ దగ్గర ఎలాంటి వాతావరణం ఉంటుందో, ఇక్కడా అలాగే ఉంటుంది. కాకపోతే, మౌంట్ కైలాస్ దగ్గర ఆక్సీజన్ చాలా తక్కువగా ఉంటుంది.. మణిమహేశ్‌లో మాత్రం ఆక్సీజన్ తగిన స్థాయిలోనే ఉంటుంది. పర్వతంపైకి ట్రెకింగ్ చేసే వీలూ ఉంది. మణిమహేశ్ పరమేశ్వరుడు స్వయంగా సృష్టించిన మరో కైలాసం.. మానససరోవర ప్రాంతంలో గౌరీకుండం వద్ద శివపార్వతులు ఆదిదంపతులుగా అవతరించిన తరువాత ఈ మణిమహేశ్‌ను మరో కైలాసంగా సృష్టించాడు. మానస సరోవరం లాగానే ఇక్కడా శివకుండాన్ని నెలకొల్పాడు. తన గణాలలో ఒకరుగా ఉన్న గద్ది గణానికి మణిమహేశ్‌ను బహుమానంగా ఇచ్చాడట. ఈ పర్వత ప్రాంతంలో నివసించే గిరిజన తెగల్లో గద్ది వర్గం ప్రముఖమైంది. ఈ వర్గం గురించి శివపురాణం ప్రముఖంగా ప్రస్తావించింది. దక్ష వినాశనం టైమ్‌లో వీరభద్రుడికి పూర్తి తోడుగా నిలిచిన సైన్యమిది.

ప్రతి సంవత్సరం శ్రావణ మాసంలో అంటే ఆగస్టులో పరమేశ్వరుడు మణిమహేశ్‌పైకి వచ్చి తపస్సు చేస్తాడట.. ఈ సమయంలోనే పౌర్ణమి రోజుల్లో తపోదీక్షలో ఉన్న శివుడి తలపైనున్న నెలవంక నుంచి మణికాంతులు కిందనున్న సరస్సులో ప్రతిబింబిస్తాయి. ఇది ఇక్కడ ప్రచారంలో ఉన్న కథనం.

ఈ మణికాంతులు ఎలా వస్తాయి? ఇదేమీ పెద్ద మిస్టరీ కాదు.. సూర్యుడి కాంతి పుంజాలు పర్వత శిఖర భాగంపై పడినప్పుడు అవి మణికాంతులు విరజిమ్ముతాయి. చిత్రమేమంటే, మణిమహేశ పర్వత ప్రాంతంలో సూర్యుడి కిరణాలు శిఖరం పైభాగం నుంచి ప్రసరించినప్పుడు సరస్సులో అవి ఒక మణిరూపంలో మాత్రమే కనిపిస్తాయి. విచిత్రమేమంటే కనిపించిన ప్రతిసారీ, ఒకే రూపంలో కనిపిస్తాయి. నీటి కదలికల్లోనూ రూపం మారదు.. తొలి కిరణ ప్రసారంలో మాత్రమే అగ్ని రూపంలో అంటే కాషాయం రంగులో, శివుడి మూడో కన్ను తలపిస్తుంది? ఇది ఇక్కడ మాత్రమే కనిపించే విశేషం.. సాధారణంగా సూర్య కిరణాల ప్రసారం క్షణక్షణానికీ మారుతుంటుంది.. ఆ కదలికల

ఆధారంగానే నీడలు ఉంటాయి. కానీ, మణిమహేశ్‌లో మాత్రం ఈ కాంతి మణి రూపంలో మాత్రమే కనిపిస్తాయి. అదే మహేశ్వరుడి ఎగ్జిస్టెన్స్‌ను చాటుతోంది. మణి మహేశ్ కైలాసం ఒక విచిత్రమైన వాతావరణాన్ని కలిగి ఉంటుంది. హిమాలయ శ్రేణుల్లో ఎక్కడా కనిపించని విశేషమిది. చిన్ని చిన్ని శబ్దాలు సైతం ఇక్కడ శివపంచాక్షరిని వినిపిస్తాయి. ప్రణవనాదాన్ని ప్రతిధ్వనింపజేస్తాయి.

ఈశ్వరుడి ప్రళయ తాండవం ఇక్కడ కనిపించదు.. ఆయన తపస్సు..ఉపాసనా మార్గం ఇక్కడికి వెళ్లిన వారికి గోచరిస్తుంది.మణిమహేశ్‌కు, మౌంట్ కైలాస్‌కు మధ్య చాలా పోలికలు ఉన్నాయి. కానీ, రెంటికీ మధ్య ఒక్క తేడా మాత్రం ఉంది. మౌంట్ కైలాస్ పైకి ఎక్కిన వాళ్లు ఇప్పటి వరకు లేరు.. కానీ, మణిమహేశ్ ట్రెకింగ్‌కు అనువైన పర్వతమే. 13వేల అడుగులు పైకి అధిరోహిస్తే శిఖరాన్ని చేరుకున్నట్లే.. పర్వతం కింది భాగాన ఉన్న శివకుండ్‌కు ఇరువైపులా ఉన్న మంచు కొండల నడుమ నుంచి పైకి వెళ్లటానికి మార్గం ఉంది... ఈ మార్గం నుంచి పైదాకా వెళ్లవచ్చు. మరో విచిత్రం ఏమంటే, ఇక్కడి వాతావరణం.. ఇక్కడి సరస్సు చుట్టూ ఇసుక తిన్నెలు కనిపిస్తాయి. చిన్న చిన్న రెల్లు పొదల్లాంటివి ఎక్కువగా వుంటాయి. ఇక్కడి గాలి ఎంత స్వచ్ఛమైందంటే.. ఆ గాలిని పీలిస్తే చాలు.. మన లోపల కాలుష్యాన్నంతా కడిగేస్తుంది.. చీమలు లాంటి పురుగు, పుట్రా, జంతువులు వంటివి మచ్చుకైనా కనిపించవు. ఏడాది పొడవునా ఒకే వాతావరణం.. ఐసీ కోల్డ్... ఈ ఒక్క కారణం వల్లనే కావచ్చు, ఈ ప్రాంతంలో భూతద్దం పెట్టి వెతికి చూసినా శాశ్వత నివాసాలు కనిపించవు. భక్తులు ఎక్కువ సంఖ్యలో వచ్చినప్పుడు తప్ప ఇక్కడి నిశ్శబ్దానికి ఎప్పుడూ ఆటంకం ఉండదు. ఎందుకంటే ఇది శివుడు తపస్సు చేసుకునే భూమి కాబట్టి. మంచు కురిసినప్పుడు మణిమహేశ్ వెండికొండను తలపిస్తుంది. శివకుండం సమీపంలో మహాదేవుని విగ్రహం ఉంటుంది. యాత్రికులు ఈ విగ్రహానికి పూజలు చేస్తారు. ఈ స్వామిని చౌముఖ అని పిలుస్తారు. మణిమహేశ్ పైకి ట్రెకింగ్ సుమారు తొమ్మిది రోజులు జరుగుతుంది. నాలుగు వైపులనుంచి పైకి ఎక్కవచ్చు. 14 నుంచి 20 కిలోమీటర్ల వరకు ట్రెకింగ్ చేయాల్సి వస్తుంది.. మణి మహేశ్ శివుడి తపోభూమి మాత్రమే కాదు.. ఆయన ఆటలాడుకునే ప్లే గ్రౌండ్‌గా కూడా భక్తులు చెప్పుకుంటారు. యాత్రికుల కంటే కూడా సాధువులు ఎక్కువగా పర్వతారోహణ చేసే కైలాసం ఇది. అయితే సాధువులు సైతం దూరంగా ఉన్న చంబా జిల్లాలోనే ఉంటారు తప్ప, పర్వత ప్రాంతంలో మాత్రం నివాసం ఏర్పాటు చేసుకోరు. శివుడికి తపోభంగం చేయరాదన్నది ప్రధాన ఉద్దేశం. హిమాలయాల్లోని శివక్షేత్రాల్లో మణిమహేశ్ గొప్పది. శివుడి అయిదు కైలాసాల్లో ఇది మూడో కైలాసం. ఆస్తికులకూ, నాస్తికులకూ కూడా ఆధ్యాత్మిక భావభూమికలను అనంతంగా పంచి ఇచ్చే అపురూప క్షేత్రం.

# మంచుకొండల్లో మహాదేవుడు



చుట్టూ ఎత్తైన కొండలు.. కిందకు చూస్తే లోతెంతో తెలియని లోయలు.. పైకి వెళ్తున్న కొద్దీ ఆక్సీజన్ అందనంత ప్రమాదకరమైన వాతావరణం. మైనస్ డిగ్రీలలో గడ్డకట్టే శీతోష్ణ స్థితి.. ప్రయాణంలో వెంటుక వాసి నిర్లక్ష్యం చేసినా అంతే సంగతులు. అంతటి ప్రతికూల పరిస్థితిలోనూ ఒకే ఒక్క మంత్రం అందరినీ ఆకాశమంత ఎత్తుకు తీసుకువెళ్తుంది.. ఒకే ఒక్క మంత్రం అంతటి దుర్భర వాతావరణాన్ని సైతం సానుకూలంగా మారుస్తుంది.. అదే పంచాక్షరి.. ఓం నమఃశివాయ.. మంచుకొండల్లో నెలకొన్న మహాశివుని దర్శనానికి సాగే యాత్ర ఇది.. ఏడాదిలో కేవలం 45రోజుల పాటు కనిపించే మంచు శివలింగాన్ని చూసేందుకు సాగే తపన ఇది.. అమర్‌నాథ్‌లో ఉన్న ప్రత్యేకత అలాంటిది. అసలు మంచు లింగం ఏర్పడటం, కరిగిపోవటం జరుగుతోంది.. జ్యోతిర్లింగం అని చెప్పుకునే అమర్‌నాథుడు కొన్ని రోజులు మాత్రమే కనిపిస్తున్నాడు. కొద్ది రోజులు మాత్రమే అమర్‌నాథ్‌లో పరమేశ్వరుని ఉనికి వ్యక్తమవుతోంది

అమర్‌నాథ్‌లో మంచులింగం ఎలా ఏర్పడుతోంది? కృత్రిమంగా ఏర్పాటు చేస్తున్నదా? సహజంగా ఏర్పడుతోందా? కొండ గుహలో ఒక్క చోటనే హిమలింగం ఎలా వస్తోంది? ప్రతి ఏడాది.. ఒకే సమయం.. ఒకే ఎత్తు.. ఒకే ఆకారంలో శివలింగం ఏర్పడటంలో మర్మం ఏమిటి? కైలాస పర్వతం

నుంచి అమర్‌నాథ్‌కు శివుడు రావటం వాస్తవమేనా? లయకారకుడి నిజరూపం శివ లింగమేనా? చావుకీ శివుడికీ మధ్య ఉన్న సంబంధం ఏమిటి? ఈ ప్రశ్నలకు జవాబులు అమరనాథుడే చెప్తాడు.

జూలై మాసం వచ్చిందంటే అమర్‌నాథ్‌కు భక్తుల యాత్ర మొదలవుతుంది. ప్రపంచంలోనే అతి కష్టమైంది.. తిరిగి వస్తామో, రామో అన్నంత కఠినమైన ట్రెకింగ్.. ఇరుకైన దారి... ఇరుపక్కలా లోయలు.. కళ్లు తెరిస్తే గిర్రున తిరిగి ఎక్కడ పడిపోతామో అన్నంత భయం.. తెరవకపోతే ఎలా వెళ్తున్నామో తెలియని అయోమయం. ఒక్క మాటలో చెప్పాలంటే మన వెనకే మృత్యువు నడుస్తుంటే... దాని బారిన పడకుండా వెళ్లటమే అమర్‌నాథ్ యాత్ర.

కాశ్మీర్ రాజధాని శ్రీనగర్‌కు కేవలం 145 కిలోమీటర్ల దూరం. కానీ, ఎత్తులో మాత్రం ఎవరికీ అందనంత. సముద్రమట్టానికి అక్షరాలా 13,700 అడుగుల హైట్‌లో అమర్‌నాథ్ గుహ ఉన్నది.. ఇది సాదా సీదా గుహ కాదు.. ప్రపంచంలోనే అతి పెద్ద గుహల్లో ఒకటి.. 150 అడుగుల ఎత్తు, 90 అడుగుల పొడవున్న గుహ ఇది. హిమాలయ పర్వత సానువుల్లో అపురూపంగా, సహజసిద్ధంగా ఏర్పడిన గుహ.. ఇది మానవనిర్మితం ఎంతమాత్రం కాదు.

ప్రతి ఏటా జూలై నుంచి ఆగస్టు చివరివరకు అమర్‌నాథ్ గుహలో శివలింగం భక్తులకు దర్శనమిస్తుంది. కేవలం 45రోజులు మాత్రమే ఈ శివలింగం కనిపిస్తుంది. ఆ తరువాత క్రమంగా కరిగి, కరిగి అంతర్ధానమవుతుంది. ఈ శివలింగం సగటు మనిషి ఎత్తులో ఏర్పడుతుంది.. జాగ్రత్తగా పరికిస్తే మనిషి ఆకారం ఇందులో గోచరిస్తుంది కూడా.

అమర్‌నాథ్ గుహలో సహజంగా ఏర్పడే జ్యోతిర్లింగంతో పాటు, మరో రెండు చిన్న మంచుమూర్తులు కూడా కనిపిస్తాయి. వీటిని పార్వతి, గణపతులంటూ భక్తులు కొలుస్తారు. విచిత్రమేమంటే ఈ మూర్తులకు ప్రత్యేక ఆకారాలు ఉండవు.. మంచు ముక్కల్లా మాత్రమే కనిపిస్తాయి. కాకపోతే.. మహాదేవుని లింగరూపం ఏర్పడిన సమయంలో మాత్రమే ఈ రెండు మంచు మూర్తులు కనిపిస్తాయి. ఆ తరువాత ఇవీ ఉండవు.

ఏడాదిలో రెండు మాసాలు మాత్రమే తెరిచి ఉండే ఈ గుహకు వ్యయప్రయాసలకు ఓర్చి భక్తులు వేల సంఖ్యలో వెళ్తారు. ఇది మామూలు ప్రయాణం కాదు. ఇంత కష్టపడి అంత దూరం వెళ్లటానికి ఎవరూ సంకోచించకపోవటం విచిత్రం. ఓ పక్క జారిపడితే ఆనవాళ్లు సైతం చిక్కనంత లోతైన లోయలు.. మరోపక్క ఊపిరితిత్తులు బిగిసిపోయేలా ఆక్సీజన్ లేకపోవటం... సన్నటి దారులు.. గుర్రాలపై తప్ప వెళ్లలేని ప్రయాణం.. అయినా భక్తులు ఆగిపోరు.. వాళ్లు ముందు వెళ్తుంటారు.. చావు వాళ్ల వెంటే వస్తూందా అనిపిస్తుంది.. మనం ఒక సెకన్ తప్పటడుగు వేస్తే అది వాళ్లను దాటి మింగేస్తుంది.. ఇంత టెన్షన్‌లోనూ అమర్‌నాథ్ యాత్రకు అపూర్వంగా వెళ్తుంటారు భక్తులు.

ఎందుకింత క్రేజి.. ప్రమాదమని తెలిసినా ఎందుకీ యాత్ర.. పరిమిత సంఖ్యలో

అనుమతిస్తున్నా ఎందుకీ డిమాండ్.. అమర్‌నాథ్‌లో ఉన్న ప్రత్యేకత ఏమిటి? అసలు మంచు శివలింగం ఎలా ఏర్పడుతోంది.. దీని వెనుక ఉన్న మర్మం ఏమిటి? అంటే అమర్‌నాథ్‌కు వెళ్తే.. సాక్షాత్తూ శివదర్శనం కలిగినంత అన్నమాట.

పరమేశ్వరుడి ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రాలలో అమర్‌నాథ్ ఒకటి.. సాధారణంగా ఎక్కడైనా ఈశ్వరుడు స్వయంభువుగా వెలిస్తే ఒకేసారి అవతరిస్తాడు.. కానీ, అమర్‌నాథ్‌లో ప్రతి ఏటా పత్యేకంగా స్వయం వ్యక్తమవుతున్నాడు.. అదీ మంచు శివలింగ రూపంలో.. ఇది ఎలా సాధ్యమవుతోంది..?

అమర్‌నాథ్ గుహ ఏడాదిలో జూలై, ఆగస్టు మాసాలు మినహా మిగతా సమయం అంతా పూర్తిగా మంచు కప్పుకుని ఉంటుంది.. ఆ సమయంలో ఇక్కడ గుహను చేరుకోవటం అసాధ్యం... జూలై వచ్చేసరికి ఇక్కడ వాతావరణం కొద్దిగా వేడెక్కుతుంది.. మంచు విచ్చుకుంటుంది.. గుహ స్పష్టంగా కనిపిస్తుంది.. కానీ, శివలింగం ఉండే ప్రాంతంలో మాత్రం వాతావరణం ఎప్పటిలాగే ఉంటుంది.. అందువల్లే 45 రోజుల పాటు శివలింగం చెక్కు చెదరకుండా ఉంటుంది..

విచిత్రమేమంటే గుహలో శివలింగం ప్రతి ఏటా ఒకే చోట, ఒకే ఎత్తులో ఆవిర్భవిస్తుంది.. 90 అడుగుల పొడవైన గుహలో అదే చోట ఎందుకు వెలుస్తుందన్నది ప్రశ్న.. సంవత్సరమంతా గడ్డకట్టుకుపోయిన అమర్‌నాథ్ గుహ క్రమంగా తేటపడుతున్న సమయంలో జ్యోతిర్లింగం ఏర్పడే చోట గుహ పైభాగం నుంచి ఒక్కొక్కటిగా నీటి చుక్క కింద పడుతూ ఉంటుంది.. సుమారు 45 రోజుల పాటు ఈ నీటిబొట్లు పడుతూనే ఉంటాయి.. ఈ నీటి బొట్లు క్రమంగా మంచుగా మారి, లింగరూపంగా ట్రాన్స్‌ఫామ్ చెందుతాయి.

భక్తులు ఈశ్వరుని సందర్శించుకునే 45 రోజులు కూడా నీటి బిందువులు పడుతూనే ఉంటాయి. అయితే శివలింగం గుహ పైభాగాన్ని తాకి ఉండటం వల్ల అవి మామూలుగా కనిపించవు. భక్తులు దర్శనం చేసుకునే 45 రోజుల తరువాత గుహను మంచు పూర్తిగా కప్పేసినప్పటికీ, శివలింగం ఉండాల్సిన ప్రాంతం నుంచి ఒకరకమైన తేజస్సు స్పష్టంగా కనిపిస్తుందని భక్తులను గుహదాకా తీసుకువచ్చి, మళ్లీ కిందకు తీసుకువెళ్లే స్థానికులు అంటారు.. అందుకే దాన్ని జ్యోతిర్లింగమని చెప్తారు.

అమర్‌నాథ్‌లో జ్యోతిర్లింగం మామూలుగా ఏర్పడుతున్నదేనా? లేదా నిజంగానే శివుడు కైలాసం నుంచి దిగివచ్చి రెండు మాసాల పాటు భక్తులకు కనువిందు చేస్తున్నాడా? దేవుడే ఒక మిథ్ అని భావించే వాళ్లు కొల్లలుగా ఉన్నప్పుడు ఇక కైలాసం నుంచి శివుడు రావడమేమిటని అనుకుంటున్నారా? మరదే విచిత్రమంటే!

పరమేశ్వరుడు కైలాసం నుంచి అమర్‌నాథ్‌కు ప్రతి ఏటా బయలు దేరి వస్తున్నాడట..? విస్తుపోకండి.. ఆశ్చర్యం అసలే అక్కర్లేదు.. అర్థం లేని ఈ వాదన ఏమిటని నిలదీయకండి..



**పరమేశ్వరుడు ఈ భూమ్మీదే నడయాడుతున్నాడని అమర్‌నాథ్ ప్రజల విశ్వాసం.. హిమాలయాల్లో మరింత ఎత్తైన కైలాస పర్వతంపైనే మహాదేవుడు ఉన్నాడు. అక్కడి నుంచి ఆయన అమర్‌నాథ్‌కు తన మందీ మార్బలంతో తరలి వచ్చాడట. మార్గమధ్యంలో ఆయన ఎక్కడెక్కడ ఆగిందీ, ఏం చేసిందీ కూడా వీళ్లు వివరిస్తారు..**

పరమేశ్వరుడు ఈ భూమ్మీదే నడయాడుతున్నాడని అమర్‌నాథ్ ప్రజల విశ్వాసం. హిమాలయాల్లో మరింత ఎత్తైన కైలాస పర్వతంపైనే మహాదేవుడు ఉన్నాడు. అక్కడి నుంచి ఆయన అమర్‌నాథ్‌కు తన మందీ మార్బలంతో తరలి వచ్చాడట. మార్గమధ్యంలో ఆయన ఎక్కడెక్కడ ఆగిందీ, ఏం చేసిందీ కూడా వీళ్లు వివరిస్తారు..

మృత్యువు గురించి పార్వతీదేవికి వచ్చిన సందేహాన్ని తీర్చేందుకు శివుడు ఆమెను అమర్‌నాథ్‌కు తీసుకువచ్చాడు.. ఈ దారి కైలాస్ మానస్ సరోవర్ నుంచి నేపాల్ మీదుగా కాశ్మీర్‌లోకి ప్రవేశించి అమర్‌నాథ్ దగ్గర ముగుస్తుంది.

కైలాసం నుంచి బయలు దేరిన శివుడు దారిలో బైల్‌గావ్ దగ్గర తన వాహనాన్ని వదిలేశాడట.. ఈ బైల్‌గావే.. కాశ్మీర్‌లో ఇవాళ ఉన్న పహల్‌గామ్. ఆ తరువాత మరికొంత దూరంలో చందన్ వాడి దగ్గర చంద్రుని, మహాగణేశ్ గుహ దగ్గర గణపతిని విడిచిపెట్టాడు.. అక్కడి నుంచి అమర్‌నాథ్ దగ్గరలోని పంచతరణి ప్రాంతాల్లో పంచభూతాలను వదిలేశాడు. ఈ ప్రాంతాలన్నీ ఇప్పటికీ పవిత్ర శివ క్షేత్రాలుగా ఉన్నాయి.

అమర్‌నాథ్ గుహలోనే పార్వతీదేవికి మృత్యురహస్యం చెప్పాడని స్థానిక కథనం. ఇదంతా పుక్కిటి పురాణంగా కొందరు కొట్టి పారేయవచ్చు. కానీ, ఇక్కడ టెక్నికల్ లాజిక్ ఉంది. అమర్‌నాథ్ గుహ 13,700 అడుగుల ఎత్తున ఉంది. ఇరుకు దారిలో ప్రాణంతో చెలగాట మాడుతూ వెళ్లాల్సిన పరిస్థితి. ఊపిరితిత్తులకు ఆక్సీజన్ సక్రమంగా అందదు. మృత్యు బాధ ఎలా ఉంటుందో అక్కడికి వెళ్లిన వారికి ఈజీగా అర్థమైపోతుంది. పార్వతికి, శివుడు మృత్యురహస్యం చెప్పాడన్న కథలోని అంతరార్థం ఇదే.

భక్తులు ఒక్కసారి గుహ దగ్గరకు చేరుకున్నాక కూల్ అయిపోతారు. అక్కడి వాతావరణం అలాంటిది.. మంచులింగం ఒకవిధంగా భక్తులను మెస్మరైజ్ చేస్తుంది.. జీవితంలో చాలా

కష్టమైన దారిలోనే సక్సెస్‌ఫుల్‌గా వెళ్లిన తరువాత మిగతా దారులన్నీ చిన్నగానే కనిపించేలా సైకలాజికల్ అనుభూతిని కలిగిస్తుంది.

మరి ఇంతటి అనుగ్రహాన్నిచ్చే మహాదేవునికి ఆగ్రహం ఎందుకు వచ్చింది? ముక్కంటి తన మూడో కంటిని ఎందుకు తెరుస్తున్నాడు.. భక్తులను ఆదరించకుండానే ఎందుకు అంతర్ధానమైపోతున్నాడు? ఏదైనా ఒక పని చేయాలంటే దానికి కొన్ని పద్ధతులుంటాయి... ఏదైనా ఒక ప్రాంతానికి వెళ్లాలంటే దానికి కొన్ని మార్గాలుంటాయి.. ప్రత్యామ్నాయాలు వెతుక్కుంటే గమ్యం చేరుకుంటారే కానీ, లక్ష్యం నెరవేరదు.. అమర్‌నాథ్ విషయంలో కూడా గత కొన్ని సంవత్సరాలుగా జరుగుతున్నది ఇలాంటిదే.

అమర్‌నాథ్ గుహ సముద్ర మట్టానికి చాలా ఎత్తైన ప్రాంతంలో ఉంది. ఉష్ణోగ్రత పూర్తిగా మైనస్ డిగ్రీల్లో ఉంటుంది. దర్శనం చేసుకోవలసిన ఈశ్వరుడూ మంచు రూపంలో ఉంటాడు. అలాంటి చోటికి హెలికాప్టర్‌లలో వెళ్లటం, ఇందుకోసం ప్రత్యేక ఏర్పాట్లు చేసుకోవటం అక్కడి వాతావరణాన్ని పూర్తిగా చెడగొడుతోంది. చల్లగా ఉండాల్సిన చోటును వేడిమయం చేస్తోంది. చలిగా ఉండాల్సిన ప్రాంతంలో వెచ్చదనాన్ని కృత్రిమంగా సృష్టిస్తోంది.

ప్రశాంతంగా ఉన్న అమర్‌నాథ్ గుహకూ గ్లోబల్ వార్మింగ్ అంటుకునే ప్రమాదం మన వాళ్ల వల్లే ఏర్పడుతోంది. దీనికి తోడు గుహలోకి పూలు, పండ్లు విసిరేయటం, వేలాది అగర్‌బత్తీలు వెలిగించటం అక్కడి విధానానికి వ్యతిరేకం.

ఏదైనా సరే ప్రకృతికి విరుద్ధంగా వ్యవహరిస్తే, అది విపత్తు సృష్టిస్తుంది. అమర్‌నాథ్‌లో 2007 నుంచి జరుగుతున్న తంతు ఇలాంటిదే. హెలికాప్టర్లు.. ఇతర ప్రత్యామ్నాయ దారుల్లో వివివిఐపిలు ఇలా వచ్చి అలా వెళ్లేందుకు చేసిన ఏర్పాట్లు మంచులింగం త్వరగా అంతర్ధానమవటానికి కారణమైంది.. వేలాది భక్తులు అమర్‌నాథ్‌కు చేరుకోకుండానే వెనక్కి తిరిగివెళ్లాల్సిన పరిస్థితి నెలకొంది.

మంచుకొండల్లో మహాదేవుని దర్శనం సామాన్యమైంది కాదు.. ఎంతో శ్రమిస్తే తప్ప ఆయన దర్శనం లభించదు.. సహజంగా ఉన్న వ్యవస్థను అసహజంగా మారిస్తే ప్రతికూల పరిణామాలు ఏర్పడతాయి. భారతదేశానికి ఉన్నవి సాంస్కృతిక, ఆధ్యాత్మిక సంపదలే.. వీటికి కూడా అస్తిత్వం లేకుండా చేసుకుంటామంటే, జవాబు చెప్పేదేముంటుంది?

# అన్నపూర్ణ

పరమేశ్వరి.. మన కడుపుల్ని చల్లగా నింపే కల్పవల్లి.. కాశీ విశ్వేశ్వరుని సహధర్మచారిణి, ప్రత్యక్షంగా సాక్షాత్కరిస్తోంది ఇక్కడే. ఈ భూమ్మీదే మన మధ్యే కొలువై ఉంది. తాను స్వయంగా కర్తగా నిలుచుని భూదేవి ఒడిలో సమస్త ఆహారాన్ని మనకోసం సమకూరుస్తోంది. శివుడి కైలాసానికి కూతవేటు దూరంలో ఆమె ఆవిర్భవించింది. సిద్ధ పురుషులకు ఆలవాలమైన తెల్లని మంచుకొండల మధ్యలో పచ్చగా అలరారుతోంది. ఆయన కైలాసంలో ఉన్నాడు. ఆ పక్కనే ఆమె తన ఉనికిని స్పష్టంగా చాటుతోంది. ఇది అన్నపూర్ణాదేవి లీలావిలాసం. సామాన్యమైన శాస్త్రాలకు అంతుపట్టని అద్భుత హిమపర్వత విన్యాసం.

మానస సరోవర తీరంలో దేవదేవుని దర్శనం చేసుకోవటం అలాంటిలాంటి సమస్య కాదు.. అంత తేలిక కాదు.. మృత్యువు అడుగడుగునా అల్లరి పెడుతుంటే, వేటాడుతుంటే దాన్ని ఎదిరిస్తూ, ఎదుర్కొంటూ వెళ్లితే కానీ కలుగని దర్శనం అది. ఐనా పిల్లలు అంత ప్రయాస పడరాదనే కావచ్చు..అమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, పార్వతీదేవి అన్నపూర్ణగా తన పిల్లలను అక్కున చేర్చుకుంటున్నది. టిబెట్‌లోని కైలాస పర్వతానికి వెళ్లటానికి ముందే, పర్వతరాజు కుమార్తెగా అన్నపూర్ణాదేవి ప్రత్యక్ష సాక్షాత్కారం కలుగుతున్నది. హిమాలయాల్లో మరెక్కడా కానరాని అద్భుత దర్శనం అది. సముద్రమట్టానికి 8091 అడుగుల ఎత్తులో ప్రపంచానికి ఆహారాన్నిచ్చే నిలువెత్తు మాతృమూర్తి అన్నపూర్ణాదేవి దర్శనం జరుగుతుంది. హిమాలయ శ్రేణుల్లో మరెక్కడా కానరాని వాతావరణం అన్నపూర్ణాదేవి సొంతం. ఇక్కడ జంతువులకు, పశుపక్ష్యాదులకు, మనుషులకు ఎక్కడ లేని స్వాంతన లభిస్తుంది. ఎందుకంటే ఆమె అమ్మ కాబట్టి.. ఇక్కడ కొలువై ఉన్నది కాబట్టి.. కడుపు నిండా కమ్మని భోజనం పెడుతుంది కాబట్టి... ఇలాంటి ప్రదేశం మొత్తం హిమాలయ శ్రేణుల్లో మరెక్కడా భూతద్దం పెట్టి వెతికినా కనిపించదు కాబట్టి.



**సముద్రమట్టానికి 8091 మీటర్ల ఎత్తులో ప్రపంచానికి ఆహారాన్నిచ్చే నిలువెత్తు మాతృమూర్తి అన్నపూర్ణాదేవి దర్శనం జరుగుతుంది. హిమాలయాల పర్వత శ్రేణుల్లో మరెక్కడా కానరాని వాతావరణం అన్నపూర్ణాదేవి సొంతం.**

కైలాసానికి మార్గమధ్యంలోనే అన్నపూర్ణ ఉనికి స్పష్టంగా కనిపిస్తుంది. అక్కడ ఆమె వాస్తవం. కైలాసంలో శివుడి అస్తిత్వం ఎంత కచ్చితంగా కనిపిస్తుందో.. అంతకంటే అద్భుతంగా అమ్మ అస్తిత్వం దర్శనమిస్తుంది. ఆమె పర్వతరాజు కుమార్తె కావటం వల్లనేనేమో.. మిగతా హిమపర్వతాలకు లేని ప్రత్యేకత అక్కడ మాత్రమే కనిపిస్తుంది. చల్లని తెల్లదనంలో నిండైన పచ్చదనం ఇక్కడి విశేషం.

అన్నపూర్ణాదేవి అనగానే నిత్యానందకరీ.. వరాభయకరీ.. సౌందర్య రత్నాకరీ.. నిర్ధూ తాఖిల లోకపావనకరీ.. ప్రత్యక్ష మాహేశ్వరీ.. కాలేయాచల వంశపావనకరీ.. కాశీ పురా ధీశ్వరీ.. భిక్షాందేహి కృపావలంబనకరీ.. మాతాన్నపూర్ణేశ్వరీ... అన్నశ్లోకం గుర్తుకు వస్తుంది.

హిందువులకు అతి పవిత్రమైన కాశీక్షేత్రంలో అన్నపూర్ణావిశ్వేశ్వరులుగా ఆదిదంపతులు వెలిశారు.. అలాంటి అన్నపూర్ణ వాస్తవంగా అవతరించింది ఎక్కడ? ఈ పర్వత రాజు ఎవరు? ఆయన కుమార్తెగా ఆమె ఎలా ఆవిర్భవించింది? శివుడి కైలాసానికి ఎలా వెళ్లగలిగింది? ఆయన్ను ఎలా సొంతం చేసుకుంది? చూస్తే అంతా మిథ్యగానే అనిపిస్తుంది. ఏదో కథ చెప్తున్నారు అని మనసు కొట్టిపారేస్తుంటుంది. పుక్కిటి పురాణమంటూ తేలిగ్గా తీసిపారేయాలనిపిస్తుంది. కానీ హిమాలయాలకు ఒకసారి వెళ్తే అసలు వాతావరణమే మారిపోతుంది. కానీ, ఇవేవీ పుక్కిటి పురాణాలు కాదు.. ఒట్టి కథలు కానే కావు.. మౌంట్ కైలాస్‌లో సైన్స్‌కు అందని ఒక అపూర్వమైన ఆధ్యాత్మిక వాతావరణం కనిపిస్తుంది.. అక్కడ శిఖరంపై ఏముందో తెలుసుకోవటమే ఇప్పటికీ కష్టమైపోయింది. ఇదిగో.. మౌంట్ కైలాస్‌కు దక్షిణంలో అన్నపూర్ణాదేవి అవతరించిన ప్రదేశం మనకు కనిపిస్తున్నది.

అన్నపూర్ణా దేవి ఒక పర్వతంగా మాత్రమే మనకు దర్శనమివ్వదు. నాలుగు భాగాలుగా నాలుగు రకాల ఎత్తుల్లో మనకు కనిపిస్తుంది. ఆమె ఆదిశక్తి. లయకారుడికి అవసరమైన మహాశక్తి.. విశ్వంలోని జీవజాలం అంతా ఆమె అనుగ్రహంపైనే మనుగడ సాగిస్తుంది. ప్రపంచానికి ఆహారం అత్యంత కీలకం. ఆ ఆహారానికి ఆమె అధిదేవత. హిమాలయ శ్రేణుల్లో ఇంకెక్కడా లేని పచ్చదనం ఈమె పాదపీఠంలో ఏడాది పొడవునా కనిపిస్తుందంటేనే అన్నపూర్ణాదేవి అస్తిత్వాన్ని తెలుసుకోవచ్చు. దాదాపు ఏడువేల చదరపు కిలోమీటర్ల మేర అమ్మ అనుగ్రహంతో ఇక్కడ పచ్చదనం వెల్లివిరుస్తుంది.

మహేశ్వరి, మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతి అంటూ ఆదిశక్తిని పురాణేతిహాసాలు నాలుగు ప్రధాన శక్తులుగా అభివర్ణించాయి. ఈ నాలుగు శక్తులు కలిస్తే ఆదిశక్తిగా మారిందని చెప్తారు.. ఆమెనే మహిషాసురుణ్ణి వధించిందనీ అంటారు .ఈమెనే ఆద్యాది శ్రీమహాలక్ష్మిగా కూడా కొలుస్తారు. ఈ కథనాలు ఏ ప్రాతిపదికన చెప్పినప్పటికీ, అన్నపూర్ణ శ్రేణి మాత్రం ఈ నాలుగు శక్తులను ప్రతిబింబిస్తుంది. నాలుగు శక్తులూ నాలుగు పర్వతాలుగా మనకు కనిపిస్తాయి. సమస్త ప్రపంచాన్ని ఈ నాలుగు శక్తులే ఆవరించి ఉన్నాయి. ఇక్కడా



**అన్నపూర్ణా దేవి ఒక పర్వతంగా మాత్రమే మనకు దర్శనమివ్వదు. నాలుగు భాగాలుగా నాలుగు రకాల ఎత్తుల్లో మనకు కనిపిస్తుంది. ఆమె ఆదిశక్తి. లయకారుడికి అవసరమైన మహాశక్తి.. విశ్వంలోని జీవజాలం అంతా ఆమె అనుగ్రహంపైనే మనుగడ సాగిస్తుంది. ప్రపంచానికి ఆహారం అత్యంత కీలకం.. ఆ ఆహారానికి ఆమె అధిదేవత... హిమాలయ శ్రేణుల్లో ఇంకెక్కడా లేని పచ్చదనం ఈమె పాదపీఠంలో ఏడాది పొడవునా కనిపిస్తుందంటేనే అన్నపూర్ణాదేవి అస్తిత్వాన్ని తెలుసుకోవచ్చు.**

హిమాలయ శ్రేణి అంతటినీ ఈ నాలుగు పర్వతాలే డామినేట్ చేస్తూ కనిపిస్తాయి.

అన్నపూర్ణ నాలుగు పర్వతాల్లో కాకుండా దక్షిణ అన్నపూర్ణగా మరో హిమాలయం కూడా మనకు దర్శనమిస్తుంది. అది కనిపించటమే చాలా టిపికల్‌గా ఉంటుంది. దాని రూపం ఉమాదేవి తపోదీక్షలో కూచుని ఉన్నట్లుగా ఉంటుంది. పార్వతీదేవి పరమేశ్వరుడి కోసం ఇక్కడే తపస్సు చేసిందని చెప్తారు. దీనికి సమీపంలోనే ముక్తినాథ్ దేవాలయం వుంది. మన్మథుణ్ణి త్రినేత్రంతో భస్మం చేసిన తరువాత ఈశ్వరుడు అమ్మవారిని ఇక్కడ కలుసుకున్నారని కథనం. ఆది దంపతుల ప్రస్థానం కైలాసం దాకా సాగిపోయింది.

మౌంట్ కైలాస్ టిబెట్ భూభాగంపై సముద్రమట్టానికి దాదాపు 22 వేల అడుగుల ఎత్తున ఉంటుంది. దానిపైన శివుడి అస్తిత్వమూ రుజువవుతోంది. ఇదిగో దానికి వెళ్లే దారిలోనే పార్వతీదేవి అన్నపూర్ణగా మనందరినీ అనుగ్రహిస్తోంది. కైలాసానికి వెళ్లటం ఎంత కష్టమో.. అంత తేలిగ్గా అన్నపూర్ణను దర్శించుకోవచ్చు. ఇదొక అద్భుతమైన అనుభూతి.. మనకు తెలియని మరో విశ్వంలోకి మనల్ని తీసుకుని వెళ్లే అపురూపమైన ఆధ్యాత్మిక పర్వత శ్రేణి. ఆయన శివుడు.. మనందరికీ తండ్రి.. కఠినమైన పరీక్షలే పెడతాడు. ఈమె తల్లి.. ఒద్దికగా ఒడిలో చేర్చుకుంటుంది.

మనకు పార్వతీదేవి పర్వతరాజు కుమార్తెగా తెలుసు.. పర్వతరాజు కుమార్తెగా పుట్టి, తపస్సు చేసి మరీ పరమేశ్వరుని వివాహం చేసుకున్నదిట పార్వతి. ఇంతవరకు పురాణాలు చెప్తున్నాయి. టిబెట్‌లోని మౌంట్ కైలాస్‌లో శివుడి అస్తిత్వం కనిపిస్తోంది. మరి పర్వత రాజు ఎవరు? ఆయన ఎగ్జిస్టెన్స్‌ను మనం ఏ విధంగా గుర్తించాలి.. పార్వతీదేవి ఆయన కుమార్తె ఎలా అయింది?

ప్రపంచంలో అత్యంత ఎత్తైన పర్వతం ఎవరెస్టు అన్నది మనం పుస్తకాల్లో చదువుకున్నదే.

**కైలాసంలో అసాధ్యమైన శిఖర దర్శనం అన్నపూర్ణపై సాధ్యపడుతుంది. విచిత్రమేమంటే ఎవరెస్టు రేంజ్‌లో అన్నపూర్ణతో కలిసిన పధ్నాలుగు ఎయిట్ థౌజండర్ పర్వతాలన్నీ కూడా ఈశ్వరుడు నెలకొని ఉన్న మౌంట్ కైలాస్‌కు ఉత్తరం నుంచి దక్షిణానికి అర్థవలయాకారంలో విస్తరించి ఉంటాయి. వీటిని ఒకదానికొకటి కలిపి చూస్తే శివుడి మెడలో హారంగా మనకు కనిపిస్తాయి.**

సముద్ర మట్టానికి 8848 మీటర్ల ఎత్తున ఉన్న ఈ పర్వతానికి సాటి మరొకటి లేదన్నదీ తెలిసిందే. చైనా, టిబెట్ బార్డర్‌లో ఉన్న ఈ పర్వతాన్నే పర్వత రాజుగా హిందువులు భావిస్తారు.. పక్షుల్లో గరుడ పక్షిని, జంతువుల్లో సింహాన్ని, పర్వతాల్లో ఎవరెస్టును ఆయా జాతులకు రాజులుగా భావించటం తెలిసిందే.

ఎవరెస్టు పర్వత రాజు కావటం, పార్వతీదేవి ఆయన పుత్రికగా చెప్పటంలో ఆంతర్యం ఏమిటన్న సందేహం వెంటనే కలుగుతుంది. ఇది సహజం కూడా.. మన పురాణకథల్లో ఏ ఒక్క అంశాన్నీ హేతువు లేకుండా చెప్పటం కానీ, పోల్చటం కానీ చేయలేదు. ప్రతి దాని వెనుక ఏదో ఒక సైంటిఫిక్ లాజిక్ ఉంది. పర్వత రాజుకు పదమూడు మంది కుమార్తెలున్నారని పురాణ కథనాల్లో చెప్తారు.. హిమాలయ పర్వత శ్రేణుల్లో 8వేల మీటర్ల ఎత్తున్న పర్వతాలు ఎవరెస్టుతో కలిపి పధ్నాలుగు ఉన్నాయి. వీటన్నింటినీ కలిపి ఎయిట్ థౌజండర్స్ అని పిలుస్తారు. అన్నపూర్ణ హిల్ ఎవరెస్ట్ రేంజ్‌లో ఉన్న ఎయిట్ థౌజండర్స్‌లో ఒకటి. పార్వతీదేవి పర్వతరాజు కుమార్తె అనటానికి కారణం ఎవరెస్ట్ పేరెంట్ పీక్ కావటమే.. అది కూడా ఒక అద్భుతమైన హిల్ రేంజ్‌గా అలరారుతూ కనిపించటం.

సెంట్రల్ నేపాల్‌లోని పొఖారా జిల్లాలో ఉన్న అన్నపూర్ణ హిల్ రేంజ్ నేపాల్‌లోని చాలా భూభాగం విస్తరించి ఉంది. ఈ పర్వత ప్రాంతంలో ట్రెకింగ్ చేయటం ఎవరెస్టు కంటే చాలా డేంజర్.. నాలుగు భాగాలుగా ఉన్న పర్వతశ్రేణి ప్రపంచంలోనే అతి ప్రమాదకరమైన ట్రెకింగ్ రేంజిలలో ఒకటిగా చెప్పుకుంటారు. 50శాతానికి పైగానే రిస్క్ ఉన్న పర్వతం ఇది. కాకపోతే, కాస్త జాగ్రత్త పడితే, నియమాలను ఖచ్చితంగా పాటిస్తూ వెళ్తే శిఖర దర్శనం చేసుకోవటం సాధ్యమే. కైలాసంలో అసాధ్యమైన శిఖర దర్శనం అన్నపూర్ణపై సాధ్యపడుతుంది. విచిత్రమేమంటే ఎవరెస్టు రేంజ్‌లో అన్నపూర్ణతో కలిసిన పధ్నాలుగు ఎయిట్ థౌజండర్ పర్వతాలన్నీ కూడా ఈశ్వరుడు నెలకొని ఉన్న మౌంట్ కైలాస్‌కు ఉత్తరం నుంచి దక్షిణానికి అర్థవలయాకారంలో విస్తరించి ఉంటాయి. వీటిని ఒకదానికొకటి కలిపి చూస్తే శివుడి మెడలో హారంగా మనకు కనిపిస్తాయి.

మన పురాణాలు, ఇతిహాసాల్లో దేనికి ఏ పేరు ఎందుకు పెట్టారో ఆలోచిస్తూ పోతే ఆశ్చర్యమేస్తుంది. అన్నపూర్ణకు పేరెంట్ పీక్ అయిన మౌంట్ ఎవరెస్ట్ మినహా హిమాలయ

శ్రేణుల్లో అన్ని పర్వతాల పేర్లూ భారతీయతతో ముడిపడి ఉన్నవే.. మౌంట్ ఎవరెస్ట్‌కు మొదట సగరమాత, చోమలంగామ్ అన్న పేర్లు ఉండేవి.. అన్ని పర్వతాలకు తండ్రి లాంటిదని నేపాలీ భాషలో దీని అర్థం. ఇంగ్లీషు వాడొచ్చి సర్‌జార్జి ఎవరెస్ట్ పేరును దీనికి తగిలించి వెళ్లిపోయాడు లెండి..మనం ఏమీ చేయలేక దాన్నే కంటిన్యూ చేస్తూ పోయాం.

మన కథలోకి వస్తే అన్నపూర్ణ నిజంగా అన్నపూర్ణే.. కరవు అన్నది తెలియని ఒక అద్భుతమైన వ్యవసాయ క్షేత్రమిది. అన్నపూర్ణ హిల్ రేంజ్ మధ్య నేపాల్‌లో ఉంది. అన్నపూర్ణ అన్న పేరు దీనికి అన్ని విధాలుగా సరిపోలుతుంది. దాదాపు 7629 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో ఇక్కడ రకరకాలైన ఆహారం ఉత్పత్తి అవుతుంది. నేపాల్ మొత్తంలో ఇంత విస్తీర్ణంలో వ్యవసాయం జరుగుతున్న ప్రదేశం మరెక్కడా కానరాదు.. ఏడాదిలో 365 రోజులు పచ్చదనం కనిపించే ఏకైక ప్రదేశం ప్రపంచంలో అన్నపూర్ణ తప్ప మరేదీ లేదనే చెప్పాలి. అన్నపూర్ణ పర్వత ప్రాంతంలో పుట్టిన రెండు జీవనదులు కాలి, గండకి నేపాల్ దేశానికంతటికీ ధాన్యాగారాన్ని అందిస్తున్నవి. నాలుగు దశాబ్దాల క్రితమే నేపాల్ ప్రభుత్వం దీన్ని అధికారికంగా కన్సర్వేషన్ ఏరియాగా గుర్తించి దీన్ని మరింత అభివృద్ధి చేసేందుకు నడుంబిగించింది. దీంతో పాటు ఇక్కడ అభయారణ్యాన్ని కూడా అభివృద్ధి చేసింది.

అన్నపూర్ణ హిల్ రేంజ్ దగ్గర మరో విశేషం ఏమంటే సూర్యోదయ, సూర్యాస్తమయాలు సమయానుకూలంగా క్రమం తప్పకుండా వస్తాయి. ఈ రెంటికి మబ్బులు అడ్డం రావటం కానీ, సూర్యుడు కనిపించకుండా పోవటం కానీ జరగని అరుదైన ప్రాంతం అన్నపూర్ణ.

కైలాస పర్వతం దగ్గరకు వెళ్లే ప్రతి ఒక్కరూ అన్నపూర్ణ దర్శనం చేసుకోకుండా వెళ్లరు.. ఇక్కడికి వచ్చి ఇక్కడ లభించే ఆహారాన్ని వండుకుని తింటే జీవితంలో తిండి కొరత వుండదని భక్తుల విశ్వాసం. ఎందుకంటే ఇక్కడ స్వచ్ఛమైన ఆహారం లభిస్తుంది. ఇక్కడి ఆహారంలో కాలుష్యం ఉండదు. ఎరువుల వాడకంతో పని లేదు. సూర్యుడి కిరణాలు.. అన్నపూర్ణ నుంచి ఉద్భవించిన నదీజలాలు.. ఎలాంటి కష్టం లేకుండా పంట దిగుబడి వచ్చే ప్రాంతం ఇది. అద్భుతమైన భూసారం, ప్రపంచంలో కలుషితం కాని ఆహారం ఎక్కడా దొరకదు.. అందుకే ఆమె అన్నపూర్ణ అయింది.. బిడ్డల్ని కడుపున పెట్టుకుని కాచే కన్నతల్లి అయింది. అన్నపూర్ణ హిల్ రేంజ్ దగ్గర నుంచి మౌంట్ కైలాస్‌దాకా ఒక అద్భుతమైన ఆధ్యాత్మిక సంపద కనిపిస్తుంది. శివపార్వతుల కల్యాణం జరిగిన తరువాత ఆది దంపతులు కైలాసానికి వెళ్లిన దారి మొత్తంలో స్వయం వ్యక్త శివపార్వతుల ఆలయాలు కనిపిస్తాయి. అయిదారు వందల కిలోమీటర్ల దూరమున్న ఈ ప్రాంతంలో వందల కొద్దీ ఆలయాలు దర్శనమిస్తాయి. అన్నపూర్ణ దగ్గర ముక్తినాథ్ టెంపుల్‌తో ప్రారంభమై, కైలాసంపై ఆదిదంపతుల దర్శనంతో ఈ ట్రెకింగ్ ముగుస్తుంది.

# మోక్షం

మృత్యువు కోసమే ఇక్కడికి ప్రయాణం
మరణం కోసం ప్రతిక్షణం ఎదురుచూపు
మహదానందమైన మరణాలు
అఖండంగా కాలే చితిమంటలు
శివసాన్నిధ్యంలో లయమయ్యే జీవులు
ఇక్కడ చనిపోతే పునర్జన్మ లేదు
ఈ చితిమంటల్లో కాలటమే కైలాసం
ఇక్కడ అంతిమ సంస్కారం జరిగితేనే మోక్షం



మృత్యువు. ఈ పదం అంటే మనలో భయం లేనిదెవరికి? ఈ చావును తప్పించుకోవటానికి మనం చేయని ప్రయత్నం ఉండదు.. ఒక మనిషి బతకడని తెలిసిన తరువాత కూడా చివరి క్షణం వరకూ అతణ్ణి బతికించటం కోసం చేయాల్సిన ప్రయత్నం అంతా చేస్తాం. లక్షలు ఖర్చు చేసేందుకైనా వెనుకాడం.. మనకు చావంటే అంత భయం. కానీ, మృత్యువును కోరి ఆహ్వానించేవారూ ఉన్నారు.. వారికి మృత్యువు ఒక వరం.. దాని కోసం అంతదూరం వెళ్లి మరీ మరణాన్ని ఆహ్వానిస్తారు. దాని కోసం వేచి చూస్తారు. ఆనందంగా మరణిస్తారు. ఎందుకింత ఆనందం..అక్కడే చనిపోవాలి.. అక్కడ చనిపోతే కైలాసంలోకి వెళ్లి శివుడిలో ఐక్యం చెందినట్లే.. సాక్షాత్తూ శివుడి సమక్షంలో మోక్షాన్ని సాధించినట్లే.. భారతీయుల్లో వేలాది ప్రజలు మృత్యువును కోరుకుంటున్న ప్రదేశం అది. ఆ స్మశానం అతి ప్రవితం.. ఈశ్వరుడు తాను దగ్గరుండి జీవులను తనలో ఐక్యం చేసుకునే స్మశానం.. ఏమిటీ స్మశానం ప్రత్యేకత? ఇక్కడ అంతిమ సంస్కారం కోసం ఎందుకు తాపత్రయ పడాలి? నిజంగా మరణం తరువాత మరో జీవితం అనేది ఉంటుందా? దీని వెనుక మర్మమేమిటి?

అదొక స్మశాన వాటిక. అన్నింట్లో మాదిరిగానే ఇక్కడా చనిపోయిన వారిని తీసుకువచ్చి దహన క్రియలు చేస్తుంటారు. ఇక్కడ చితి మంటలకు విరామం ఉండదు.. దహన కాండకు అంతు ఉండదు.. అనంతంగా అంతిమక్రియలు జరుగుతుంటాయి. అఖండంగా చితి మంటలు కాలుతుంటాయి. ఒకదాని వెంట ఒకటిగా శవయాత్రలు జరుగుతూనే ఉంటాయి. అంతిమ సంస్కారం కోసం క్యూలు ఉంటాయి. సమయం ఉండదు.. దహనకాండలు

నిర్వహించేందుకు రోజులో ఉన్న 24 గంటలు ఎంతమాత్రం సరిపోవు. సమయం తగ్గించుకోవటానికి ఒక చితిపై మరో చితిని పేర్చేస్తారు. ఒక శవం మూడు వంతులు కాలిందో లేదో పక్కనే ఉన్న నదిలోకి తోసేసి మరో దహన కాండను చేపడతారు.. ఆ నదిలో ఆ భౌతిక దేహం భాగాలు కొట్టుకుపోతాయి.

చూసే వాళ్లకు అసహ్యం వేస్తుంది.. జుగుప్స కలుగుతుంది. భయం వేస్తుంది. శవాల్ని పూర్తిగా దహనం కూడా చేయకుండా నదిలోకి ఎందుకు విసిరేస్తున్నారన్న ఆగ్రహమూ కలుగుతుంది.. అసలు అక్కడ వేరే స్మశానాలు లేవా? వేరే చోట దహనం చేయవచ్చు కదా? అంతిమ సంస్కారాలు ప్రశాంతంగా నిర్వహించాలన్న జిజ్ఞాస చనిపోయిన వారి బంధువులకు ఉండదా? వారిని ఏం చేసినా తప్పు లేదన్న విసుగూ కలుగుతుంది.. నిజమే చూస్తుంటే పరమ భయంకరంగా కనిపించే చోటు.. ఎక్కడో, ఎప్పుడో సినిమాల్లో నరకంలో శిక్షలను చూశాం...ఇది అలాంటిదేనా? ఈ స్మశానానికి ఎందుకింత గిరాకీ.. ఎందుకంటే ఇక్కడ సాక్షాత్తూ పరమేశ్వరుడే కాటికాపరిలా ఉన్నాడు.. ఇక్కడే ఆయన నివాసమున్నాడు. ఈ చితాభస్మమే ఆయన విభూతిగా మారుతోంది. ఈశ్వరుడు కొలువైన స్మశానమది. మణికర్ణికా స్మశాన ఘట్టం అది. సత్యహరిశ్చంద్రుడు కాపలాగా ఉన్న స్మశాన వాటిక అది. ఈశ్వరుడు విశ్వనాథుడిగా ఉన్న స్మశానమది. వారణాసి... బెనారస్.. కాశీ.. క్రైస్తవులకు జెరూసలేం ఎలాంటిదో.. హిందువులకు కాశీ అలాంటిది. హిందువులకు ఇంతకు మించిన ఆధ్యాత్మిక క్షేత్రం మరొకటి లేదు.. శైవక్షేత్రానికి తోడు పవిత్రమైన గంగానదీ తీరం.. ఇక్కడ పుణ్యస్నానం ఆచరించటం, దేవుణ్ణి దర్శించటం ఎంత ముఖ్యమో, ఇక్కడ చనిపోవటం అంత ముఖ్యం. ఇక్కడికి వచ్చిన వారికి ఒకటే కోరిక.. మరణించటం. అదే స్మశాన వాటికలో అంత్యక్రియలు జరగటమే పరమపదం. ఇది విపరీతం కాక మరేమిటి? వారణాసికి ఎందుకింత క్రేజి?

ఆధ్యాత్మిక క్షేత్రం అంటే అక్కడికి వెళ్లాలి.. నదిలో స్నానం చేసి, దేవుణ్ణి దర్శించుకుని మొక్కులు చెల్లించుకుని తిరిగి వస్తాం.. కానీ, కాశీకి వెళ్తే కాటికి వెళ్లినట్లే.. కాటికి వెళ్లేందుకే కాశీకి వెళ్లాలి. దీనికి కారణం ఆ స్మశాన వాటికే.. అక్కడే దహనం కావాలి. ఆ గంగలోనే అస్థికలు కలవాలి. అప్పుడే మోక్షం కలుగుతుంది. శివసాన్నిధ్యం దొరుకుతుంది. గంగా తరంగాలలో ప్రతిధ్వనించే భక్తుల మనోరథమిది. ఎవరేమన్నా సరే.. అసహ్యమేసినా సరే.. తమ వారి శరీరాన్ని సగం కాలగానే గంగలోకి తోసేసినా సరే.. వెనక్కి తగ్గేది లేదు. అంత్యక్రియలు ఆ ఘాట్‌లోనే జరిగి తీరాల్సిందే. ఎందుకంటే ఇది సత్య హరిశ్చంద్రుడు కాపలా కాసిన స్మశాన వాటిక. ఈ స్మశానవాటికలో మహా విష్ణువు తన సుదర్శన చక్రంతో భూమిని కట్ చేసి బావిని ఏర్పాటు చేశాడట. ఆ బావిలో విశాలాక్షి పార్వతీదేవి చెవిరింగులు పడిపోయాయి. అందుకే ఈ స్మశాన వాటికకు మణికర్ణిక అన్న పేరు వచ్చింది.

ఇక్కడ అణువణువూ భక్తి భూమిక అనంతంగా ఉంటుంది. ఒక విశ్వేశ్వరుడు మాత్రమే

కాదు.. ఇది అష్టాదశ శక్తి పీఠాలలో ఒకటి. శివుడి పన్నెండు జ్యోతిర్లింగాలలో కాశీ ఒకటి. అన్నింటికీ మించి దేవనది గంగమ్మ ఈశ్వరుడి పాదాల చెంత నుండి ప్రవహిస్తున్నది. ఇన్ని ఆధ్యాత్మిక భావభూమికలు ఒకచోట కలగలిసిన ఆధ్యాత్మిక భూమి మరెక్కడా కనిపించదు. ఇక్కడి గంగా నదిలో స్నానం చేస్తే సాధారణంగా కలిగే శరీర వికారాల నుంచి ఆత్మకు స్వేచ్ఛ లభిస్తుందంటారు. ఇక్కడ విశాలాక్షిగా ఉన్న పార్వతీదేవి అన్నపూర్ణగా భక్తులను ఆదరిస్తుంది. ఎంతమంది వచ్చినా ఇక్కడ భోజనానికి లోటు ఉండదు. ఇది బెనారస్‌లోని ప్రత్యేకత. ఈ స్మశానాన్ని శివుడి కైలాసంగా భావిస్తారు కాబట్టే ఇక్కడ చనిపోవటం ఒక వరంగా భక్తులు విశ్వసిస్తారు.

చనిపోవటం వరం అనుకోవటం ఏమిటి? పిచ్చితనం కాకపోతే..? అదీ ఇంతదూరం వచ్చి చనిపోవటం విడ్డూరం కాక మరేమిటి? అదీ ఒక చితిపైన మరో చితి పేర్చటం.. ఒక శవాన్ని కాలకుండానే మరో శవాన్ని దహనం చేయటాన్ని ఎలా అంగీకరిస్తున్నారు.. మూఢనమ్మకం కాదా ఇది? దీని గురించి పర్యావరణవేత్తలూ గగ్గోలు పెడుతున్నారు.. గంగమ్మ కాలుష్యమైపోతోందని. దీనికి పరిష్కారం వెతకలేక సర్కారూ చేతులెత్తేసింది? ఎందుకింత వెర్రి? అంటే సమాధానం చెప్పటం కష్టం. మిగతా ప్రపంచానికి, మన దేశానికి లైఫ్ స్టయిల్‌లో చాలా తేడా ఉంటుంది. ఎంతగా వెస్ట్రన్ కల్చర్‌ను మనం అడాప్ట్ చేసుకున్నా, బేసిక్స్ మాత్రం కొనసాగుతూనే ఉన్నాయి. పుట్టుక నుంచి చావుదాకా మన లైఫ్‌స్టైల్ ఒక స్పెసిఫిక్ టార్గెట్‌తో సాగుతుంది. జీవితంలో కుటుంబం పట్ల, సమాజం పట్ల ధర్మాన్ని నిర్వర్తించటం, తగినంత సంపాదించుకోవటం, విజయం సాధించటం, జీవితంలో సుఖాలను అనుభవించటం, కోరికలు తీర్చుకోవటం, చివరకు ప్రశాంతంగా చనిపోవటం.. ఇది ఒక ట్రెడిషనల్ లైఫ్‌స్టైల్.. దీనికి పురాణాలు ధర్మ, అర్థ, కామ, మోక్షాలని పేర్లు పెట్టాయి. చివరిదైన మోక్షం కోసమే కాశీలోని స్మశానవాటికకు జనం వస్తారు.

క్రీస్తుపూర్వం ఆరో శతాబ్దానికి ముందు నుంచే గంగానదీ తీరంలో నాగరికత అభివృద్ధి చెందుతూ వచ్చింది. అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీ, అవంతికా అంటూ గరుడపురాణంలోనే స్పష్టంగా కాశీ గురించి ప్రస్తావించారు. వారణాసి క్రీస్తుపూర్వం అయిదు వందల సంవత్సరాలప్పుడే ఏర్పడింది. మొదట్నుంచీ కూడా హిందూ సంప్రదాయాలను పూర్తిగా అనుసరిస్తున్న నగరం వారణాసి మాత్రమే. పుట్టడం, పెళ్లి చేసుకోవటం, జీవితంలో విజయం సాధించటం, మరణించటం.. ఇవన్నీ ఒక పద్ధతి పకారం మనిషి జీవితంలో జరగాల్సిందే. అందులో చివరిదైన మృత్యువు మాత్రం కాశీలోనే రావాలి.

కాశీ అంటే శివుడి మహా స్మశానం అని అర్థం. ఈ మహా స్మశానానికే శ్రీరాముడి పూర్వీకుడైన హరిశ్చంద్రుడు కాపలా కాశాడు. ధర్మాన్ని నిలబెట్టాడు. సత్యవ్రతాన్ని నిరూపించాడు. సాక్షాత్తూ ఈశ్వరుడు లయకారుడై... చనిపోయిన వారి ఆత్మలను తనలో లయం చేసుకుంటాడని బలమైన విశ్వాసం కాబట్టే ఈ మణికర్ణికాఘాట్‌లో అంత్యక్రియల



**సాక్షాత్తూ ఈశ్వరుడు లయకారుడై చనిపోయిన వారి ఆత్మలను తనలో లయం చేసుకుంటాడని బలమైన విశ్వాసం కాబట్టే ఈ మణికర్ణికాఘాట్‌లో అంత్యక్రియల కోసం ప్రజలు అల్లాడిపోతుంటారు.**

కోసం ప్రజలు అల్లాడిపోతుంటారు. చరమాంకంలో కాశీకి వచ్చి అక్కడే శేషజీవితాన్ని గడిపేసి ఆ స్మశాన వాటికలోనే లయమైపోతారు.

ఎందుకింత విపరీతం అన్నదానికి హేతుబద్ధత లేదు. భక్తుల విశ్వాసమే ఇందుకు ప్రాతిపదిక. భారతీయ సంస్కృతిలోని అనంతమైన మోక్ష సాధనే ఈ బలమైన కోరికకు అసలు కారణం. చనిపోయిన తరువాత ఆత్మ అనేది ఉంటుందనే నమ్మకం. ఈ ఆత్మ దేవుడిలో లీనం కావాలనే కోరిక.. ఇవన్నీ కాశీలో, అదీ మణికర్ణికా ఘాట్‌లో అంతిమ ఘట్టం పూర్తయినప్పుడే జరుగుతాయనే భావనకు హేతువులు వెతకటం సాధ్యమేనా?

చనిపోవటాన్ని మనిషి తానుగా కోరుకోవటం మన జీవన విధానంలో ఉన్న గొప్ప లక్షణం. ఒక జీవితానికి ముగింపు ప్రశాంతంగా సాగిపోవాలి. మృత్యువు తప్పదని తెలిసి తెలిసీ, దాన్నుంచి పారిపోవటం వెర్రితనం.. ఎంతగా పారిపోయినా, అది రాకుండా పోదు. ఇది అందరికీ తెలిసినా, చివరివరకూ ఏదోరకంగా దాన్నుంచి దూరం కావటానికి ప్రయత్నిస్తారు. కానీ, కాశీకి వెళ్లిన వారికి మాత్రం జీవితం ప్రశాంతంగా ముగిసిపోవాలన్న కోరిక కలుగుతుంది. ఆ ప్రదేశంలోని గొప్పతనం అదే. అయితే శవాల దహనకాండ ఇంత దారుణంగా ఉండటాన్ని మాత్రం ఎలా అంగీకరిస్తున్నారన్నదే ఎవరికీ అంతుపట్టని ప్రశ్న. వారణాసికి ప్రతి నెలా దాదాపు లక్ష మంది యాత్రికులు వస్తుంటారు. గంగానదిలో రోజూ పవిత్ర స్నానాలు జరుగుతూనే ఉంటాయి. అదే సమయంలో ప్రతి నెలా దాదాపు రెండు నుంచి మూడు వేల మంది ఇక్కడికి వలసలు వస్తుంటారు. వీరంతా ఇక్కడే తమ జీవితాన్ని ముగించాలన్న ఉద్దేశంతో వచ్చేవారే.. ఇక్కడే చనిపోయే వారే. కాశీ విశ్వేశ్వరుడి సన్నిధిలో, గంగానదీ తీరంలో కనీసం వంద ఘాట్‌లు ఉంటాయి. వీటిలో ఎక్కువ స్నాన ఘాట్‌లు ఉంటే క్రిమేషన్ ఘాట్‌లు పాతిక దాకా ఉంటాయి. వీటన్నింటికీ కూడా ఏదో ఒక స్థల పురాణం చెప్తారు. పురాణ కథ వినిపిస్తారు. ఇన్ని స్మశాన వాటికలు ఉన్నా,



**మణికర్ణికా స్మశాన వాటికలో కాటి కాపరులు శిక్షిస్తారు.. గంగానది శిక్షిస్తుంది. అఘోరాలు శిక్షిస్తారు. ఈ జన్మలోని కర్మలన్నింటికీ ఫలితాలు ఇక్కడ అంతమైనప్పుడే లభిస్తాయి. తరువాత లభించేది మోక్షమే.**

మణికర్ణికా ఘాట్‌కు ఉన్న డిమాండ్ సామాన్యమైంది కాదు. ఈ స్మశానవాటికలోనే ఎందుకు దహనం కావాలి? సగం కాలిన శరీరాన్ని గంగలోకి విసిరేసినా ఎందుకు ఒప్పుకోవాలి?

గమ్మత్తేమిటంటే, కొందరి భౌతిక దేహాలను ఎలాంటి దహన కాండ చేయకుండానే, ఖననం లాంటి క్రియలు చేయకుండానే నేరుగా గంగలో వదిలేస్తారు. ఈ శవాలను వామాచార పద్ధతిలో రుద్రుని పూజించే అఘోరాలు సేకరించి వాటికి పూజలు చేసి ఉపాసిస్తారు. కొందరు అఘోరాలు ఈ శవాలను ఆహారంగా కూడా స్వీకరిస్తారు. సామాన్య లోకానికి అర్థం కాని భయంకరమైన జీవితాలను శవాలతో సహవాసం చేస్తూ గడుపుతారు. ఎందుకిలా జరుగుతుంది? దీనికి కారణం లేకపోలేదు.. మనిషి చనిపోయిన తరువాత స్వర్గానికి కానీ, నరకానికి కానీ వెళ్తాడనేది నమ్మకం. కాశీలో చనిపోతే నరకబాధలు ఆత్మకు ఉండవు. ఆ బాధలన్నీ తమ భౌతిక దేహానికి ఈ భూమి మీదే అనుభవంలోకి వచ్చేస్తాయి. అన్ని రకాల శిక్షలూ ఇక్కడే లభిస్తాయి. మణికర్ణికా స్మశాన వాటికలో కాటి కాపరులు శిక్షిస్తారు.. గంగానది శిక్షిస్తుంది. అఘోరాలు శిక్షిస్తారు. ఈ జన్మలోని కర్మలన్నింటికీ ఫలితాలు ఇక్కడ అంతమైనప్పుడే లభిస్తాయి. తరువాత లభించేది మోక్షమే. ఈ మోక్షం కోసమే కాశీకి జనం వెళ్తారు. ఈ మోక్షం కోసమే హరిశ్చంద్ర ఘాట్‌లో అంతిమ సంస్కారానికి ఆరాటపడతారు.. ఈ మోక్షం కోసమే మృత్యువును వరంగా కోరుకుంటారు. సైన్స్‌కు ఇది నచ్చదు. పర్యావరణానికి ఇది సరిపడదు. హేతువాదానికి ఇది అంతుపట్టదు. భక్తి, విశ్వాసాలకు ఇది పతాక సన్నివేశం.

శరీరంపై అంతులేని ప్రేమకు చితిపేర్చే మహా స్మశానం. మణికర్ణిక.. మోక్ష సాధనకు ఇది చివరి స్థానం.

# గుప్త మహాదేవుడు

*కైలాసం నుంచి శివుడు పారిపోయాడు.*
*ఎక్కడికి వెళ్లాడు.. ఎక్కడున్నాడు?*
*పార్వతీదేవి ఆందోళన చెందుతోంది.*
*ముక్కోటి దేవతలు*
*సర్వలోకాలూ వెతుకుతున్నారు.*
*శంకరుడు ఎక్కడ?*



తెల్లవారురుఝాము.. బ్రహ్మముహూర్తం. పరమేశ్వరుడు ధ్యానం ముగించుకుని వచ్చి ఋషిమునులకు, భక్తకోటికి సతీసమేతంగా దర్శనమిచ్చాడు.. ఓ పక్క విఘ్నాధిపతి వినాయకుడు, మరో పక్క షణ్ముఖుడు కూచున్నారు.. ఎదురుగా శివపురాణ గానం సాగుతోంది.. రతీమన్మధులు ఆనందనృత్యం చేస్తున్నారు.. అంతా హ్యాపీగా సాగుతోంది.. ఇంతలోనే భూలోకం నుంచి సన్నగా పంచాక్షరీ శబ్దం ప్రతిధ్వనించింది.. అంతలోనే కైలాసాన్ని కదిపేంతగా.. కుదిపేంతగా ధ్వనితరంగాలు వినిపిస్తున్నాయి. ఒకసారి కైలాసాన్ని ఎత్తిన రావణుడి ఎక్స్పీరియన్స్ ఉంది కాబట్టి.. శివుడు ఆలస్యం చేయకుండా వెంటనే బయలు దేరాడు..... అప్పటికీ, ఎందుకో పార్వతీదేవి శంకించింది.. నేనూ రానా అని అడిగింది.. శివుడు వింతగా చూసి ఇప్పుడే వస్తాగా అని వెళ్లిపోయాడు.. మళ్లీ రాలేదు.. రోజులు గడుస్తున్నాయి కానీ శివుడి జాడ మాత్రం లేదు. ఇంతకీ ఎక్కడికి వెళ్లినట్లు..?

శివుడు కైలాసం వదిలి ఎక్కడికి వెళ్లినట్లు? ఎవరికీ అర్థం కాలేదు.. క్షణాల్లో ముల్లోకాలకూ ఈ విషయం దేవతల ఫోర్త్ ఎస్టేట్ అయిన నారదుడి ద్వారా పాకిపోయింది. అంతా ఆయన్ను వెతకటానికి బయలుదేరారు.. 14 లోకాలూ కలియదిరిగారు.. చివరకు అంతా కలిసి ఆపద్బాంధవుడు విష్ణువు దగ్గరకు వెళ్లారు. ఆయన తన సూపర్ నేచురల్ విజన్ అదేనండీ దివ్యదృష్టితోని అంతా ఒక్కసారి రివైండ్ చేసి చూశాడు.. ఆశ్చర్యపోయాడు.. అవాక్కయ్యాడు.. అందరితో చెప్పాడు.. పరమేశ్వరుడు ఎక్కడికో పరుగులు తీస్తున్నాడని.. ఏం జరిగింది..?

పరమేశ్వరుడు... లయకారుడు..ప్రళయకారుడు.. తన త్రినేత్రం తెరిచి సమస్త విశ్వాన్ని భస్మీపటలం చేయగల మృత్యుంజయుడైన ఈశ్వరుడు పారిపోవటం ఏమిటి? ఎందుకు

పారిపోతున్నాడు? పరమేష్టి, మహావిష్ణువులచే పూజలందుకున్న మహాదేవుడు ఎందుకిలా చేస్తున్నాడు? ఎక్కడికి వెళ్తున్నాడు? ఆయన్ను అంతగా భయపెడుతున్నదెవరు? శివుడు లేని కైలాసాన్ని ఊహించగలమా? అమ్మ భవానీని ఇప్పుడు ఓదార్చేదెవరు? ముక్కోటి దేవతలకూ శివుడు కానరావటం లేదు. సమస్త గణాలు.. కార్తికేయుడు.. వినాయకుడు.. అంతా వెతుకుతున్నారు. ఎవరి శక్తికీ అంతుపట్టని చోట.. ఎవరికీ కానరాని చోట మహాశివుడున్నాడు.. దేవదేవుడు ఎక్కడ దాక్కున్నాడు? ఆయన్ను కనిపెట్టేదెలా? తిరిగి కైలాసానికి తెచ్చేదెలా?

ముల్లోకాలు వణికిపోతున్నాయి. ఏం జరిగిందో అర్థం కావటం లేదు. దావానలంలా వార్త పాకిపోయింది. ఈశ్వరుడు కైలాసంలో లేడని.. ఎక్కడికి వెళ్లాడో తెలియడం లేదు.. మూడు కోట్ల మంది దేవతలు.. యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, కిన్నెర కింపురుషులంతా వెతుకుతున్నారు.. కానీ, ఆయన ఎక్కడున్నాడో తెలియటం లేదు.. చివరకు సాక్షాత్తూ మహా విష్ణువే రంగంలోకి దిగాల్సి వచ్చింది.. ఆ మహాదేవుడిని తిరిగి ఇంటికి తీసుకువచ్చే బాధ్యతను ఆయన నెత్తినెత్తుకున్నాడు.

విష్ణువు అన్వేషణ పైనున్న సత్యలోకం నుంచి కింద ఉన్న పాతాళం దాకా సాగింది.. ఎక్కడా శివుడి జాడ కానరాలేదు.. తన దివ్యదృష్టికి కూడా అంతుపట్టని చోట ఎక్కడున్నాడని నారాయణుడు తెగ ఆలోచిస్తున్నాడు.. అటూ.. ఇటూ.. విశ్వంలో అన్ని వైపులా చూస్తున్నాడు.. ఇంతలో ఒక చోటి నుంచి సన్నని వెలుగు రేఖ కైలాసంవైపు ప్రసరిస్తూ కనిపించింది. పైలోకాలకు, కింది లోకాలకు మధ్యనున్న భూలోకంనుంచి ఆ వెలుతురు వస్తోంది. విష్ణుమూర్తి ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా అక్కడికి బయలు దేరాడు..

భూమ్మీద.. భారత దేశంలో వింధ్య పర్వతాలకు కింది వైపున, కర్ణాటక రాష్ట్రంలోని ఒకానొక పెద్ద కొండ గుహలోంచి ఆ వెలుతురు వస్తోంది. అందులోకి సూక్ష్మరూపంలో శ్రీమహావిష్ణువు ప్రవేశించాడు.. ఆ గుహలో పరమేశ్వరుడు తపోధ్యాన ముద్రలో స్వామికి కనిపించాడు.. ఇంత గుప్తంగా ఇక్కడ దాక్కోవటమేమిటో ఆయనకు అర్థం కాలేదు. సందేహం తీర్చమని శివుడినే అడిగాడు..

కైలాసంలో శివుడు నృత్యగానాలతో ఉన్నప్పుడు ఆయనకు వినిపించింది భస్మాసురుడనే రాక్షసుడి తపో మంత్రం. అతని తపస్సుకు మెచ్చి వరం ఇవ్వటానికి శివుడు కైలాసం నుంచి దిగివచ్చాడు. కైలాస పర్వతానికి సమీపంలోనే తీర్థపురి అనే పర్వతం ఉంది.. ఈ పర్వతంపైనే భస్మాసురుడు పరమేశ్వరుడి కోసం ఘోరంగా తపస్సు చేశాడు.

సరే.. తపస్సు చేశాడు కదా.. వరమిద్దామని ఉదారంగా వచ్చిన బోళా శంకరుడికి భస్మాసురుడు గట్టి ఫిటింగే పెట్టాడు.. తన చెయ్యి ఎవరి తలపై పెడితే వాళ్లు క్షణంలో బూడిద కావాలని వరం కోరుకున్నాడు.. ఈ బోళా దేవుడికి కరుణాకటాక్షాలు ఎక్కువ

**సాక్షాత్తూ ఈశ్వరుడు తానే సృష్టించుకుని ఈ గుహలో ఉన్నాడని చెప్తారు. రెండు అతి ఎత్తైన రాతి నిర్మాణాల నడుమ లోతైన గుహ ఏర్పడింది. ఈ రెండు రాతి శిఖరాలకు కూడా ఆధ్యాత్మికమైన పేర్లే ఉన్నాయి. ఒకటి భైరవ శిఖరమైతే.. మరొకటి మోహినీ శిఖరం.. భైరవ శిఖరం ఎత్తు దాదాపు 120 మీటర్ల వరకు ఉంటుంది. ఈ శిఖరం కిందనున్న గుహలో స్వయంభువుగా వెలసిన శివలింగం ఉంది..**

కావటంతో అడగిందే తడవుగా వరం ఇచ్చాడు.

కానీ, ఆ రక్కసికి పెద్ద అనుమానం వచ్చింది. ఈ వరం ఎలా పనిచేస్తుందని.. వస్తువు కొన్నప్పుడు టెస్ట్ చేసి ఎలా తీసుకుంటామో.. వరం పొందినప్పుడు దాన్ని టెస్ట్ చేయాలన్న కొత్త ట్రెడిషన్‌ను భస్మాసురుడే స్టార్ట్ చేశాడు. వరం ఎవరిమీద టెస్ట్ చేయాలి? ఇచ్చిన వారిపైనే చేస్తే పోలా.. అందుకే శివుడిపైనే టెస్ట్‌కు సిద్ధపడ్డాడు.. దాంతో అంతటి పరమేశ్వరుడు తీర్థపురి నుంచి కింద ఉన్న కన్నడ దేశం దాకా పరిగెత్తి పరిగెత్తి గుహలో దాక్కోవలసి వచ్చింది.

ఇప్పుడు పరమేశ్వరుడిని కాపాడే బాధ్యతను విష్ణువు స్వీకరించాల్సి వచ్చింది. ఈశ్వరుని వెతుకుతూ.. వెతుకుతూ.. భస్మాసురుడు ఆ గుహ దగ్గరకు రానే వచ్చాడు. ఇంతకీ ఆ గుహ ఎక్కడుంది..? ఇప్పటికీ దాని జాడలున్నాయా? అక్కడ ఏం జరిగింది?.. విష్ణుమూర్తి ఏం చేశాడు..? శివుణ్ణి చూసిన తరువాత భస్మాసురుడి భరతం పట్టడానికి నారాయణుడు మోహినీ అవతారం దాల్చాల్సి వచ్చింది. ప్రపంచంలోనే అతి సౌందర్యరాశిగా మోహినిని చూసిన భస్మాసురుడు అసలు విషయాన్ని పూర్తిగా మరచిపోయి.. ఆమె వెంట పడటం మొదలు పెట్టాడు. తనను పెళ్లి చేసుకోమన్నాడు.. ఆమె అతనికి సవాలు విసిరింది.. తనతో సమానంగా డాన్స్ చేస్తే అప్పుడు ఆలోచిస్తానంది.. డాన్స్‌లోనే అతని చేయి అతని తలపైనే ఉంచుకునేలా చేసి అసురుని అంతం చేసింది. ఇదీ కర్ణాటకలోని ఆ పర్వత గుహ వెనుక దాగిన కథ. ఈ గుహ సాదాసీదా గుహ కాదు. భారత దేశానికి పశ్చిమ కనుమల్లో పవిత్ర సహ్యాద్రి పర్వత శ్రేణుల మధ్యలో అనూహ్యమైన.. ఎవరూ ఊహించని.. గొప్ప గొప్ప జియాలజిస్టులకు సైతం అంతుపట్టని విధంగా ఏర్పడ్డ రాతి నిర్మాణం ఈ గుహ. చుట్టూ దట్టమైన అడవి.. చాలా దూరం నడిస్తే తప్ప గుహ దగ్గరకు చేరుకోవటం కష్టం. సాక్షాత్తూ ఈశ్వరుడు తానే సృష్టించుకుని ఈ గుహలో ఉన్నాడని చెప్తారు. రెండు అతి ఎత్తైన రాతి నిర్మాణాల నడుమ లోతైన గుహ ఏర్పడింది. ఈ రెండు రాతి శిఖరాలకు కూడా ఆధ్యాత్మికమైన పేర్లే ఉన్నాయి. ఒకటి భైరవ శిఖరమైతే.. మరొకటి మోహినీ శిఖరం.. భైరవ శిఖరం ఎత్తు దాదాపు 120 మీటర్ల వరకు ఉంటుంది. ఈ శిఖరం కిందనున్న గుహలో స్వయంభువుగా వెలసిన శివలింగం ఉంది.. ఈ శివలింగంపై శిఖరం

నుంచి నిరాఘాటంగా పవిత్ర జల అభిషేకం చేస్తూ ఉంటుంది. కఠిన గండశిలగా కనిపించే ఈ లైమ్‌స్టోన్ ఫార్మేషన్‌కు ఎలాంటి ఆధారం మాత్రం లేదు. ఈ రాతి శిఖరాలలో అత్యంత ఖరీదైన మాంగనీస్, లైమ్‌స్టోన్, ఐరన్ ఓర్ లాంటి ఖనిజాలు ఉన్నాయని జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా సైంటిస్టులు చెప్పగలిగారు. ఇంతకు మించి ఈ రాతి శిఖరాలు ఎప్పుడు ఏర్పడ్డాయి? ఎలా ఏర్పడ్డాయి? అన్నదానికి వారి దగ్గర ఎలాంటి సమాచారం లేదు. మన దేశంలోని స్పిరిచ్యువల్ వండర్స్‌లో యానా కేవ్స్ ఒకటి. మహాదేవుడి ఉనికిని స్పష్టంగా చాటుతున్న అద్భుతం ఇది. దేవుడి అస్తిత్వాన్ని నమ్మని వాళ్లకు కూడా ఆశ్చర్యాన్ని, విస్మయాన్ని గొలిపే విశేషమిది. ఇది కేవలం శివుడి క్షేత్రమే కాదు. హరిహరులు ఇద్దరూ కొలువైన  పరమాద్భుతం.

భైరవేశ్వర శిఖరం పక్కనే మోహినీ శిఖరం ఉంటుంది. న్యూయార్క్‌లో కూలిపోయిన వరల్డ్ ట్రేడ్ సెంటర్ల మాదిరిగానే ఇవి రెండు శిఖరాలు జంట శిఖరాలు. భైరవ శిఖరానికి కాస్త తక్కువ ఎత్తులో, అంటే సుమారు 90 మీటర్ల ఎత్తులో ఈ శిఖరం ఉంటుంది. ఈ మోహినీ శిఖరంపై అమ్మవారి విగ్రహం ఉంటుంది. ఈ అమ్మవారు పార్వతీదేవిగా కొలుస్తారు. భస్మాసుర వధ తరువాత మోహినీరూపంలో విష్ణువు స్వయంగా కైలాసానికి వెళ్లి ఉమాదేవిని ఈ గుహల దగ్గరకు తీసుకుని వచ్చాడట. అందుకే ఇక్కడ ఆమె కొలువై కనిపిస్తుంది. భైరవేశ్వర శిఖరం నుంచి లోపల ఉన్న శివలింగంపై పడే నీటికి ఎక్కడ లేని పవిత్రత ఉంది. శివుడి విభూతి ఎంత పవిత్రమైందో.. ఇక్కడ శిఖరంపై నుంచి నేరుగా మహాదేవుని అభిషేకించే జలం అంత పవిత్రమైంది. అందుకే ఈ నీటిని విభూతి జలాలుగా పిలుస్తారు. అంతే కాదు.. ఈ నీరు శిఖరం నుంచి శివలింగంపై పడేందుకు మార్గం వుంది. ఈ మార్గాన్ని చండీ మార్గమని పిలుస్తారు.

ఈ నీరు రహస్యంగా ప్రవహించటం లేదు. పక్కనే పవహించే ఆఘనాశని నది నుంచి వస్తుంది. భగీరథుడి తపస్సుకు మెచ్చి గంగ కిందకు వచ్చినప్పుడు శివుడి ఝటపై పడటం ఎలా ఉంటుందో.. భైరవేశ్వరుడిపై విభూతి జలాలు అభిషేకించటం అలానే కనిపిస్తుంది... శివరాత్రి వచ్చిందంటే చాలు... యానా గుహలకు వెళ్లి మహాదేవుని దర్శనం కోసం జనం తహతహలాడతారు. అడవిలోకి ప్రయాణించటం ఎంత కష్టమైనా.. క్రూరమైన జంతువులున్నా సరే.. యానా గుహలకు వెళ్లాల్సిందే. ఎలాంటి ఆపద ఎదురైనా సరే మృత్యుంజయుడు తమను రక్షిస్తాడన్న అపారమైన విశ్వాసం భక్తులది.. యానా గుహలు ఎలా ఏర్పడ్డాయో ఎవరికీ తెలియదు. కానీ, భారతీయ ఆధ్యాత్మిక భక్తి శిఖరాలుగా మాత్రం ఇక్కడి భైరవేశ్వర, మోహినీ శిఖరాలు అలరారుతున్నాయి. మనం దేవుణ్ణి నమ్ముతామా? లేదా అన్నది యానా గుహల విషయంలో అప్రస్తుతం. నమ్మేవాళ్లు భక్తి కోసం.. నమ్మని వాళ్లు ఒక థ్రిల్ కోసం యానా కేవ్స్ చూసి తీరాల్సిందే.. మరింకేం.. ఇది చదివిన వెంటనే నెక్స్ట్ హాలిడే ట్రిప్ కర్ణాటక వెస్టర్న్ ఘాట్స్‌గా డిసైడ్ చేసేసుకోండి.

# మనుషులు చేసిన దేవుడు

*దేవుడు భూమిని సృష్టించాడు*

*దేవుడు ప్రాణాన్ని సృష్టించాడు*

*దేవుడు మనిషిని సృష్టించాడు*

*మరి దేవుణ్ణి ఎవరు సృష్టించారు?*

*దేవుడి రూపాన్ని సృష్టించిందెవరు?*



దేవుడు భూమిని సృష్టించాడు.. భూమిపై మనిషినీ సృష్టించాడు. విశ్వాసాన్ని సృష్టించాడు.. దేవుడు చేసిన మనుషులు అదే దేవుణ్ణి తయారు చేశారు.. అతడికి గుడి కట్టారు.. గోపురాన్ని కట్టారు..విగ్రహాన్నీ తయారు చేశారు.. ఈ రూపానికి ఆధారం ఏమిటి? మనిషి దీన్ని ఎలా తయారు చేశాడు? దీనికి ప్రాణం పోయటం సాధ్యమేనా? దీన్ని పూజిస్తే భగవంతుడు ప్రసన్నమవుతాడా? మానవుడి విశ్వాసంలోంచి ఆవిర్భవించిన అపూర్వ సృష్టి.. మనిషి జీవితాన్ని శాసించిన సృష్టి.. మనిషి చేసిన దేవుడు.

దేవుడికి పుట్టుక లేదు.. చావు లేదు.. రూపం లేదు.. వేషం లేదు.. ఆయన సర్వాంతర్యామి అన్నది అన్ని మతాల విశ్వాసం.. ఆయన్ను చూసిన వారెవరో తెలియదు. మనిషికి కనిపించని ఒక మహాశక్తి.. అలాంటి శక్తికి.. అలాంటి సృష్టికి, అలాంటి తేజస్సుకు.. అలాంటి సర్వాంతర్యామికి మనిషి ఒక రూపాన్నిచ్చాడు.. వేషమిచ్చాడు.. అభరణాలను ఇచ్చాడు.. తనకంటే ఎక్కువ రాజపూజ్యాలను ఇచ్చాడు.. తను చేసిన దేవుడిని తానే ఊరేగిస్తున్నాడు.

ఒక ప్రత్యేక వాతావరణం.. మనసుకు ఒక్కసారిగా ప్రశాంతతను చేకూర్చే వాతావరణం.. విషపూరితమైన వాతావరణంనుంచి ఒక్కసారిగా బయటపడినంత ఫీలింగ్.. ఆ పరిసరమే ఒక కొత్త ప్రపంచం.. భక్తి ప్రపంచం.. భగవంతుడి ప్రపంచం.. దేవాలయం.. అక్కడ రణగొణ ధ్వనులున్నా.. అవి వాతావరణాన్ని కలుషితం చేయవు. నినాదాలు మిన్నంటినా... మనసులో ప్రశాంతత చెక్కు చెదరదు.. దైవాన్ని ఊరేగిస్తుంటే.. నాట్యాలు చేసినా.. వేలాది జనం నీరాజనాలు పలుకుతున్నా.. వాతావరణంలోకి కాలుష్యం చేరదు.

ఏ దేవాలయానికి వెళ్లినా అక్కడ ఉండే ప్రత్యేకతే అది. అసలు ఆలయానికి వెళ్లడంలోని

అంతర్యమే అది. చికాకులనుంచి, చీకూచింతల నుంచి కాసేపైనా రిలాక్స్ కావటం కోసమే ఆలయానికి వెళ్లేది. దేవుడు మనిషిని సృష్టిస్తే.. మనిషి దేవుడి కోసం చేసిన ప్రత్యేక సృష్టి ఆలయం. విశాలమైన ప్రాంగణంలో ప్రశాంతమైన సంకీర్తనలతో.. నిత్యోత్సవ, పక్షోత్సవ, సంవత్సరోత్సవాలతో భగవంతుడికి సేవచేసే అద్భుతమైన ప్రదేశం.. ఆలయం. ఉత్సవాలనగానే మనకు ముందుగా గుర్తొచ్చేది శ్రీవారి ఆలయం తిరుమల. అక్కడ స్వర్ణకాంతులీనే దేవదేవుడికి ప్రతిరోజూ జరిగే ఉత్సవాలను చూడటానికి రెండు కళ్లు ఎందుకూ సరిపోవు. రకరకాల వాహనాల్లో, పల్లకిలో, రథంలో కూచుని ఊరేగుతున్న శ్రీనివాసుడి దివ్యమంగళ విగ్రహాన్ని చూసేందుకే రోజుకు దాదాపు లక్ష మంది రావటమే ఒక అద్భుతం. ఏమిటా విగ్రహంలోని గొప్పతనం? అంతమందిని ఆకర్షిస్తున్న అనంతమైన సౌందర్యం ఆ విగ్రహంలోకి ఎలా వచ్చింది? మూల విరాట్టు రూపం సంగతి సరే సరి.. ఉత్సవాల్లో సకల భోగాలతో దర్శనమిస్తున్న స్వామివారి విగ్రహాలకు అంతటి తేజస్సు ఎక్కడిది? అసలు ఆ విగ్రహాలను ఎలా తయారు చేస్తారు? ఎక్కడి నుంచి అంత శోభ వాటికి లభిస్తుంది.. నిజంగా దేవుడు ఆ విగ్రహాల్లో కొలువై ఉంటాడా?

పరమేశ్వరుని సాకారంగా దర్శించిన వాళ్లు ఎవరైనా ఉన్నారో లేదో మనకైతే తెలియదు.. దేవుణ్ణి ఫలానా వారు చూశారంటూ తపస్సంపన్నుల గురించి, ఉపాసనాపరుల గురించి చెప్పగా విన్నాం.. వారి దగ్గరకు వెళ్లి నమస్కారం చేస్తాం.. కానీ, మనకు తెలిసిన దేవుడు ఆలయంలో విగ్రహమే. మూల విరాట్టు ప్రధానమూర్తి అయితే, ఉత్సవ విగ్రహం సేవా మూర్తి. ఈ ఇద్దరినే మనం దేవీదేవుళ్లుగా పూజిస్తాం. భక్తి ప్రపత్తులతో నమస్కరిస్తాం.. కోరికలు తీర్చమని కోరుకుంటాం.. ఈ విగ్రహాలు ఎలా రూపొందాయి? వీటి తయారీ వెనుక నేపథ్యం ఎంతో ఉంది.

ఆ మూర్తిని చూస్తేనే ఒంట్లో ఒకరకమైన పులకింత కలుగుతుంది. మనసు భక్తిభావంతో పరవశించిపోతుంది. ఆ రూపంలోనే ఒకరకమైన దివ్య తేజస్సు కనిపిస్తుంది. ఆ తేజస్సులోనే భక్తులకు స్వామి సాక్షాత్కరిస్తాడు. కోరిన కోర్కెలన్నింటినీ తీరుస్తాడు. ఇంత గొప్ప రూపం భగవంతుడికి ఇచ్చింది ఎవరు? భగవంతుడికి రూపం ఏమిటో ఎవరికీ తెలియదు.. కానీ, రూపాన్నిచ్చింది మాత్రం మనిషే.. అంత సౌందర్యమూర్తిని సృష్టించింది మనిషే.. దేవదేవుడి దివ్యమంగళ విగ్రహం మూలవిరాట్టులోనే ఉంటుంది. సాధారణంగా స్వయంభువుగా భగవంతుడు అవతరించిన ప్రాంతాల్లో కాకుండా.. మిగతా ఆలయాల్లో మూల విగ్రహాన్ని రూపొందించేందుకు నల్లని గండశిలను ఉపయోగిస్తారు.. ఇప్పుడంటే పాలరాయి, నల్లని గ్రానైట్ రాతిని విగ్రహ రూపకల్పనకు వినియోగిస్తున్నారు..

నల్లని గండశిలతో ప్రధాన విగ్రహ రూపకల్పన జరుగుతుంది. దీనిపై విద్యుత్తు దీపాలను వెలగనివ్వరు.. ఈ విగ్రహాలు ఆభరణాల అలంకరణల్లోనే దివ్యకాంతులీనుతాయి. నూనె దీపాలతో విగ్రహాలకు జ్యోతలు పడతారు. పాలరాయి, గ్రానైట్‌లతో రూపొందించిన



**తంజావూరులోని బృహదీశ్వరుని మూల శివలింగం అపూర్వమైంది. రాజరాజచోళుడు నిర్మించిన ఈ ఆలయం దేశంలోనే గొప్పనిర్మాణ వైచిత్రి కలిగింది. అతి పెద్ద ఆలయమూర్తులలో ఒకరుగా ఇక్కడి బృహదీశ్వరుడు దర్శనమిస్తారు.**

విగ్రహాలను పతిష్ఠించిన చోటనే విద్యుద్దీపాలు ఉంచుతున్నారు. గండశిలతో రూపొందించిన మూల విగ్రహాలపై విద్యుత్తు కాంతులను వెదజల్లితే విగ్రహాల్లోని స్వచ్ఛమైన దివ్య తేజస్సు దర్శనం కాదని విశ్వాసం.

తంజావూరు ఇందుకు ప్రబలమైన ఉదాహరణ. తంజావూరులోని బృహదీశ్వరుని మూల శివలింగం అపూర్వమైంది. రాజరాజచోళుడు నిర్మించిన ఈ ఆలయం దేశంలోనే గొప్పనిర్మాణ వైచిత్రి కలిగింది. అతి పెద్ద ఆలయమూర్తులలో ఒకరుగా ఇక్కడి బృహదీ శ్వరుడు దర్శనమిస్తారు.. ఇందులోని మహాదేవుడి శివలింగం ఈ విధంగా రూపొందిందే.. నలుగురు మనుషుల ఎత్తుండే ఈ మహాలింగాన్ని చూసేందుకు ఎన్ని కన్నులున్నా సరిపోవు. మూల విగ్రహం ప్రాణప్రతిష్ఠ జరిగిన తరువాత ఎక్కడికీ కదిలించరు. దేవీదేవతలకు సంబంధించి ఎలాంటి చలనపూరితమైన ఉత్సవాలు జరగాలన్నా ఉత్సవమూర్తులే ఆధారం. ఈ ఉత్సవమూర్తులు మనిషి శరీరం లాంటివి. మన శరీరం పంచభూతాలతో ఎలా తయారవుతుందో, ఈ విగ్రహాలు కూడా పంచ లోహాలతో తయారవుతాయి. భూమి, నీరు, వాయువు, అగ్ని, ఆకాశాలు మన శరీరాన్ని పుట్టుక నుంచి చనిపోయేంత వరకు ప్రభావితం చేస్తాయి. దేవాలయాల్లో ఉత్సవమూర్తులను పంచ లోహాలతో తయారు చేస్తారు. దీనికి ప్రత్యేకమైన శిల్ప నైపుణ్యం అవసరమవుతుంది.. ఎక్కడా ఎలాంటి లోపం లేకుండా, స్వామిని రూపకల్పన చేయటం నిజంగా ఈశ్వరుడిచ్చిన వరమే. పంచలోహ విగ్రహం.. ఈ పదం మనం తరచూ వినే మాటే.. ఏ ఆలయంలోనైనా, ఎక్కడైనా, దేవతామూర్తుల విగ్రహం అంటే పంచలోహ విగ్రహమే. ఈ విగ్రహం తయారు చేయాలంటే మామూలు విషయం కాదు. జీవకళ ఉట్టిపడేలా దేవతామూర్తిని సృష్టించడానికి ప్రత్యేక నైపుణ్యం వుంటుంది. బాగా చేయి తిరిగిన వాళ్లు నిష్ఠగా పూనుకుంటేనే అది సాధ్యపడుతుంది. సాకారమవుతుంది. పంచలోహ మూర్తి.. తయారు కావటానికి ముందు పెద్ద తతంగమే ఉంటుంది. దేవతలను మూర్తిమంతం చేయటంలో తమిళనాడు కళాకారులను మించిన వాళ్లు ఉండరు. దేవతా విగ్రహాన్ని తయారు చేయటానికి, ముందుగా ఆ స్వామిని కళాకారులు ఉపాసిస్తారు.. ఆయన మూర్తిని పూర్తిగా మనసులో నిలుపుకుంటారు. ఆ తరువాతే విగ్రహాన్ని రూపొందించటం ప్రారంభిస్తారు.









*తమిళనాడులోని మదురైలో నటరాజ విగ్రహాన్ని తయారు చేస్తున్న విధానం..*

ముందుగా మైనం ముద్దను తీసుకుని దానితో తాము చేయాల్సిన విగ్రహం అచ్చును తయారు చేస్తారు.. వస్త్రభూషణాలతో సహా అన్నింటినీ ఈ అచ్చులో వచ్చేట్లు జాగ్రత్త పడతారు.. మైనం విగ్రహమే చాలా కీలకం.. ఇందులో ఎలాంటి లోపం రాకుండా చూసుకోవటం పెద్ద సమస్య. ఏ చిన్న పొరపాటు జరిగినా చివరగా వచ్చే విగ్రహంపై ఆ లోపం స్పష్టంగా కనిపిస్తుంది.. నిత్యం ఆరాధన జరిగే విగ్రహాల్లో ఎలాంటి లోపం రాకుండా చూసుకోవటంలో చాలా జాగ్రత్త వహించాల్సి ఉంటుంది. భారతీయ శిల్పశాస్త్రం విగ్రహాలను తయారు చేయటంలో ప్రత్యేకంగా విధించిన నిబంధనలను వీళ్లు తు.చ.తప్పకుండా పాటిస్తారు. మైనాన్ని ఎక్కడ ఎలా ఫోల్డ్ చేయాలో ప్రణాళికాబద్ధంగా ఉంటుంది. మైనాన్ని అనుకున్న విధంగా ఫోల్డ్ చేసుకున్న తరువాత దానితో అసలైన విగ్రహం తయారవుతుంది. ఆ మైనపు అచ్చును చుట్టూ పిడకలు పేర్చి వేడి చేయటం ద్వారా అచ్చులో కరిగిస్తారు. ఇది పార్థనతో మొదలు అవుతుంది.. ప్రార్థనతోనే ముగుస్తుంది. ఇది మొత్తం కరగటానికి దాదాపు రెండు గంటలు పడుతుంది. అలా కరిగిన తరువాత దానిపై వేడి చేసిన పంచలోహ మిశ్రమాన్ని నెమ్మదిగా పోస్తారు. అది పూర్తిగా చల్లారిన తరువాత చుట్టూ పేరుకుపోయిన మట్టిని తొలగించి అసలైన విగ్రహాన్ని బయటకు తీసి, దానికి తుది మెరుగులు దిద్దుతారు. తరువాత మిగిలేది ఆ మూర్తిలో మంత్రోచ్చారణలతో ప్రాణ ప్రతిష్ఠ చేయటం అర్చనాది సేవలను కొనసాగించటం.. ఎంత కష్టపడి.. భక్తి ప్రపత్తులతో.. శిల్పశాస్త్ర నిబంధనలకు

లోబడి ఖచ్చితమైన పద్ధతులతో చేయటం వల్లనే శిల్పం విగ్రహం అవుతుంది. విగ్రహం దేవుడిగా మారుతుంది.. ప్రాణం పోసుకుంటుంది. దివ్య తేజస్సు సంతరించుకుంటుంది.. దైవం ఆ విగ్రహాన్ని తన నెలవు చేసుకుంటుంది. మనిషి కోరిన కోరికలన్నింటినీ తీరుస్తోంది. మనిషి అందించిన సేవలన్నింటినీ అందుకుంటోంది.

ఇంతకీ పంచలోహాలు ఏమిటి? ముందే చెప్పుకున్నట్లు మనకు పంచభూతాలు ఎలాగో, పంచలోహాలు అలాంటివే. కంచు, రాగి, బంగారం, వెండి, ఇనుము ఇవన్నీ పంచలోహాలు. దేవతామూర్తుల రూపకల్పనలో ఈ లోహాలను ఏయే పాళ్లలో కలపాలో శిల్పశాస్త్రం స్పష్టంగా చెప్పంది. ఈ పద్ధతి ప్రకారం వెండి నాలుగు పాళ్లు.. బంగారం ఒక పాలు.. కంచు ఎనిమిది పాళ్లు.. రాగి ఎనిమిది పాళ్లు.. ఇనుము కొద్దిగా. రాగి, కంచు ప్రధానంగా మిగతా లోహాలు మిగతా పాళ్లలో కలిపి కరిగించి దైవ స్వరూపాన్ని రూపొందిస్తారు. హిందూ దేవతా మూర్తుల్లో ఈ నిష్పత్తిని ఖచ్చితంగా పాటిస్తారు. మిగతా మతాల్లో విగ్రహాలను తయారు చేయటంలో ఈ నిష్పత్తిలో కొంత తేడా ఉండవచ్చు. కొన్ని విగ్రహాల్లో సీసం కూడా ఉపయోగిస్తారు. ఇలా రూపొందించిన విగ్రహాలు ఒకసారి ప్రాణప్రతిష్ఠ జరిగిన తరువాత వెయ్యేళ్ల వరకూ చెక్కుచెదరవు. మనిషి జీవిత కాలం 60 నుంచి 70 ఏళ్లు ఉంటే.. విగ్రహాల జీవితకాలానికి ఎండ్ అన్నదే ఉండదు.

ఈ విగ్రహాలు ఎన్నాళ్లయినా తేజస్సు కోల్పోకుండా చైతన్యవంతంగా ఎలా ఉంటాయో మీకు తెలుసా? స్వామి వారికి.. అమ్మవారికి ప్రత్యేక పూజలు చేయటం వల్లనే ఈ చైతన్యం నిరంతరంగా ఉంటుంది. ఈ పూజలు పునస్కారాలు చేయటం వల్లనే భగవంతుడు విగ్రహాల్లో కొలువై ఉండటం వల్లనే ఈ తేజస్సు ఉంటుంది. ఏమిటీ సేవలు? ఏమిటీ పూజలు? అన్ని దేవాలయాల్లో మూల విగ్రహాలకు అభిషేకాదులు చేస్తే.. ఉత్సవ మూర్తులకు తిరుమంజన సేవ చేస్తారు. తిరుమంజనం అంటే ఉత్సవ మూర్తులను శుద్ధి చేసే కార్యక్రమం. స్నానపానాదులతో పాటు.. పంచామృతాలు.. చందనాదులు.. ఇతర ప్రత్యేక పదార్థాలతో విగ్రహాలకు అభిషేకం చేసి కొత్త వస్త్రాలు ధరింపజేస్తారు. దేవతామూర్తుల తిరుమంజన సేవ ఒక విశిష్టమైన ప్రక్రియ. మళ్లీ అదే మాట.. దేవుడు ఎలా ఉంటాడో మనకైతే తెలియదు. మనకు ఇష్టమైన దేవతను మనకు ఇష్టమైన రూపంలో కొలుచుకుంటాం.. ఆ దేవత మూర్తిమంతం కావటం వెనుక ఎంత తతంగం ఉందో తెలుసుకున్నారు కదా.. భక్తి ప్రపత్తులతో, నిష్ఠతో తయారు చేసిన విగ్రహం ఆ తరువాత విగ్రహంగా ఉండదు.. దైవంగా మారిపోతుంది. దైవం విగ్రహరూపంలో ఆలయాన్ని తన నెలవుగా మలచుకుంది.

అందుకే దానికి అంత సౌందర్యం.. దాన్ని చూస్తేనే అలౌకిక ఆనందం.. అంతులేని ప్రశాంతత.

# దశావతారం



*చేప రాక్షసుణ్ణి చంపుతుందా?*
*తాబేలు పర్వతాన్ని మోస్తుందా?*
*ఒక వరాహం భూమిని ఎలా కాపాడింది?*
*పొట్టి మనిషిని చూశాము*
*పొడవు మనిషిని చూశాము*
*కానీ. మనిషీ, జంతువు కలిసి*
*ఉన్న జీవి సాధ్యమేనా?*
*నారాయణుడి దశావతారాలు వాస్తవమేనా?*
*పది అవతారాల్లో*
*మరేదైనా లాజిక్ ఉందా?*
*ఏమిటీ సీక్రెట్?*

దేవుళ్లు.. మనకు బోలెడు మంది.. మూడు కోట్ల మంది. ఒక్కొక్కరిదీ ఒక్కో రూపం.. ఒక్కో తేజం.. వీళ్లలో అవతారాలన్న పేరు చెప్పగానే గుర్తుకు వచ్చేది మాత్రం విష్ణుమూర్తే. ప్రపంచంలో ఏ దుర్మార్గుడు రెచ్చిపోయినా వాణ్ణి శిక్షించే బాధ్యత మాత్రం విష్ణువుదే. అందుకోసం రకరకాల రూపాల్లో అవతరిస్తుంటాడు.. క్రిమినల్స్‌ను శిక్షిస్తుంటాడు. ఇక్కడే ఓ విచిత్రం, సందేహం రెండూ ఉన్నాయి. విష్ణుమూర్తి పది అవతారాలు ఒక్కొక్కటీ ఒక్కో రకంగా ఉంటాయి. ఒకసారి చేప, ఒకసారి తాబేలు, ఒకచోట మనిషీ, సింహం కలిసిన శరీరం, ఇంకోచోట వామనుడు.. ఏమిటివన్నీ.. ఇవన్నీ అవతారాలేనా? వీటి వెనుక సీక్రెట్ ఏదైనా ఉందా? వాట్ ఇట్ ఈజ్..?

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరశురామ, రామ, కృష్ణ, బుద్ధ, కల్కి...ఇవన్నీ నారాయణుడి దశావతారాలు.. ఈ అవతారాలన్నీ కూడా వింతరూపాల్లో వుంటాయి. చేప మనిషిని చంపుతుంది. తాబేలు పర్వతాన్ని మోస్తుంది. మనిషీ, జంతువు కలగలిసిన రూపం– నారసింహం.. దశావతారాల్లో బుద్ధుడు ఉన్నాడు.

ఈ బుద్ధుడు గౌతమ బుద్ధుడు కాదు. మనకు తెలియని మరో బుద్ధుడు మరెవరో వున్నారనటానికి ఆధారం లేదు. ఈ గౌతమబుద్ధుడే విష్ణువు అవతారమనే వాదన బలంగానే ఉంది. వాస్తవానికి దశావతారాల్లో మర్మం ఏమిటి? ఆదిశక్తి చేతి వేళ్లగోళ్ల నుంచి విష్ణువు

అవతారాలు పుట్టాయా? ఇందులో దాగున్న సృష్టి రహస్యం ఏమిటి? అంతా మిథ్యేనా? సైంటిఫిక్ రీజన్ ఏమైనా ఉందా?

విష్ణుమూర్తి దశావతారాలు కేవలం కథలు కావు.. ఇవి మన జీవితానికి సంబంధించిన అత్యంత ముఖ్యమైన విషయాలను విప్పి చెప్తున్నాయి. సృష్టి పరిణామ క్రమంలో ఒక కీలకమైన అంశాన్ని నిరూపిస్తున్నాయి. ఇవి సాదాసీదా అవతారాలు కావు. సినిమాల్లో ట్రిక్స్ అంతకంటే కావు.. పుక్కిటి పురాణాలు అంతకంటే కావు. వీటి వెనుక సృష్టిలోని రహస్యం అంతా దాగుంది.

విష్ణువుకు సంబంధించిన పురాణాల ప్రకారం, వాటిల్లో కథల ప్రకారం ఆయన చాలా అవతారాలే ధరించాడట. మనకు బాగా తెలిసినవి మాత్రం పదే. అందులో ఒకటి కల్కి.. అది ఇంకా రావలసి ఉంది. అంటే ఇప్పటికి తొమ్మిది అవతారాలు పూర్తయ్యాయన్నమాట.

ఈ అవతారాల నేపథ్యం కూడా అద్భుతంగా ఉంటుంది. వేదాలను దొంగిలించిన సోమకాసురుడనే రాక్షసుణ్ణి చంపి, ఆ వేదాలను కాపాడటం కోసం నారాయణుడు చేప.. అదే మత్స్య రూపంలో అవతరించాడు. అమృతం కోసం పాల సముద్రాన్ని చిలికేందుకు మంథర పర్వతాన్ని తీసుకువస్తే అది మునిగిపోకుండా ఉండేందుకు తాబేలుగా దాని బరువును మోశాడు నారాయణుడు.. ఈ సముద్ర మథనంలో అమృతం చివరకు దొరికింది కానీ, దానికి ముందు దొరికినవి చాలా చాలానే ఉన్నాయి.

భూమిని చాపగా చుట్టేసి దాన్ని పట్టుకుని పోయిన హిరణ్యాక్షుణ్ణి చంపేందుకు విష్ణువు వరాహరూపాన్ని ధరించాల్సి వచ్చింది. తమ్ముణ్ణి చంపినందుకు పగబట్టి అర్థం లేని వరాలు కోరి బీభత్సాన్ని సృష్టించిన హిరణ్యకశిపుని హతమార్చేందుకు నరసింహుడిగా విష్ణువు స్తంభం నుంచి ఆవిర్భవించాడు. తరువాత షార్టెస్ట్ మ్యాన్ ఆఫ్ ది వరల్డ్‌గా వామనుడి అవతారంలో విష్ణువు పుట్టాడు. బలిని అణచేసి యావత్ ప్రపంచాన్ని ఆవరించేశాడు. హింసకు ప్రతిరూపం పరుశురాముడు.. 21సార్లు రాజులను వెంటాడి వేటాడిన వాడు. పరిపూర్ణ మానవుడిగా అవతరించిన వాడు శ్రీరాముడు. రావణుడిని చంపి పాలకులకు ఓ రోల్ మోడల్‌గా నిలిచిన వాడు. ఇక కృష్ణుడి అవతారం తెలియందెవరికి.. ఆయన గురించి చెప్పాల్సిందేముంది. జగత్తుకు గురువుగా నిలిచి మార్గదర్శనం చేసిన వాడు కృష్ణుడు.

కథలు వింటే పుక్కిటి పురాణాలు.. చూస్తే సినిమాలా అనిపిస్తుంది. కానీ, దశావతారాల వెనుక అసలు కథ వేరే ఉంది. మన జీవితంతో ముడిపడి ఉన్న కథ.. మనిషి ఎవల్యూషన్ మూలాలున్న కథ. సృష్టి పరిణామ క్రమాన్ని నిర్దేశించే కథ.. జీవ పరిణామ సిద్ధాంతాన్ని రుజువు చేసే కథ.. దశావతారాలు చెప్తున్న సైన్స్.

విష్ణుమూర్తి అవతారాలు పది కూడా ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్నవే. సైన్స్‌లోని

పలు శాఖలు తీవ్ర పరిశోధనలు చేసి భూమ్మీద జీవులు ఏ విధంగా ఉద్భవించాయో చెప్తున్న అనేక విషయాలకు దశావతారాలు ఒకే ఒక్క సీక్వెన్స్‌తో జవాబు చెప్తాయి.

ఒక గ్రహంపై జీవరాశులు ఉండాలంటే ముందుగా ఉండాల్సింది నీటి వనరు.. నీటి జాడలు ఉంటే అక్కడ జీవరాశులు పుట్టేందుకైనా, మనగలిగేందుకైనా అవకాశం ఉంటుంది. ఇందుకోసమే అమెరికా సహా అగ్రరాజ్యాలన్నీ ఇతర గ్రహాల్లో ఎక్కడైనా నీటి జాడలున్నాయా అని పరిశోధనలు చేస్తూనే ఉన్నాయి. మార్స్‌పై నీటి జాడలు ఉన్నాయని కూడా ఇప్పు డిప్పుడే చెప్తున్నాయి. భూమి కూడా అంతే, నీటి జాడ ఉన్నప్పుడే ప్రకృతిలోని మిగతా జీవచరాలు అభివృద్ధి చెందుతాయి, నదీతీరాల వెంటనే నాగరికత అభివృద్ధి చెందినట్లు..

వీటికీ దశావతారాలకు సంబంధం ఏమిటని ప్రశ్నించవచ్చు. కానీ, ఉంది. ఈ రెంటికీ అవినాభావ సంబంధం ఉంది. విష్ణుమూర్తి  పాలసముద్రంపై నివాసమున్నాడు.. సృష్టికి మొదటి సంకేతం అది. భూమిపై ఉన్న నీటిజాడకు ఈ పాలసముద్రం సంకేతం. ఈ సముద్రం నుంచే జీవరాశి పుట్టింది.. నాగరికత అభివృద్ధి చెందింది. భూమిపై తొలి జీవ కణం నీటిలోనే పుట్టిందంటారు. విష్ణువు అవతారాల్లో తొలి అవతారం చేప.. ఇది జలచరం.. మీనావతారంలో విష్ణువు వేదాలను రక్షించాడు.. వేదాలంటే విజ్ఞానం.. జీవి పుట్టుకతోనే విజ్ఞానం అన్వేషణలో పడింది. జ్ఞానాన్ని సాధించేందుకు పోరాటం చేసింది. సంపాదిం చుకుంది. దాన్ని ఆధారం చేసుకుని ఎదుగుతూ వచ్చింది. విష్ణువు తొలి అవతారంలోని మర్మం  ఇదే.

ఒక గ్రహంపై నీటి జాడ గురించి ప్రస్తుతం జరుగుతున్న అన్వేషణ సామాన్యమైంది కాదు.. నీటి ఉనికి ఉంటే చాలు.. ఆ గ్రహంపై సమస్తం సమకూర్చుకోవచ్చు. క్షీరసాగర మథనం ఇందుకు స్పష్టమైన ఉదాహరణ. ఈ సాగర మథనం నుంచే పాడి పంటలు పుట్టాయి. అంటే కామధేనువు, కల్పవృక్షం అన్నమాట. విషం ఇందులోంచే పుట్టింది.. అమృతమూ ఇక్కడే లభించింది. మంచీ ఇక్కడ ఉంది.. చెడూ ఉంది.. సముద్ర మథనం భారాన్నంతా మోసిన వాడు తాబేలు రూపంలో అవతరించిన విష్ణువు.

అంతే కాదు.. చేప జల చరమయితే, తాబేలు ఉభయచరం.. ఇది నీటిలోనూ, భూమిలోనూ జీవించగలిగే జంతువు.. జీవ పరిణామ ఎదుగుదలలో ఇదొక కీలక పరిణామం. తొలి రెండు అవతారాలే కాదు.. విష్ణువు మిగతా అవతారాలు సైతం జీవి జంతువు నుంచి మనిషిగా, మనీషిగా ఎదగటాన్ని సూచిస్తున్నాయి. మన ప్రాచీనులు చెప్పిన గాడ్స్ థియరీలో దశావతారాలు చాలా కీలకమైనవి. సైన్స్ శాస్త్రోక్తంగా చెప్పిన అంశాలను అవతారాల గాథల్లో  తేలిగ్గా అర్థం అయ్యేలా చేసిన ఆర్గనైజ్డ్  సిస్టమ్ మన మైథాలజీ..

# మథన మర్మం

*సముద్రం లోతుల్లో*
*దాగున్నవేమిటి?*
*అమృతమా? విషమా?*
*మణిమాణిక్యాలా?*
*పాల సముద్రం*
*దేనికి సంకేతం?*
*దేవతలు.. రాక్షసులు*
*సముద్రాన్ని ఎందుకు చిలికారు?*



క్షీరసాగర మథనం.. దేవతలు.. రాక్షసులు కలిసి సముద్రాన్ని చిలికిన పౌరాణిక గాథ... ఇది అందరికీ తెలిసిన కథే. సముద్రాన్ని చిలికి అమృతాన్ని సాధించిన కథ.. అమృతంతో పాటు, విషం కూడా వచ్చింది కదా? లక్ష్మీదేవి కూడా ఉదయించింది? ఇంకా బోలెడు వస్తువులు బయటకు వచ్చాయి.. సముద్రాన్ని చిలికితే ఇవన్నీ వచ్చేస్తాయా? అసలు పాల సముద్రమనేది ఉందా? ఉంటే ఎక్కడ ఉంది.. సముద్ర మథనం అనేది ఇది కేవలం కథా? కల్పనా? పుక్కిటి పురాణమా? పాలసముద్రం దేనికి సంకేతం? మథనం వెనుక దాగి ఉన్న రహస్యం ఏమిటి? పాల సముద్రంలో, ఆదిశేషువు తల్పంపై విష్ణుమూర్తి శయనించి ఉంటాడట.. అదే వైకుంఠం అని అంటారు.. ఆ సముద్రాన్నే దేవతలు, రాక్షసులు చిలికారు.. ధన్వంతరి అమృతాన్ని తీసుకువచ్చి అందించాడు.. మన పురాణాల్లో ఫుల్ క్రేజ్ ఉన్న కథ ఇది.. ఒక విధంగా చెప్పాలంటే ఇది సోషియో ఫాంటసీ టైప్‌లో ఉండే పురాణ కథనం.

పాల సముద్రం.. విష్ణుమూర్తి నివాసం..అదే వైకుంఠం.. ఈ సముద్రంలోనే అమృతం దాగి ఉందని బద్ధ శత్రువులైన దేవతలకు, దానవులకు తెలిసింది.. దాన్ని ఎలాగైనా సాధించటం కోసం ఇద్దరూ చేతులు కలిపారట.. అటు తన నివాసమైన క్షీరసాగరాన్ని చిలికేందుకు విష్ణువూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చేశాడు. ఇంకేం సముద్ర మథనం మొదలైంది.

**ప్రపంచంలో కనీ వినీ ఎరుగని రత్నాలు. ఐశ్వర్యం, జంతువులు, అప్సరసలు, అమృతం.. ఎన్నని చెప్పేది.. ప్రపంచం అప్పటి వరకూ ఊహించనివి.. ఆలోచించనివి.. కనీవినీ ఎరుగనివి అన్నీ సముద్ర గర్భంలోంచి బయటపడ్డాయి. దేవతలకు, రాక్షసులకు అంతులేని సంపద లభించింది. ఏమిటీ విచిత్రం? ఎలా సాధ్యపడింది? అసలు పాలసముద్రం అనేది వుందా? ఉంటే అందులో ఇన్ని సంపదలు దాగి ఉన్నాయా?**

మథనమర్మంలో ఒక్కోటి ఒక్కోవిధంగా ఉపయోగపడ్డాయి

కవ్వం=మంథర పర్వతం, తాడు = వాసుకి, తాబేలు=విష్ణువు,

వాసుకి తలవైపు రాక్షసులు, తోక వైపు దేవతలు..

అంతా కలిసి సముద్రాన్ని చిలకడం ప్రారంభించారు.. పర్వతం సముద్రంలో మునిగిపోకుండా కూర్మావతారంలో విష్ణువు దాన్ని మోశాడు.. సముద్రాన్ని మథిస్తున్న కొద్దీ లోపలి నుంచి ఒక్కొక్కటే బయటకు వస్తున్నాయి. ముందుగా వచ్చింది కాలకూట విషం హాలాహలం.. దీంతో దేవతలు, రాక్షసులు అల్లాడిపోయారు.. చివరకు మహాశివుడు కరుణించి ఆ విషాన్ని తన కంఠంలో పదిల పరుచుకుని నీలకంఠుడయ్యాడు. సముద్రం నుంచి అమూల్యమైన మణిరత్నాలు బయటకు వచ్చాయి. జీవజాలం బయటకు వచ్చింది.

సముద్ర మథనం నుంచి బయటకు వచ్చినవి.. సురాభాండం, కౌస్తుభము, ఉచ్ఛైశ్రవం- ఏడుతలల గుర్రం, ఐరావతం, పారిజాతం, కల్పవృక్షం, కామధేనువు, అప్సరసలు- రంభ, మేనక, ఊర్వశి తదితరులు, లక్ష్మీదేవి, చంద్రుడు, ధన్వంతరి, అమృతం.

సముద్రాన్ని చిలికిన కొద్దీ చాలా వస్తువులు బయటకు వచ్చాయి. వీటిని దేవతలు, రాక్షసులు ఎవరికి వారు కావలసినవి కోరుకుని మరీ పంచేసుకున్నారు.అమృతం దగ్గరకు వచ్చేసరికి పేచీ వచ్చింది.. మరణం లేకుండా చేసే మందు కాబట్టి అది మాకంటే మాకని గొడవ మొదలైంది. విష్ణువు మోహిని అవతారం ధరించి అమృతాన్ని దేవతల పరం చేశాడు. ప్రపంచంలో కనీ వినీ ఎరుగని రత్నాలు. ఐశ్వర్యం, జంతువులు, అప్సరసలు, అమృతం.. ఎన్నని చెప్పేది.. ప్రపంచం అప్పటి వరకూ ఊహించనివి.. ఆలోచించనివి.. కనీవినీ ఎరుగనివి అన్నీ సముద్ర గర్భంలోంచి బయటపడ్డాయి. దేవతలకు, రాక్షసులకు అంతులేని సంపద లభించింది. ఏమిటీ విచిత్రం? ఎలా సాధ్యపడింది? అసలు పాల సముద్రం అనేది ఉందా? ఉంటే అందులో ఇన్ని సంపదలు దాగి ఉన్నాయా?

క్షీర సాగరాన్ని చిలికిన కొద్దీ అందులోంచి అనేక వస్తువులు బయటపడ్డాయి.. సముద్రం నుంచి పుట్టిన ప్రతి వస్తువూ ఓ ప్రత్యేకతను కలిగి ఉన్నాయి. అమృతం పుట్టిన చోటే విషమూ పుట్టింది.. ఏనుగు వచ్చిన దగ్గరి నుంచే గుర్రమూ వచ్చింది.. కల్లు అని మనం

**దేవతలు.. రాక్షసులు.. మన పురాణాల్లో కథలన్నీ వీటి చుట్టూనే పరిభ్రమిస్తుంటాయి.. దైవ, దానవ కాన్సెప్ట్ మనుషుల్లో గుణాలకు సింబల్.. మంచివారు దేవతలు, చెడ్డవారు రాక్షసులయ్యారు.. ఇవన్నీ కూడా ప్రతీకాత్మలే.. మనకు అర్థమయ్యేందుకు దేవ రాక్షస భావన పుట్టింది. ఇక్కడ కులగణాంకాలు వర్తించవు. కేవలం మంచి, చెడు మాత్రమే ప్రమాణాలు.. సముద్ర మథనం లోంచి వెలువడ్డ వస్తువుల్లో కూడా సమాజానికి మంచి చేసే వస్తువులు దేవగణానికి, చెడు చేసే వస్తువులు రాక్షస గణానికి వెళ్లిపోయాయి.**

వ్యవహరించే సుర పుట్టిన చోటే కామధేనువు పుట్టింది. వైద్యానికి ఆద్యుడు ధన్వంతరీ అందులోనుంచే పుట్టుకొచ్చాడు.

విషాన్ని శివుడు హరించాడు..ఆయన లయకారుడు.. అది ఆయన వల్ల మాత్రమే జరిగింది. అమృతం మృత్యువును హరించేది.. అది దేవతలకు దక్కింది...సురాభాండం తామసానికి సింబల్.. కిక్ ఎక్కించేది.. దీన్ని రాక్షసులు ఏరి కోరి తీసుకున్నారు.. గుర్రం స్పీడ్‌కు సింబల్.. అది కూడా ఏడు తలలు కలిగింది.. ఆలోచనలు పక్కన పెట్టి ఆవేశానికి తావునిచ్చే జంతువు.. ఇది బలి చక్రవర్తికి వెళ్లింది.. ఏనుగును ఇంద్రుడు స్వీకరించాడు.. ఇది నిదానానికి, ప్రశాంతతకు ప్రతీక..

దేవతలు.. రాక్షసులు.. మన పురాణాల్లో కథలన్నీ వీటి చుట్టూనే పరిభ్రమిస్తుంటాయి.. దైవ, దానవ కాన్సెప్ట్ మనుషుల్లో గుణాలకు సింబల్.. మంచివారు దేవతలు, చెడ్డవారు రాక్షసులయ్యారు.. ఇవన్నీ కూడా ప్రతీకాత్మలే.. మనకు అర్థమయ్యేందుకు దేవ రాక్షస భావన పుట్టింది. ఇక్కడ కులగణాంకాలు వర్తించవు. కేవలం మంచి, చెడు మాత్రమే ప్రమాణాలు.. సముద్ర మథనంలోంచి వెలువడ్డ వస్తువుల్లో కూడా సమాజానికి మంచి చేసే వస్తువులు దేవగణానికి, చెడు చేసే వస్తువులు రాక్షస గణానికి వెళ్లిపోయాయి.

కౌస్తుభం వంటి మణిమాణిక్యాలు, ఐశ్వర్య దేవత లక్ష్మీదేవి విష్ణుమూర్తి చెంతకు చేరటంలో కూడా లాజిక్ ఉంది.. విష్ణుమూర్తి స్థితికారుడు.. అంటే ఈ విశ్వాన్ని పరిపాలించేవాడు.. పాలకుడికి అడ్మినిస్ట్రేషన్ పరంగా సిరి చెంత ఉండటం అవసరం. అందుకే లక్ష్మీదేవిని నారాయణుడు స్వీకరించాడు..

వాస్తవానికి క్షీర సాగరం అన్న కాన్సెప్టే చాలా గొప్పది. దాన్ని మించింది సముద్రం.. ఈ సముద్ర గర్భంలో మనకు తెలియని మరో ప్రపంచం ఇమిడి ఉంది.. అది గొప్ప గొప్ప సైంటిస్టులకూ అంతుపట్టని ప్రపంచమది.. క్షీర సాగరం.. పాల సముద్రం.. విష్ణుమూర్తి దగ్గర సముద్రమంత పాలున్నాయిట.. పాలకు, మనిషికి మధ్య ఉన్న సంబంధాన్ని మనం విడదీయలేం.. మనిషికి రోజూ అత్యంత అవసరమైన పౌష్టికాహారంలో

పాలే ప్రధానం.. ప్రత్యక్షంగా, పరోక్షంగా పాలతో మనిషికి ఉన్న ప్రయోజనాలు అన్నీ ఇన్నీ కావు.. విష్ణుమూర్తి పరిపాలకుడు కాబట్టి మనిషి ప్రధాన అవసరమైన పాల సముద్రం ఆయనకు నివాసమని ప్రతీకాత్మకంగా చెప్పుకొచ్చారు..

పాల సముద్రం మాటెలా ఉన్నా, సముద్రమనేది భూమి మనుగడకే ముఖ్యమైంది.. భూమిపై మొత్తం 71 శాతం సముద్రమే ఉంది.. అంటే మూడింట రెండు వంతులు ఉప్పునీటితో కప్పేసి ఉందన్నమాట. భూగోళంలో కేవలం 29 శాతం మాత్రమే మనిషి తన మనుగడకు ఉపయోగించుకుంటున్నాడు.

సముద్రం అవతల భూమిపై ఎంత ప్రపంచం ఉందో అంతకు రెండు రెట్లు కొత్త ప్రపంచం సముద్రం లోపలి భాగంలో ఉంది... అనేక జీవరాశులు, మొక్కలు రాళ్లు, రత్నాలు సముద్రంలో లభించేవి... ఇప్పటికీ సముద్రం లోతుల్లో.. లో లోతుల్లో ఏమున్నాయనేది మనిషి పరిశోధనలు చేస్తూనే ఉన్నాడు.

భూమి మీద ఏడు మహా సముద్రాలు ఉన్నట్టు పురాణాలు చెబుతున్నాయి. కానీ శాస్త్రీయంగా మహాసముద్రాలు ఐదే. వాస్తవానికి ఈ ఐదు మహా సాగరాలు కలిసి ఉన్నా, వ్యావహారికంగా వాటిని ఐదుగా విభజించారు. అవే అట్లాంటిక్, ఆర్కిటిక్, పసిఫిక్, హిందూ, దక్షిణ మహా సముద్రాలు. ఈ ఐదు మహా సముద్రాలు భూమిని కవర్ చేస్తున్నాయి. డీప్ బ్లూసీలో మనకు తెలిసింది కేవలం చేపలు, షార్క్‌లు, తిమింగళాల వంటి పెద్ద జలచరాలు, చెట్లు, చేమలు.. ముత్యాలు తయారు కావటం లాంటి చాలా చిన్న చిన్న అంశాలే. కానీ లోపలికి వెళ్తున్న కొద్దీ రోజుకో కొత్త ఇన్వెన్షన్ జరుగుతోంది.. అండర్ వాటర్ నగరాలే బయటపడుతున్నాయి. మణులు, మాణిక్యాలు దొరుకుతున్నాయి. నల్ల సముద్రం, పసిఫిక్ మహా సముద్రంలో ఇటీవలి అన్వేషణలో అరుదైన వస్తువులు లభించాయి.

క్షీర సాగర మథనం అన్నది అచ్చంగా దీనికి ప్రతీక. సముద్ర గర్భంలో ఉన్న అనేక వస్తువుల గురించి మన వాళ్లు వేల ఏళ్ల నాడే పరిశోధనలు చేశారనటానికి క్షీర సాగర మథనం ఒక ప్రతీక.. ఓషనోగ్రఫీ గురించి మన పూర్వీకులకు చక్కని అవగాహన ఉంది.. సముద్ర గర్భంలో ఏం ఉంది.. అందులో దాగిన రహస్యాలను ఛేదించటంలో మన వాళ్లు సక్సెస్ సాధించారనటానికి సముద్రమథనం ఒక తార్కాణం.

మనకు తెలిసింది చాలా కొంచెం.. సముద్రం గురించి మనకు తెలియంది సముద్రమంత... దాని గర్భంలో చాలా విశేషాలు ఉన్నాయి. అసలు భూమి మనుగడే సముద్రంపై ఆధారపడి ఉంది.. సముద్రం లేకపోతే.. ఉప్పునీటి అండ లేకుంటే భూమే చచ్చిపోతుంది.. అందుకే సాగరాన్ని క్షీరసాగరంగా పిలిచారు.. దాన్ని మథించిన కొద్దీ, మనకోసం కొంచెం కొంచెంగా అపూర్వ శక్తిసంపదను అందిస్తుంది. సముద్రం... 36 కోట్ల చదరపు కిలోమీటర్ల మేర విస్తరించిన మహాజలరాశి. 1300 మిలియన్ క్యూబిక్

కిలోమీటర్లు, 12,430 అడుగుల లోతైన జలం. మహాసముద్రాలు అయిదనే చెప్తారు.. కానీ, ఇవన్నీ ఒకదానితో ఒకటి కలిసిపోయి ఉంటాయి కాబట్టి, దీన్నంతా ప్రపంచ మహా సముద్రంగానే పిలవాలి. సముద్రంపై ప్రయాణం మనిషికి చాలాకాలం క్రితమే తెలిసిన విద్య.. కానీ, సముద్రం లోతుకు, అట్టడుగుకు వెళ్లటం మాత్రం 1960లోనే సాధ్యపడింది. ఇప్పటికీ సముద్రాంతర తలంలో ఏముందో తెలియనే లేదు.. ప్రస్తుతానికి సముద్రం నుంచి మనకు తెలిసింది మత్స్య సంపదను కొల్లగొట్టడం.. సముద్ర గర్భంలో నూనె, సహజవాయువు, ఇతర ఖనిజ సంపదను కనుగొనడం.. ఈ సహజ వాయువునే మనం ఇంధన వనరుగా వినియోగిస్తున్నాం.

సముద్రం భూమి వాతావరణాన్ని తీవ్రంగా ప్రభావితం చేస్తుంది. మనకు సమయానికి రుతుపవనాలు రావాలంటే సముద్రమే ఆధారం.. భూమిపై ఉష్ణోగ్రతను సముద్ర జలాలు ప్రభావితం చేస్తాయి. భూమి ఎక్కువగా వేడెక్కకుండా నియంత్రిస్తాయి. వాతావరణాన్ని కలుషితం కాకుండా, కొన్ని విష వాయువులను కూడా సముద్ర జలాలు పీల్చేసుకుంటాయి. అదే సమయంలో తుపానులు, ప్రకృతి విపత్తులకూ ఇవే కారణమవుతాయి.

సముద్రం లేకుంటే భూమికి ఎలాంటి అస్తిత్వమూ ఉండదు.. అంటే మనిషి జీవనానికి సముద్రం మూలాధారం. హిందూ మైథాలజీ ప్రకారం ఈ జీవరాశి జీవనానికి విష్ణుమూర్తి పాలకుడు.. ఆయన నివాసం ఈ క్షీరసాగరమే.. మన పురాణాల్లో నారాయణుడి కథనంలోని వాస్తవ ప్రతీక ఇదే. పరిపాలన దాపరికం లేకుండా ఉండేందుకు సింబల్ తెలుపు.. పాలను సింబాలిక్‌గా తీసుకుంది ఇందుకే.. అన్ని రంగులూ తెలుపు నుంచే వచ్చినట్లు.. సముద్ర జలాల నుంచే మనకు అన్నీ వస్తున్నాయి. రుతుపవనాల నుంచి వర్షాలు.. వర్షాల నుంచి పంటలు.. పంటల నుంచి ఆహారం.. ఇలా ఒకదానితో ఒకటి ముడిపడి ఉన్న అంశాలే.

సాగరాన్ని మథించటం అంటే ప్రజా పాలనను మథించటమనే అర్థం. మంధరగిరి లాంటి మొద్దు వ్యవస్థను మోస్తున్న పాలకులకు ప్రజలు తోడుగా నిలిస్తే, ఆ పాలన మథనం వల్ల వచ్చే ఫలితాలను ప్రజలంతా సమానంగా పంచుకునే అవకాశం లభిస్తుంది. ప్రజాసంక్షేమ పథకాలను లబ్దిదారులకు పంచి ఇచ్చినట్లే ఇది కూడా... రాజు ప్రజలను సక్రమంగా పరిపాలించి, సత్ఫలితాలను ప్రజలందరికీ పంచి ఇవ్వటమే క్షీరసాగర మథనంలోని మర్మం.

# దేవుడు శరీరాన్ని త్యాగం చేస్తాడా?



*దేవుడికి మరణమా? అసలు ఉన్నాడో, లేడో అన్న వాదోపవాదాలు జరిగే దేవుడికి చావు ఉండటం ఏమిటి? మన వేదాల ప్రకారం పుట్టుకే లేని భగవంతునికి మృత్యువు ఎక్కడిది..? చావు పుట్టుకలకు అతీతమైన దేవుడు శరీరాన్ని త్యాగం చేస్తాడా? ఆ శరీరానికి అంత్యక్రియలు జరుగుతాయా? అదీ మనుషులు అంతిమ సంస్కారం చేస్తారా? ఇది వింతా? విచిత్రమా? విడ్డూరమా? లేక వాస్తవమా?*

అవును.. ఇది నిజం. ఈ భూమ్మీదే జరుగుతోంది. మన దేశంలోనే జరుగుతోంది. ప్రపంచంలోనే ప్రసిద్ధి చెందిన దేవుడికి జరుగుతున్న కార్యక్రమం ఇది. మనుషులే చేస్తున్న అద్భుతమైన సంస్కారం ఇది. ఎందుకిలా చేస్తారు? దేవుడికి పార్థివ శరీరం వుండటం ఎలా సాధ్యపడుతుంది? అంటే దేవుడు ఉన్నాడన్నది వాస్తవమేనా? విశ్వాసం కాదా?

మన పురాణాల ప్రకారం దేవుడు నిరాకారుడు.. అంటే ఆకారం అంటూ లేని వాడు.. అందుకే మన వాళ్లు భూమిని కొలుస్తారు.. ఆకాశాన్ని కొలుస్తారు.. రాయి, రప్పను కొలుస్తారు.. పామును కొలుస్తారు.. గోవును కొలుస్తారు.. ఒక ఇటుకకు పసుపు కుంకుమ పెట్టి దాన్ని దేవతగా కొలుస్తారు.. దేనికీ ఆకారమే ఉండదు.. తమకు ఏ రూపం కావాలనుకుంటే ఆ రూపంలో దేవుళ్లను కొలుస్తారు.

మరి ఓ స్పెసిఫిక్ ఆకారమే లేని దేవుడికి శరీరం మాత్రం ఎలా ఉంటుంది? అదే దేవ రహస్యం.. దేవుడికి రూపం అనేది ఓ పదార్థం. అంటే మెటీరియల్.. ఈ మెటీరియల్ లోపల ఉండే చైతన్యమే దైవత్వం అని మన గాఢ విశ్వాసం. సైన్స్ ఎప్పుడూ మెటీరియలిస్టిక్‌గా ఆలోచిస్తుంది.. ఇదిగో ఈ దేవుడు ఆ మెటీరియల్ ఏమిటో మనకు చూపిస్తున్నాడు.. దాని రహస్యాన్ని వివరిస్తున్నాడు. మెటీరియల్‌లో చైతన్యం ఎలా వుంటుందో.. ఆ చైతన్యం లేనప్పుడు ఎలా నిర్జీవంగా మారుతుందో రుజువు చేస్తున్నాడు.. మనం బట్టల్ని మార్చినట్లు ఈ దేవుడు తరచూ తన శరీరాన్ని మార్చేస్తున్నాడు.. ఇది మన కళ్ల ముందు జరుగుతున్న ప్రక్రియ.. ప్రజలు పండుగలా చేసుకునే అద్భుతమైన కార్యక్రమం ఇది.

పూరీ జగన్నాథుడు..అనగానే ముందుగా గుర్తుకు వచ్చేది రథయాత్ర... ప్రపంచంలో

మరెక్కడా లేని అతి పెద్ద రథయాత్ర... లక్షలాది ప్రజలు అతి పెద్ద రథాలను లాగే అపురూప ఉత్సవం.. ప్రతి ఏడాది ప్రపంచంలోని లక్షలాది ప్రజలు వేయి కళ్లతో ఎదురు చూసే వేడుక... కానీ, రథయాత్రను మించిన ఎన్నో ప్రత్యేకతలు మనకు ఇక్కడ కనిపిస్తాయి... అందులో ఒకటి జగన్నాథుడు తన శరీరాన్ని విడిచిపెట్టడం.

పూరీలో జగన్నాథ రథచక్రాలు ప్రతి ఏటా కదులుతుంటాయి. జగన్నాథుడు, బలభద్రుడు, సుభద్రలు మూడు రథాలపై పూరీలో ఊరేగుతుంటారు... ఈ రథయాత్రను చూసేందుకే లక్షలాది ప్రజలు తరలి వస్తారు. రోజుల తరబడి వేచి చూస్తారు.. రథాన్ని లాగడానికి ఉత్సాహపడతారు. 3 కిలోమీటర్ల పొడవైన తాడును ఎన్ని వేల మంది లాగుతారో ఊహించుకుంటేనే ఒళ్లు పులకరిస్తుంది... మామూలుగా వివిధ ఆలయాల్లో దేవుళ్లకు రథోత్సవం జరుగుతుంది. కానీ, రథంలో ఊరేగే దేవుడు ఆయా దేవాలయాల్లోని ఉత్సవ మూర్తే. కానీ, పూరీలో సాక్షాత్తూ మూల విరాట్టే వీధిలోకి వచ్చి రథంపై కూర్చొని ఊరేగుతాడు.. ఇది విచిత్రం ఏం కాదు.. ఇక్కడి ప్రత్యేకతే అది.. గర్భగుడిలో ఉన్న మూల విరాట్టు మూర్తులను కదిలించి బయటకు తీసుకువచ్చి రథంపై కూర్చోబెట్టి పది రోజుల పాటు రథయాత్ర నిర్వహించటం ఇక్కడ మాత్రమే కనిపించే సంప్రదాయం. జగన్నాథుడు, బలభద్రుడు, సుభద్ర ఊరేగే రథాలు ఏ యేటికాయేడు కొత్తగా తయారు చేసేవే. ఒకసారి ఉపయోగించిన రథాన్ని మళ్లీ ఉపయోగించరు.. పోనీ ఆ రథం మామూలుగా ఉంటుందా అంటే అదీ లేదు.. ఒక్క జగన్నాథుడి రథమే 45 అడుగుల ఎత్తు ఉంటుంది. ఏకంగా పదహారు రథచక్రాలు ఉంటాయి. ఇది నందఘోష రథం. ఇక బలభద్రుడి రథం ఒక అడుగు తక్కువ ఉంటుంది. ఇదీ 14 రథచక్రాలతో నడుస్తుంది. మూడోరథం ఇంకో అడుగు తక్కువతో తయారు చేస్తారు.. ఇవన్నీ పూర్తిగా కలపతో చేసినవే.. ప్రత్యేకంగా పెంచిన చెట్ల కలపను వాడి తయారు చేసినవే. ప్రతి ఏడూ కొత్త రథాన్ని తయారు చేయటం అంటే సామాన్యమైన విషయం కాదు.. అంత ఈజీ కూడా కాదు.. కానీ, పూరీలో మాత్రం ఇది సాధ్యమవుతోంది. వందల సంవత్సరాలుగా ఈ రథయాత్ర ఆగకుండా సాగుతోంది. రథయాత్ర పూర్తి కాగానే రథాల్ని పూర్తిగా ఏ భాగానికి ఆ భాగం విడగొడతారు.. మళ్లీ ఏడాది కాగానే కొత్త రథాలు తయారవుతాయి. పూరీలో ఇదొక్కటే విచిత్రం కాదు.. ఇక్కడ జరిగే ప్రతి ఉత్సవం దేనికదే ప్రత్యేకంగా ఉంటుంది.. ఇక్కడి జగన్నాథుడు మనలో ఒకరుగానే ఉన్నట్లుగా ఇక్కడి ఉత్సవాలు జరుగుతాయి.

ప్రపంచంలో పూరీలోని ఆలయమే ఒక విచిత్రమైన ఆలయం. సాధారణంగా ఆలయాల్లో లక్ష్మీ నారాయణులో, సీతారాములో, శ్రీనివాస పద్మావతులో, శివ పార్వతులో ఇలా జంటలుగానే దేవతామూర్తులు కనిపిస్తారు. కానీ, పూరీలో అన్నా చెల్లెళ్లు ఉంటారు. శ్రీకృష్ణుడు, బలరాముడు, వాళ్ల చెల్లెలు సుభద్రలు ఇక్కడ ప్రధాన దేవతలు. ఈ మూల విగ్రహాలను సైతం కలపతోనే తయారు చేస్తారు.



**జగన్నాథుడికి విగ్రహాన్ని చూడగానే ప్రత్యేక ఆసక్తి కలుగుతుంది. వీటన్నింటినీ ఓ ప్రత్యేకమైన కలపతోనే తయారు చేస్తారు.. వీటికి ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది.. అలాంటి విగ్రహాలకు కాలనుగుణంగా అంతిమ సంస్కారం జరగటం వెనుక పెద్ద రహస్యమే దాగి ఉంది.. అదే పూరీలోని విశేషం...**

ఇక్కడ ఇంకో విచిత్రమూ ఉంది..ఇక్కడ కనిపించే జగన్నాథ స్వామి మొండి చేతుల వాడు.. ఈ మూర్తికి చేతులు పూర్తిగా ఉండవు. ఈ విగ్రహాన్ని తొలిసారి విశ్వకర్మ రూపొందిస్తున్నప్పుడు ఒరిస్సా రాజు ఇంద్రద్యుమ్నుడు ఆటంకం కలిగించటం వల్ల విగ్రహం పూర్తి కాకుండానే విశ్వకర్మ వెళ్లిపోయాడట.. అప్పటి నుంచీ జగన్నాథ స్వామి మొండి చేతుల వాడిగానే భక్తులకు దర్శనమిస్తున్నాడు. స్వామి వారి విగ్రహమైనా సాధారణంగా ఉంటుందా అంటే అదీ ప్రత్యేకమైన పద్ధతిలో ఉంటుంది.. పెద్ద పెద్ద గుండని కళ్లు జగన్నాథుడికి ఉంటే, బలభద్రుడికేమో ఓవెల్‌షేప్‌లో కళ్లు ఉంటాయి. వీటికి కింది నుంచే కాస్తంత ఉన్న మొండి చేతులు ఉంటాయి. విగ్రహాన్ని చూడగానే ప్రత్యేక ఆసక్తి కలుగుతుంది. వీటిని ఓ ప్రత్యేకమైన కలపతో తయారుచేస్తారు.. వీటికి ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది. అలాంటి విగ్రహాలకు కాలనుగుణంగా కొన్ని నియమిత సంవత్సరాలకు అంతిమ సంస్కారం జరగటం వెనుక పెద్ద రహస్యమే దాగి ఉంది.. అదే పూరీలోని పరమ అద్భుతమైన విశేషం.

ఇంతటి విశిష్ఠత కలిగిన జగద్గురువుకు అంతిమ సంస్కారం చేయటం ఏమిటి? దీని పేరు నవకళేవర ఉత్సవం అంటారు. ఇలాంటి విశేషమైన ఉత్సవం అన్నది ప్రపంచంలో పూరీలో తప్ప మరెక్కడా జరగదు.. ఇది అంతిమసంస్కారం కాదు.. కొత్త శరీరంలోకి భగవంతుడు మారటమే ఇది.. జగన్నాథుడు పాత శరీరాన్ని విడిచిపెట్టి కొత్త శరీరంలోకి ప్రవేశిస్తాడు.. అదే పూరీలో జరిగే నవ కళేవర ఉత్సవం.

మనం మాసిన బట్టలను వదిలేసి ఉతికిన బట్టలను రోజూ మార్చుకుంటాం.. పూరీలో జగన్నాథుడు పాత శరీరాన్ని విడిచిపెట్టి, సరికొత్త శరీరాన్ని ధరిస్తాడు.. దీన్ని నవ కళేవర ఉత్సవంగా పిలుస్తారు.. ఇది దాదాపు రెండు మాసాల పాటు సాగే అతి పెద్ద కార్యక్రమం. ఖగోళ శాస్త్రం పద్ధతులను అనుసరించి ప్రతి 8, 11, 19 సంవత్సరాలకు ఒకసారి పూరీ జగన్నాథుడికి నవ కళేవర ఉత్సవాన్ని నిర్వహిస్తారు. ఇది అంత ఈజీగా జరిగే తంతు కాదు. మూల విగ్రహాల స్థానంలో కొత్త విగ్రహాలను తయారు చేసి ప్రతిష్ఠించటం.. ఇందుకోసం చాలా పెద్ద కసరత్తే చేస్తారు...విగ్రహాల తయారీ అత్యంత రహస్యంగా

నిర్వహిస్తారు.. నవ కళేవర ఉత్సవాలు ప్రారంభం కాగానే ఆలయ ప్రధానార్చక కుటుంబీకులు పూరీకి 60 కిలోమీటర్ల దూరంలో ఉన్న కకట్‌పూర్‌కు వెళ్తారు. అక్కడ పాచీ నదిలో స్నానం చేసి పక్కనే ఉన్న మంగళాదేవి ఆలయంలోకి వెళ్లి అక్కడే నిద్రిస్తారు. అమ్మవారు వారి కలలో కనిపించి జగన్నాథ స్వామి వారి విగ్రహానికి కావలసిన చెట్టు ఎక్కడుందో చెప్తుంది. పూజారులు అక్కడి నుంచి అమ్మవారు చెప్పిన దిశలో కాలినడకన బయలుదేరి వెళ్తారు.. కొన్ని ప్రత్యేకతలు కలిగిన వేప వృక్షాలను కనుగొంటారు.

***ఈ చెట్లకు ఖచ్చితమైన గుర్తులు కనిపించి తీరాలి..***

***1. జగన్నాథుడి విగ్రహం తయారు కావలసిన చెట్టు కాండంపై సుదర్శన చక్రం గుర్తు... 2. బలభద్రుడి విగ్రహ తయారీకి వాడే చెట్టుపై గద గుర్తు 3. సుభద్ర విగ్రహం కోసం వినియోగించే చెట్టుపై కమలం గుర్తు 4. ఆ చెట్ల నీడలో విషపాములు కనిపించాలి 5. దగ్గరలో తప్పనిసరిగా ఓ చింత చెట్టు ఉండాలి...***

విగ్రహాల తయారీకి ఉపయోగించే చెట్టు కాండం నిటారుగా పది నుంచి పన్నెండు అడుగుల ఎత్తుకు ఎదిగి ఉండాలి..కాండం నాలుగు నుంచి ఏడు భాగాలుగా విస్తరించి వుండాలి. చెట్లకు సమీపంలో ఒక స్మశానం, నీటి వనరు, శివాలయం ఉండి తీరాలి.

ఇన్ని రకాలుగా అన్నీ కుదిరిన తరువాత ఎంపిక చేసుకున్న చెట్లకు పూజారులు సంప్రదాయబద్ధంగా పూజలు నిర్వహిస్తారు. ఆ తరువాత ఆ చెట్లను కొట్టేస్తారు.. వాటిని చెక్కతో తయారు చేసిన బండ్లపై ఎక్కించి పూరీ ఆలయానికి తీసుకువస్తారు.. ఉత్తర ద్వారం గుండా వాటిని ఆలయంలోకి తీసుకెళ్లి కోయిల్ వైకుంఠం ప్రాంగణంలో వుంచుతారు. అక్కడే విగ్రహాల తయారీ జరుగుతుంది. ఇది అత్యంత రహస్యంగా జరుగుతుంది.. సదరు శిల్పికి తప్ప ఎవరికీ అనుమతి ఉండదు. చైత్ర మాసంలో మొదలయి, సరిగ్గా ఆషాఢశుద్ధ చతుర్థి నాటికి విగ్రహాల తయారీ పూర్తవుతుంది. అదే రోజు రాత్రి బ్రహ్మ ముహూర్తంలో పాత విగ్రహాల లోపల ప్రాణ ప్రతిష్ఠ చేసి ఉన్న బ్రహ్మ పదార్థాన్ని ప్రధాన పూజారి కొత్త విగ్రహాల్లోకి మారుస్తారు. దీంతో కొత్త విగ్రహాలకు చైతన్యం వస్తుంది. ఈ పదార్థాన్ని ఆ ముగ్గురు దేవతల అస్థికలని కొందరంటారు.. మరి కొందరు సాలగ్రామాలని పిలుస్తారు.. బౌద్ధులు బుద్ధుడి పన్ను అంటారు.. శ్రీకృష్ణుడి నిర్యాణానంతరం ఆయన అస్థికను ఈ విగ్రహాల్లో ఉంచారట.. అలాగే సముద్రంలో శరీర త్యాగం చేసిన బలరాముడు, సుభద్రల అస్థికలనూ ఇందులో ఉంచారట.. వీటిని మారుస్తున్నప్పుడు పూజారి సైతం కళ్లకు గంతలు కట్టుకుంటారు.. కొత్త విగ్రహాల్లో ప్రాణప్రతిష్ఠ చేసిన తరువాత పాత విగ్రహాలను అత్యంత శాస్త్రోక్తంగా గుడిలోనే కోయిల్ వైకుంఠం అన్న ప్రాంగణంలో ఖననం చేస్తారు.. ఇక్కడ స్వామి తన పాత శరీరాన్ని విడిచి కొత్త శరీరంలోకి ప్రవేశించాడు.. ఇది దేవుడికి మరణం కాదు.. జీవుడు తన దేహాన్ని మార్చుకోవటమే ఈ నవకళేవరలోని ప్రధాన అంశం. ఇప్పటి వరకు 17సార్లు పూరీలో నవ కళేవర కార్యక్రమం జరిగింది. చివరి సారి 1996లో







*పూరీ జగన్నాథుడి నవకళేవర కార్యక్రమంలో భాగంగా విగ్రహాల తయారీకి గుర్తించిన సుదర్శన చక్రం, శంఖం ఉన్న చెట్లు.. వాటి సమీపంలో విషపాము కనిపించిన దృశ్యం.. వాటిని నరికి పూరీకి తరలిస్తున్న దృశ్యాలు..*

జరిగింది. రథయాత్ర కంటే ఈ కార్యక్రమానికి లెక్కించలేనంత మంది భక్తులు హాజరవుతారు.. శరీరంలో జీవుడు ప్రవేశించి, ఆ తరువాత బయటకు వచ్చి మరో శరీరంలో ఎలా ప్రవేశిస్తాడో.. జగద్గురువు ఇక్కడ బోధిస్తున్నాడు.. పునరపి జననం.. పునరపి మరణంలోని రహస్యార్థం ఇదే. ఆయన రథంపై స్థిరంగా కూర్చుని తిరగడం కూడా ఇలాంటిదే.. జీవుడిలోపల గూడు కట్టుకుని ఉండిపోయి, అతనికి మార్గదర్శనం చేస్తున్నాడు.. రాముడు తాను చేసి చూపించాడు.. కృష్ణుడు చెప్పి చేయించాడు.. అందుకే ఈయన జగద్గురువు అయ్యాడు.. పూరీలో ఆయన చూపించిందీ, చూపిస్తున్నదీ అంతా జీవ రహస్యమే.. కృష్ణం వందే జగద్గురుమ్.



# కృష్ణుడు నిజమా? అబద్ధమా?

*శ్రీకృష్ణుడు నిజమా? అబద్ధమా? ఏలియనా? ఇదొక విచిత్రమైన ప్రశ్న.. కానీ ఈ ప్రశ్నకు ఎవరైనా జవాబు చెప్పగలరా? శ్రీకృష్ణుడు నిజంగా భూమ్మీద పుట్టాడా? లేదా? పుడితే ఎప్పుడు పుట్టాడు? ఎన్నేళ్లు ఈ భూమ్మీద ఉన్నాడు? ఇవన్నీ ఎవరికైనా తెలుసా? భాగవతంలో.. భారతంలో శ్రీకృష్ణుడి గురించి చాలా చాలా కథలు ఉన్నాయి. పుట్టినప్పటి నుంచీ కురుక్షేత్ర సంగ్రామం దాకా రకరకాల లీలలతో అలరించిన వాడు కృష్ణుడు. అవన్నీ నిజమేనా? లేక కృష్ణుడు గ్రహాంతర వాసా?*

**ఇం**తకీ కృష్ణుడు నిజమా అబద్ధమా అన్న డౌట్ ఎందుకొచ్చింది? మీకు తెలిస్తే చెప్పండి.. లేకుంటే ఆలోచించండి.. అదీ కష్టమనుకుంటే ఈ వ్యాసం చదవండి..

శ్రీకృష్ణుడు ఎవరు? ఒక ప్రశ్నకు.. వంద జవాబులు చెప్పవచ్చు... ప్రేమకు ఓ ఆకారాన్ని కల్పిస్తే దాని పేరు కృష్ణుడు.. ఉదాత్తమైన ప్రేమ భావుకులు రాధాకృష్ణులు. గోపికల శ్వాస.. ప్రాణాలు అన్నీ కృష్ణుడే.. కుచేలుడికి ఓ మంచి స్నేహితుడూ కృష్ణుడే.. జగత్తుకే గొప్ప గురువు.. భగవద్గీతను అందించిన గీతాచార్యుడు. అంతకుమించి రాజనీతిజ్ఞుడు, రణతంత్రవేత్త.. విజయుడికి సారథి.. విజయానికే సారథి. తాను ఆయుధం పట్టకుండానే పాండవులకు విజయాన్ని కట్టబెట్టిన థింక్‌ట్యాంక్. పుట్టినప్పటి నుంచే మృత్యువుతో చెలగాటమాడిన వాడు. తాను చెప్పినట్టల్లా మృత్యువును ఓ ఆటాడించిన వాడు. కానీ, ఆయన ఓ ఏలియన్ అంటే ఓ గ్రహాంతర వాసి అంటున్నారు..... ఇదీ ఇప్పుడు ప్రపంచమంతటా జరుగుతున్న చర్చ.. దీనిపై తెగ పరిశోధనలు జరుగుతున్నాయి. ఇందులో ఏది నిజం..? దేవుడా.. గ్రహాంతరవాసా? అసలు ఆయన అస్తిత్వం నిజమా? అబద్ధమా?

భాగవతం.. మహాభారతం.. శ్రీకృష్ణుడి ఉనికిని చాటే రెండు ఇతిహాసాలు.. భాగవతంలో శ్రీకృష్ణుడి కథ ప్రధానంగా ఉన్నా.. రకరకాల కథనాల సమాహారమది.. మహాభారతం తెలిసిందే.. కురుపాండవుల కథ.. ఈ రెంటిలోనూ కీలక పాత్రధారి కృష్ణుడే. మనకు తెలిసినంత వరకు ఈ కృష్ణుడు చిన్ననాటి నుంచే చాలా లీలలు చూపించాడు. పసివాడుగా ఉన్నప్పుడే పూతనాది రాక్షసులను హతమార్చాడు. రేపల్లె ప్రజలను కాపాడాడు. పెద్దవాడైన తరువాత పాండవుల పక్షాన నిలుచుని కురుక్షేత్ర సంగ్రామాన్ని అంతా తానే అయి నడిపించాడు. ఎవరిని ఎప్పుడు ఎక్కడ ఎలా ఏం చేయాలో బాగా తెలిసిన వాడు కాబట్టే జగద్గురువు అయ్యాడని అంతా పూజిస్తున్నాం.

కానీ, కృష్ణుడిని గ్రహాంతర వాసి అంటే హిందూ ధార్మిక వాదులు విశ్వసించరు. హేతువాదులు అస్సలు నమ్మరు. అసలు దేవుడనే కాన్సెప్ట్‌కే వ్యతిరేకం అయినప్పుడు ఎక్స్‌ట్రా టెర్రెస్ట్రియల్ ఆబ్జెక్ట్స్‌ను ఒప్పుకోవటం ఎలా సాధ్యపడుతుంది? వీటన్నింటినీ ఫాంటసీ స్టోరీలుగా చెప్పుకోవటమే విచిత్రం. కృష్ణుడు భారతీయులకు సంబంధించిన, భారతీయతకు సంబంధించిన అపురూపమైన చరిత్ర. కృష్ణుడికి సంబంధించిన అనేక రకాల ఆధారాలు ఎవరో విదేశీ ఓషనోగ్రాఫిక్ సైంటిస్టులకు దొరికితే కానీ నమ్మలేని దురదృష్టమైన పరిస్థితి నెలకొనటం ఈ దేశంలో ఉండిపోయింది. ఇవిగో కృష్ణుడి ఉనికిని చాటే ఆనవాళ్లు ఇవి అని చెప్పుకోవాల్సిన పరిస్థితి మనది..

ఈ కృష్ణుడు గ్రహాంతర వాసులతో రాకపోకలు సాగించారా? యుద్ధం చేశాడా అన్నది తెలియదు. కానీ, ఎక్స్‌టా టెర్రెస్ట్రియల్ ఆబ్జెక్ట్స్‌తో కృష్ణుడికి స్పష్టమైన సంబంధాలు వున్నట్లు ఆస్ట్రో సైంటిస్టులు భావిస్తున్నారు. కృష్ణుడు అబద్ధం కాదు.. నిజమేనన్న అంచనాకు వచ్చేశారు.

హిందూయిజానికి సంబంధించిన గ్రంథాలు.. కథలు.. పుక్కిటి పురాణాలుగా వేల

ఏళ్లుగా చర్చించటానికి కారణాలు చాలానే ఉన్నాయి. హేతువాదులు వీటిని నమ్మరు. అంగీకరించరు. ఇదమిత్థమైన చారిత్రక ఆనవాళ్లు ఏవీ దొరకలేదన్న కారణంతో నిక్కచ్చిగా తిరస్కరిస్తారు. ఈ పద్ధతి భారతీయ హేతువాదులకే చెల్లింది. కానీ, ఆస్ట్రోనాట్ సైంటిస్టుల లెక్కలు రామాయణ, భారత కాలాన్ని ఖచ్చితంగా నిర్ధారిస్తున్నాయి. భారత భాగవతాల్లో అనేక లీలలను ప్రదర్శించిన శ్రీకృష్ణుడి చరిత్ర వాస్తవమేనని ఖచ్చితంగా చెప్తున్నాయి. ఇప్పుడు ఆస్ట్రో సైంటిస్టుల వాదనా ఇందుకు అనుకూలంగానే స్పష్టమైంది.

భారత రామాయణాలను ఇప్పటికీ కేవలం కావ్యాలుగానో, ఇతిహాసాలుగానో పరిగణించటం తప్ప చరిత్రగా చెప్పుకోవటానికి మనలో మనకే బోలెడు విభేదాలు, భిన్నాభిప్రాయాలు. అంతర్జాతీయ స్థాయిలో సైతం దీనిపై పెద్ద ఎత్తున పరిశోధన జరిగింది. ఎందుకంటే మన నాగరికతకు.. సంస్కృతికి మూలాలు ఇవే కాబట్టి వీటి రహస్యాన్ని ఛేదించటం అవసరమైంది. రష్యా, గ్రేట్ బిటన్, దక్షిణ అమెరికాలకు చెందిన సైంటిస్టులు మహాభారత కాలాన్ని ఖచ్చితంగా తేల్చారు. ఈ లెక్కల ప్రకారం మహాభారతం నేటికి సరిగ్గా 5240 సంవత్సరాలకు ముందు జరిగింది.

శ్రీకృష్ణుడు ఎప్పుడు పుట్టాడన్నది భాగవతంలోని పదవ స్కంధంలో వివరంగా ఉంది. శ్రావణ మాసం, కృష్ణపక్షం, అష్టమి తిథి, రోహిణీ నక్షత్రం ఉన్న సమయంలో శ్రీకృష్ణుడు మధురలోని కంసుడి జైలులో జన్మించాడు. భూమధ్య రేఖకు 27.25 డిగ్రీల ఉత్తర అక్షాంశం, 77 డిగ్రీల తూర్పు రేఖాంశంపై ఉన్న ప్రదేశంలో జగన్నాథుడు పుట్టాడు.

ఆయన జన్మించిన సమయంలో వివిధ గ్రహాలు రకరకాల డిగ్రీల్లో సంచరిస్తున్నాయి. సూర్యుడు 139.48 డిగ్రీల కోణంలో ఉన్నాడు. చందుడు 42 డిగ్రీల కోణంలో.. అంగారకుడు 91 డిగ్రీల కోణంలో, బుధుడు 152 డిగ్రీలలో, గురువు 148, శుక్రుడు 104, శని 224 డిగ్రీల కోణాల్లో సంచరిస్తున్నారు. శ్రీకృష్ణుడు పుట్టినప్పుడు చంద్ర మహాదశ నడుస్తోంది. ఈ గణాంకాలను ఆధారం చేసుకుని శ్రీకృష్ణుడి జన్మకాలాన్ని లెక్కిస్తూ వెళ్లారు. ఈ పరిశోధనల సారాంశం ప్రకారం శ్రీకృష్ణుడు క్రీస్తుపూర్వం 3228, జూలై 19 బుధవారం నాడు జన్మించాడు. ఈ భూమ్మీద మొత్తం 125 సంవత్సరాలు జీవించి తిరిగి తన లోకానికి వెళ్లిపోయాడు. ఈ 125 సంవత్సరాలలో ఆయన చూపించిన లీలలు.. చేసిన కార్యాలు అన్నీ ఇన్నీ కావు.. ఒక మనిషి సామాన్యుడిగా జన్మించి మహానుభావుడిగా ఎదిగిన తీరుకు శ్రీకృష్ణుడు రోల్‌మోడల్‌గా నిలిచాడు.

కృష్ణుడి కాలనిర్ణయంపై ఒకటిన్నర దశాబ్ద కాలంగా పెద్ద చర్చే జరుగుతోంది. వాదోపవాదాలు జరిగాయి. ఆస్ట్రో సైంటిస్టుల రీసర్చ్‌ను కాదన్న వాళ్లూ ఉన్నారు. కానీ, చివరకు కృష్ణుడు కేవలం ఒక కేరెక్టర్ కాదు.. ఆయన ఒక చరిత్ర.. ఒక గొప్ప సమాజపు నాగరికతా వికాసానికి మూలపురుషుడని నిర్ధారణ అయింది.

జ్యోతిష్యం ప్రకారమైనా, ఆస్ట్రో థియరీ ప్రకారమైనా శ్రీకృష్ణుడు క్రీస్తు పుట్టడానికి 3228 సంవత్సరాలకు ముందు జూలై 19 బుధవారం మధుర లోని కంసుడి జైల్లో జన్మించాడు. అంటే ద్వాపర యుగం ప్రారంభమైన తరువాత 8 లక్షల 63వేల 874వ సంవత్సరం అయిదో నెల 22వ రోజున కృష్ణుడు పుట్టాడన్నమాట. ఇందులో ఇప్పుడిక వివాదాలకు తావు లేదు. పుట్టడం తోనే చావుతో పోరాడాల్సిన పరిస్థితి కృష్ణుడిది. జన్మించిన వెంటనే కంసుడు చంపేస్తాడన్న భయంతో మధుర నుంచి రాత్రికి రాత్రి గోకులానికి పారిపోవలసి వచ్చింది. తండ్రి వసుదేవుడు అతణ్ణి గోకులానికి తరలించిన తరువాత ఆయన యశోదాదేవి దగ్గర పెరిగాడు. గోకులంలో కూడా కృష్ణుడు ఎక్కువకాలం వుండలేక పోయాడు. ఆయన అక్కడ పెరిగింది జస్ట్ మూడు సంవత్సరాల నాలుగు నెలలు మాత్రమే. ఈ మూడేళ్ల కాలంలోనే కృష్ణుడిపై చాలా సార్లు హత్యాయత్నం జరిగింది. పూతన, శకటాసురుడి లాంటి వాళ్లు బాలకృష్ణుణ్ణి చంపేందుకు ప్రయత్నించారు. వీటి ఆనవాళ్లు మనకు ఇప్పటికీ మధురకు దగ్గర్లోని గోకులంలో కనిపిస్తాయి.

క్రీస్తు పూర్వం 3225 నవంబర్–డిసెంబర్ల మధ్యన కృష్ణుడిని గోకులం నుంచి బృందావనానికి తరలించారు. అక్కడ మరో నాలుగేళ్ల పాటు ఎదిగాడు. ఇక్కడే ఆయన ముగ్గురు రాక్షసులను చంపాడు. ఏడేళ్ల వయసు వచ్చేసరికి బృందావనానికి దగ్గర్లో ఉన్న నంద్గావ్కు కృష్ణుడు చేరుకున్నాడు. పదో ఏడు వచ్చేంత వరకూ కృష్ణుడు అక్కడే వున్నాడు. ఈ మధ్య కాలంలోనే ఆయన గోపికలకు బృందావనంలో రాసలీలలను చూపించాడు. అపురూపమైన మధుర భక్తిని రుచి చూపించాడు. నంద్గావ్లో ఉన్న సమయంలోనే ఆయన తన ప్రజల్ని కాపాడటానికి గోవర్ధనగిరి పర్వతాన్ని ఎత్తాడు. ఆ పర్వతం ఇప్పటికీ మనకు అక్కడ కనిపిస్తుంది. ఇక్కడికి వెళ్లినవారు ఈ గిరి ప్రదక్షిణం చేయకుండా రారు. కృష్ణుడికి పదేళ్ల వయసు వచ్చేసరికి దాదాపు ఏడుగురు రాక్షసులను హతమార్చాడు. వీళ్లంతా కంసుడు పంపించిన వాళ్లే.. దీంతో కంసుడు తానే రంగంలోకి దిగాడు. బలరామకృష్ణులను రాయబారం చేసి తిన్నగా తన మధురకు రప్పించుకున్నాడు. అప్పటికి కృష్ణుడి వయసు సరిగ్గా 10 సంవత్సరాల ఎనిమిది నెలలు.

కంసుడి మధురకు కృష్ణుడు వెళ్లింది క్రీస్తుపూర్వం 3216 మార్చి నెలలో.. చైత్ర శుక్ల ఏకాదశి నాడు ఆయన మధురలో ప్రవేశించాడు. రెండు రోజుల తరువాత అంటే చతుర్దశి రోజున కంసుడిని హతమార్చాడు. కంసుడిని చంపిన తరువాత కృష్ణుడు మధురలోనే వున్నాడు. తల్లిదండ్రులను చెరవిడిపించిన తరువాత వారితోనే ఉండిపోయాడు. అయినా బృందావనానికి అప్పుడప్పుడూ వెళ్లి వస్తుండేవాడు. అక్కడే ఆయన అద్భుతమైన రాసలీలలను ప్రదర్శించాడు. గోపికలు ఆయన పట్ల వివశులైపోయారు. అన్నీ వదిలేసి కృష్ణుడి కోసం వచ్చేశారు. ఆ బృందావనానికి పట్టమహిషి రాధ. ఉజ్వల రసవైచిత్రికి బృందావనం ఒక భూమికగా నిలిచింది. ఆయనకు పదిహేను సంవత్సరాల వయసు వచ్చేంత వరకూ

రాసలీలలు కొనసాగాయి. ఆ తరువాత ఆయన చదువు కోసం గురువు సాందీపని దగ్గరకు వెళ్లాల్సి వచ్చింది. అప్పటికి ఆయన వయస్సు సరిగ్గా 15 సంవత్సరాల 9 నెలల 7 రోజులు. ఆనాటికి రాధాదేవి వయస్సు 14 సంవత్సరాల 2 నెలల 15 రోజులు.

క్రీస్తుపూర్వం 3212 ఏప్రిల్ 26వ తేదీన శ్రీకృష్ణుడు విద్యాభ్యాసాన్ని సాందీపని గురువు దగ్గర ప్రారంభించాడు. దాదాపు పదేళ్ల పాటు ఆయన చదువు కొనసాగించాడు. తనకు 28 సంవత్సరాల 4 నెలల వయసు వచ్చే వరకు కృష్ణుడు మధురలోనే ఉన్నాడు.

అప్పుడే మగధ రాజు జరాసంధుడితో గొడవ వచ్చిపడింది.. దీంతో తన ప్రజల్ని కాపాడేందుకు అరేబియా సముద్ర తీరంలో ద్వారకను నిర్మించాడు. క్రీస్తుపూర్వం 3199 నవంబర్‌లో కృష్ణుడు మధురను వదిలి ద్వారకకు తన ప్రజలతో సహా తరలిపోయాడు... అయితే ద్వారకకు వెళ్లడానికి ముందే శిశుపాలుడు, అతని తమ్ముడు దంతవక్త్రులను హతమార్చాడు.. ద్వారకకు వెళ్లిపోయే ముందు రెండు నెలల పాటు బృందావనానికి వచ్చి అక్కడ గోపికలతో గడిపి తిరిగి వెళ్లిపోయాడు.

ద్వారకకు వెళ్లిన తరువాతే కృష్ణుడు రుక్మిణి సహా ఎనిమిది మంది భామలను వివాహం చేసుకున్నాడు. ద్వారకలో ఆయన గడిపింది 96 సంవత్సరాల ఎనిమిది నెలలు. కృష్ణుడి 90 సంవత్సరాల వయసులో అంటే క్రీస్తుపూర్వం 3138లో కురుక్షేత్ర యుద్ధం జరిగింది. యుద్ధం ముగిసేనాటికి ఆయన వయస్సు 89 సంవత్సరాల రెండు నెలల ఏడు రోజులు. అంటే మహాభారత యుద్ధం ముగిసింది క్రీస్తుపూర్వం 3138 సెప్టెంబర్ 26న. ఆ తరువాత మరో 35 సంవత్సరాల పాటు బలరామ కృష్ణులు ఈ భూమ్మీద ఉన్నారు. క్రీస్తుపూర్వం 3102 ఫిబవరి 18 శుక్రవారం మధ్యాహ్నం రెండు గంటల 27 నిమిషాల 30 సెకన్లకు కృష్ణుడు శరీరాన్ని విడిచిపెట్టి తన లోకానికి వెళ్లిపోయాడు. ఆర్కియాలజిస్టులు మన దేశంలో ఉండి నిర్ధారించిన అంశాలివి. ప్రపంచంలో ప్రాచీన చరిత్రను, సంస్కృతిని, నాగరికతను శిథిలాల ద్వారా, వాటి డిఎన్ఏల ద్వారా నిర్ధారించటానికి ఆర్కియాలజీ పద్ధతులు శాస్త్రీయంగా ఉన్నాయి.. వాటినే ఉపయోగించి వాళ్లు చెప్పిన అంశాలే ఇవి... ఇవన్నీ రికార్డెడ్ వర్షన్స్ కూడా ఉన్నాయి.

మన కల్చర్‌ను నమ్మక పోవటం.. తర్కానికి అందటం లేదంటూ అందంగా వ్యాఖ్యానించటం జనరల్‌గా ఓ ఫ్యాషన్.. ఇప్పటికైనా మన మూలాలను తెలుసుకుని అవగాహన చేసుకునే ప్రయత్నం చేయాలన్న అవసరాన్ని గుర్తిస్తే ఈ తరానికి మంచిది.

# మహాసాగరంలో మహానగరం

*ఈ తరానికి  కృష్ణుడంటే రొమాన్స్, లవ్‌కు వన్ అండ్ ఓన్లీ గాడ్‌గా మాత్రమే పరిచయం.. అదిగో దట్ లెజండరీ కింగ్ మేకర్ శ్రీకృష్ణుడు నిర్మించిన గొప్ప నగరం ద్వారక... ఇవాళ్టి మెట్రో, కాస్మో పాలిటన్ అని చెప్పుకునే మహా మహా నగరాలకు వంద రెట్లు గొప్పదైన నగరం... అయిదువేల ఏళ్ల నాడే అద్భుతాల్ని సృష్టించిన అపూర్వ నగరం... లక్షల రాజభవనాలు.. లక్షణమైన నిర్మాణాలు... సాగరమధ్యగా వెలసిన ద్వారక.. ఇవాళ సాగర గర్భంలో కనిపిస్తోంది.. అయిదు వేల ఏళ్ల తరువాత కూడా చెక్కుచెదరని మహానగరం ద్వారక..*

**జూ**న్ 2001 .. భారత్‌కు పశ్చిమాన అరేబియా మహా సముద్రం.. తీరానికి సరిగ్గా ఏడు మైళ్ల దూరంలో సముద్రపు లోతుల్లో ఇండియన్ ఓషియానిక్ రీసర్చ్ యూనిట్‌కు చెందిన పరిశోధకులు సముద్ర మథనం ప్రారంభించారు.

చాలా లోతుల్లోకి వెళ్లిన తరువాత విశాలమైన రాతి కట్టడాల ప్రాంగణం ఒకటి కనిపించింది. 5వేల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో ఓ మహానగరపు శిథిలపు ఆనవాలు కనిపించింది. సుమారు 170 అడుగుల ఎత్తైన గోడల నిర్మాణంతో అపూర్వమైన నగరపు గుర్తులు బయటపడ్డాయి. వేల సంవత్సరాల నాటి నగరంగా దీన్ని శాస్త్రవేత్తలు గుర్తించారు. అత్యంత ప్రాచీనమైన శిథిల చిహ్నాలివి.. సుమారు 32వేల సంవత్సరాల నుంచి 9 వేల సంవత్సరాల మధ్య కాలం నాటివిగా వీటిని గుర్తుపట్టారు.

మహాభారత కాలం నాటి కంటే కూడా చాలా చాలా ముందు కాలం నాటివి ఇవి.. ఆ తరువాత మూడు సంవత్సరాలకే ఈ శిథిల నగరం బయటపడిన రెండు వందల మైళ్ల దూరంలో ఆధునిక ద్వారక సాగరతీరంలో జస్ట్ 70 అడుగుల లోతులోనే ఇసుకరాతి గోడ ఒకటి బయటపడింది. దాని అంచులను పట్టుకుని వెళ్లిన కొద్దీ కృష్ణుడి ద్వారక వెలుగులోకి వచ్చింది. ఆర్కియాలజిస్టులు వెతికిన కొద్దీ సంపన్నమైన నాగరికతకు సంబంధించిన గుర్తులు బయటపడుతూ వచ్చాయి. అంతా కూడుకుని చూస్తే సముద్ర గర్భంలో వెలిసిన మహానగరంగా గుర్తించారు. మహాభారత కాలం నాటి ద్వారక సిటీ ఇదేనని నిర్ధారించారు. ఇది చాలా పవర్‌ఫుల్ సిటీ.. కృష్ణుడు పరిపాలించిన నగరం ఇది. ఈ నగరాన్ని నిశితంగా గమనించినప్పుడు ఆస్ట్రోనాట్ సైంటిస్టులు ఆశ్చర్యపోయారు. 1940లలో లభించిన ఏలియన్ టెక్నాలజీని మించిన టెక్నాలజీ ఈ నగరంలో కనిపించింది. అంతే కాదు స్పేస్ క్రాఫ్ట్ ఆనవాలు కూడా దొరికింది. ఈ స్పేస్‌క్రాఫ్ట్ ద్వారా పిడుగుపాటు శక్తి కలిగిన పవర్‌ఫుల్ వెపన్స్‌ను కూడా వినియోగించినట్లు ఆధారాలు లభించాయి.సాగర



A circular bastion of submerged fort wall of Dvārakā.



A long wall plotted and photographed by diver-archaeologists.

**192 కిలోమీటర్ల పొడవు...192 కిలోమీటర్ల వెడల్పు.. 36,864 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం..బారులు తీరిన వీధులు..వీధుల వెంట బారులు తీరిన చెట్లు..రాయల్ ప్యాలెస్‌లు..రెసిడెన్షియల్ కాంప్లెక్స్‌లు.. కమర్షియల్ మాల్స్.. కమ్యూనిటీ హాల్స్.. క్రీస్తుపూర్వం అయిదు వేల సంవత్సరాల నాడే అపూర్వ మహానగరం. రత్నస్తంభాలు.. వజ్ర తోరణాలు.. సాటిలేని ఆర్కిటెక్చర్.. సముద్రం మధ్యలో మహా నిర్మాణం.. జగన్నాథుడి జగదేక సృష్టి.. క్రీస్తుపూర్వం 4000 సంవత్సరాల నాటి లెజెండ్ సిటీ... ద్వారక.. ఇప్పుడు సాగర గర్భంలో మన ప్రతిభకు పట్టం కట్టిన నాటి కాస్మోపాలిటన్ సిటీ..ద్వారక**

గర్భంలో లభించిన ఈ మహానగర విస్తీర్ణాన్ని.. విశేషాలను గమనించినప్పుడు అబ్బురపరిచే అనేక అంశాలు వెలుగులోకి వచ్చాయి.

192 కిలోమీటర్ల పొడవు...192 కిలోమీటర్ల వెడల్పు.. 36,864 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం.. బారులు తీరిన వీధులు.. వీధుల వెంట బారులు తీరిన చెట్లు.. రాయల్ ప్యాలెస్‌లు.. రెసిడెన్షియల్ కాంప్లెక్స్‌లు.. కమర్షియల్ మాల్స్.. కమ్యూనిటీ హాల్స్.. అయిదు వేల సంవత్సరాల నాడే అపూర్వ మహానగరం.. రత్నస్తంభాలు.. వజ్ర తోరణాలు..సాటిలేని ఆర్కిటెక్చర్.. సముద్రం మధ్యలో మహా నిర్మాణం.. జగన్నాథుడి జగదేక సృష్టి.. క్రీస్తుపూర్వం 4000 సంవత్సరాల నాటి లెజెండ్ సిటీ... ద్వారక.. ఇప్పుడు సాగర గర్భంలో మన ప్రతిభకు పట్టం కట్టిన నాటి కాస్మోపాలిటన్ సిటీ.. ద్వారక

అవును, రామాయణం నిజం.. మహా భారతం నిజం.. ద్వాపర యుగం నిజం.. వేల ఏళ్ల నాటి మన సంస్కృతి నిజం.. అద్భుతమైన మన నాగరికత నిజం.. అపూర్వమైన మన సైన్స్ నిజం.. సాటి లేని మన ఇన్వెన్షన్స్ నిజం.. ఇందుకు ఈ సముద్ర గర్భంలో కనిపిస్తున్న మహానగరమే తిరుగులేని ఉదాహరణ.. ఒక్కమాటలో చెప్పాలంటే.. ద్వారక.. గోల్డెన్ సిటీ ఆఫ్ ఇండియా.. 1980వ దశకంలో గుజరాత్ సముద్ర తీరంలో జరిగిన

పరిశోధనలు భారతీయ చారిత్రక నిర్మాణంలో అపూర్వ ఘట్టాన్ని ఆవిష్కరించింది. పశ్చిమాన గోమతి నది అరేబియా సముద్రంలో కలిసే ప్రాంతంలో సాగర గర్భంలో ఒక మహానగరం బయటపడింది.. మహాభారత కాలాన్ని, శ్రీకృష్ణుడి ఉనికిని ఈ నగరం బయటి ప్రపంచానికి చాటి చెప్పింది.. ఇదే ఇవాళ మనం చెప్పుకుంటున్న ద్వారక.. .కృష్ణుడి ద్వారక.. విశ్వకర్మ నిర్మించిన ద్వారక. ఈ తవ్వకాల్లో ఏవో చిన్న చిన్న రాళ్ల కట్టడాలు దొరికాయనుకుంటే పొరపాటే.. శిథిలాల రూపంలోనే అయినా, ఒక మహా నగరమే బయటపడింది.. సముద్రం అట్టడుగున ముందుకు వెళ్తున్న కొద్దీ.. కిలోమీటర్ల కొద్దీ, అంతమెక్కడో తెలియనంత విస్తీర్ణంలో అపురూపమైన నిర్మాణం వెలుగు చూసింది.. మన దేశంలో ప్రసిద్ధి చెందిన ఆర్కియాలజిస్ట్ ఏస్.ఆర్.రావు నేతృత్వంలో సాగిన ఈ పరిశోధనలు ఈ మహానగరాన్ని దాదాపు క్రీస్తుపూర్వం 3150 సంవత్సరాల క్రితం నాటిదిగా నిర్ధారించారు.. మహాభారత కాలంలో కృష్ణుడు నిర్మించిన ద్వారకగా స్పష్టమైంది..

కంసుడిని చంపిన తరువాత మధురను ఏలుతున్న కృష్ణుడిపై మగధ రాజు జరాసంధుడు, కాల యవనుడితో కలిసి 17 సార్లు యుద్ధం చేశాడు.. చివరకు ప్రజలకు రక్షణ కల్పించటం కోసం ఏకంగా పశ్చిమ తీరానికి వచ్చి గోమతి తీరంలో ద్వారకను కృష్ణుడు నిర్మించాడు. శ్రీకృష్ణ నిర్యాణానంతరం సునామీ రూపంలో ప్రళయం వచ్చి ద్వారక సాగర గర్భంలో కలిసిపోయింది. కాలగర్భంలో ఆనవాలే లేకుండా పోయింది. మనకంటూ చరిత్రే లేదని అనిపించేలా అదృశ్యమైంది..

ద్వారక సముద్రంలో మునిగిపోయిన తరువాత భారత్ నాగరికత కూడా మాయమై పోయింది.. మనం అన్నీ మర్చిపోయాం.. మన కల్చర్ గురించి మనకు అందించేవాళ్లే లేకుండా పోయారు. ఇప్పుడు అయిదు వేల ఏళ్ల తరువాత ఒక్కటొక్కటిగా బయటపడుతున్న మన మూలాల్ని చూస్తుంటే మనకే కాదు.. ప్రపంచ దేశాలన్నింటికీ కళ్లు బైర్లు కమ్ము తున్నాయి. ద్వారక నగరం ఆషామాషీ నగరం కానే కాదు.. ఇవాళ మనకు తెలిసిన గొప్ప గొప్ప నగరాలకంటే వెయ్యి రెట్లు అడ్వాన్స్‌డ్ మెట్రోపాలిటన్ సిటీ అని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడు పర్‌ఫెక్ట్ ప్లాన్‌తో ద్వారక నిర్మాణానికి పూనుకున్నాడు. విశ్వకర్మతో ఈ నగరాన్ని నిర్మించాడు.. గోమతి నది, సముద్రంలో కలిసే చోటును నగర నిర్మాణానికి ఎంచుకున్నాడు. ఈ నిర్మాణం కూడా అలాంటిలాంటి స్టయిల్ కాదు. ద్వారకలో అక్షరాలా తొమ్మిది లక్షల రాజభవనాలు ఉండేవి.. శ్రీకృష్ణుడి అష్ట భార్యలతో పాటు 16వేల మంది గోపికలకూ ఒక్కో రాజభవనం ఉండేదిట.. ఈ భవనాలన్నీ కూడా క్రిస్టల్స్, ఎమరాల్డ్స్, డైమండ్స్ వంటి అపురూప రత్నాలతో నిర్మించారు.. ఒక్క మాటలో చెప్పాలంటే సిటీ ఆఫ్ గోల్డ్‌గా ద్వారకను చెప్పుకోవాలి..

పొడవైన అతి పెద్ద పెద్ద వీధులు.. వీధుల వెంట బారులు తీరిన చెట్లు.. మధ్యమధ్యలో ఉద్యానవనాలు.. వాటి మధ్యలో రాజభవనాలు.. ఏ వర్గానికి ఆ వర్గం ప్రత్యేకమైన నివాస గృహాలు.. వ్యవసాయ క్షేత్రాలు.. ఒక క్రమ పద్ధతి ప్రకారం ఒక నగరం ప్రజలందరికీ



**పొడవైన అతి పెద్ద పెద్ద వీధులు.. వీధుల వెంట బారులు తీరిన చెట్లు.. మధ్యమధ్యలో ఉద్యానవనాలు.. వాటి మధ్యలో రాజభవనాలు.. ఏ వర్గానికి ఆ వర్గం ప్రత్యేకమైన నివాస గృహాలు.. వ్యవసాయ క్షేత్రాలు.. ఒక క్రమ పద్ధతి ప్రకారం ఒక నగర ప్రజలందరికీ ఎలాంటి సౌకర్యాలు ఉండాలో.. అలాంటి సౌకర్యాలన్నింటితో నిర్మించిన ఏకైక నగరం ద్వారక.. నగర నిర్మాణం ఇళ్లు, వీధుల నిర్మాణంతోనే అయిపోయిందనుకుంటే పొరపాటే.. మహానగరంలో ఎక్కడ కమర్షియల్ జోన్లు ఉండాలో, ఎక్కడ రెసిడెన్షియల్ జోన్లు ఉండాలో ఇప్పుడు మాస్టర్ ప్లాన్లు వేస్తున్నారు.. ఇప్పటికే కట్టిన నిర్మాణాలను ఎలా తొలగించాలో తెలియక సిగపట్లు పడుతున్నారు.. కానీ, ద్వారకలో ఆనాడే ఇవన్నీ ఉన్నాయి.. కమర్షియల్ జోన్లు, ప్లాజాలు, అవసరమైన ప్రతిచోటా పబ్లిక్ యుటిలిటీస్, భారీ షాపింగ్ మాల్స్ అన్నీ ఉన్నాయి..**

ఎలాంటి సౌకర్యాలు ఉండాలో.. అలాంటి సౌకర్యాలన్నింటితో నిర్మించిన ఏకైక నగరం ద్వారక. నగర నిర్మాణం ఇళ్లు, వీధుల నిర్మాణంతోనే అయిపోయిందనుకుంటే పొరపాటే. హైదరాబాద్ మహానగరంలో ఎక్కడ కమర్షియల్ జోన్లు ఉండాలో, ఎక్కడ రెసిడెన్షియల్ జోన్లు ఉండాలో ఇప్పుడు మాస్టర్ ప్లాన్లు వేస్తున్నారు. ఇప్పటికే కట్టిన నిర్మాణాలను ఎలా తొలగించాలో తెలియక సిగపట్లు పడుతున్నారు. కానీ, ద్వారకలో ఆనాడే ఇవన్నీ వున్నాయి.. కమర్షియల్ జోన్లు, ప్లాజాలు, అవసరమైన ప్రతిచోటా పబ్లిక్ యుటిలిటీస్, భారీ షాపింగ్ మాల్స్ అన్నీ ఉన్నాయి.

బ్యూటీకే.. బ్యూటీ... అందమైన గార్డెన్‌లు, పూల సువాసనలు, సరస్సులతో ద్వారక గోల్డెన్ సిటీ ఆఫ్ ఇండియాగా అలరారిందనటంలో సందేహం లేదు. రామాయణ కాలంలో

రావణుడి ఎయిర్‌పోర్ట్‌లు బయటపడ్డాయి. అతని ఆర్కిటెక్చర్ నైపుణ్యం వెలుగులోకి వచ్చింది. భారత కాలంలో ద్వారక శ్రీకృష్ణుడి దార్శనికతకు దర్పణం పట్టింది. భారత దేశంలో వేల ఏళ్ల నాడే అపూర్వ నాగరికత ఉన్నదన్న వాస్తవాన్ని ప్రపంచానికి చాటి చెప్పింది.. కాలగర్భంలో కలిపేందుకు చూసినా కలిసేది కాదని నిరూపించింది..

న్యూయార్క్ సిటీ, వాషింగ్టన్ డిసి, లండన్, మాస్కో, బీజింగ్, టోక్యో, ముంబయి వంటివన్నీ ఇవాళ ప్రపంచం గొప్పగా చెప్పుకునే, చాటుకునే మహానగరాలు.. మెట్రో పాలిటన్ సిటీలు.. కాస్మోపాలిటన్ సిటీలు.. ఏళ్ల తరబడి కష్టపడితే తప్ప ఇవాల్టి రూపానికి రాలేని నగరాలు. ఈ మెట్రో, కాస్మోపాలిటన్‌లకు వేల రెట్లు అడ్వాన్స్‌డ్ అభివృద్ధితో అపురూప నగర నిర్మాణం ఆనాడే జరిగింది. అదే ద్వారక.. ఇక్కడ కేవలం కమర్షియల్ జోన్లు ఏర్పాటు చేయటమే కాదు. సాగర తీరంలో గొప్ప హార్బర్‌ను కూడా యాదవ రాజులు సక్సెస్‌గా నిర్వహించారు. గ్రీకు, ఇతర దేశాలతో నౌకల ద్వారా అంతర్జాతీయ వర్తకం కూడా చేసినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. ప్రముఖ ఆర్కియాలజిస్ట్ ఎస్ఆర్ రావు పరిశోధనల్లో ద్వారక ఆరు ప్రధాన రంగాల్లో అభివృద్ధిని సాధించిందని ధృవీకరించారు. ద్వారకను ద్వారామతి, ద్వారావతి, కుశస్థలిగా పిలిచేవారని కూడా తేల్చారు. క్రీస్తుపూర్వం 3138లో మహాభారత యుద్ధం జరిగింది. యుద్ధం జరిగిన తరువాత 35 సంవత్సరాల పాటు శ్రీకృష్ణుడు ద్వారకలోనే ఉన్నాడు. ఆ తరువాత యాదవ రాజుల మధ్య పరస్పరం గొడవలతో ఒకరికొకరు చంపుకున్నారు. తరువాత కొంతకాలానికే శ్రీకృష్ణుడు దేహ పరిత్యాగం చేసి భూమిని విడిచివెళ్లిపోయాడు. ఈ భూమిపై కృష్ణుడు నివసించింది 125 సంవత్సరాలు. కృష్ణ నిర్యాణానంతరం ద్వారకను సముద్రం ముంచివేసింది. సాగరం ఉవ్వెత్తున ఎగిసి వస్తుంటే తాను ప్రత్యక్షంగా చూసినట్లు అర్జునుడు మహాభారతంలో చెప్తాడు.

సాగర గర్భంలో మునిగిపోయింది మునిగిపోగా.. తీరం వెంట కూడా ద్వారకకు సంబంధించిన, కృష్ణుడి రాజ్యానికి సంబంధించిన ఆనవాళ్లు లభించాయి. ప్రస్తుతం కనిపించే ద్వారకాధీశ్ ఆలయం కూడా కృష్ణుడి మనవడు వజ్రనాభుడే నిర్మించినట్లు చరిత్ర చెప్తోంది... అసాధారణ భారతీయ ప్రతిభకు, నాగరికతకు, సంస్కృతికి ఎవరెస్ట్ శిఖరమంత కీర్తి, కృష్ణ ద్వారక.

# సత్యభామ

*అహంకారం ఆమె అందం..*
*అభిమానం ఆమె నడత*
*విజయం ఆమెకు వెన్నెతో పెట్టిన విద్య*
*సబలకు ఆమె ఓ రోల్‌మోడల్*
*సమాజాన్ని ఎదిరించిన*
*వారియర్, సా(త్రాజితి*



ఆమెను అంతా అహంకారి అన్నారు.. మొగుణ్ణి కొంగున ముడేసుకుందన్నారు.. పెంకిపెళ్లామని ఈసడించుకున్నారు.. ముక్కుమీదే కోపం ఉందన్నారు. మొగుణ్ణి అమ్మేసిన జాణ అని తిట్టుకున్నారు. కుటుంబం పట్ల సరిగా వ్యవహరించలేదన్నారు. సవతులను అవమానించిందని ఆగ్రహించారు. మహిళాలోకంలో ఆమె ఓ నెగెటివ్ కేరెక్టర్.. ద్వాపర యుగంలో ఆమె కథ ఓ స్పెషల్ ఎపిసోడ్.. నిలువెత్తు బంగారం లాంటి నెరజాణ.. సత్రాజిత్తు కుమార్తె.. సత్యభామ.. ఎ రియల్ విమెన్ వారియర్..

సత్యభామ. పేరు చెప్పగానే మనకు ముందుగా గుర్తుకు వచ్చేది అహంకారం.. ఒక మహిళ అహంభావం పతాకస్థాయికి ఆమె అచ్చమైన ఉదాహరణ. కృష్ణుడి అష్టభార్యల్లో తీవ్రమైన లక్షణాలు ఉన్న వ్యక్తిగా సత్యభామ మనకు తెలుసు. నిజంగా ఆమెలో ఇంత నెగెటివ్ షేడ్ ఉందా? నిజంగానే ఆమె దురహంకారేనా? ఓ మహిళా విలన్‌గా ఆమె పాత్రను ఎలా చిత్రించారు..?

అందమైన అహంకారం, ఆ అహం నుంచి పుట్టిన అస్తిత్వం, నడకలో వాడి, నడతలో వేడి. ముక్కుసూటి. ఆమె వ్యక్తిత్వమే ఓ స్పెషల్ అట్రాక్షన్.. ఆమె సత్యభామ.. శ్రీకృష్ణుడి ముద్దుల భార్య. అష్టభార్యల్లో ముచ్చటగా మూడో భార్య.. సృష్టి సౌందర్యం అంతా రాశిగా

పోతపోసుకుని పుట్టిన ముద్దుగుమ్మ.. వేల నిర్వచనాలకైనా అందని ఆనందలక్ష్మి.. ఓటమి ఆమె ఎరుగని పదం. విజయం ఆమె హక్కు. దాన్ని సాధించటం ఆమె నైజం. భర్తనైనా ఎదిరించటం ఆమె తత్త్వం. ఆధిపత్యం పరమసోపానం.

సత్యభామ గురించి మాట్లాడుకున్నా, ఆమె పేరు ప్రస్తావనకు వచ్చిన ప్రతిసారీ ఈ విషయాలన్నీ గుర్తుకు వస్తాయి. ఎనిమిది మంది భార్యలున్నా, పదహారు వేల మంది గోపికలున్నా, అంతమందిలోనూ భర్తను కొంగున ముడివేసుకున్న మహిళగా ఆమె వ్యక్తిత్వం సుపరిచితమే. ఆమె నిటారుగా నిలబడితేనే నిలువెత్తు అహంభావానికి రూపమిచ్చి నట్లుంటుంది.. పురాణాల్లోనైనా, భాగవతంలోనైనా ఎవరితోనూ సఖ్యంగా ఉన్నట్లు మనకు కనిపించదు.. అంతా మంచి వాళ్లే, ఆమె మాత్రం దుర్మార్గురాలన్నట్లుగానే మనం వింటూ వస్తున్నాం.. ఆమె కేరెక్టర్‌ను అలాగే మన మనసుల్లో ముద్రించుకున్నాం..

సత్యభామ కేరెక్టర్ ఇంత దుర్మార్గమైందా? ఆమె తానున్న సమాజంలో అందరినీ తిరస్కరించి, అందరికీ దూరంగా ఉండిపోయిందా? సత్యభామ నిజంగా అంత ఈసడించు కోదగిందా? ఆమె ఎందుకలా ప్రవర్తించింది? ఒక మహిళగా ఆమె జీవించిన తీరు ఎందుకు ఇంతగా అభ్యంతరకరమైంది?

శ్రీకృష్ణుడితో చిన్ననాట రాసలీలలాడింది రాధాదేవి. బృందావనంలో కృష్ణుడి రసరాజ్యానికి ఆమె పట్టమహిషి.. శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుకున్న తరువాత రాధాదేవి పాత్రను పోషించింది సత్యభామే. సత్యభామ ద్వారకానాథుడి శృంగార రసాధిదేవత. ఆమెలో అహంకారమే మనకు పైకి కనిపించిన, కనిపిస్తున్న వ్యక్తిత్వం. ఆ వ్యక్తిత్వంలో మనకు తెలియని కోణాలు మరెన్నో ఉన్నాయి.

క్రీస్తుపూర్వం 3228 నాటి మాట.. మధురలో కంసుడి జైల్లో జన్మించిన కృష్ణుడి గాథ.. పదకొండో ఏట కంసుణ్ణి సంహరించిన తరువాత మధురలో ఉన్నప్పుడు అంటే 25వ ఏట రుక్మిణితో వివాహం జరిగింది. రుక్మిణితో వివాహం ఓ సంచలనం. రుక్మిణితో వివాహం తరువాత సత్రాజిత్తు తన శ్యమంతక మణిని దొంగిలించాడని కృష్ణుడిపై నిందమోపాడు. దాన్ని మాపుకోవటానికి వెళ్లి మణితోపాటు జాంబవతిని వివాహం చేసుకుని వచ్చాడు కృష్ణుడు. సత్రాజిత్తు తన తప్పును తెలుసుకుని తన కూతురు సత్యభామను కృష్ణుడి చేతిలో ఉంచి వివాహం చేశాడు. మొత్తం ఎనిమిది వివాహాలు చేసుకుని అష్టభార్యలతో సంసారం చేయటం కృష్ణుడికి మాత్రమే సాధ్యమైంది.

అష్టభార్యల్లో ఏడుగురు ఒక ఎత్తు.. సత్యభామ ఒక్కతే ఒక ఎత్తు.. ఆమె అహం ముందు మిగతా సపత్నులంతా ఓడిపోయారు.. 8 మందిలోనూ ఆమె తన ప్రత్యేకతను చాటుకుంది.. భర్తను తన వాడిగా చేసుకుంది.. సంపద, అభిమానం, పట్టుదల, భర్తపైన అపారమైన ప్రేమ కృష్ణుడిని కట్టిపడేసింది.

**సత్యభామ నిజంగా అహంకారా? ఎవరికీ రాని సందేహం ఇది. ఎందుకంటే ఆమె స్వభావంలో కనిపించేదే అద్దైనప్పుడు ఆమె ధిక్కార ధోరణిపై అనుమానం దేనికి? అందరూ తప్పులో కాలేసే చోటు ఇదే. ఎందుకంటే ఆమె వ్యక్తిత్వంలో కనిపించే అహం- అహం కాదు. ఆమె తనను తాను అసర్ట్ చేసుకునేందుకు చేసిన పోరాటానికి ఓ ప్రతిరూపం.. ఒక మహిళగా తన ఉనికిని కాపాడుకునేందుకు సమాజాన్ని ఎదిరించి నిలిచిన అసాధారణ వ్యక్తిత్వానికి బింబం.**



చివరకు ఆమె ప్రేమకు ఆయన దాసుడయ్యాడు. కృష్ణుడి భార్య సత్యభామ అని కాకుండా, సత్యాపతి కృష్ణుడనే లెవల్‌కి తన స్టేటస్‌ను పెంచుకోగలిగింది సత్యభామ. తాను అనుకున్నది సాధించటం కోసం అధికారం చెలాయించింది... ముద్దు చేసింది. మురిపాలు పోసింది. వయ్యారానికి పోయింది. కోపగించుకుంది. అలకబూనింది.. కోపంతో తలనే తన్నింది.

భర్తను తనవాడిగా చేసుకోవటం కోసం ఆయన్నే దానమివ్వటానికి కూడా వెనుకాడని మహిళ సత్యభామ. తనదైన వస్తువును, వ్యక్తిని ఇతరులెవరితోనూ పంచుకునేందుకు ఇష్టపడని అభిమానవతి.. ఇందుకోసం ఆమె దేనికైనా తెగించింది. సాహసించింది. సాధించింది. ఈ లక్షణమే ఆమెను అహంకారిని చేసింది. ఈ తెగింపే ఆమె నడతను నిందించింది. ఆమెను విలన్‌గా మార్చింది.

సత్యభామ నిజంగా అహంకారా? ఎవరికీ రాని సందేహం ఇది. ఎందుకంటే ఆమె స్వభావంలో కనిపించేదే అద్దైనప్పుడు ఆమె ధిక్కార ధోరణిపై అనుమానం దేనికి? అందరూ తప్పులో కాలేసే చోటు ఇదే. ఎందుకంటే ఆమె వ్యక్తిత్వంలో కనిపించే అహం- అహం కాదు. ఆమె తనను తాను అసర్ట్ చేసుకునేందుకు చేసిన పోరాటానికి ఓ ప్రతిరూపం.. ఒక మహిళగా తన ఉనికిని కాపాడుకునేందుకు సమాజాన్ని ఎదిరించి నిలిచిన అసాధారణ వ్యక్తిత్వానికి బింబం.

సత్యభామ వ్యక్తిత్వాన్ని ఇంతకాలం సమాజంలో ఓ వ్యతిరేక శక్తిగానే మనం చిత్రించుకుంటూ వచ్చాం. దుర్మార్గమైన మహిళగా ఉన్న సత్యభామ దురహంకారాన్ని కృష్ణుడు అణచివేసినట్లుగా చెప్పుకుంటున్నాం. కృష్ణుడి మిగతా ఏడుగురు భార్యలు చాలా మంచివారుగా, సత్యభామ మాత్రం తులసివనంలో గంజాయి మొక్కలా చెప్పుకొస్తున్నాం..

కానీ సత్యభామ వ్యక్తిత్వం వక్రీకరణ జరిగింది. మోస్ట్ అడ్వాన్స్‌డ్ విమెన్‌కు ఆమె అచ్చమైన ప్రతీక. ఇదేమిటని ఆశ్చర్యపోకండి.. ఇది తిరుగులేని నిజం. సత్యభామ తన అస్తిత్వాన్ని కాపాడుకోవటానికి విరామం లేని పోరాటం చేసిన సబల.

సత్యభామ కాలం నాటి సమాజం ఒక చిత్రమైన లక్షణం కలిగి ఉన్నది. బహు భార్యత్వాన్ని, బహు భర్తృత్వాన్ని అంగీకరించిన సమాజం. ఇందుకు ఉదాహరణ అయిదుగురు భర్తలు ఉన్న ద్రౌపది.. అష్టభార్యలున్న శ్రీకృష్ణుడు.. పైగా సమష్టి కుటుంబ వ్యవస్థ, భర్తను దేవుడితో సమానంగా చూడటం, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాల వంటివి బలంగా వేళ్లూనుకునిపోయిన సమాజం ఆనాటిది.. అలాంటి సమాజంలో మహిళగా తన ప్రత్యేకతను నిలబెట్టుకోవటం కత్తిమీద సాము లాంటిది. కృష్ణుడి అష్టభార్యల్లో రుక్మిణి, సత్యభామ మినహా మిగతావాళ్లు అబలలుగానే వెనుకబడే ఉండిపోయారు. సత్యభామ మాత్రం తనను తాను అసెర్ట్ చేసుకోగలిగింది.

ఎనిమిది మంది భార్యల మధ్య భర్తను తనవాడిగా చేసుకోవటం కోసం తాపత్రయ పడింది. ఏ భార్యకైనా భర్త తనవాడుగా ఉండాలని ఉండటం తప్పుకాదు.. సత్యభామ అదే కోరుకుంది. అలా అని అత్తమామల పట్ల కానీ, సపత్నుల పట్ల కానీ, ఆమె ఎన్నడూ అమర్యాదగా ప్రవర్తించలేదు. కాకుంటే ఆమెలోని ఈగో తన భర్తను డామినేట్ చేసే దిశగా సాగింది. అలిగైనా సరే ఆయన్ను సాధించుకుంది.

విజయవిలాసం వంటి కావ్యాల్లో, ఆ తరువాత వచ్చిన రకరకాల కథనాల్లో సత్యభామ పాత్రను రకరకాలుగా చిత్రించారు.. మగవాడి డామినేషన్‌కు కొంత వ్యతిరేకంగా వుండటంతో దాన్ని తగ్గించేందుకు, సప్రెస్ చేసేందుకు ఆమె అహంకారాన్ని అణచినట్లు, మిగతావారి పట్ల ఆమె అనుచితంగా ప్రవర్తించినట్లు కథను మార్చేశారు. వాస్తవానికి ఆమె ఆనాటికి తానున్న సొసైటీలో తన భర్త కోసం, తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటం కోసం అనుక్షణం పోరాడింది.

సాధారణంగా మహిళలో ఉండే ఆభిజాత్యమే ఆమెలోనూ ఉంది. ఎందుకంటే సత్యభామ ఆగర్భ శ్రీమంతురాలు.. రోజుకు ఎనిమిది బారువుల బంగారాన్ని ఇచ్చే శ్యమంతకమణిని వెంట తెచ్చుకున్న మహిళ.. అంతటి సంపద నుంచి వచ్చిన అహం, తామసం సహజంగానే ఆమె వ్యక్తిత్వాన్ని విశిష్టంగా మలచింది. మిగతా భార్యలందరిలోనూ ప్రత్యేకంగా నిలిచింది.

భర్తను డామినేట్ చేయటం కాదు.. భర్తపట్ల పెత్తనం చెలాయించటం కాదు.. మిగతా భార్యల కంటే తానే ఎక్కువగా ప్రేమ కురిపించింది. ముద్దు మురిపాలు చేసింది. భర్త ప్రేమను పొందటమే కాదు.. పది మందిలో తానేమిటో నిరూపించుకోవటమే సత్యభామా కలాపం. భర్తను గౌరవించటం, భర్తను దేవుడిగా పూజించటం, భర్త మాటే వేదవాక్కుగా భావించటం మాత్రమే స్త్రీ జీవితం కాదని నిరూపించింది సత్యభామ. ఆత్మాభిమానం

వుండటం అహం కాదు.. అభిమానం అంటే, ఆధిపత్యం చెలాయించటం కాదు. మొగుణ్ణి కొంగున ముడేసుకోవటం కాదు.. ప్రేమను పంచటం.. భర్త సుఖంలో, కష్టంలో పాలుపంచుకోవటం.. అతని బాధ్యతల్లో భాగం పంచుకోవటం.. అలాంటి అభిమానానికి భర్త దాసోహం అనక ఏం చేస్తాడు.. కృష్ణుడు అందుకే సత్యాపతి అయ్యాడు..

శ్రీకృష్ణుడికి 8 మంది భార్యల్లో ఏడుగురిని ఆయన ఏదో రకంగా యుద్ధం చేసి తీసుకొచ్చి వివాహం చేసుకున్నాడు. రుక్మిణీ వివాహం కూడా ఆమె నన్ను తీసుకుపొమ్మని ఉత్తరం రాస్తే వెళ్లి ఎత్తుకొచ్చేసి పెళ్లి చేసుకున్నాడు..

సత్యభామ వివాహం మాత్రం అలా జరగలేదు. తండి సత్రాజిత్తు ఒప్పుకున్నాడు. తాను ఒప్పుకుంది. అందరి అంగీకారంతో సంప్రదాయబద్ధంగా జరిగిన పెళ్లి అది. పైగా సంపన్నవతి.. బంగారం లాగానే తామసం ఎక్కువ. అందుకే మిగతా అందరిలోనూ ఆమె రూటే సెపరేటు.

కేవలం భార్యగా భర్తను పొందటమే కాదు.. అవసరమైతే భర్తకు దీటుగా, సరిసాటిగా నిరూపించుకుంది. ఆయనకు అండగా నిలిచి మహిళగా తన ప్రత్యేకతను రుజువు చేసుకుంది. నరకాసురుడి వధకు భర్తతో పాటు యుద్ధరంగానికి వెళ్లింది.. యుద్ధంలో భర్త అలసిపోతే, తానే ఆయుధం చేతపట్టింది. భీకరంగా పోరాడింది. నరకుణ్ణి తానే వధించింది. పదహారు వేల మంది కన్నెలను విడిపించింది. మహిళల కోసం పోరాడిన ఎ రియల్ విమెన్ వారియర్‌గా చరిత్రలో నిలిచిపోయింది. అన్ని రకాలుగా, అన్ని విధాలుగా ఒక మహిళ ఎలా ఉండాలో సత్యభామ ఉండి చూపించింది. ఇప్పుడున్న సమాజంలో ఇలాంటి అభిమానవతులు అవసరం. రకరకాల ఇన్‌ఫ్లూయెన్సెస్ పడటం వల్ల ఇవాళ్టి మహిళలు పెళ్లి కాగానే భర్తను తమ చెప్పుచేతల్లో ఎలా పెట్టుకోవాలో ఆలోచిస్తారు.. తాము పుట్టినింటిని వదిలి వచ్చినప్పుడు తన భర్త మాత్రం అతని కుటుంబంతో ఎలా ఉండాలన్న స్థాయికి మోడ్రన్ మహిళ వచ్చేసింది. ఫలితం వేరు కాపురం.. వినకపోతే విడాకులు.. అంతా జస్ట్‌కూల్.. మనల్ని మనం అసెర్ట్ చేసుకోవటం అంటే ఎదుటివాళ్లను అవమానించటం కాదు.. చిన్నచూపు చూడటం అంతకంటే కాదు.. నెగెటివ్ ఆటిట్యూడ్‌ను వదిలేసి సానుకూల కోణంలో వ్యవహరించటం ఈతరానికి ఉండాల్సిన బేసిక్ క్వాలిటీ.. ఇదిగో ఈ క్వాలిటీ సత్యభామ నుంచి నేర్చుకోవాలి.. తనలో అభిమానాన్ని కొంచెమైనా విడవకుండానే మహిళగా, భార్యగా, యోధాగా తానేమిటో నిరూపించుకుంది.. జస్ట్ ఒక్కసారి ఆలోచించండి.. ప్రతి భామా ఒక సత్యభామ అయితే, అలుకలూ, అనునయాలు ఉంటాయేమో కానీ, ఏ కాపురమూ కుప్పకూలదు.

# నరకాసుర

దీపావళి... వెలుగు దివ్వెల పండుగ.. చీకట్లను తొలగించి వెలుతురు పూలను వికసింపజేసిన పండుగ. అమావాస్య అంధకారం సైతం పండు వెన్నెలలను పంచే పండుగ.. తెలతెలవారుతూనే హారతులతో ప్రారంభమై.. చీకట్లలో టపాకాయల మిరుమిట్లలో ప్రపంచం పగలుగా మారిన ఒక అపురూపమైన రాత్రిని చూసే ఒక అద్భుతమైన సన్నివేశం.. ప్రపంచంలోనే ఇంత అద్భుతమైన పర్వదినం మరొకటి లేదు.. రాదు.. ఇంత గొప్ప పండుగ మొట్టమొదటి సారి ఎక్కడ జరిగిందో మీకు తెలుసా? ఏ కారణంతో జరిగిందో తెలుసా? మనందరికీ తెలిసిన నరకాసుర వధ జరిగిన ప్రదేశం మనదేశంలోనే ఉంది. నరకాసురుడి సామ్రాజ్యం.. అతని వంశస్థులు పరిపాలించిన రాజ్యం.. ఇప్పుడు భారతదేశానికి తూర్పుద్వారంగా విలసిల్లుతోంది. ఇప్పటికీ నరకుడి జాతి ఉంది.

నరకాసురుడి ఉనికి ఏమిటి? అన్నది మన తరానికి తెలియని అరుదైన చరిత్ర. నరకాసురుడి రాజ్యం మనకు ఇవాళ్టికీ కనిపిస్తోంది.. మన దేశంలోనే ఈశాన్య భారత దేశం నరకాసురుడి సామ్రాజ్యం.. నరకుడు ఏలిన కిరాట రాజ్య రాజధాని ప్రాగ్జ్యోతిషపురం ఇవాళ్టి గౌహతి.. భారత దేశానికి తూర్పున ముఖద్వారం.. మహాభారత కాలం నాటి అనేక నాగరికతలు అంతరించిపోయినా, నరకుడి ఆనవాళ్లు మాత్రం ఇప్పటికీ సజీవంగానే మనకు కనిపిస్తున్నాయి.

ప్రాగ్జ్యోతిష పురం.. క్రీస్తుపూర్వం 3200 సంవత్సరంనాటి రాజ్యం.. మహాభారత కాలం నాటి రాజ్యాలలో కిరాట రాజ్యం ఒకటి. దాని రాజధానే ఈ ప్రాగ్జోతిషపురం. అదే ఇవాళ్టి అసోం రాజధాని. బహ్మపుత్రా నదీతీరంలో  భారతదేశానికి ఈశాన్యాన ఉన్న గేట్‌వే. ఇవాళ గౌహతి వేగంగా అభివృద్ధి చెందుతున్న అత్యద్భుతమైన వాణిజ్య నగరం. సామాజిక, మత, సాంస్కృతిక, పారిశ్రామిక, రాజకీయ పరంగా అన్ని విధాలా పురోగమిస్తున్న ప్రాంతం. ఈ గౌహతి నగరమే ఒకనాటి నరకుడి రాజధాని. దీన్ని కమరూప నగరంగా కూడా పిలుస్తారు. ఇక్కడ నరకుడి ఆనవాళ్లు.. కిరాట రాజ్యపు శిథిలాలు ఇవాళ్టికీ మనకు కనిపిస్తాయి. ప్రఖ్యాత కామాఖ్యదేవి ఆలయ సమీపంలోనే నాటి ప్రాగ్జ్యోతిషపురం అభివృద్ధి చెందింది. నీలాంచల్ హిల్స్ సమీపంలో దొరికిన రాగి పళ్లాలు.. శాసనాలు నరకుడు ఇక్కడ రాజ్యమేలిన విషయాన్ని ధృవీకరిస్తున్నాయి. ఈ నరకుడే శ్రీకృష్ణుడికి నిద్ర లేకుండా చేసాడు.. అతని మధుర నుంచి వేల మంది గోపికలను అపహరించుకుని వెళ్లినవాడు.. అరాచకానికి కేరాఫ్ అడ్రస్.. ఇతణ్ణి సంహరించటం ఎవరి వల్లా కాలేదు.. ఇతనికి తన తల్లి తప్ప ఎవరి చేతుల్లోనూ చనిపోకుండా వరం పొందిన వాడు.. దీంతో అతణ్ణి సంహరించటం ఎవరికీ సాధ్యం కాలేదు..



**గౌహతి నగరమే ఒకనాటి నరకుడి రాజధాని.. దీన్ని కమరూప నగరంగా కూడా పిలుస్తారు.. ఇక్కడ నరకుడి ఆనవాళ్లు.. కిరాట రాజ్యపు శిథిలాలు ఇవాళ్టికీ మనకు కనిపిస్తాయి. ప్రఖ్యాత కామాఖ్యదేవి ఆలయ సమీపంలోనే నాటి ప్రాగ్జ్యోతిషపురం అభివృద్ధి చెందింది.. నీలాంచల్ హిల్స్ సమీపంలో దొరికిన రాగి పళ్లాలు.. శాసనాలు నరకుడు ఇక్కడ రాజ్యమేలిన విషయాన్ని ధృవీకరిస్తున్నాయి.**

చివరకు శ్రీకృష్ణుడు భూదేవీ రూపమైన సత్యభామాదేవిని వెంటబెట్టుకుని వెళ్లి నరకాసుర వధ చేయాల్సి వచ్చింది. నరకుడి చావుతో చీకట్లు తొలిగిపోయాయి. వెలుగులు విరజిమ్మాయి. శ్రీకృష్ణుడితో నరకాసురుడి యుద్ధం జరిగిన ప్రదేశం గౌహతిలోనే ఉంది. గౌహతిలోని నీలాంచల్ హిల్స్ సమీపంలోనే ఈ యుద్ధం జరిగింది. అతణ్ణి హతమార్చిన తరువాత ప్రజలు ఆనందంగా దీపావళి సంబరాలను జరుపుకున్నది ఈ నీలాంచల్ హిల్స్ లోనే. ఇక్కడే అష్టాదశ శక్తిపీఠాలలో ఒకటైన కామాఖ్య దేవాలయం ఉంది.. అతి శక్తిమంతమైన మహాశక్తిపీఠం. దక్షయజ్ఞంలో సతీదేవి మృతి తరువాత ఖండఖండాలైన ఆమె మృతదేహం భాగాలలో యోని భాగం ఈ పర్వతంపై పడి శక్తిపీఠంగా ఆవిర్భవించింది. నరకుడు ఈ అమ్మవారిని మాతృశ్రీగా భావించి పూజించేవాడట. ఆలయాలు ఏవీ లేని కాలంలో కొండపై వెలసిన కామాఖ్యదేవి అతనికి ఆరాధ్యదైవమైంది. నరకుడు ఎంత కాముకుడో.. ఎంత కిరాతకుడో.. తల్లిపై అంతకంటే ఎక్కువ ప్రేమ ఉన్నవాడు. అందుకేనేమో.. తల్లి చేతిలోనే మరణాన్ని కోరుకున్నాడు.. అలాగే మరణించాడు..

కామాఖ్య దేవాలయం అష్టాదశ శక్తిపీఠాల్లో చాలా ముఖ్యమైంది.. ఈ ఆలయం కేంద్రంగానే కిరాట రాజ్యం మనుగడ సాగించింది. నరకాసురుడి అనంతరం అతని వంశస్థులు కొన్ని వందల సంవత్సరాల పాటు ఈ ప్రాంతాన్ని పరిపాలించారు. మహాభారత యుద్ధంలో కూడా వీళ్లు పాల్గొన్నారు.

ఇవాళ అసోం ప్రాంతంలో మనం చూస్తున్న గౌహతి నగరం చుట్టుపక్కల కొండప్రాంతాలే ఒకనాటి అసుర మహాసామ్రాజ్యానికి ఆటపట్టు. కిరాట జాతులు ఇక్కడ తమ రాజ్యాన్ని అభివృద్ధి చేసుకున్నవి. పురాతత్త్వ శాస్త్రవేత్తల కథనం ప్రకారం ఇప్పుడు బోడో జాతి ప్రజలు నాటి కిరాట జాతికి చెందిన వారే. వీరంతా పసిఫిక్ మహాసముద్ర తీరం నుంచి

ఈ ప్రాంతానికి వలస వచ్చిన వారు. మహేశ్వర్ నియోగ్ ఈశాన్య భారత ఎథ్నాలజీపై పరిశోధనలు చేసి తేల్చిన సత్యం ఇది.

ఈశాన్య భారతానికి వచ్చిన వలసల విషయంలో కొన్ని మిథ్యావాదాలు లేకపోలేదు.. కానీ, మహేశ్వర్ నియోగ్ నిరూపించిన వాస్తవాల్లో కిరాటులు నరకుడి మూలపురుషులని తేలిపోయింది. బాణాసురుడు కూడా ఈ కిరాట వంశస్థుడేనని మరో కథనం ఉంది. శ్రీకృష్ణుడి మనవడైన అనిరుద్ధుడు ఈ బాణాసురుడి కుమార్తె ఉషను ప్రేమించి వివాహం చేసుకున్నాడు. అయితే బాణాసురుడికి సంబంధించిన రుజువులు ఇక్కడ కనపడలేదు. కానీ నరకాసురుడి చరిత్రకు సంబంధించిన ఆనవాళ్లు అనేకం అస్సోంలో కనిపిస్తున్నాయి. ఇతని మరణానంతరం ఇతని కుమారుడు భగదత్తుడు ఈ ప్రాంతాన్ని పరిపాలించాడు..

భగదత్తుడు కురుక్షేత్ర యుద్ధంలో కౌరవుల పక్షాన పోరాటం చేసాడు. పాండవుల చేతిలో హతమయ్యాడు. అతని తరువాత మహిదానవుడు ఈ కిరాట రాజ్యాన్ని కలియుగం వరకు పరిపాలించాడు. వేద సంప్రదాయంతో సంబంధం లేని రాచరిక వంశాలు మహాభారత కాలంలో చాలా ఉన్నాయి. అసురులు ఈ వంశాల్లోని వారే. అసురులంటే ఒక కులానికో.. మతానికో చెందిన వాళ్లు కారు. ప్రజల్ని కిరాతకంగా హింసించే దానవ ప్రవృత్తి ఉన్న వాళ్లను అసురులుగా పిలిచారు. నరకుడు అలాంటి వాడే.. భూమి కడుపున పుట్టినప్పటికీ, దురాగత చర్యల వల్ల అసురుడయ్యాడు.

టిబెట్, బర్మా, మంగోలియాల నుంచి వలస వచ్చిన ట్రైబల్స్ నరకాసురుడి రాజ్యంలో భాగమయ్యారు. ఇక్కడ బోడో ప్రజల్లో ప్రచారంలో ఉన్న కథనం ప్రకారం నరకుడు వారి రాజ కుమారుడు. రాజ్యంలో తన తండ్రిపై కుట్ర జరగటంతో అతని తల్లి పొరుగున ఉన్న మగధకు పారిపోయి నరకుణ్ణి కన్నది. అతను అక్కడ 14 సంవత్సరాలు ఉన్నాడు. ఆ తరువాత తిరిగి ప్రాగ్జ్యోతిషపురం అంటే ఇవాల్టి గౌహతికి వచ్చి తన రాజ్యాన్ని చేపట్టాడు. మగధ రాజు జరాసంధుడి ఇన్‌ఫ్లూయెన్స్ ఇతనిపై చాలా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే శ్రీకృష్ణుడిపై అసాధారణ శత్రుత్వాన్ని ప్రదర్శించాడు. బహ్మపుత్రానదీ తీరంలో బోడోలాండ్ ఇవాళ అస్సాంకు కేంద్రస్థానం.. ఇవాళ బోడోలు తమకు స్వయంప్రతిపత్తి కావాలని పోరాడుతున్నారు. శ్రీకృష్ణుడి కాలం నుంచి ఢిల్లీకీ, గౌహతికి మధ్య నిరంతరంగా కొనసాగుతున్న యుద్ధానికి ఇది ఉదాహరణ. గౌహతి ప్రాగ్జ్యోతిషపురమే కాదు.. దీనికి కామరూపనగర్ అని కూడా పేరుంది. కామరూపనగరాన్నే ప్రాగ్జ్యోతిషపురంగా నరకుడు మార్చాడు. కామరూపనగరం అంటే ఏమిటి? ఎందుకు ఆ పేరు వచ్చింది..?

గౌహతి నగరంలోని నీలాంచల్ హిల్స్‌పై కామాఖ్యాదేవి ఆలయం తాంత్రిక శక్తికి కేంద్రస్థానంగా చెప్పుకుంటారు.. దీనికి కొద్ది దూరంలోనే భువనేశ్వరీ దేవి ఆలయం వుంది.. ఇక్కడి నుంచి మరి కొంత దూరం వెళ్తే చిత్రాంచల్ కొండలపైన నవగ్రహదేవాలయం



**టిబెట్, బర్మా, మంగోలియాల నుంచి వలస వచ్చిన ట్రైబల్స్ నరకాసురుడి రాజ్యంలో భాగమయ్యారు. ఇక్కడ బోడో ప్రజల్లో ప్రచారంలో ఉన్న కథనం ప్రకారం నరకుడు వారి రాజ కుమారుడు. రాజ్యంలో తన తండ్రిపై కుట్ర జరగటంతో అతని తల్లి పొరుగున ఉన్న మగధకు పారిపోయి నరకుణ్ణి కన్నది. అతను అక్కడ 14 సంవత్సరాలు ఉన్నాడు. ఆ తరువాత తిరిగి ప్రాగ్జ్యోతిషపురం అంటే ఇవాళ్టి గౌహతికి వచ్చి తన రాజ్యాన్ని చేపట్టాడు.**

ఉంటుంది. ఈ ఆలయం ఖగోళ శాస్త్రాన్ని, జ్యోతిష శాస్త్రాన్ని అధ్యయనం చేసేందుకు అనువుగా.. ఆయా గ్రహాల కదలికలను తెలిపే విధంగా ఉండటం విశేషం. అన్నింటికీ మించి బ్రహ్మపుత్రా నది మధ్యలో నెమలి ద్వీపం ఉంది. ఇక్కడ ఉమానంద ఆలయాన్ని చూడటం ఒక అద్భుతం. అపురూపం. ఈ ప్రాంతమే గౌహతిని కామరూప నగరంగా పేరు పడేలా చేసింది. మహాశివుడు అన్నింటినీ వదిలేసి తపోదీక్షకోసం నెమలి ద్వీపానికి వచ్చాడట. ఇక్కడ ఆయన తపస్సులో ఉన్నప్పుడు పార్వతీదేవి ఆయన కోసం తపించింది.. ప్రార్థించింది.. వాళ్లిద్దరినీ కలిపేందుకు రతీమన్మథులు ప్రయత్నించారు. మన్మథుడి పూలబాణంతో తపోభంగం జరిగిన శివుడు త్రినేత్రాన్ని తెరిచి అతణ్ణి భస్మం చేశాడట. ఇదే ప్రదేశంలో ఉమానంద ఆలయం ఏర్పడింది. ఇక్కడ శివుడు స్వయంభువుగా వెలిశాడు.. అస్సాం వెళ్లిన వారికి ఇది పరమాద్భుతమైన ప్రదేశం. చుట్టూ ప్రవహించే నది.. మధ్యలో అందాల నెమలి దీవి.. ఈశాన్యభారతంలో ఇది తప్పనిసరిగా చూసి తీరాల్సిన చూడచక్కని ప్రదేశం. గౌహతి, ఈశాన్యభారత దేశంలో భారతకాలం నాటి చారిత్రక ఆనవాళ్లను సజీవంగా నిలిపి ఉంచిన అరుదైన నగరాల్లో ఒకటి. ఒక వైపు మగధ.. మరో వైపు మధుర.. రెండు మహాసామ్రాజ్యాలకు తూర్పు ఈశాన్యాలలో విస్తరించిన అసుర సామ్రాజ్యమిది.. దీపావళి సంబరాలు భారత దేశంలో మొట్టమొదటి సారి జరుపుకున్న దేశం ఇది. ఇది నరకుడి రాజ్యం. ఈనాటి బోడో తెగ ప్రజల మూలపురుషులు ఏలిన దేశమిది.

# రాముడు ఎప్పుడు పుట్టాడు?



*రాముడు కేవలం పౌరాణిక పాత్ర కాదు..*
*రాముడు ఒక చరిత్ర..*
*ఈ భూమిని పరిపాలించిన*
*గొప్ప పాలకుడు..*
*మూర్తీభవించిన ధర్మస్వరూపుడు..*
*ఆయన పుట్టింది నిజం.. పెరిగింది నిజం..*
*రావణ సంహారం చేసిందీ వాస్తవం..*
*రామాయణం పుక్కిటి పురాణం కాదు.*
*భారతదేశంలో వేల ఏళ్ల నాడే విలసిల్లిన*
*నాగరికతా మూలం..*

రాముడు.. అయోధ్య రాముడు.. మర్యాదా పురుషోత్తముడు.. దుష్టశిక్షణ కోసం ఈ భూమి మీద అవతరించిన శ్రీమన్నారాయణుడు. తరతరాలుగా వేల సంవత్సరాలుగా మనకు భారతీయుల మహోన్నతేతిహాసం రామాయణం చెప్తున్న కథ ఇది.. బోధిస్తున్న ధర్మం ఇది.. నిజంగా రాముడు ఉన్నాడా? రామాయణం వాస్తవంగా జరిగిందేనా? ఇది చరిత్రా..? లేక మిథ్యావాదమా? రాముడు నిజంగా ఈ భూమ్మీద అవతరించి ఉంటే.. రావణ సంహారం చేసి ఉంటే.. ఆయనది చరిత్రే అయితే, ఆయన ఎప్పుడు పుట్టాడు? కాల నిర్ణయం చేయటం సాధ్యమేనా? శ్రీరామచంద్రుడి కాల కథాకథన రహస్య మేమిటి?

రామరాజ్యం.. ఇవాళ ప్రపంచం అంతా కోరుకునే ఆదర్శవంతమైన పరిపాలన. భారత దేశం మహేతిహాసాలలో ఒకటిగా భావించే రామాయణంలో శ్రీరామచంద్రుడు సాగించిన పరిపాలన ఇన్ని వేల సంవత్సరాల తరువాత కూడా ఈ దేశానికి మార్గదర్శనమైంది. అయితే, రామాయణం ఇతిహాసమేనా? లేక చరిత్రా? శాస్త్రీయంగా లేని నిరూపణలు రామాయణాన్ని ఒక కథగా కొట్టిపారేస్తున్నాయి. శాస్త్రీయతతో సంబంధం లేని విశ్వాసం రాముడి అస్తిత్వాన్ని వాస్తవంగా గుర్తిస్తోంది. గోదావరీ పరీవాహక ప్రాంతం అంతా రామాయణపు ఆనవాళ్లు పరిపరి విధాలుగా రాముడి అస్తిత్వాన్ని నిరూపిస్తున్నాయి. ఇప్పుడు ఖగోళశాస్త్ర పరిశోధనలు మరింత రామాయణాన్ని చరిత్రగా స్పష్టం చేస్తున్నాయి. రాముడు పుట్టుక.. తేదీతో సహా ఇప్పుడు తేలిపోయింది. అనంత విశ్వంలో నక్షత్రాలు.. గ్రహాల కదలికలు.. సౌరమండలంలో ఆయా కాలాల ప్రకారం చోటు చేసుకున్న మార్పులు రామాయణ కాలాన్ని నిరూపిస్తున్నాయి.

బ్రిటిష్ వాళ్ల పాలనతో మనకు చరిత్రే లేదన్న నిర్ణయానికి వచ్చేశాం... మాక్స్ ముల్లర్ అనే వాడు ఆర్యుల దండయాత్ర సిద్ధాంతాన్ని తెరపైకి తీసుకువచ్చి భారతీయుల చరిత్ర కేవలం 1500 సంవత్సరాలేనంటే కూడా చాలాకాలం పాటు గుడ్డిగా నమ్ముతూ వచ్చాం. హరప్పా మొహంజదారో నగరాలు బయటపడ్డాక ఈ చరిత్ర కాస్తా 5500 సంవత్సరాలకు పెరిగిపోయింది. బయటి చరిత్రకారులు దశాబ్దాల తరబడి చెప్పుకుంటూ వస్తున్న చరిత్రతోనే మనం రాజీ పడుతూ వస్తున్నాం.. కానీ, ఇప్పుడు ఔత్సాహిక పాశ్చాత్య చరిత్రకారులు.. మన హిస్టారియన్లతో కలిసి మన జాతి మూలాల్లోని అద్భుతాల్ని ఆవిష్కరిస్తున్నకొద్దీ భారతీయుల చరిత్ర, నాగరికతల వేళ్లు వేలు.. లక్షల సంవత్సరాలకు పైబడి లోతుల్లోకి అంతు తెలియకుండా చొచ్చుకుపోతున్నాయి. వాల్మీకి రచించిన రామాయణంలో దాని కాలనిర్ణయం అంతా ఖగోళ సంబంధంగానే ఉంది. అందువల్లే రోదసిలో రాశీచక్రాల ఆధారంగా రాముడు ఎప్పుడు పుట్టిందీ ఖచ్చితమైన వివరాలను తెలుసుకోవటం వీలవుతోంది. దాని ద్వారా మొత్తం రామాయణ కథా సందర్భాలు చోటు చేసుకున్న తేదీల వివరాలూ గుర్తించటం సాధ్యమైంది.

రామాయణం, రాముడు ఈ రెండు పదాలు పలకకుండా భారత దేశానికి ఇన్ని వేల సంవత్సరాల తరువాత కూడా తెల్లారదు. కౌసల్యాసుప్రజారామా అంటూ సుప్రభాతం చదివితేనే కానీ హిందూ దేవుళ్లు మేలుకోరు. భారతదేశ సంస్కృతి రామాయణంతో అంతగా పెనవేసుకుపోవటానికి కారణం ఏమిటి? ఒక కథ... పౌరాణిక గాథ భారతీయులపై వేల సంవత్సరాల పాటు ప్రభావం చూపించటం సాధ్యమేనా? రాముడు నిజంగా పుట్టి వుండకపోతే, ఈ భూమిని పరిపాలించకపోతే, ఆ పరిపాలనా ఫలితాలను ప్రజలు పొంది ఉండకపోతే.. ఇంతకాలం కేవలం ఒక పురాణమో.. ఇతిహాసమో ముద్ర వేయటం సాధ్యమేనా? రాముడు దేవుడా? రామాయణం ఎప్పుడు జరిగింది? ఇవి మిలియన్ డాలర్ల ప్రశ్నలు.. మన తరానికి అంతుపట్టని ప్రశ్నలు.. అసలు రామాయణమే లేదని,

ఇది కేవలం ఒక మిథ్యావాదమని, కల్పిత కావ్యమే తప్ప, చరిత్ర కాదని చెప్పేవాళ్లు ఎక్కువ మందే వుంటారు. కానీ, రామాయణ కాలం ఇప్పటికే విస్పష్టమైంది.. టైమ్‌తో సహా తేలింది.. హిందూ కాలమానం ప్రకారం చతుర్యుగ విభజన మేరకు రామాయణం ఉనికి త్రేతాయుగంలో కనిపిస్తుంది. ఒక మహాయుగం అంటే కృత, త్రేత, ద్వాపర, కలి యుగాలన్నమాట. ఒక చతుర్యుగం మొత్తం 43లక్షల 20వేల సంవత్సరాలలో పూర్తవుతుంది. ఇందులో 4.32 లక్షల సంవత్సరాలు కలియుగం.. దీనికి రెట్టింపు అంటే 8లక్షల64వేల సంవత్సరాలు ద్వాపరయుగం.. కలియుగానికి మూడు రెట్లు అంటే 12 లక్షల 96 వేల సంవత్సరాలు త్రేతాయుగం, కలియుగానికి నాలుగు రెట్లు అంటే 17 లక్షల 28 వేల సంవత్సరాలు కృతయుగం. ఈ లెక్కల ప్రకారం త్రేతాయుగం ఇవాల్టికి 8 లక్షల 66 వేల 11 సంవత్సరాల క్రితం ముగిసిందన్నమాట. ఆ ప్రకారం రామాయణం ఎనిమిదిన్నర లక్షల సంవత్సరాల క్రితమే జరిగింది. యుగవిభజన ప్రకారం లెక్క వేసుకుంటే రాముడు ఎనిమిదిన్నర లక్షల సంవత్సరాల క్రితం ఈ దేశాన్ని పరిపాలించాడని ఈ యుగ విభజన చెప్తోంది. ఇన్ని సంవత్సరాల క్రితం నాటి చరిత్రకు ఆనవాళ్లు దొరకటం సాధ్యమేనా? ఈ యుగవిభజన ప్రకారం ఖగోళగమనాన్ని గణిస్తే పునర్వసు నక్షత్రంలో ఉత్తరాయణ పుణ్యకాలంలో  చైత్రశుద్ధ నవమి రోజున రామచంద్రుడు జన్మించాడు. అంటే ఇప్పటికి ఎనిమిది లక్షల మూడువేల 23వ సంవత్సరంలో రామచంద్రుడి జననం జరిగింది. రావణవధ తరువాత ఆయన పదమూడు వేల సంవత్సరాల పాటు భారత దేశాన్ని పరిపాలించాడని వాల్మీకి రామాయణం చెప్తుంది.

దీనికి పూర్తిస్థాయి హేతుబద్ధత ఏమిటి? అంటే హిందూ యుగ ధర్మమే. చతుర్యుగ కాలమానమే ఇందుకు ఏకైక కొలమానం. దీనికి స్పష్టమైన ఆధారాలు చూపించటం కష్టమే. ఈ లెక్కల ప్రకారం 28వ మహా యుగంలో రామాయణం జరిగింది. కానీ, ఇప్పుడు ఖగోళ శాస్త్రవేత్తలు మాత్రం అదే వాల్మీకి రామాయణాన్నే ఆధారం చేసుకుని రాముడి కాలాన్ని నిర్ధారిస్తున్నారు. వారి గణాంకాల ప్రకారం రామాయణ కాలం కేవలం పదివేల సంవత్సరాల క్రితం నాడు జరిగిందేనంటున్నారు. లెక్కలతో సహా వాళ్లు నిరూపిస్తున్నారు. తేదీలతో సహా చెప్తున్నారు. ఈ గణాంకాల లెక్కల్లోనే రాముడు ఈ భూమ్మీద జీవించి ఉన్నాడని చెప్తున్నారు. రామాయణం గురించి, దాని చారిత్రకత గురించి చాలా పరిశోధన జరిగింది. ఆర్కియాలజిస్టులు, సాహిత్యవేత్తలు, చరిత్రకారులు, ఖగోళశాస్త్రవేత్తలు వాల్మీకి రామాయణంలోని మొత్తం 24వేల పద్యాలను అక్షరమక్షరం మథించి నిజాల్ని నిగ్గుతేల్చారు.. ఖగోళశాస్త్రవేత్తల లెక్కల ప్రకారం రామాయణం పదివేల సంవత్సరాలకు పూర్వం జరిగిన వాస్తవం.. ఇందుకు సంబంధించిన ఆధారాలను కార్బన్ డేటింగ్‌తో సహా సైంటిస్టులు నిరూపిస్తున్నారు. భారతదేశంలో రామాయణానికి సంబంధించిన రుజువులు అన్నీ దొరికాయి. ఉత్తర ప్రదేశ్‌లోని ఫైజాబాద్ జిల్లాలోని అయోధ్యలో రాముడి జన్మస్థలాన్ని మొట్టమొదట కనుగొన్నది విక్రమాదిత్యుడు. ఆయనే

**రామాయణంలో సరయూ నదీతీరం, సాకేతపురి అన్నీ ధృవీకరణ జరిగాయి. అయోధ్య సరయూ తీరంలోనే ఉంది. అటు లంకలో రావణాసురుడి ఆనవాళ్లు స్పష్టంగా లభించాయి. అన్నింటికీ మించి రాముడు లంకకు నిర్మించిన సేతువు ఇవాళ్టికీ 30 కిలోమీటర్ల మేర మనకు కనిపిస్తూనే ఉంది. ఇది పూర్తిగా మానవ నిర్మితమేనని నాసా కూడా స్పష్టం చేసింది. వీటిని బేస్ చేసుకునే రామాయణ కాలనిర్ణయంపై పరిశోధన సాగింది.**



అయోధ్యలో గొప్ప ఆలయాన్ని నిర్మించాడు. రామాయణంలో పేర్కొన్న సరయూ నదీతీరం, సాకేతపురి అన్నీ ధృవీకరణ జరిగాయి. ఈ అయోధ్య సరయూ తీరంలోనే ఉంది. అటు లంకలో రావణాసురుడి ఆనవాళ్లు స్పష్టంగా లభించాయి. అన్నింటికీ మించి రాముడు లంకకు నిర్మించిన సేతువు ఇవాళ్టికీ 30 కిలోమీటర్ల మేర మనకు కనిపిస్తూనే ఉంది. ఇది పూర్తిగా మానవ నిర్మితమేనని నాసా కూడా స్పష్టం చేసింది. వీటిని బేస్ చేసుకునే రామాయణ కాలనిర్ణయంపై పరిశోధన సాగింది. వాల్మీకి రామాయణంలో రాముడు జన్మించిన సమయాన్ని ఆదికవి వర్ణించిన పద్యాలలో ఆయన జన్మకాలాన్ని నిర్ధారిస్తున్నారు. సరోజ్‌బాలా, డాక్టర్ పివి వర్తక్, డాక్టర్ సౌరబ్ క్వాతా పుష్కర్ భట్నాగర్ లాంటి ప్రముఖ హిస్టారియన్‌లు రాముడి పుట్టిన తేదీని కన్‌ఫర్మ్ చేశారు.

ఆస్ట్రోమాథ్స్ ప్రకారం రామాయణం 9300 సంవత్సరాల క్రితం జరిగింది. వాల్మీకి రామాయణంలోని బాలకాండలోని 19వ సర్గలోని 8, 9 శ్లోకాలు రామజననం గురించి వివరిస్తున్నాయి. ఉత్తరాయణం చైత్ర శుద్ధ నవమి.. పునర్వసు నక్షత్రం. ఆ సమయంలో సూర్యుడు మేషరాశిలో పది డిగ్రీలలో ఉన్నాడు. అంగారకుడు మకరంలో 28 డిగ్రీల కోణంలో, గురువు కర్కాటక రాశిలో 5 డిగ్రీలలో, శుక్రుడు మీన రాశిలో 27 డిగ్రీల్లో, శని తులారాశిలో 20 డిగ్రీ కోణంలో ఉన్నారు.

మహాభారత యుద్ధం.. నాటి గ్రహరాశులు ఉన్న పొజిషన్‌ను బట్టి క్రీస్తు పూర్వం 3102లో జరిగినట్లు నిర్ధారణ జరిగింది. మొహంజదారో నగరంలో లభించిన రేడియేషన్ ఎఫెక్ట్ కూడా దీని ఖచ్చితత్వాన్ని నిరూపిస్తున్నది. ఈ లెక్కలను ఆధారం చేసుకుని ప్లానెటరీ పొజిషన్స్‌ను ఆస్ట్రో సైంటిస్టులు లెక్కిస్తూ వెళ్లారు. దీని ప్రకారం సూర్యుడు, అంగారకుడు, గురువు, శుక్రుడు, శని, రాహువులు బాలకాండలో పేర్కొన్న పొజిషన్‌లలో ఉన్నారు. ఈ రాశుల సమీకరణ క్రీస్తుపూర్వం 7323 డిసెంబర్ 4 దగ్గర ముగుస్తోంది. ప్రముఖ శాస్త్రవేత్త పివి వర్తక్ పూర్తి వివరాలతో ఈ అంశాల్ని నిరూపిస్తున్నారు. ఇటీవలి కాలంలో

**క్రీస్తుకు పూర్వం 7323 డిసెంబర్ నాలుగున మర్యాదాపురుషోత్తముడు పుట్టాడు. ఆరోజు సోమవారం. మధ్యాహ్నం 12 నుంచి ఒంటిగంట మధ్య సమయంలో రాముడు జన్మించాడు. ఆ కాలానికి ఇంకా క్రీస్తు శకం పారంభం కాలేదు. క్రీస్తు శకం ప్రారంభమైన తరువాత ఈరోజు నుంచి వెనక్కి లెక్కించుకుంటూ పోతే.. చైత్రమాసం దాదాపుగా డిసెంబర్ ప్రాంతంలో వచ్చింది.**



మరో శాస్త్రవేత్త పుష్కర్ భట్నాగర్ కూడా రామజననంపై పరిశోధన చేసినప్పటికీ, పివి వర్తక్ రీసర్చ్ కొంత వరకు వాస్తవాలకు దగ్గరగా ఉన్నట్లు ఎక్కువ మంది నమ్ముతున్నారు.

ఈ లెక్కలు శ్రీరామచందుడి పుట్టుకను స్పష్టం చేస్తున్నాయి. క్రీస్తుకు పూర్వం 7323 డిసెంబర్ నాలుగున మర్యాదాపురుషోత్తముడు పుట్టాడు. ఆరోజు సోమవారం. మధ్యాహ్నం 12 నుంచి ఒంటిగంట మధ్య సమయంలో రాముడు జన్మించాడు. ఆ కాలానికి ఇంకా క్రీస్తు శకం పారంభం కాలేదు. క్రీస్తు శకం ప్రారంభమైన తరువాత ఈరోజు నుంచి వెనక్కి లెక్కించుకుంటూ పోతే.. చైత్రమాసం దాదాపుగా డిసెంబర్ ప్రాంతంలో వచ్చింది.. అంటే ఇవాళ్టి పాశ్చాత్య క్యాలెండర్ జనవరితో ఎలా మొదలవుతున్నదో.. దాదాపు అదే సమయంలో మన నూతన సంవత్సరమూ మొదలయ్యేదనమాట... గత 9300 సంవత్సరాలలో రాశుల కదలికలు.. అధిక మాసాలతో కలిపి.. ఈ చైత్రమాసం దాదాపు నాలుగు నెలలు ముందుకు జరిగిందని అర్థమవుతున్నది.

రాముడి జన్మసమయం నిర్ధారణ కావటంతో.. రామాయణంలోని మిగతా సంఘటనల కాలంపై మరింత స్పష్టత వచ్చింది. రాముడు తొలిసారి ప్రవాసానికి విశ్వామితుడితో వెళ్లిన సమయంలో మూడు గ్రహాలు చంద్రుడి చుట్టూ తిరుగుతూ పాలపుంతను ప్రకాశవంతం చేశాయట.. పురాతత్వ శాఖ పరిశోధనల్లో అయోధ్య నుంచి లంక వరకు బయటపడిన రామాయణ కాలపు ఆనవాళ్లు కూడా ఈ గణాంకాలను బలపరుస్తున్నాయి. రాముడి జన్మసమయం తెలియటంతో పాటు ఆయన ప్రవాస సమయంలో గ్రహరాశుల సమీకరణలు ఆస్ట్రో సైంటిస్టులకు అదనపు ఇన్‌పుట్‌ను ఇచ్చింది. దీని ప్రకారం రాముడి జీవితాన్ని సంపూర్ణంగా విశ్లేషించే అవకాశం లభించింది. శ్రీరాముడు సీతాదేవిని తన పదిహేడో ఏట వివాహం చేసుకున్నాడు. మిథిలా నగరంలో క్రీస్తుపూర్వం 7307 ఏప్రిల్ ఏడో తేదీన సీతమ్మను రామచంద్రుడు శివధనుస్సును విరిచి వివాహం చేసుకున్నాడు.

వివాహం చేసుకున్న ఏడాదిన్నర కాలానికే రాముడు 14 ఏళ్ల పాటు వనవాసానికి



**సీతను వెతుక్కుంటూ బయలుదేరిన రామలక్ష్మణులను కలిసిన హనుమంతుడు సీత జాడను తెలుసుకోవటానికి 7292 సెప్టెంబర్ 1వ తేదీన లంకలో ప్రవేశించాడు. సెప్టెంబర్ 2 సీతాదేవిని దర్శించుకున్నాడు.. అదేరోజు రాత్రి లంకాదహనం జరిగింది. సీతాదేవి జాడ తెలుసుకున్న తరువాత ఇరవై రోజుల్లో ఆయన తిరిగి కిష్కింధకు చేరుకున్నాడు. హనుమంతుడు రోజుకు ముప్పై మైళ్లు ప్రయాణించాడట.**

వెళ్లాల్సి వచ్చింది. రాముడి తండ్రి దశరథుడి జన్మనక్షత్రమైన రేవతి చుట్టూ రవి, అంగారకుడు, రాహువు తదితర నక్షత్రాలు తిరుగుతున్న సమయం అది. రాజుకు మారకాన్ని సూచించే దశ అది. అదే సమయంలో మూడు గ్రహాలు చంద్రుడి చుట్టూ తిరుగుతూ రాముడికి శుభ సంకేతాన్ని ఇస్తుండటంతో, ఆ ముహూర్తాన్ని రాముడి పట్టాభిషేక ముహూర్తంగా దశరథుడు నిర్ణయించాడు. అయోధ్యకాండ రెండో సర్గలోని 18వ శ్లోకంలో ఈ విషయం ఉంది. కానీ, అది రాజు మరణానికి దారి తీసింది. శత్రువైన రావణ వధ కోసం రాముడు 14 ఏళ్ల వనవాసానికి బయలు దేరాల్సి వచ్చింది. క్రీస్తుపూర్వం 7306వ సంవత్సరం నవంబర్ 29న రాముడు సీతాలక్ష్మణులతో కలిసి వనవాసానికి వెళ్లాడు.

రాముడు పంచవటిలో ఉన్నప్పుడు సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించింది. వనవాసం మరో ఏడాదికి పూర్తవుతుందనగా సీతాపహరణం జరిగింది. 7293వ సంవత్సరం ఆగస్టు 7న రావణుడు సీతను అపహరించుకుని వెళ్లాడు. ఆరోజు అమావాస్య. ఆ సమయంలో ఖగోళంలో అంగారకుడు మధ్యలో ఉన్నాడు. ఒకవైపు బుధుడు, శుక్రుడు, మరోవైపు రవి, శని ఉన్నారని రామాయణం చెప్తోంది. ఆరోజు సూర్యగ్రహణం కూడా వచ్చింది.

ఆ తరువాత సీతను వెతుక్కుంటూ బయలుదేరిన రామలక్ష్మణులను కలిసిన హనుమంతుడు సీత జాడను తెలుసుకోవటానికి 7292 సెప్టెంబర్ 1వ తేదీన లంకలో ప్రవేశించాడు. సెప్టెంబర్ 2 సీతాదేవిని దర్శించుకున్నాడు.. అదేరోజు రాత్రి లంకాదహనం జరిగింది. సీతాదేవి జాడ తెలుసుకున్న తరువాత ఇరవై రోజుల్లో ఆయన తిరిగి కిష్కింధకు చేరుకున్నాడు. హనుమంతుడు రోజుకు ముప్పై మైళ్లు ప్రయాణించాడట. ఆంజనేయుడు సీత జాడ చెప్పిన వెంటనే రాముడు యుద్ధ సన్నాహాలు చేశాడు. మాఘ శుద్ధ పాఢ్యమి అంటే 7292 అక్టోబర్ 2న రామసైన్యం లంకకు బయలు దేరింది. కిష్కింధ అంటే నేటి హంపి, హోస్పేట నుంచి లంకకు సుమారు ఆరువందల మైళ్ల దూరం ఉంటుంది. రోజుకు సుమారు ఇరవై మైళ్ల చొప్పున ఫాల్గుణ శుద్ధ చతుర్దశి అంటే 7292 అక్టోబర్

31న లంకలో వానరసైన్యం ప్రవేశించింది. అంతకు ముందు అక్టోబర్ 26 నుంచి 30 మధ్య రోజుల్లో రామసేన సముద్రంపై అసాధారణమైన వారధిని నిర్మించింది.

రామరావణ యుద్ధం మొదలైంది 7292 నవంబర్ 3న. యుద్ధం ప్రారంభమైన అయిదో రోజున అంటే నవంబర్ 7న రావణ సోదరుడు కుంభకర్ణుని రాముడు హతమార్చాడు.. క్రీస్తుపూర్వం 7292 నవంబర్ 15న రావణ వధ జరిగింది. క్రీస్తుపూర్వం 7292 నవంబర్ 19కి రాముడి 14ఏళ్ల వనవాస కాలం ముగిసింది. అదే రోజు అక్కడి నుంచి బయలుదేరి అయోధ్యకు డిసెంబర్ 6 ఆయన చేరుకున్నారు. విచిత్రమేమంటే ఆ రోజు కూడా చైత్ర శుక్ల నవమి కావటం. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైంటిఫిక్ రీసర్చ్ ఆన్ వేదాస్ (ఐ–సర్వ్) ప్రకారం శ్రీరాముడు క్రీస్తు పూర్వం 5114, జనవరి 10న జన్మించాడు. ప్రముఖ ఖగోళ శాస్త్రవేత్త పుష్కర్ భట్నాగర్ చేసిన గణాంకాలు ఇవి. ఈ లెక్కల పకారం 5077 అక్టోబర్ 7న ఖరదూషలతో యుద్ధం చేశాడు. 5076, ఏపిల్ 6న వాలిని హతమార్చాడు. అదే సంవత్సరం సెప్టెంబర్ 12న హనుమంతుడు లంకలో ప్రవేశించాడు. సెప్టెంబర్ 14న వెనక్కి వచ్చేశాడు. 19న రాముడు యుద్ధానికి బయలు దేరాడు. డిసెంబర్ 4న రావణ వధ జరిగింది. 30 డిసెంబర్ 5076న రాముడు అయిోధ్యకు తిరిగి చేరుకున్నాడు. మరో ఖగోళ శాస్త్రవేత్త పి.వి వర్తక్ గణాంకాలు రాముడు క్రీస్తుపూర్వం 7323 సంవత్సరం జన్మించినట్లుగా చెప్తున్నాయి. భూమిపై ఐస్ ఏజ్ ముగిసిన తరువాత అంటే సుమారు లక్షా 20 వేల సంవత్సరాల క్రితం సముద్రమట్టం ప్రస్తుతం ఉన్న స్థాయి కంటే 120 మీటర్లు తక్కువ ఎత్తులో ఉండేది. శ్రీలంక భారత్‌ల మధ్య సముద్రమట్టం తేడా సుమారు 6 నుంచి 13 మీటర్లు మాత్రమే. భారత్‌తో లంక కనెక్ట్ అయి దాదాపు 16వేల సంవత్సరాలు అయి ఉండవచ్చని అంచనా.. అలాగే వాల్మీకి రామాయణంలోని గ్రహాల స్థానాలను బట్టి పీవీ వర్తక్ లెక్కలు వేసుకుంటూ వెళ్లారు. ఈ గణాంకాల ప్రకారంగా రామాయణం క్రీస్తుకు పూర్వం 7323లో సంభవించింది.

రాముడి జన్మపట్టికలో జ్యోతిష్యశాస్త్ర వివరణలు పరిశోధకులకు రామాయణ కాలాన్ని నిర్ణయించటంలో బాగా తోడ్పడ్డాయి. రాముడు వనవాసం పూర్తి చేసుకుని తిరిగి అయోధ్యకు చేరుకుని పట్టాభిషేకం చేసుకునే నాటికి ఆయన వయస్సు 39 సంవత్సరాలు. రాముడి కాలనిర్ణయాన్ని, రామాయణ చరిత్రను సుమారు భారత దేశంలోని 195 ప్రదేశాలు విస్పష్టంగా నిరూపిస్తున్నాయి. అయోధ్యలో, పంచవటిలో, హంపిలో, లంకలో దొరికిన ఆనవాళ్లు.. వాటిపై చేసిన పరిశోధనలు ఈ కాలనిర్ణయంతో సరిపోలుతున్నాయి. రామాయణం ఇతిహాసమా, చరిత్రా అన్న మీమాంసకు తెరదించే ప్రయత్నాలు ఆస్ట్రో సైంటిస్టులు చాలాకాలంగా చేస్తూనే ఉన్నారు. ఇటు పురాతత్త్వవేత్తలు, సాహిత్య, చారిత్రకులు వేల సంఖ్యలో రామాయణ మూలాలను అన్వేషించారు. దాని ఫలితమే.. రాముడి జన్మకాల నిర్ణయం. రామాయణ కాలావధి నిర్ధారణ.



# రాముడికి సీత ఏమవుతుంది?

రామాయణానికి సంబంధించి చాలా పాపులర్ అయిన సామెత ఇది.. "వెనుకటికి ఎవరో రామాయణం అంతా విన్నాక రాముడికి సీత ఏమవుతుందని అడిగాడట".. ఇదీ ఆ సామెత. అలాంటి ప్రశ్నలు వేసేవాడు వెర్రివాడని కన్‌ఫర్మ్ చేసే భావనలో ఈ సామెత జనం నోళ్లలో నానుతూ ఉంటుంది. ఎప్పుడో మూడున్నర దశాబ్దాల క్రితం మహాకవి ఆరుద్ర ఈ ప్రశ్న వేశాడు..? రాముడికి సీత ఏమవుతుందని? ఎందుకు ఈ ప్రశ్న ఉదయించింది? నిజంగా ఇది జవాబు చెప్పాల్సిన ప్రశ్నేనా..? నిన్నటి తరానికి, ఇవాళ్టి తరానికి రేపటి తరానికి కూడా నిద్రలో లేపి అడిగినా ఠక్కున జవాబు చెప్పే జగమెరిగిన సత్యాన్ని ప్రశ్నించటం ఏమిటి? ప్రపంచంలో మరే జాతికీ లేని విధంగా మన మూలాలను మనం ప్రశ్నించుకోవటం అనేది మనకు మాత్రమే చెల్లింది.. అందులో ఒకటే ఈ ప్రశ్న.. దీనికి జవాబు ఏమిటి? రామాయణం. రాముడు.. సీతారాములు.. వేల సంవత్సరాల నాటి చరిత్ర... అఖండ భారతమంతటితో అనుబంధం పెనవేసుకున్న చరిత్ర. ఆదికవి వాల్మీకికి నారదుడు విశదీకరించి చెప్పిన కథ.. మానవజాతి చరిత్రలోని మాననీయ అంశాలను జాతికి అందించిన మహా ఇతిహాసాలకు ఆది కావ్యమిది.. భూమికి భారంగా మారిన దుష్టశక్తులను నిర్మూలించేందుకు విష్ణువు శ్రీరామచంద్రుడిగా, ఆది లక్ష్మి సీతాదేవిగా అవతరించిందని మనకు తెలుసు. అయోధ్య రాజు దశరథుడి కుమారుడిగా నారాయణుడు జన్మిస్తే, జనకుడి ఇంట సీతాదేవిగా లక్ష్మీదేవి అవతరించి, లోక కంటకాన్ని తొలగించారు.

రామాయణం చెప్పని ఆదర్శం లేదు.. చూపించని ధర్మం లేదు.. నిరూపించని సత్యం లేదు. అలాంటి రామాయణంలో సీతారాముల బాంధవ్యాన్ని ప్రశ్నించటం అర్థంలేని ప్రశ్న.. చిన్నపిల్లవాణ్ణి అడిగినా సీత రాముడికి భార్య అవుతుందని చెప్తాడే తప్ప.. మరో మాట చెప్పడు.. సీతారాముల నింద ఈ దేశంలో భరించరానిది. రామ తిరస్కారం సహించరానిది. అలాంటి దేశంలో.. 90 శాతం ప్రజానీకానికి వేల సంవత్సరాలుగా విశ్వాసపాత్రమైన రామాయణాన్ని ప్రశ్నించటం వెర్రితనమేనా? ఇప్పుడు ఎందుకు ఈ

ప్రశ్న వచ్చింది? నిజానికి ఇదేం వెర్రి ప్రశ్నకాదు.. రాముడికి సీత ఏమవుతుందని అడగటానికి అనుమాన బీజం సహజంగానే పడుతోంది.. వాల్మీకి రామాయణం ప్రకారం ఆమె భూమి నుంచి పుట్టింది.. భూజాత.. నాగటి చాలుకు తగిలి జనకుడికి లభించింది కాబట్టి ఆమెను భూదేవి కూతురన్నారు.

ఇక్కడే చిక్కుముడి అంతా ఉంది. విష్ణువు భార్యలు శ్రీదేవి.. భూదేవులని మనం చెప్పు కుంటాం.. విష్ణువు భార్య భూదేవి అయినప్పుడు.. ఆమె కూతురుగా పుట్టిన సీత... రాముడి రూపంలో అవతరించిన విష్ణువును ఎలా వివాహమాడిందన్నది లౌకికుల్లో ఉత్పన్నమయ్యే ప్రశ్న.. దీనికి జవాబు ఏమిటి?

ప్రజలకు తెలిసినంత వరకు రాముడికి సీత ఏమవుతుందన్న ప్రశ్నకు సంబంధించిన లాజిక్ ఇదొక్కటే. కానీ, ప్రపంచంలో ఇంతకంటే ఎక్కువ కథలు.. కథనాలు.. రామాయణాలు ఉన్నాయన్న విషయం చాలా మందికి తెలియదు. వాల్మీకి రామాయణాన్ని మించిన రామాయణాలు వేల కొద్దీ ఈ భూమ్మీద పుట్టాయి. చిత్రవిచిత్రమైన కథలు వెలువడ్డాయి.. రకరకాల సంబంధాలు.. వావి వరుసలు.. తమ తమ సమాజాలకు అనుకూలంగా, అనువుగా పుట్టుకొచ్చాయి.. ఇవన్నీ నిజమేనా? ఈ కథలన్నీ విశ్వసనీయమైనవేనా? రామాయణం రాసింది ఎవరు? వాల్మీకి.. భారతదేశపు ఆది కవి.. ఇది అందరికీ తెలిసిన నిజం. కానీ, రామాయణాలు ఎన్ని ఉన్నాయో తెలుసా? రాముడి చరిత్ర ఎన్ని చీలికలు పేలికలు అయిందో తెలుసా? లెక్కలేనన్ని.. వేల సంఖ్యలో రామాయణం రకరకాల కథలను పుట్టించింది. వాల్మీకి కాకుండా.. రామాయణాన్ని ఆయా కాలాల్లో.. చాలా మంది రచయితలు తమకు తోచిన రీతిలో.. తోచినట్లుగా రచించారు.. బౌద్ధమతానికి కూడా ఓ రామాయణం ఉంది.. జైన మతానికి ఓ రామాయణం ఉంది.. టిబెట్‌నుంచి ఇండోనేషియా దాకా అన్ని మతాల్లో, అన్ని జాతుల్లో, అన్ని నాగరికతల్లో ఒక్కో రామాయణం పుట్టింది. స్త్రీల పాటల్లో ఒక రామాయణం.. జానపద కథల్లో ఒక రామాయణం, నాటకాల్లో... రూపకాల్లో చెప్పుకుంటూ పోతే కోట్ల సంఖ్యలో రామాయణాలు పుట్టాయి.. అన్ని రామాయణాలకూ సీతారాములే ప్రధాన పాత్రధారులు.. రావణ సంహారమే అసలు కథ.

బౌద్ధ మతంలో పేరు తెలియని ఓ జాతక కథ రామాయణాన్నే చెప్తుంది. ఇందులో బోధిసత్త్వుడి భార్యను నాగుడనే వాడు ఎత్తుకుపోతే వానరుల సాయంతో అతణ్ణి సంహరించి భార్యను కాపాడుకోవటం కథ. ఇది అచ్చంగా రామాయణమే. మరో కథలో దశరథుడు అయోధ్యను కాకుండా వారణాసిని పరిపాలించాడట.. అతని పెద్ద కొడుకు పేరు రామపండితుడు.. రెండో కుమారుడు లక్ష్మణపండితుడు.. మూడో కుమార్తె సీత.. ఇందులో సీతారామలక్ష్మణులను సోదరులని చెప్పుకొచ్చారు.. ఇది పూర్తిగా రామాయణ పాత్రలతో, దాని కథను ఇమిటేట్ చేస్తూ రాసిన జాతక కథ. దీనికి ఎలాంటి హేతువు లేదు. చైనాలోని ఖోటాన్‌లో ప్రచారంలో ఉన్న మరో రామాయణం కూడా ఇదే విధంగా వుంటుంది.

లావోస్‌లో రకరకాల రామకథలు ఉన్నాయి.. ఇందులో ఒకటి దశరథుడికి మండోదరి వల్ల సీత పుట్టిందనేది.. పరమ విచిత్రమైన కథ ఇది.. మరో కథలో సీత రావణాసురుడి ఉద్యానవనంలో ఒక చెట్టుకు పుట్టిందని చెప్తారు.. థాయ్‌లాండ్‌లో మరో చిత్రమైన కథ ప్రచారంలో ఉంది... థాయ్‌లాండ్‌కు సయాం అన్న పేరు కూడా ఉంది.. ఈ సయాంలో కూడా ఓ అయోధ్య నగరం ఉంది. రెండేళ్లు ముట్టడించినా శత్రు సైన్యాన్ని తట్టుకోగల దుర్గం ఇక్కడుంది.. క్రీస్తుశకం 1350 నుంచి 1417 దాకా 37 మంది రాజులు ఈ రాజ్యాన్ని పాలించారు. వీళ్లంతా రామభక్తులే.. వీళ్ల పేర్లన్నీ రాముడి పేరుతోనే ఉంటాయి.. ఈ సయాంలో ప్రచారంలో ఉన్న రామాయణం ప్రకారం మండోదరి కడుపులో లక్ష్మీదేవి లంకలో జన్మించింది. పుడుతూనే రావణుని చంపు అని మాట్లాడటంతో ఆమెను పెట్టెలో పెట్టి నీళ్లలో పారేశాడు.. ఆమె మిథిలా నగరాధిపతికి దొరికింది.

మన దేశంలోనే ఆనంద రామాయణం మరో కథను చెప్తుంది. పద్మాక్షుడనే రాజు మహాలక్ష్మిని కూతురుగా పొందాలని తపస్సు చేసి ఆమెను సాధించాడు. ఆమె స్వయంవర సమయంలో రావణుడు వచ్చి విధ్వంసం సృష్టించాడు. పద్మాక్షుడు మరణించాడు.. పద్మ అగ్నికుండంలో దూకింది.. ఆ తరువాత వేదవతిగా అవతరించింది.. ఆమెను చెరబట్టాలని చూసినప్పుడు ఆమె దహనమైపోయింది. ఆ బూడిదను రావణుడు లంకకు తీసుకుపోతే అక్కడ పాపగా అవతరించింది. ఆమెను పెట్టెలో ఉంచి సముద్రంలో పడవేశాడు.. ఆ పెట్టె జనకుడికి దొరికి ఆ పాప సీతగా పెరిగింది.. సీత పుట్టుక లంకకు చేటు అన్న సామెత ఈ కథ నుంచే పుట్టుకొచ్చింది. సీనియర్ ఎన్టీయార్ సీతారామకల్యాణం సినిమా ఈ కథను ఆధారం చేసుకునే రూపొందించారు. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా చాలా రామాయణాలు ఉన్నాయి.. ఇవేవీ మూల రామాయణంతో సంబంధం ఉన్నవి కావు.. రామాయణ గాథను ఆధారం చేసుకుని ఆ పాత్రలను కథలో ఉపయోగించుకుని రకరకాల కాలాల్లో రాసిన కథలే. అసలైన మూల రామాయణానికి దీనికి ఎలాంటి సంబంధం లేదు.. కథలో.. కథనంలో పోలికలు తప్ప. ప్రధాన కథతో వీటికి ఎలాంటి లింక్స్ లేవు. తమ తమ ప్రాంతాల్లో ప్రచారాల్లో ఉన్న కథల్ని, అమలులో ఉన్న ఆచారాల్ని కలగలుపుకుని రాసిన కథలే ఇవన్నీ.. కాకపోతే.. వీటిని మూల రామాయణంతో పోల్చి..ఆ కథని, ఈ కథని కలగలిపి.. రామాయణాన్ని కలగాపులగం చేసి రామాయణం ఇతిహాసాన్ని గందరగోళంలో పడేసే యత్నం చేశారు.. దాని విశ్వసనీయతను నష్టపరిచే ప్రయత్నం చేశారు. కానీ, కొంచెం కూడా సడలించలేక పోయారు.

రామాయణ సృష్టికర్త ఆదికవి వాల్మీకి. ఇందులో సందేహానికి తావు లేదు. వాల్మీకి రామాయణమే అసలైన రామకథ.. వాల్మీకి తరువాత ఎన్ని రామాయణాలు వచ్చినప్పటికీ అవన్నీ ఆయా రచయితలు అసలైన కథను బేస్ చేసుకుని కొత్తగా సృష్టించుకున్నవే తప్ప, మరేవీ కాదు. పాత్రల పేర్లు, ప్రచారంలో ఉన్న కథలు అన్నీ కూడా ఈ కల్పితాలకు

**సీత అంటే నాగటి చాలు. భూమి అధోజగత్తుకు ప్రతీక..అంటే కింది లోకాలకు ఉపరితలం భూమి.. వికసిస్తున్న చైతన్యానికి భూమిని సింబాలిక్‌గా భావిస్తారు. ఈ చైతన్యమే జనక మహారాజు' అన్నది వాల్మీకి కథాంశంలో ప్రధాన అర్థం. ఈయన తన నాగలితో భూమిలో దారి ఏర్పాటు చేసి అందులో దాగి ఉన్న కుండలిని శక్తిని పైకి తీసుకువచ్చాడు.. ఆమే సీత అయింది.**

మాత్రమే పరిమితమైనవి.. రాముడి కథకు, సీత చరిత్రకు ప్రామాణికం కేవలం వాల్మీకి రామాయణమే.. మరి సీత గురించి వాల్మీకి చెప్పింది ఏమిటి? వాల్మీకి రామాయణం ప్రామాణికంగా తీసుకోవటానికి కారణాలు చాలానే ఉన్నాయి. ఇందులో నిక్షిప్తమైన రామ కాల నిర్ణయం ఇందుకు మూలం.. భారతీయ నాగరికత ప్రాచీనతను ఇది నిరూపిస్తుంది.

ఇక సీత రాముడికి ఏమవుతుందన్న తొలి ప్రశ్న గురించి చర్చిద్దాం...

సీత భూమి నుంచి పుట్టింది.... కాబట్టి భూదేవి కుమార్తె..! ఈ వాదనే విడ్డూరమైంది. ఆమె భూమిలో ఒక పేటికలో దొరికింది.. భూమిలో జన్మించలేదు.. ఇది స్పష్టం. రామావతార కార్యంలో ప్రధాన పాత్ర పోషించేందుకు భూమి ఒడిలోనుంచి జనకుడి ఇంట ప్రవేశించింది. ఆమె ఎవరి కూతురూ కాదు. ఆమె అయోనిజ. సామాన్య మానవిలా తల్లి గర్భం నుంచి పుట్టిన యువతి కాదు. ఆనంద రామాయణం ప్రకారం చూసినా అగ్ని నుంచి పుట్టిన వేదవతి బూడిదగా మారి లంకలో పాపాయిగా అవతరించి, అక్కడి నుంచి పేటికలో ప్రవేశించి సముద్ర మార్గంలో మిథిలకు చేరుకుంది. అక్కడ భూమిలో జనకుడికి దొరికింది. అందువల్ల ఆమె భూదేవి కూతురు కాదు.. ఆమె ఈ భూమ్మీద అవతరించటం కోసం భూదేవిని ఒక మార్గంగా ఉపయోగించుకుంది. కాబట్టి సీతారాముల సంబంధాన్ని ప్రశ్నించే అవసరమే ఉత్పన్నం కాదు.

'సీత అంటే నాగటి చాలు అని అర్థం. భూమి అధోజగత్తుకు ప్రతీక.. అంటే కింది లోకాలకు ఉపరితలం భూమి.. వికసిస్తున్న చైతన్యానికి భూమిని సింబాలిక్‌గా భావిస్తారు. ఈ చైతన్యమే జనక మహారాజు' అన్నది వాల్మీకి కథాంశంలో ప్రధాన అర్థం. ఈయన తన నాగలితో భూమిలో దారి ఏర్పాటు చేసి అందులో దాగి వున్న కుండలిని శక్తిని పైకి తీసుకువచ్చాడు.. ఆమే సీత అయింది. మనిషిలో మూలాధారం నుంచి తల దాకా ఆరు చక్రాలు ఉంటాయని అంటారు. ఇందులో మూలాధారం నుంచి సహస్రారం దాకా కుండలిని సర్పరూపంలో ప్రయాణిస్తుందిట.. ఇందులో సీత మూలాధారం అయితే.. రాముడు సహస్రారం.

వాల్మీకి తన రామాయణం గురించి తానే స్పష్టంగా చెప్పుకున్నాడు.. రామాయణంలో రాముడి కథ ఎంత ప్రధానమో.. సీత కథ అంతే ప్రధానమన్నాడు. భూమ్మీద రాముడు దుష్టశిక్షణ కోసం అవతరిస్తే.. ఆయన తన లక్ష్యాన్ని చేరుకోవటానికి ప్రధానంగా

సహకరించింది సీతాదేవే. సీత లేకుంటే రావణ సంహారమనే రామకార్యం నెరవేరేదే కాదు. గగనతలంలో వేయికిరణాలతో ప్రకాశించే సూర్యుడే నారాయణుడు. సౌర మండలంలో మధ్యలో ఈయన ఉంటాడు. ఈ సూర్యనారాయణుడు తానే నాలుగు వ్యూహాలుగా మారి, నాలుగు వేదాలుగా మారి రామ లక్ష్మణ భరత శతృఘ్నులుగా పుట్టారట. రామావతార కథ భూమ్మీద దైవశక్తులను బలపరచటానికి, రాక్షస శక్తులను బలహీనం చేయటానికి ఉద్దేశించిందే. రాముడు ఆకాశం నుంచి దిగివచ్చిన చైతన్యమైతే.. సీతాదేవి భూమి నుంచి ఉబికి వచ్చిన మహాశక్తి. భూమ్యాకాశాల మధ్య విశ్వశ్రేయస్సును సాధించాలన్న లక్ష్యమే ఈ ఇద్దరి అవతారం. అందుకే సీతాదేవి ఎవరంటే.. చెప్పాల్సింది ఒకే ఒక్కమాట... ఆమె తాను ముందుండి రాముడిని నడిపించిన ఆదిశక్తి.

వాల్మీకి అరణ్యపర్వం మొదట్లోనే ఆమె చాలా స్పష్టంగా వివరిస్తుంది.. నేను మీకంటే ముందు నడుస్తూ దారిలో ఉన్న ముళ్లను, రాళ్లను తీసివేస్తానని.. తాను చెప్పినట్లుగానే ఆమె ముందే లంకకు చేరుకుంది.. రాక్షస శక్తులను బలహీనం చేసింది. త్రిజట లాంటి రాక్షసుల్లో కలలో కూడా నిద్ర లేకుండా చేసింది.. విభీషణుడి లాంటి సాత్వికులను రావణుడి నుంచి దూరం చేసింది. రావణుడికి సైతం భయాన్ని కలిగించింది.

శతకంఠ రామాయణం అనే మరో రామాయణంలో ఆదిపరాశక్తే సీతాదేవిగా అవతరించి రాముడి కంటే ముందే లంకకు చేరుకుని సర్వరాక్షస సంహారానికి పునాది వేసిందని పేర్కొంది. సీతారాముల కలయిక ఈ పరమ ప్రయోజనాన్ని సాధించటం కోసమేనన్నది స్పష్టం. వనవాసానికి రాముడితో బయలు దేరటం మొదలుకొని, మాయలేడి కావాలని కోరటం వంటివన్నీ కూడా రావణ సంహారానికి సీతాదేవి చేసుకుంటూ పోయిన దారిలో భాగమే.. ఈ కథలన్నీ పుట్టుకురావటానికి అసలు కారణం లేకపోలేదు. సమాజంలో అత్యంత విశ్వసనీయమైన ఆరాధ్య దైవాలుగా సీతారాములు శతాబ్దాల తరబడి కొనసాగు తున్నారు. ధర్మానికి నిలువెత్తు విగ్రహం ఎవరంటే రాముడని చెప్పే పరిస్థితి. పబ్లిక్ లైఫ్‌కు రోల్ మోడల్ ఎవరంటే సీతారాములు అనే పరిస్థితి. అలాంటి విశ్వాసం ఉన్న సమాజంలో వాళ్ల పేర్లతో, పాత్రలతో.. కథలతో ఏదైనా చెప్తే ఆ చెప్పేది మరింత విశ్వసనీయ మవుతుంది.. అందులో మంచి ఉండవచ్చు. చెడు ఉండవచ్చు. దేన్నైనా వ్యాపింపచేయటానికి తేలికైన మార్గం ప్రజల్లో బలంగా వేళ్లూనుకునిపోయిన నమ్మకాన్ని ఆసరా చేసుకుని నడవటం. అందుకే ప్రపంచ వ్యాప్తంగా ఇన్ని వేల రామాయణాలు పుట్టుకొచ్చాయి. దేన్నైనా అబ్సార్బ్ చేసుకునే ఫ్లెక్సిబిలిటీ ఈ దేశంలోని మెజారిటీ ధర్మంలో ఉంది కాబట్టే.. ఇన్ని పుట్టుకథలు.. పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. కానీ, సీతారాముల కథ భారతీయ జాతీయ మూలం.. ఈ మూలాన్ని ఛేదించటం వేల సంవత్సరాలుగా ఎవరివల్లా కాలేదు.. ఇకముందూ ఎవరికీ సాధ్యంకాదు.

# సేతువు కట్టిందెవరు?



రాముడి సేతువు కూడా ఇప్పటిదాకా ఓ మిస్టరీగానే ఉండిపోయింది. దీనిపై చర్చలు జరిగాయి. దీన్ని ధ్వంసం చేసేందుకు నిన్నమొన్నటి వరకు భారత ప్రభుత్వం తీవ్రంగా పూనుకుంది కూడా. ఇంతకీ ఈ రామ సేతువు నిర్మాణం వెనుక దాగిన రహస్యం ఏమిటి? ఇంతకాలం ఇదో మిస్టరీ.. ఇప్పుడు సైన్స్ నిరూపించిన వాస్తవం. పది వేల సంవత్సరాల నాటి మనిషి టెక్నాలజీకి నిదర్శనం.. ఇది రాముడి వంతెన.. రాముడి కోసం కట్టిన వంతెన.. రాముడు కట్టని వంతెన.. వేల సంవత్సరాల క్రితం నాటి మేధో మానవుడి సాంకేతిక పరిజ్ఞానానికి ప్రతీక. ఇదొక్కటే జవాబు చెప్తుంది. రామాయణపు కాలం నాడు సముద్రంపై నిర్మించిన వారధి ఎలాంటి టెక్నాలజీతో కట్టారో తేలిపోయింది. ఎవరు నిర్మించారో తెలిసిపోయింది. ఎన్ని రోజుల్లో ఏ విధంగా ఎలాంటి మెటీరియల్‌ను ఉపయోగించారో స్పష్టమైంది. రాముడి అస్తిత్వానికి 35 కిలోమీటర్ల పొడవైన సాక్ష్యం సముద్రంపై సాటిలేని నిర్మాణం... రోజుల వ్యవధిలో వందల మైళ్ల నిర్మాణం.. అత్యాధునిక పరిజ్ఞానం.

రామ సేతువు నిర్మాణాన్ని ఎవరు పర్యవేక్షణ చేశారు.. ఎలాంటి టెక్నాలజీని వాడారు?

ఇన్ని యుగాల తరువాత కూడా వంతెన ఆనుపానులు కొంతమేరకైనా కనిపించేంత గొప్ప టెక్నాలజీని ఏం వాడారు? వింటే ఆశ్చర్యమేస్తుంది.. వివరాలు తెలుసుకున్న కొద్దీ మన సాంకేతిక పరిజ్ఞానంలోని అద్భుతం ఆవిష్కారమవుతుంది. రామసేతువు రామాయణాన్ని నిజం చేస్తోంది. భారతీయ ప్రాచీన నాగరికతను నిరూపిస్తోంది. మన కేలండర్‌ను, కాల మానాలను వాస్తవాలని రుజువు చేస్తోంది. మన యుగ విభజనలోని నిజానిజాలను స్పష్టంగా చెప్తోంది. లక్షల సంవత్సరాల కాలం నాడే మన మేధస్సు ఎంత గొప్పదో తెలియ జెప్తోంది. రామాయణాన్ని అంతా కలిపి మూడు ముక్కల్లో చెప్పేయమంటే– కట్టె, కొట్టె తెచ్చె అని చెప్తారు. అందులో మొదటిది కట్టె.. అంటే వారధి కట్టె అని అర్థం.. వారధి ఎందుకు కట్టాడు? సముద్రాన్ని దాటి లంకకు చేరుకోవటానికి. సీతాదేవి లంకలో ఉన్న విషయాన్ని ఆంజనేయుడు కనుక్కుని వచ్చి చెప్పగానే వానర సైన్యాన్ని వెంటబెట్టుకుని రాముడు లంకకు బయలు దేరాడు. అక్కడ సముద్రాన్ని దాటేందుకు రాముడికి ఎలాంటి ఉపాయం తోచలేదు. అప్పుడు సముద్రుణ్ణే ఉపాయం చెప్పమని కోరాడట.. అప్పుడు సముద్రుడు తనమీదుగా వంతెన కట్టుకుని వెళ్లమని సలహా ఇచ్చాడట... అలా ఏర్పడిందే వారధి.

రాముడు ప్రతి రాయిని తాకగానే అది తేలికపాటిదయిందని ఒక కథ. ఆ రాళ్లను నీటిలో వేయగానే అవి తేలిపోయాయట.. ఇలా వానరసైన్యం రామసేతువును చిటికెలో నిర్మించేసింది. ఇది నమ్మశక్యమేనా? రాముడు దాటాల్సిన సముద్రం నూరు యోజనాలు. ఒక యోజనం అంటే 13 కిలోమీటర్లు. వంద యోజనాలు అంటే, 1300 కిలో మీటర్లన్నమాట.. ఇన్ని కిలోమీటర్ల పొడవున వారధి నిర్మించటం అదీ కొన్ని రోజుల్లో పూర్తి చేయటం ఎలా సాధ్యపడింది. అదీ నీళ్లపై తేలే రాళ్లతో.. ఎన్ని రాళ్లు తెచ్చారు.. ఎంత మంది పని చేస్తే ఇది సాధ్యపడింది? ఎంత సూపర్ టెక్నాలజీ అందుబాటులో వున్నా ఇన్ని వందల కిలోమీటర్ల వారధిని రోజుల్లో ఎలా నిర్మించగలిగారు? ఇలాంటి నిర్మాణాన్ని ఈ కాలంలో చేపట్టడం సాధ్యం కాదని చెప్పే శాస్త్రవేత్తలే.. రామ సేతు నిర్మాణం సాధ్యపడిందని అంటున్నారు. ఆ కాలంలో ఇవి ఖచ్చితంగా సాధ్యపడ్డాయని అంటున్నారు. హిందూ మహా సముద్రంలోనే కాదు... అట్లాంటిక్ మహా సముద్రంలోనూ ఇలాంటి వారధిని పోలిన నిర్మాణాలున్నాయని చెప్తున్నారు. కాకపోతే వీటన్నింటికంటే రామ సేతువు మరీ ప్రాచీనమైంది అని నాసా పరిశోధనలో స్పష్టమైంది.

రామసేతువు గురించి క్రీస్తు శకం 1747లో తొలిసారి చర్చ జరిగింది. ఒక డచ్ కార్టోగ్రాఫర్ సేతువు ఉన్న సముద్రాన్ని చూసాడు. కానీ, ఇది ఏ కాలం నాటి వంతెన అన్నది అతనికి అంతు పట్టలేదు. పదేళ్ల క్రితం అమెరికా అంతరిక్ష పరిశోధన సంస్థ నాసా దీని ఆనుపానులను బయటపెట్టింది. అచ్చంగా ఇది మనిషి నిర్మించిన వంతెనే అని తేల్చి చెప్పింది. రామేశ్వరం.. భారత దేశానికి దక్షిణాన ఉన్న సరిహద్దు.. ఇక్కడ సముద్రంపై రైలు, రోడ్డు వంతెనలు అద్భుతంగా ఉంటాయి. రైలు వంతెనపై వెళ్తుంటే దూరంగా



**జియోగ్రాఫికల్ నిర్మాణాల గురించి రామాయణం తప్ప మరే హిందూ ఇతిహాసం కానీ, పురాణం కానీ లోతుగా చర్చించిన దాఖలా కనిపించదు. రామ సేతువును సుగ్రీవుడి సైన్యంలోని నలుడు, నీలుడనే ఇంజనీర్లు నిర్మించారు. వీరిలో నలుడు విశ్వకర్మ కుమారుడు. వీళ్లిద్దరి ఇంజనీరింగ్ పర్యవేక్షణలోనే రాముడి సేతువు నిర్మాణం జరిగింది.**

వరుసగా నీటిలో తేలుతున్న రాళ్లు కనిపిస్తాయి. దాదాపు 35 కిలోమీటర్ల పొడవున ఉన్న రాతి వంతెన అది.. శ్రీరామ చంద్రుడు రావణుడిపై యుద్ధానికి వెళ్లినప్పుడు నిర్మించిన వంతెన ఇది. 1804లో బ్రిటిష్ ప్రభుత్వం ఆడమ్స్ బ్రిడ్జ్ అని పేరు పెట్టుకుంది. బైబిల్ ప్రకారం భూమిపై తొలి మానవుడు ఆడమ్స్.. ఈ బ్రిడ్జి కూడా ఆడమ్ కాలంనాటి మనుషులు కట్టిందేనని వాళ్లూ విశ్వసించారు. అంతే కాదు.. ఇక్కడ చాలా కీలకమైన అంశం ఏమంటే.. పాక్ జలసంధికి, లంకలోని మన్నార్ తీరప్రాంతానికి ఇసుక రాళ్ల చైన్‌తో ఉన్న ఒకే వంతెన ఇది... లంకకు చేరుకోవటానికి మరో మార్గం ఇక్కడెక్కడా కనిపించదు. రామసేతువును సముద్ర జలాలపై సముద్రుడి సహాయంతో నిర్మించారని వాల్మీకి రామాయణం చెప్తుంది. సేతువుపై లభించిన ఇసుక రాళ్లు వేల సంవత్సరాల పాతవేనని పురావస్తు శాస్త్రవేత్త దుబే నిరూపించారు. సైంటిఫిక్ డేటింగ్ ప్రకారం ఈ వంతెన వయసు పదివేల సంవత్సరాలు. హిందూ శాస్త్రాల ప్రకారం త్రేతాయుగంలో రామాయణం జరిగింది. ఈ యుగం 12లక్షల 96వేల సంవత్సరాలు, ద్వాపర యుగం 8లక్షల 64వేల సంవత్సరాలు, కలియుగం మనం చూసింది ఇప్పటి వరకు అయిదున్నర వేల సంవత్సరాలు. త్రేతాయుగం చివరలో రామాయణం, రావణ వధ జరిగాయి. ఈ ప్రకారం చూసుకుంటే రామ సేతువును 8లక్షల 69వేల సంవత్సరాల క్రితం నిర్మించారు. కానీ, తాజాగా నిర్ధారణ జరిగిన రామాయణ కాలవ్యవధి ప్రకారం ఈ వంతెన పదివేల సంవత్సరాల క్రితం నాటిది. రామాయణంలో పేర్కొన్న గణాంకాలను బట్టి నిర్ధారించిన చారిత్రక కాలమిది. జియోగ్రాఫికల్ నిర్మాణాల గురించి రామాయణం తప్ప మరే హిందూ ఇతిహాసం కానీ, పురాణం కానీ లోతుగా చర్చించిన దాఖలా కనిపించదు. రామ సేతువును సుగ్రీవుడి



**కేవలం నీటిపై తేలే రాళ్లతోనే మొత్తం వంతెన నిర్మాణం జరగలేదు. దీని వెనుక టెక్నాలజీ చూస్తే ఎవరికైనా తల తిరిగి పోవాల్సిందే. మొదట సముద్ర గర్భంలో సాండ్‌బెడ్ వేసుకుంటూ వెళ్లారు.. దానిపైన వుడెన్ కుషను నిర్మించారు.. ఆపైన బరువైన రాళ్లను.. ఆపైన లైట్‌వెయిట్ రాళ్లను వేసుకుంటూ వెళ్లారు. నాలుగు లేయర్లను సమాంతరంగా వేసుకుంటూ వెళ్లారు.. దీని పొడవు వెడల్పు కూడా చాలా సైంటిఫిక్‌గా, సపోర్టివ్‌గా ఉండేలా చూసుకున్నారు.**

సైన్యంలోని నలుడు, నీలుడనే ఇంజనీర్లు నిర్మించారు. వీరిలో నలుడు విశ్వకర్మ కుమారుడు. వీళ్లిద్దరి ఇంజనీరింగ్ పర్యవేక్షణలోనే రాముడి సేతువు నిర్మాణం జరిగింది. లక్షల సంవత్సరాలైనా, ఆటుపోట్లను తట్టుకుని నిలబడింది. ఇది ఎంతమాత్రం ఫాంటసీ కాదు.. రామాయణం నిజంగా ఫాంటసీయే అయితే, వాల్మీకి లాంటి వాడికి రామాయణాన్ని ఫాంటసైజ్ చేయటం పెద్ద కష్టమేం కాదు.. రాముడు తన బాణాలతోనే లంక దాకా వారధి క్షణంలో కట్టేశాడని రాసేవాడు.. దాన్ని ఎవరూ తప్పుపట్టే వారూ కారు.. కానీ, ఇది చరిత్ర కనుకనే నలుడి నిర్మాణ నైపుణ్యాన్ని గురించి ఆయన స్పష్టంగా క్లారిఫై ఇచ్చారు. రామ సేతువు నిర్మాణం ఎలా జరిగింది? ఇదొక పెద్ద చర్చ... రాముడి పధ్నాలుగేళ్ల వనవాసం పూర్తి కావస్తున్న సమయంలో సీతాపహరణం జరిగింది. ఆమె అన్వేషణకే పది మాసాలు పట్టింది. రాముడి ముందున్నది రెండు మాసాలే.

గడువు పూర్తికాగానే తిరిగి రాకపోతే ప్రాయోపవేశం చేసేస్తానని భరతుడు ముందే వార్నింగ్ ఇచ్చాడు. దీంతో ఈ కొద్ది సమయంలోనే సీతాదేవిని తీసుకుని అయోధ్య చేరుకోవాలి.. ఈ కొద్ది సమయంలోనే వారధి నిర్మాణం జరిగింది.. యుద్ధం పూర్తయింది. ఇదంతా ఎలా జరిగింది? అదే ఇక్కడ ఇంటరెస్టింగ్ థింగ్ మరి.. రావణ వధకోసం రామేశ్వరం సమీపంలో సముద్ర తీరానికి చేరినప్పుడు రాముడి సైన్యం ఎంతో తెలుసా? అక్షరాలా పది మిలియన్లు.. మానవ, వానర సైన్యం అంతా కలిపి కోటి మంది.. ఇదెలా సాధ్యమని విడ్డూర పోకండి.. ఆయన ఉత్తర భారతం నుంచి దక్షిణ భారతం దాకా తరలి వచ్చాడు.. అప్పుడు అఖండ భారతావని జనాభా ఎంతుంటుందో ఊహించుకోవచ్చు. భారత యుద్ధంలోనే 34లక్షల మంది చనిపోయారు. రామాయణ కాలం నాటి రాముడి సైన్యం కోటి మంది పెద్ద అసాధ్యమైన విషయమేం కాదు. దక్షిణ భారతంలోని ప్రజలంతా

రాముడి పక్షాన నిలిచి రావణుడితో పోరుసలిపారు. ఈ కోటి మంది కలిసి రామ సేతువును అయిదు రోజుల్లో నిర్మించారు. వింటే ఆశ్చర్యం వేయవచ్చు. కానీ, ఇదే వాస్తవం.

***మొదటి రోజు 14 యోజనాలు..***

***రెండో రోజు 20 యోజనాలు..***

***మూడో రోజు 21 యోజనాలు..***

***నాలుగో రోజు 22 యోజనాలు..***

***అయిదో రోజు 23 యోజనాలు..నిర్మించారు.***

అయిదు రోజుల్లోనే నిర్మించారు కాబట్టి రావణుడి నిఘా వర్గాలు సైతం ఈ వారధిని పసిగట్టలేకపోయాయి. ఈ నిర్మాణాన్ని పూర్తిగా పర్యవేక్షించిన వాడు నీలుడు. నలుడు డిజైనింగ్ చేశాడు. ఈ నీలుడు కిష్కింధకు చెందిన వాడు. అంటే ఇప్పుడున్న కర్ణాటక. అంటే దక్షిణ భారతానికి చెందిన వాడు. వారధి నిర్మాణంలో హనుమంతుడికి కానీ, రాముడికి కానీ ఎలాంటి ప్రమేయం లేదు. అయితే వంతెన నిర్మాణం ఎలా జరిగిందన్నది మరో ప్రశ్న.. కేవలం నీటిపై తేలే రాళ్లతోనే మొత్తం వంతెన నిర్మాణం జరగలేదు. దీని వెనుక టెక్నాలజీ చూస్తే ఎవరికైనా తల తిరిగి పోవాల్సిందే. మొదట సముద్ర గర్భంలో సాండ్‌బెడ్ వేసుకుంటూ వెళ్లారు.. దానిపైన వుడెన్ కుష్‌ను నిర్మించారు.. ఆ పైన బరువైన రాళ్లను.. ఆ పైన లైట్‌వెయిట్ రాళ్లను వేసుకుంటూ వెళ్లారు. నాలుగు లేయర్లను సమాంతరంగా వేసుకుంటూ వెళ్లారు.. దీని పొడవు వెడల్పు కూడా చాలా సైంటిఫిక్‌గా, సపోర్టివ్‌గా ఉండేలా చూసుకున్నారు. ఎందుకంటే చాలామంది బరువును మోయాల్సింది కాబట్టి. త్రేతాయుగం నాటి మానవులు పన్నెండు నుంచి పధ్నాలుగు అడుగుల ఎత్తు వున్నట్లు ఆధారాలు కూడా మనకు ఉన్నాయి. సింధునాగరికతలోనే 12 అడుగుల జెయింట్ హ్యూమన్ అస్థిపంజరం మనకు లభించింది. రాముడు పట్టుకున్న ధనుస్సు పదహారు అడుగులు ఉందని రామాయణం చెప్తోంది. అందువల్ల ఆనాటి మనుషులు బలిష్ఠులు, భారీకాయులు కావటం వల్ల కూడా నిర్మాణం సులువుగా, తేలిగ్గా జరిగింది. అందుకే ఈ నిర్మాణాన్ని అండర్ ఎస్టిమేట్ చేయటం సరికాదు.

ఇవాళ పాక్ జలసంధిలో కనిపిస్తున్న రామసేతువు నిర్మాణం ఈ టెక్నాలజీని పూర్తిగా బలపరుస్తోంది. కేవలం నీటిపై తేలే రాళ్లే అయితే, దాన్ని ధ్వంసం చేయాలన్న సర్కారు ప్రయత్నం నెరవేరటం తేలికే అయ్యేది. కానీ, తేలే రాళ్ల కింద ఉన్న మహా నిర్మాణాన్ని ధ్వంసం చేయటం అంత ఈజీ కాదు. రామ సేతువు.. భారత దేశానికే కాదు.. ప్రపంచంలో సంపూర్ణంగా జంతువు నుంచి ఎదిగిన తరువాత మానవుడి విజ్ఞాన నైపుణ్యానికి తిరుగులేని సాక్ష్యం. భగవంతుడిగా ఎదిగి పోయిన మానవుడి చరిత్రకు మాసిపోని నిదర్శనం.

# రాముడు ఎలా గెలిచాడు?



సేతువు సంగతి తేలిపోయింది. కానీ, అసలు సంగతి మిగిలే ఉంది. రామాయణం ప్రధాన లక్ష్యం రావణ వధ.. ఇది ఎలా జరిగింది? పురాణాల కథనాల ప్రకారం విష్ణుమూర్తి అప్పటికే ఆరు అవతారాలు ధరించాడు.

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, పరుశురామ అవతారాలన్నీ క్షణాల్లో ముగిసిపోయినా.. శత్రువును నిర్నిరోధంగా హతమార్చినవే ఈ అవతారాలన్నీ. ఒక్క పరుశు రాముడి అవతారం ముగించటానికి కొంత టైం పట్టిందేమో కానీ, ఏ అసురుడిని శిక్షించటానికైతే అవతారాన్ని ధరించాడో.. వచ్చిన పనిని సెకన్ల వ్యవధిలో కానిచ్చేసుకుని చక్కా వైకుంఠానికి వెళ్లిపోయాడు. తనను ఎదిరించే కనీస గడువు కూడా శత్రువుకు ఇవ్వకుండా అంతం చేసిన అవతారమూర్తి, రాముడుగా ఆవిర్భవించిన తరువాత ఆ నారాయణుడు దైవత్వాన్ని ఎందుకు ప్రదర్శించలేదు? రావణుణ్ణి తన దివ్యశక్తితో ఎందుకు సంహరించలేదు? దైవశక్తుల్ని ప్రయోగించనప్పుడు.. రావణుణ్ణి ఎలా చంపగలిగాడు?

లంక ఓ మహా సామ్రాజ్యం.. బలవంతుడైన రాజు.. అత్యాధునిక ఆయుధ సంపత్తి.. సూపర్ సోనిక్ వెపన్స్.. సుశిక్షితమైన సేనావాహిని, చతురంగబలాలు.. ఒక్కొక్కరు వంద మందినైనా చంపగల యోధులు ఉన్న రావణుడు ఎదురులేని వాడు.. ముల్లోకాలను జయించిన వాడు.. నేలపై ఉండి యుద్ధం చేయగలడు.. ఏరియల్ అటాక్స్ చేయగలడు.. మిస్సైల్ టెక్నాలజీ తెలిసిన వాడు.. అలాంటి యోధుణ్ణి జయించటం ఎవరికైనా ఎలా సాధ్యం? ఈయనేమో పధ్నాలుగేళ్లు అడవుల్లో గడిపి వచ్చాడు. నారచీరలు.. కందమూలాల ఆహారం.. చేతిలో కోదండం.. అమ్ములపొదిలో బాణాలు.. వెన్నంటి ఉన్న అడవిలో తిరిగే వానరాలు.. రాళ్లూ రప్పలు విసరడం తప్ప కోతులకు యుద్ధ నైపుణ్యం ఎక్కడిది.. ఇద్దరు అన్నదమ్ముల దగ్గర ధనుర్బాణాలు తప్ప మరేవీ లేవాయె.. కనీసం రథం కూడా లేదు.. వెంట ఉన్న సైన్యమేమో.. అడవుల్లో తిరిగే కోతులు.. ఎలుగుబంట్ల జాతుల వారు.. వీరితో పాటు ఉత్తర భారతం నుంచి దక్షిణాపథం వరకూ వెంట వచ్చిన జనసమూహం ఉంది. సంఖ్య ఎక్కువే అయినా.. రావణుడి రణనీతి ముందు వీరంతా బలాదూరే.

కోతి బుద్ధులు కోటి.. ఇలాంటి వాళ్లను వెంటేసుకుని వెళ్లిన రాముడు రావణాసురుని గెలవటం ఎలా సాధ్యమైంది? కేవలం దేవుడు కాబట్టే అలా జరిగిందా? కేవలం రాముడి దగ్గరే అంతులేని శక్తి ఉందా? లేక మరేదైనా కారణం ఉందా?

రామావతారంలో ఎక్కడా దైవశక్తి ప్రదర్శన కొంచెం కూడా కనిపించదు. అలాంటప్పుడు రాముడి శక్తిసామర్థ్యాలు ఏపాటివి? ఆయన బలాబలాలు.. యుద్ధ వ్యూహాలు ఏమిటి? పోనీ అయోధ్యలో ఉన్నాడంటే.. అక్కడి సైన్యం తోడైనా ఉండేది.. కానీ, రాముడికి ఉన్న యుద్ధనీతి ఏమిటి?

రావణుడి కడుపులో అమృతం ఉందని విభీషణుడు చెప్పటం.. లేదు లేదు.. ధర్మానికి విరుద్ధంగా.. నేను కడుపుపై బాణం వేయనని రాముడు అనటం.. హనుమంతుడు గాలిని పార్థించటం.. బాణం కాస్తా దారి మళ్లి కడుపులో గుచ్చుకోవటం ఇదంతా రామాయణ యుద్ధంలో వాస్తవంగా జరిగిందా?

అసలు ఓ వ్యక్తి కడుపులో అమృతం ఉన్న కుండను దాచుకోవటం సాధ్యమయ్యేపనేనా? ఒకవేళ రావణుడి కడుపులో అమృతభాండం ఉందని కాసేపు అనుకుందాం. దేవతలకు అమృతం దొరికిన తరువాత వాళ్లు దాన్ని తాగి.. తమ రక్తంలో కలిపేసుకుని చిరంజీవులయ్యారు. అంతే కానీ, గిన్నెల్లోనో.. కుండల్లోనో నింపుకుని కడుపుల్లో దాచుకోలేదు. అమృతం తాగితే చిరంజీవులు అవుతారు కానీ, సీల్ చేసి కడుపులో పెట్టుకుంటే ఎలా చిరంజీవి అవుతారు? అలాంటప్పుడు రాముడు కడుపులోకి బాణం కొట్టి అమృతభాండాన్ని బద్దలు చేయటం ఏమిటి? దీని వెనుక ఉన్న లాజిక్ ఏమిటి?

రామాయణంలో ఒకటి రెండు సందర్భాల్లో తప్ప ఆయన విష్ణువుగా.. అవతార పురుషుడిగా మనకు కనిపించడు. ఒక మనిషి తానుగా ఎలా ఎదగాలి.. శక్తి సామర్థ్యాలు ఎలా సంపాదించుకోవాలి? విజేతగా ఎలా నిలవాలి? అన్నవాటిని అక్షరాలా తాను చేసి చూపించినవాడు శ్రీరామచంద్రుడు.

నేను మనిషిని.. మనిషి ధర్మమే నాది.. ఈ భూమ్మీద ఎలాంటి అధర్మపు నీడను కూడా నేను సహించను అని అరణ్యకాండలో రాముడు విస్పష్టంగా చెప్పాడు. కాబట్టి శ్రీరామచంద్రుడు అవతారపురుషుడే అయినా ఖచ్చితంగా సాధారణ మనిషి లాగానే తానూ ప్రవర్తించాడు. ఆయన ఒక రాజుగా తాను చేయవలసిందంతా చేశాడు. ధర్మాన్ని అతిక్రమించిన వాళ్లు ఎంతటి వారైనా శిక్షించాడు. యుద్ధ రంగంలో అలా వెళ్లి ఏవో దివ్యశక్తులతో రావణుణ్ణి దండించలేదు. చిన్నప్పటి నుంచీ రాముడు ఒక లక్ష్యంతో పెరిగాడు. అన్ని విద్యలూ నేర్చుకున్నాడు. ఏ ఆయుధాన్ని, ఏ అస్త్రాన్ని ఎలా ప్రయోగించాలో పూర్తి నైపుణ్యంతో నేర్చుకున్నాడు. చిన్నతనంలో గురువు దగ్గర విద్యాభ్యాసానికి వెళ్లటానికి ముందే ధనుర్విద్య ప్రారంభించాడు. భారత కాలం నాటికి చాలా ఆయుధాలు రంగంలోకి వచ్చాయి కానీ, త్రేతాయుగంలో మాత్రం విల్లే ప్రధాన ఆయుధం.. ఇంద్రజిత్తు, రావణుడు, రాముడు,



**రాముడికి ధనుర్విద్యలో ఓనమాలు నేర్పింది ఎవరో తెలుసా? ఎవరైతే ఆయన్ను అడవులకు పంపాలని భర్తను డిమాండ్ చేసిందో ఆమే.. కైకేయి. మొదట్నుంచీ ఆమె టార్గెట్ రాముణ్ణి రావణాంతకుడిగా తయారు చేసి పంపిచాలన్నదే.. అందుకోసమే మొదట్నుంచీ రాముణ్ణి పెంచి పెద్ద చేసింది కైకేయే.. ధనుర్విద్యను రాముడు మొదట ఆమె దగ్గరే నేర్చుకున్నాడు. ఆ తరువాత విశ్వామిత్రుడితో యాగరక్షణ పేరుతో అడవికి వెళ్లి ఆయన దగ్గర అనేక అస్త్రాలను ప్రయోగించటం, ఉపసంహరించటం నేర్చుకున్నాడు.**

లక్ష్మణుడు అంతా విల్లుతో యుద్ధం చేసిన వాళ్లే.

రాముడికి ధనుర్విద్యలో ఓనమాలు నేర్పింది ఎవరో తెలుసా? ఎవరైతే ఆయన్ను అడవులకు పంపాలని భర్తను డిమాండ్ చేసిందో ఆమే.. కైకేయి. మొదట్నుంచీ ఆమె టార్గెట్ రాముణ్ణి రావణాంతకుడిగా తయారుచేసి పంపిచాలన్నదే.. అందుకోసమే మొదట్నుంచీ రాముణ్ణి పెంచి పెద్ద చేసింది కైకేయే. ధనుర్విద్యను రాముడు మొదట ఆమె దగ్గరే నేర్చుకున్నాడు. ఆ తరువాత విశ్వామిత్రుడితో యాగరక్షణ పేరుతో అడవికి వెళ్లి ఆయన దగ్గర అనేక అస్త్రాలను ప్రయోగించటం, ఉపసంహరించటం నేర్చుకున్నాడు. ఆనాటి కాలంలో అతి ముఖ్యమైన బల అతిబల విద్యలను కూడ విశ్వామిత్రుడి దగ్గరే రాముడు నేర్చుకున్నాడు. రాముడు అడవికి వెళ్లే నాటికే పూర్తిస్థాయిలో యుద్ధవిద్యల్లో ఆరితేరినవాడు. అడవుల్లో పధ్నాలుగేళ్లు వనవాస జీవితం గడిపినా.. సాధువులా ఉండలేదు. దండకారణ్యానికి రావణుడి ప్రతినిధిగా, మన పరిభాషలో గవర్నర్‌లుగా వ్యవహరిస్తున్న ఖరదూషణులను.. వారి దగ్గరున్న 14వేల మంది సైన్యాన్ని అంతం చేశాడు. శూర్పణకను ఆయన తమ్ముడు పరాభవించి పంపాడు.

ఒక్కమాటలో చెప్పాలంటే మొదట్నుంచీ మనం ఏ విద్యనైనా ఎలా నేర్చుకుంటామో.. రాముడూ అలాగే నేర్చుకున్నాడు. మహారాక్షస సంహారానికి వ్యూహాత్మకమైన రణతంత్ర ప్రయోగాన్ని చేశాడు. తాను అడవికి వెళ్లింది రావణ సంహారానికని రాముడికి స్పష్టంగా తెలుసు.. మొదట మారీచ సుబాహుల ద్వారా తాను వచ్చానన్న సంకేతాన్ని రావణుడికి పంపించాడు. ఆ తరువాత ఖరదూషణులను చంపటంతో అతణ్ణి కవ్వించినట్లయింది. శూర్పణక పరాభవంతో రావణుడు పూర్తిగా రాముడి ఎత్తుగడకు పడిపోయాడు.. పరుగులు పెడుతూ దండకారణ్యానికి వచ్చి చేయరాని తప్పిదాన్ని, సీతాపహరణం రూపంలో చేసేశాడు. రాముడు లంకలో ప్రవేశించటానికి ముందే చాలా పక్కాగా ప్లాన్ చేసుకున్నాడు. సీతాదేవిని

ఏ వైపు రావణుడు తీసుకెళ్లాడో జటాయువు ముందే చెప్పాడు. అందుకే హనుమంతుడిని అటువైపు పంపించాడు. అతను లంకకు వెళ్లి సీతమ్మ జాడను తెలుసుకోవడం కంటే చాలా పెద్దపనే చేశాడు. దీంతో రాముడి గెలుపు చాలా సులువైంది.

ఆంజనేయుణ్ణి లంకకు పంపించటం వెనుక రాముడి రణతంత్రాన్ని రావణుడు ఊహించలేకపోయాడు. హనుమంతుడు.. సీత జాడతో పాటు రావణుడి వ్యూహాత్మక యుద్ధ స్థావరాలను ధ్వంసం చేశాడు. అతడి కుమారుల్లో ఒకడైన అక్షయుణ్ణి హతమార్చాడు. వైమానిక దాడుల కోసం రావణుడు ఉపయోగించే విమానాశ్రయాలను ధ్వంసం చేశాడు. ఆయుధాగారాలను దగ్ధం చేశాడు.

వానరులు.. గోలాంగూలాలు.. భల్లూకులు రాముడి సేనావాహినిలో మూడు ప్రధాన విభాగాలుగా ఉన్నాయి. లంకకు చేరుకున్న తరువాత మూడు వైపుల మూడు దళాలను మోహరించాడు. అదే సమయంలో అన్నతో గొడవపడి వచ్చిన విభీషణుణ్ణి తన శిబిరంలోకి చేర్చుకోవటం యుద్ధనీతిలో భాగమే. శత్రువు బలాలు.. బలహీనతల గురించి తెలుసుకుని దానికి తగ్గట్టుగా యుద్ధవ్యూహం పన్నటానికి ఇతను ఆసాంతం రాముడికి ఉపయోగపడ్డాడు.

అదే సమయంలో రావణుడు కూడా తన నిఘా వర్గాలను అలర్ట్ చేశాడు. ఇద్దరు సీక్రెట్ ఏజెంట్లు రాముడి వెంట ఉన్న సైన్యం వివరాలను, శక్తి సామర్థ్యాలను రావణుడికి వివరించారు. రావణుడు తన దగ్గరున్న దుర్భిణి(మైక్రోస్కోప్) ద్వారా రాముడి సైన్యాన్ని చూసి ఓ అంచనాకు వచ్చాడు. దాదాపు 18 మంది సేనా నాయకులు రావణుడి సైన్యాన్ని పటిష్ఠంగా నడిపిస్తున్నారు. ప్రహస్తుడు.. ఇంద్రజిత్తు, నికుంభుడు, విరూపాక్షుడు లాంటి వారుండగా.. తానూ, కుంభకర్ణుడూ యుద్ధానికి వెళ్లాల్సిన అవసరం రానే రాదనుకున్నాడు రావణుడు. విరూపాక్షుణ్ణి నగరం మధ్యలో ఉంచి.. మిగతా వీరులను లంకానగరానికి నాలుగు ద్వారాల దగ్గరా మోహరించాడు. అదే విధంగా రాముడు కూడా తన వీరులను నాలుగువైపులా పంపాడు. ఓ వైపు లంకపై వానరసేన ముప్పేటదాడికి పూనుకుంది. మరోవైపు ఇంద్రజిత్తు రామలక్ష్మణులపై నాగాస్త్రాన్ని ప్రయోగించాడు. దాంతో ఇద్దరూ మూర్ఛపోయారు. గరుత్మంతుడు వచ్చి వాళ్లను విడిపించాల్సి వచ్చింది.

ప్రహస్తుని నీలుడు హతమార్చాడు. ఇంద్రజిత్తును హతమార్చటానికి లక్ష్మణుడు చాలా కష్టపడాల్సి వచ్చింది. చివరకు ఒకరాత్రి మూర్ఛపోయిన లక్ష్మణుణ్ణి అంజనేయుడు తెచ్చిన సంజీవనీ మూలికలతో సుశేనుడు బతికించాడు. చివరకు రావణుడు రంగంలోకి ప్రవేశించక తప్పలేదు. రావణుడి భీకర యుద్ధానికి సుగ్రీవుడు మూర్ఛపోయాడు. అతని పిడికిలి దెబ్బకు హనుమంతుడు కంపించిపోయాడు. రావణుడు విసిరిన శక్తికి లక్ష్మణుడు సొమ్మసిల్లి పడిపోయాడు.. ఆ తరువాత హనుమంతుడు రాముడిని తన భుజాలపై ఎక్కించుకుని అసురుడిపైకి ఉరుకురికి వెళ్లాడు. రాముడి బాణాలకు రావణుడి రథం, గుర్రాలు.. ధ్వంసం



**రాముడు దేవుడిలా కంటే మామూలు మనిషిలాగానే వీరోచితంగా పోరాడాడు.. యుద్ధంలో ఆయన శరీరం కూడా గాయపడింది.. నువ్వానేనా అన్న స్థాయిలో యుద్ధం చేశాకే రాముడు గెలిచాడు. అంతే కానీ.. ఏదో దివ్యశక్తులతో ఓ సుదర్శన చక్రాన్ని సింపుల్‌గా ప్రయోగించి రావణుణ్ణి చంపలేదు.**

అయ్యాయి. మర్నాడు కుంభకర్ణుడు సీన్‌లోకి వచ్చాడు. ఇతని దెబ్బకు హనుమంతుడు రక్తం కక్కుకున్నాడు. మిగతా వానరవీరులు వాడి విదిలింపులకే మూర్ఛపోయారు. ఆ తరువాత రాముడు రెండు గొప్ప అస్త్రాలను ప్రయోగించి అతణ్ణి హతమార్చాడు.

మూడో రోజున తిరిగి రావణుడితో భీకరమైన యుద్ధం జరిగింది. రామరావణుల శరీరాలు రక్తసిక్తమయ్యాయి. రావణుడితో సమానంగా పోరాడటం కోసం ఇంద్రుడు తన రథాన్ని పంపించాడు. రావణుడి తలల్ని నూటొక్క సార్లు తెగనరికినా అవి తిరిగి మొలుస్తూనే ఉన్నాయి. చివరకు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ బ్రహ్మాస్త్రం రావణుడి గుండెను చీల్చేసింది. అలా రాముడు రావణుణ్ణి హతమార్చాడు. రావణ వధ అంతా చెప్పుకుంటున్నట్టు విజయదశమి నాడు జరగలేదు. యుద్ధకాండ(92/64)లో చెప్పినట్టు అమావాస్య రోజున చోటు చేసుకుంది.

రావణుడిని వధించిన సమయంలో రాముడు జయ నినాదం చేశాడు. ఓ చేత్తో ధనస్సును.. మరో చేత్తో బాణాణ్ణి పట్టి తిప్పుతూ రక్తంతో ఎరుపెక్కిన శరీరంతో నిలుచున్నాడు. రాముడు దేవుడిలా కంటే మామూలు మనిషిలాగానే వీరోచితంగా పోరాడాడు.. యుద్ధంలో ఆయన శరీరం కూడా గాయపడింది.. నువ్వానేనా అన్న స్థాయిలో యుద్ధం చేశాకే రాముడు గెలిచాడు. అంతే కానీ.. ఏదో దివ్యశక్తులతో ఓ సుదర్శన చక్రాన్ని సింపుల్‌గా ప్రయోగించి రావణుణ్ణి చంపలేదు. తాను ఒక మనిషిగా.. మనిషి జీవితంలో విశ్వవిజేతగా నిలవాలంటే ఏ విధంగా ఉండాలో.. ఏం చేయాలో రాముడు అది చేసి చూపించాడు. మనిషిలో ఉండాల్సిన అన్ని కోణాలను రాముడు చూపించగలిగాడు కాబట్టే ఆయన లోకనాయకుడయ్యాడు.

# రావణ రహస్యం



రావణ లంక దొరికింది.. సీతను దాచిపెట్టిన లంక దొరికింది. ఆంజనేయుడు సంజీవినీ పర్వతాన్ని తీసుకువచ్చి లక్ష్మణుణ్ణి కాపాడిన లంక దొరికింది.. రామ రావణ యుద్ధం భీకరంగా జరిగిన లంక దొరికింది. ఇవి ఒట్టి మాటలు కావు.. పుక్కిటి పురాణం అంతకంటే కాదు.. లక్షల సంవత్సరాల నాటి యథార్థ గాథ.. ఒక మహా అసురుని ఉనికిని ఇవాళ్టికీ చాటి చెప్తున్న కథ.. ఇంతకాలం మిథ్యగా భావిస్తున్న చరిత్ర. రావణ రహస్యమిది..

ఇదేదో సోది కథ కాదు.. రావణ లంక.. ఇది ఒక నిజం.. నిప్పులాంటి నిజం... వైజ్ఞానికులకు కొత్త సవాలును విసురుతున్న నిజం.. భారత దేశ చరిత్రను గొప్ప మలుపు తిప్పనున్న నిజం. ఒకనాడు రావణుని రాజరికం అప్రతిహతంగా సాగిన రాజ్యం... సాక్ష్యాలతో సహా లభించింది. రామ రావణ యుద్ధంలో ఆనాడు రావణుడు చనిపోయి వుండవచ్చు. కానీ, శ్రీలంకలో కనిపిస్తున్న సాక్ష్యాలలో రావణుడు ఇంకా జీవించే వున్నాడు.. ఇది నిప్పులాంటి నిజం..

లంక మిథ్య కాదు.. లంకేశ్వరుడు రాజ్యమేలిన లంక.. ప్రపంచాన్నంతా జయించి తెచ్చిన బంగారంతో నిర్మించిన మహానగరం లంక.. సముద్రం మధ్యలో అందమైన దీవిలో, అపురూపంగా రావణుడు నిర్మించుకున్న నగరం లంక. శ్రీలంక సర్కారే రావణుడి ఆనవాళ్లను అధికారికంగా గుర్తించింది. రాజముద్ర వేసింది. రావణ ఆనవాళ్లు శ్రీలంకలో అడుగడుగునా కనిపిస్తున్నాయి. అశోకవనంతో ఈ గుర్తులు మొదలవుతాయి. అశోక వాటిక అని పిలిచే ఈ వనంలోనే సీతాదేవిని ఆనాడు రావణుడు బంధించి ఉంచాడు. ఈ ప్రదేశంలో ఎవరు ప్రతిష్ఠించారో తెలియని వేల ఏళ్ల నాటి సీతారామచంద్రుల విగ్రహాలు మనకు కనిపిస్తాయి.

ఈ ఆలయం పక్కనే సీతాజల పారుతుంది. సీతాదేవి కన్నీటితో ఏర్పడిన నీటి కుండమని ఇక్కడి ప్రజల విశ్వాసం.. ఈ నీటి కుండాన్ని ఆనుకుని హనుమంతుని అడుగులూ మనకు

కనిపిస్తాయి. అశోక వాటిక సమీపంలో మొక్కల్లో నల్లని మట్టి ఉంది.. ఇది బాగా కాలిపోయి ఉన్నట్లు కనిపించే మట్టి ఇది. ఈ మట్టి ఇలా ఎందుకు ఉందో ఇప్పటి వరకు ఏ శాస్త్రవేత్తకూ అంతుపట్టలేదు.. అశోక వాటిక చుట్టూ లెక్కలేనన్ని కోతులు ఎప్పుడూ తిరుగుతూ వుంటాయి. ఈ ప్రదేశంలో ఇక్కడ మాత్రమే కోతులు కనిపిస్తాయి. సీతా జలకు దగ్గరలోనే మరో చిన్న ఏరు పారుతుంటుంది.. అది నిత్యం రావణుడు స్నానం చేసే ఏరు.. ఇక్కడ స్నానం చేసి పరమేశ్వరుని అర్చించేవాడు రావణుడు.

ప్రతి చారిత్రక ప్రదేశాల్లో కొన్ని ప్రాంతాలను చూపి స్థల పురాణాలు చెప్పటం సహజమే. లంకలో కనిపిస్తున్న ఆనవాళ్లు కూడా ఇలాంటివే అనుకుంటే పొరపాటే. ఇవాళ్టి శ్రీలంకలో నాటి తేజోమయ రావణ లంక స్మృతులు చాలా ఉన్నాయి. త్రేతాయుగాన్ని మనకు కళ్లకు కట్టినట్లు చూపిస్తున్నాయి.

రావణ లంక సామాన్యమైంది కాదు.. రామాయణం ఉనికిని చాటిచెప్తున్న లంక.. రావణ స్నానం చేసే నది నుంచి దూరంగా చూస్తే ఓ పెద్ద పర్వతం కనిపిస్తుంది. ఆ పర్వతాన్ని జాగ్రత్తగా పరికిస్తే అతి పెద్ద హనుమాన్ ఆకృతి నిద్రిస్తున్నట్లుగా గోచరిస్తుంది.

ఈ పర్వతాన్ని రాము సోలా అని ఇక్కడి ప్రజలు పిలుస్తారు.. ఈ పర్వతం ఒక విచిత్రమైన పర్వతం.. రామ రావణ యుద్ధం జరుగుతున్న సమయంలో లక్ష్మణుడు మూర్ఛ పోయినప్పుడు హనుమంతుడు హిమాలయాల నుంచి సంజీవని మొక్కను తీసుకువచ్చిన పర్వతం ముక్క ఇది. ఇది ఆంజనేయుడు సంజీవని తీసుకువచ్చిన సుమేరు పర్వతమనటానికి అనేక ఆధారాలు ఉన్నాయి. ఇలాంటి పర్వత భాగం శ్రీలంకలో మరెక్కడా కనిపించదు.. మనకు ఇది మామూలు కొండ.. కానీ, శ్రీలంక ప్రజలకు ఇది హాస్పిటల్... ఈ పర్వతంలో దొరికే మొక్కలన్నీ ఔషధ మొక్కలే కావటం ఇది సుమేరువే అనటానికి బలమైన సాక్ష్యం. దీనికి దగ్గరలో ఉన్న ప్రజలు ఏ జబ్బు వచ్చినా డాక్టర్ల దగ్గరకు వెళ్లరు..



**రావణ లంక సామాన్యమైంది కాదు.. రామాయణం ఉనికిని చాటిచెప్తున్న లంక.. రావణ స్నానం చేసే నది నుంచి దూరంగా చూస్తే ఓ పెద్ద పర్వతం కనిపిస్తుంది. ఆ పర్వతాన్ని జాగ్రత్తగా పరికిస్తే అతి పెద్ద హనుమాన్ ఆకృతి నిద్రిస్తున్నట్లుగా గోచరిస్తుంది. ఈ పర్వతాన్ని రాము సోలా అని ఇక్కడి ప్రజలు పిలుస్తారు.రామ రావణ యుద్ధం జరుగుతున్న సమయంలో లక్ష్మణుడు మూర్ఛ పోయినప్పుడు హనుమంతుడు హిమాలయాల నుంచి సంజీవని మొక్కను తీసుకువచ్చిన పర్వతం ముక్క ఇది.**

ఈ పర్వతం దగ్గరకు వచ్చి ఇక్కడి మొక్కలతోనే వైద్యం చేసుకుంటారు. విచిత్రమేమంటే ఈ ఔషధ మొక్కలు పెరగాలంటే ప్రత్యేకమైన మట్టి కావలసి ఉంటుంది. ఈ కొండపై మనకు కనిపించే మట్టి హిమాలయాల్లో మాత్రమే కామన్‌గా కనిపిస్తుంది.

రావణుడు దశకంఠుడు.. అంటే పది తలలు ఉన్నవాడు.. అంటే శారీరకంగా కాదు.. అతనిలో పది రకాల వ్యక్తిత్వాలు ఉన్నాయని అర్థం. అతని మేధస్సు పది రకాలుగా, అనేక రంగాల్లో విస్తరించిందని అర్థం. ఇందుకు సాక్ష్యం మనకు లంకలో స్పష్టంగా కనిపిస్తుంది. అతను పండితుడో, సీతను అపహరించుకు వచ్చిన రాక్షసుడో మాత్రమే కాదు.. రావణుడు గొప్ప శాస్త్రవేత్త కూడా. రావణుడి అస్తిత్వాన్ని, అతని శక్తిసామర్థ్యాలను చాటి చెప్పే మరో ప్రబలమైన సాక్ష్యం ఇది. మీకు పుష్పక విమానం గుర్తుంది కదా? అందులోనే సీతాదేవిని రావణుడు అపహరించుకు వెళ్లాడు. రావణ సంహారం తరువాత రాముడు అందులోనే అయోధ్యకు తిరిగి వచ్చాడు. ఆ కాలంలో విమానాలు ఉన్నాయా? అంటే ఉన్నాయని లంక చెప్తోంది.. చూపిస్తోంది. లంకాపట్టణంలో రావణుడు నిర్మించిన అయిదు విమానాశ్రయాలను శ్రీలంక సర్కారు గుర్తించింది. అంతే కాదు.. ఒక విమానాల మరమ్మతు కేంద్రాన్ని కూడా గుర్తించింది. వీటిని హనుమంతుడు లంకాదహన సమయంలో కాల్చివేశాడు. లంకలో ఒక గరుడ పక్షి ఆకృతిలో లోహపు బొమ్మ దొరికింది.. ఈ బొమ్మ మామూలు విగ్రహం కాదు.. దీనికి ఉన్న రెక్కలు సాధారణ గరుడ పక్షికి ఉండే స్థాయి కంటే కొద్దిగా ఎత్తులో ఉన్నాయి. దీనిపై ముగ్గురు వ్యక్తులు కూర్చుని ఉన్నారు.. వాస్తవానికి ఇది ఓ లోహయంత్రం. వేల ఏళ్ల నాటిది. ఆనాడు ఇది ఎలా ఎగిరిందీ అన్నదానిపై లంక ప్రభుత్వం ఇంకా పరిశోధిస్తూనే ఉంది. ఇక విమానాశ్రయం దగ్గరకు వస్తే.. శ్రీలంక రాజధాని కొలంబో నుంచి దాదాపు తొమ్మిది గంటల పాటు ప్రయాణం చేస్తే ఓ పెద్ద పర్వత ప్రాంతం వస్తుంది. ఇక్కడ దాదాపు ఎనిమిది వేల అడుగుల ఎత్తున సుమారు ఎనిమిది కిలోమీటర్ల విస్తీర్ణంలో మైదాన ప్రాంతం ఉంది. అంత ఎత్తున ఇంత విస్తీర్ణంలో మైదానం ఉండటం, ఈ మైదానానికి నాలుగు వైపులా కొండలు ఉండటం విశేషం. ఈ మైదానం మానవ నిర్మితమైనదేనని స్పష్టంగా కనిపిస్తోంది. దీన్నే రావణుడు తన విమానాశ్రయంగా వినియోగించాడని శ్రీలంక రీసర్చ్ టీమ్ నిర్ధారించింది. మరో విశేషమేమంటే ఈ మైదానం అంతటా కాలిపోయిన గుర్తులున్నాయి. ఇక్కడి మట్టి కాలి నల్లగా మాడిపోయింది. ఇక్కడి రాళ్లు కాలి కనిపిస్తున్నాయి. 8వేల అడుగుల ఎత్తులో తక్కువ వాతావరణం ఉన్న ఈ ప్రాంతంలో ఇంకా వేడి వాతావరణం ఉండటం విశేషం. లంకాదహనం చేసినప్పుడు హనుమంతుడు ముందుగా రావణుడి ట్రాన్స్‌పోర్ట్ సిస్టమ్‌ను, కమ్యునికేషన్ వ్యవస్థలనే దహనం చేశాడు.. అందుకు సాక్ష్యం ఈ విమానాశ్రయం.

పుష్పక విమానం చాలా పెద్దది. 63.5 అడుగుల పొడవైనది. 231' 4" ఎత్తు, 195'8" వెడల్పున్న రెక్కలు కలిగింది. బయటి ఉపరితలం వెండి రంగులో మిలమిల మెరుస్తుంది. దాని ఇంజన్ ఉరుముల వంటి ధ్వనిని వినిపించేది. గంటకు దాదాపు 250



**లంకలో రావణ కోట శిథిలాలు.**

మైళ్ల వేగంతో ప్రయాణించేది. అందువల్లే సూర్యాస్తమయం లోగా అయోధ్యకు చేరుకోవాలంటే పుష్పకంలో ప్రయాణించాలని విభీషణుడు రాముడిని కోరాడు. ఆరు గంటల్లో 1400 కిలోమీటర్లను అది కవర్ చేస్తుందిట. లక్జరీ సీట్లు, ఇంటీరియర్, ఎక్స్టీరియల్ డెకొరేషన్లతో ఆధునిక విమానాలకు తీసిపోని విధంగా పుష్పకం ఉండేది. లోపల మెలోడీ సంగీతం కూడా వినిపించే ఏర్పాట్లు చేశాడట రావణుడు. ప్రస్తుత విమానాల్లో ఫస్ట్ క్లాస్, ఎకానమీ క్లాస్లు ఉన్నట్లే పుష్పకంలోనూ వున్నాయి. మొదటి పోర్షన్లో రాముడు కూర్చుంటే, రెండో పోర్షన్లో వానరులు కూర్చున్నారట. దాదాపు 200 మందికి పైగా పుష్పకంలో కూచున్నారు కాబట్టే ఎందరు కూచున్నా ఒకరికి చోటుం టుందనే మాట ప్రచారంలోకి వచ్చింది.

రావణుడికి సంబంధించిన వివరాలు ముఖ్యంగా వాల్మీకి రామాయణంలో, ఆ తరువాత తులసీదాస్ రామచరిత మానస్లో మనకు ముఖ్యంగా కనిపిస్తాయి.. ఇవన్నీ మనకు ఇప్పుడు లంకలో కనిపిస్తున్న ఆనవాళ్లతో సరిపోలుతున్నాయి. తులసీదాస్ రాసిన రామచరితమానస్ ఒరిజినల్ ప్రతి ఒకటి చిత్రకూటంలో భద్రంగా ఉంది. అయితే ఆయన స్వయంగా రాసిన వాటిలో ఒకే ఒక అధ్యాయం ప్రపంచానికి మిగిలి ఉంది. చేత్తో తయారు చేసిన కాగితంపై రాసిన ఈ రామాయణంలో మిగిలి ఉన్న అధ్యాయం 117 పేజీల్లో వుంది. ఒక్కో పేజీకి 7లైన్లు రాసి ఉంది. అందులోనే ఈ వివరాలు ఉన్నాయి. కెలీనియా.. రావణుడి తమ్ముడు విభీషణుడి రాజభవనం ఉన్న ప్రాంతం.. ప్రస్తుతం బౌద్ధ ధర్మాన్ని పాటిస్తున్న శ్రీలంకలో కెలీనియా చాలా ముఖ్యమైన ప్రదేశం. బుద్ధ భగవానుడు ఈ ప్రాంతానికి వచ్చినట్లు చరిత్ర చెప్తోంది. ప్రపంచంలోని బౌద్ధులు శ్రీలంకకు వస్తే కెలీనియా చూడకుండా వెళ్లరు.. ఆ పక్కనే విభీషణుడి భవనాన్నీ సందర్శిస్తారు.. ఇంతెందుకు లంక పార్లమెంటులో విభీషణుడి ఫోటో కనిపిస్తుంది.



**రావణుడికి సంబంధించి ఇప్పటి వరకు లభించిన ఆధారాలన్నీ ఒక ఎత్తైతే, అసుర రాజు అస్తిత్వానికి సంబంధించిన అత్యంత కీలక సాక్ష్యం మరొకటి ఉంది. అది రావణ గుహ.. ఈ శవపేటిక దాదాపు పదిహేడు అడుగుల పొడవు, నాలుగు అడుగుల వెడల్పుతో ఉంది. ఈ శవపేటిక చుట్టూ రకరకాల రసాయన లేపనాలు రాసి వున్నాయి. రావణుడు చనిపోయిన తరువాత ఆయన భౌతిక దేహాన్ని నాగజాతి ప్రజలు తీసుకెళ్లి ఈ శవపేటికలో భద్రపరిచారట. శ్రీలంక ప్రభుత్వం ఒక ప్రత్యేక బృందాన్ని పంపించి ఈ శవపేటికను తెరిచేందుకు పలుమార్లు ప్రయత్నించింది. ప్రయత్నించిన ప్రతిసారీ ఏదో ఒక అడ్డంకి ఎదురవుతూనే ఉంది.**

ఆ తరువాత నరోలియా.. ఇక్కడే అశోక్ వాటిక ఉంది. దీనికి సమీపంలోనే సీతాదేవి అగ్ని ప్రవేశం చేసింది. అయితే ఇక్కడ ఓ విచిత్రం ఉంది. ఇక్కడ అటవీ ప్రాంతంలో కొన్ని చిత్రమైన గోళీలు దొరుకుతాయి. ఈ గోళీలను సీతా గోళీలంటారు.. ఇవి అలోపతి మాత్రల్లాంటివి.. ఈ గోళీలు దొరడమే భాగ్యంగా ప్రజలు భావిస్తారు. వీటిని తలకు రాసుకోవటం, కడుపుకు రాసుకోవటం, వాటిని పొడిని చేసి కొద్దిగా తీసుకోవటం వంటివి చేస్తారు.. ఈ గోళీలను శ్రీలంక ప్రభుత్వం జపాన్‌కు పంపించి పరీక్ష చేయించింది. ఇందులో వైద్య లక్షణాలు ఉన్నట్లు.. దాదాపు పదివేల సంవత్సరాలకు పూర్వ కాలం నాటివేనని నిర్ధారణ అయింది. రావణుడికి సంబంధించి ఇప్పటివరకు లభించిన ఆధారాలన్నీ ఒక ఎత్తైతే, అసుర రాజు అస్తిత్వానికి సంబంధించిన అతి కీలక సాక్ష్యం మరొకటి ఉంది. అది రావణ గుహ.

లంకలో రామరావణ యుద్ధం భీకరంగా జరిగింది. రామబాణంతో రావణుడిని శ్రీరామచంద్రుడు హతమార్చాడు. రావణుడు మరణించిన తరువాత ఏం జరిగింది? వాల్మీకి రామాయణంలో రావణుడి అంత్యక్రియలు, ఆ తరువాత విభీషణుడి పట్టాభిషేక కార్యక్రమాన్ని పర్యవేక్షించేందుకు లక్ష్మణుడిని రాముడు లంకకు పంపిస్తాడు. కానీ రావణుడి అంత్యక్రియలు జరగనే లేదన్నది కొందరి విశ్వాసం. దానికి సంబంధించిన అత్యంత గొప్ప రహస్యం వెలుగులోకి తెచ్చింది లంక సర్కారు.. అదే రావణ గుహ. శ్రీలంకలోని కెలీనియాకు కొద్ది దూరంలో ఎత్తైన ప్రదేశంలో ఈ గుహ ఉంది.. ఈ గుహలోకి ప్రవేశించటం చాలా కష్టమైన పని.. దాదాపు ఇరవై ఏళ్ల క్రితం పశువులు కాసుకునే ఒక కాపరి ఈ గుహలోకి అనుకోకుండా వెళ్లాడు. ఈ గుహలో ఒక పెద్ద శవపేటిక ఉంది.. ఈ పేటికలో

ఒక శవం ఉందని, దాన్ని చూడగానే భయంతో వెనక్కి వచ్చేసినట్లు అతను చెప్పాడు. అది రావణుడి భౌతిక శరీరమని చాలా మంది విశ్వాసం.. ఈ శవపేటిక దాదాపు పదిహేడు అడుగుల పొడవు, నాలుగు అడుగుల వెడల్పుతో ఉంది. ఈ శవపేటిక చుట్టూ రకరకాల రసాయన లేపనాలు రాసి ఉన్నాయి.

రావణుడు చనిపోయిన తరువాత ఆయన భౌతిక దేహాన్ని నాగజాతి ప్రజలు తీసుకెళ్లి ఈ శవపేటికలో భద్రపరిచారట. శ్రీలంక ప్రభుత్వం ఒక ప్రత్యేక బృందాన్ని పంపించి ఈ శవపేటికను తెరిచేందుకు పలుమార్లు ప్రయత్నించింది. ప్రయత్నించిన ప్రతిసారీ ఏదో ఒక అడ్డంకి ఎదురవుతూనే ఉంది. ఒకసారి చిరుతపులులు, మరోసారి పెద్ద పాములు అడ్డం వచ్చాయి. హెలికాప్టర్‌లో వెళ్లేందుకు ప్రయత్నించినప్పుడు సరిగ్గా గుహ దగ్గరకు వచ్చేసరికి వాతావరణం హఠాత్తుగా మారిపోయి తప్పనిసరిగా వెనక్కి మళ్లాల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ గుహలో అతని అనుచరులు కాపలా ఉన్నారని, లక్ష్మణుడి మాదిరిగా సంజీవనితో తమ రాజు పునర్జీవుతుడవుతాడని నమ్ముతున్నారని స్థానికుల అభిప్రాయం. కానీ వారిని చూసినవారెవరూ లేరు. రావణుడి ఉనికికి సంబంధించిన చాలా ముఖ్యమైన సాక్ష్యం ఇది. ఈ పేటిక రహస్యాన్ని ఛేదించగలిగితే చరిత్రలో అనేక కొత్త కోణాలు వెలికి వస్తాయి. దీనితో పాటు లంకలో మరికొన్ని అంశాలను పరిశీలించాల్సి ఉంది. రావణుడు సీతాదేవిని పంచవటి నుంచి అపహరించుకుని వెళ్లి ఎక్కడ దాచాడు? అని అడిగితే టక్కున వచ్చే జవాబు అశోక వనం.. కానీ లంక అదే శ్రీలంకలో సీన్ వేరేలా ఉంది. సీతాదేవిని పరిస్థితులను బట్టి, ముందు జాగ్రత్త చర్యగా వేర్వేరు ప్రదేశాలకు రావణుడు తరలించాడట. పంచవటిలో, పర్ణశాలలో ఉన్న సీతాదేవిని తన పుష్పకంలో లంకకు తీసుకువచ్చిన రావణుడు వెరగన్ తోటలోని తన ఎయిర్‌పోర్ట్‌లో ల్యాండ్ అయ్యాడు.. పక్కనే ఉన్న తన భార్య మండోదరిదేవి భవనానికి సీతమ్మను తీసుకువెళ్లాడు.

లంకాపురంలో అతిగొప్ప ప్యాలెస్ మండోదరికి ఉండేదిట.. చుట్టూ జలపాతాలు.. పూల తోటలు. అక్కడ సీత ఉన్నది కొన్ని రోజులే. ఆ తరువాత అశోకవాటికకు తరలించాడు. మండోదరి భవనానికి చాలా దూరంలో అశోక వాటిక ఉంది. అక్కడికి విమానంలోనే సీతను రావణుడు తీసుకువెళ్లాడు.. ఆకాశమార్గంలో లంకానగర సౌందర్యాన్ని అద్భుతంగా ఏరియల్ వ్యూ ద్వారా సీతాదేవికి వర్ణిస్తూ చూపించాడట రావణుడు.

అశోక వాటికకు సమీపంలోనే సీతా పకన్ అనే చిన్న ప్రాంతం ఉంది.. చుట్టూ కమ్ముకుని ఉన్న దట్టమైన అడవి.. నిటారుగా నిలుచుని వున్న వృక్షాల మధ్య 200 గజాల మేరకు వున్న చిన్న స్థలం.. అంత అడవిలో ఇక్కడ చిన్న మొక్క కూడా మొలవదు.. గతంలో ఇక్కడ నీళ్లు ఉండేవట.. సీతాదేవి లంకనుంచి అయోధ్యకు వెళ్లిన తరువాత ఇది పూర్తిగా డ్రై అయిపోయింది. హనుమంతుడు లంకకు వచ్చి చేయాల్సిన బీభత్సం అంతా చేసేశాక, ముందు జాగ్రత్త చర్యగా రావణుడు సీతాదేవిని అశోకవాటిక నుంచి ఇస్త్రిపురకు

తరలించాడట. అంటే ఏరియా ఆఫ్ వుమెన్ అని అర్థం. ఇక్కడి నుంచి కూడా రావణ గోడా అనే ప్రాంతానికి సీతను షిఫ్ట్ చేసినట్లు చెప్తారు.. అది ఇస్త్రిపురకు మరోవైపున ఉంది. దానికి దగ్గరలోనే దిశృంపోలా అంటారు ఇప్పుడు ఇక్కడ బుద్ధుడి ఆలయం ఉంది.. దీంతో పాటే అతి ముఖ్యమైన ప్రాంతం ఇది.. రావణ సంహారం తరువాత సీతాదేవి అగ్ని ప్రవేశం చేసిన ప్రదేశం ఇదే... ఇక్కడ బౌద్ధ మతాచార్యులు ఓ స్తూపాన్ని కూడా నిర్మించారు.. లంకలోని కెలినియాలో రావణ సోదరుడు విభీషణుడికి పట్టాభిషేకం జరిగినట్లు గతంలోనే చెప్పుకున్నాం... ఇక్కడ విభీషణుడికి ఓ ఆలయం కూడా ఉంది.. లంక పార్లమెంటులో కూడా విభీషణుడి చిత్రపటం మనకు కనిపిస్తుంది.. అంతే తప్ప అంత గొప్ప నాగరికతను ప్రపంచానికి అందించిన రావణుడికి మాత్రం ఎక్కడా ఆలయం లేదు. రావణుడి కొడుకు ఇంద్రజిత్.. ఇతను కూడా శివుడికి మహా భక్తుడు.. ఈతడు శివుని పూజించిన ఆలయం, అందులో శివలింగం ఇవాళ్టికీ పూజలందుకుంటున్నాయి.

రావణుడి తల్లి కేకసి.. ఈమె భవనం సముద్రానికి సమీపంలో ఉండేది.. ఆమె నిత్యం ఉదయం ఇసుకతో శివలింగాన్ని తయారుచేసి దానికి పూజ చేసి వచ్చేది.. శ్రీలంకలోని తిరుక్కోవిల్‌లో ఆమె తల్లి భవంతి ఉండేది.. ఇప్పుడా ప్రాంతంలో దేవాలయం ఉంది.. ఇక్కడో విచిత్రం ఉంది.. తన తల్లి మరణించిన తరువాత ఆమె అంత్యక్రియలు జరిపిన తరువాత స్నానాదులకు మంచినీరు కరవైందట.. అప్పుడు రావణుడు తన త్రిశూలంతో ఏడుసార్లు నేలను గట్టిగా కొట్టాడట.. దీంతో ఏడు ప్రాంతాలలోని నీటిధార ఉబికి వచ్చింది. సముద్రానికి దగ్గరలో మంచినీటి బావులు ఇవి. ఈ ఏడింటిలో నీటి ఉష్ణోగ్రతలు ఏడు రకాలుగా ఉండటం ఇక్కడి విచిత్రం.

తోటపాలకొండలో రావణుడి అతి పెద్ద గోశాల ఉంది.. లంకారాజ్యానికంతటికీ అదే ఏకైక డైరీఫారమ్.. శ్రీలంకలోనే కలుతర అన్న ప్రాంతంలో రావణుడికి మరో కోట వుండేది.. ఈ కోట ఇప్పుడు సముద్ర గర్భంలో కలిసిపోయిందని చెప్తారు.. దీనికోసం లంక సర్కారు పరిశోధిస్తోంది.. ఇప్పుడు ఈ ప్రాంతంలో లైట్ హౌస్ కనిపిస్తుంది.

ఇక్కడ హనుమంతుడి గురించి కొంత చెప్పుకోవాలి.. లంకాదహనం చేశాక ఓ ప్రాంతంలో కాసేపు రెస్ట్ తీసుకున్నాడు.. దాన్ని ఇప్పుడు రామ్ బోడా అంటారు.. అక్కడ చిన్మయ మిషన్ వాళ్లు అతి పెద్ద ఆలయ నిర్మాణం చేశారు.. రామాయణంలో మనకు తెలిసిన రావణుడు వేరు.. లంకలో కనిపిస్తున్న రావణుడు వేరు.. ఆయన సీతను ఎత్తుకుపోయిన సంగతే చాలామందికి తెలుసు. ఆయన పండితుడన్న సంగతి కొందరికి తెలుసు.. కానీ, రావణుడిలో మనకు అంతు చిక్కని అనేక కోణాలు ఉన్నాయి.

రావణుడు ఆర్కిటెక్చర్.. రావణుడు ఏరోనాటికల్ ఇంజనీర్.. రావణుడు డాక్టర్.. రావణుడు వార్‌ఫేర్ టెక్నాలజిస్ట్.. రావణుడు నిత్య పరిశోధకుడు.. రావణుడు గొప్ప సంగీతవేత్త.. ఇలా చెప్పుకుంటూ పోతే రావణుడిలో అనేక కోణాలు బయటపడతాయి.



**ఆనాటి లంకలో నాలుగు లక్షల వీధులు ఉండేవిట. లంకలో చాలా ప్రాంతాల్లో అనేక గుహలు, సొరంగాలు కనిపిస్తాయి. ఇవన్నీ రావణ కాలం నాటివే. రావణ ఆర్కిటెక్చరల్ ప్రతిభకు ఇవి నిదర్శనంగా నిలుస్తాయి. ఈ సొరంగాలు లంకలోని అన్ని పట్టణాలకు ఒకదానితో మరొకటి లింక్ కలిపే నెట్‌వర్క్ . తొందరగా ఒకచోటి నుంచి మరోచోటికి తరలివెళ్లేందుకు సరైన రవాణా వ్యవస్థను కలిగి ఉన్నాయి. ప్రతి సొరంగం మానవ నిర్మితమేనని స్పష్టంగా తెలుస్తుంది.. రావణ గుహకే ఏడు వందల దాకా కిటికీలున్నాయి.**

తన భార్య మండోదరితో సరదాగా ఆడుకోవటానికి చెస్‌ను కనుక్కొన్నాడట. ఆమెతో కలిసి వీణ అద్భుతంగా వాయించేవాడట రావణబ్రహ్మ. రావణుడికి సంబంధించి అయిదు విమానాశ్రయాలను లంక సర్కారు కనుక్కొందని చెప్పుకున్నాం. గుర్లపోతలో విమాన మరమ్మతు కర్మాగారం ఉంది. వాల్మీకి రామాయణంలోనూ ఈ గుర్లపోత ప్రస్తావన వుంది. రావణుడి విమానం పెద్ద నెమలి ఆకారంలో ఉండేదిట.. దీనిని సింహళభాషలో గుర్లపోత అంటారు..అంటే పక్షి వాహనం అని అర్థం. విమానాన్ని సింహళ భాషలో దండు మోనరా అంటారు.. అంటే ఎగిరే నెమలి అని అర్థం.

రావణ లంకానగరం అపూర్వమైంది.. అపూర్వ నిర్మాణాన్ని కలిగి ఉన్నది.. లంకానగరం శత యోజన విస్తీర్ణంలో నిర్మించారని రామాయణం చెప్తోంది.. ఒక యోజనం అంటే 13 కిలోమీటర్లు. ఇవాళ్టి శ్రీలంక విస్తీర్ణం, రామాయణంలో పేర్కొన్న గణాంకాలు దాదాపుగా సరిపోతున్నాయి. ఏడు ప్రాకారాలు, ఎనిమిది ద్వారాలు.. మూడు కందకాలతో అత్యంత సురక్షితంగా లంకా నగరాన్ని నిర్మించాడట రావణుడు. ఆనాటి లంకలో నాలుగు లక్షల వీధులు ఉండేవిట. లంకలో చాలా ప్రాంతాల్లో అనేక గుహలు, సొరంగాలు కనిపిస్తాయి. ఇవన్నీ రావణ కాలం నాటివే. రావణ ఆర్కిటెక్చరల్ ప్రతిభకు ఇవి నిదర్శనంగా నిలుస్తాయి. ఈ సొరంగాలు లంకలోని అన్ని పట్టణాలకు ఒకదానితో మరొకటి లింక్ కలిపే నెట్‌వర్క్ వ్యవస్థను కలిగి ఉన్నాయి. ఈ సొరంగాలు తొందరగా ఒకచోటి నుంచి మరోచోటికి తరలివెళ్లేందుకు సరైన రవాణా వ్యవస్థను కలిగి ఉన్నాయి. ఈ సొరంగాలు సహజంగా ఏర్పడినవి కావు.. ప్రతి సొరంగం మానవ నిర్మితమేనని స్పష్టంగా తెలుస్తుంది. రావణ గుహకే దాదాపు ఏడు వందల దాకా కిటికీలు ఉన్నాయి. ఎంత గొప్ప నగర నిర్మాణం.. ఎంత సాంకేతిక పరిజ్ఞానం.. ఎంత గొప్ప నాగరికత.. భారత దక్షిణాపథాన కనీవినీ ఎరుగని సాంస్కృతిక వైభవం విలసిల్లిన లంకానగరం ఎంత దారుణంగా ధ్వంసమైంది? తన ప్రజలకు ఎలాంటి కష్టం లేకుండా చేసిన సార్వభౌముడు ఎలా పతనమయ్యాడు..? చాలా ఆశ్చర్యంగా ఉంటుంది.. అబ్బురమేస్తుంది. ఒక దారుణమైన తప్పు ఎంత

వినాశనానికి దారితీసిందో అర్థమవుతుంది.

పధ్నాలుగేళ్ల వనవాసానికి అయోధ్యనుంచి బయలుదేరిన రామచంద్రుడు చిత్రకూటం మీదుగా పంచవటికి వెళ్లాడు. అప్పటికి దండకారణ్యం దాకా రావణుడి ఆధిపత్యం కొనసాగినట్లు తెలుస్తుంది.. దండకారణ్యంలో రావణుడి గవర్నర్ ఖరుడు పరిపాలన సాగించాడు. రాముడు ఖరదూషణులను ఇక్కడే చంపాడు. పంచవటి నుంచి కిష్కింధకు వెళ్లిన రాముడు అక్కడ వానర సైన్యాన్ని కలుసుకున్నాడు.. ఆ సైన్యం తోనే శ్రీలంకకు చేరుకున్నాడు.. భారతీయ నిర్మాణ రంగంలోనే అపురూపమైన సేతువును రాముడు రామేశ్వరం మీదుగా లంకలోని తలైమన్నార్ దాకా నిర్మించాడు. వానర సైన్యంలోని నీలుడి పర్యవేక్షణలో ఈ సేతు నిర్మాణం సాగింది. శ్రీలంక సరిహద్దులకు చేరుకున్నాక రాముడు తన సైన్యంతో నీలవరై పుత్తుర్ దగ్గర మొదట ఆగాడట.. అక్కడ రాముడు తన సైన్యం కోసం సృష్టించిన నీటి జల ఇప్పటికీ కనిపిస్తుంది. నీలవరై పుత్తుర్ దగ్గర నుంచి లగ్గల అన్న ప్రాంతానికి రాముడి సైన్యం తరలింది.. లగ్గల అంటే టార్గెట్ రాక్ అని అర్థం.. ఈ పర్వత పైభాగం నుంచి రావణ సైన్యం రాముడి గురించిన సమాచారాన్ని అందించింది. ఈ ప్రాంతం భౌగోళికంగా ఉత్తర లంకలో అత్యంత ఎత్తైన ప్రాంతంలో వుంటుంది. ఈ ప్రాంతానికి ఈశాన్య భాగంలో తిరుకోణేశ్వరం ఉంది.. అటు వాయవ్య దిశలో తలైమన్నార్ ఉంటుంది.. రామసేతువు లంకకు కలిపింది ఇక్కడే.. ఈ తిరుకోణేశ్వరంలోనే రావణుడు తపస్సు చేసేవాడు. ఈ యుద్ధ భూమిలోనే భీకరంగా రామరావణుల పోరాటం జరిగింది. రామబాణానికి దశకంఠుడు నేలకొరిగాడు.. రాక్షస సంహారం జరిగింది. సుందరలంక స్మశానంగా మారిపోయింది.. రావణ సంహారంతో రామాయణం ముగియలేదు.. యుద్ధం తరువాత రాముడు సీతాలక్ష్మణ సమేతంగా బయలు దేరినప్పుడూ లంకలోని కొన్ని ప్రాంతాలలో ఆగాడు, సేద తీరాడు, పరమేశ్వరుని కొలిచాడు.

రావణ వధ తరువాత సీతారామలక్ష్మణులు పుష్పకంలో అయోధ్యకు బయలు దేరుతూ వందారుమూలై అన్న ప్రాంతంలో కాసేపు ఆగారు. వందారుమూలైలో ఉన్నప్పుడు రాముడికి అనుమానం కలిగింది.. రావణుడు బ్రాహ్మణుడు.. అతణ్ణి చంపినందుకు తనకు బ్రహ్మహత్యాదోషం చుట్టుకుంటుంది కదా అన్న సందేహంతో దీనికి పరిష్కారం చెప్పమంటూ పరమేశ్వరుని కోరాడు.. అప్పుడు శివుడు నాలుగు ప్రాంతాలలో శివలింగాల్ని ప్రతిష్టించి పూజించమని రాముడికి సూచించాడట.. దీంతో రాముడు లంకలో మానావారి అన్న ప్రాంతంలో తొలి శివలింగాన్ని ప్రతిష్ఠించాడు.. దీన్ని రామలింగ శివుడని కొలుస్తారు.. ఆ తరువాత తిరుకోణేశ్వరంలో, అక్కడి నుంచి తిరుకేదారేశ్వరంలో మరో రెండు శివలింగాలను ప్రతిష్ఠించాడు... చివరగా భారత భూభాగంలో ఇప్పుడున్న రామేశ్వరంలో మరో శివలింగాన్ని ప్రతిష్ఠించాడు. పుష్పకంపై తిరిగి వెళ్తూ, రాముడు రామసేతువును పాక్షికంగా ధ్వంసం చేసి వెళ్లాడని కూడా కథనం చెప్తారు.. మొత్తం మీద రావణ లంక భారతీయ నాగరికతలోని అనేక కొత్త కోణాలను వెలికి తీస్తున్నది.

# రాయల వారి కిష్కింధ

***సుగ్రీవుడికీ, కృష్ణదేవరాయలకూ లింకేమిటి?***

***రాయల రాజ్యానికి, కిష్కింధకు ఉన్న సంబంధం ఏమిటి?***

***రాయల రాజ్యాన్ని స్థాపించింది వాలి సుగ్రీవులేనా?***

***రాముడికి సాయం చేసింది ఆంధ్రులేనా?***

శ్రీకృష్ణదేవరాయలు.. సాహితీ సమరాంగణ సార్వభౌముడు... విజయనగర సామ్రాజ్య కీర్తి పతాక. రాయల వారికీ, వానరులకూ ఓ లింక్ ఉంది తెలుసా? రామాయణ కాలం నాటి సుగ్రీవుడికీ, కృష్ణదేవరాయలకూ మధ్య విడదీయరాని ఓ అనుబంధం ఉంది. వేల సంవత్సరాల క్రితం నాటి రామాయణ కాలంలోని కిష్కింధ ఎక్కడ? 16శతాబ్దం నాటి విజయనగర సామాజ్యం ఎక్కడ? ఈ రెంటికీ పొంతన ఎలా కుదురుతుంది? అనుకోవచ్చు. సహజమే. కిష్కింధను ఏలింది వానరులు.. విజయనగరాన్ని పరిపాలించింది నరచక్రవర్తులు. కానీ, చరిత్ర మరువని సంబంధం విజయనగర మూలాల్లో దాగి ఉంది. రాయల వారి రాజ్యానికీ, వానర సామ్రాజ్యానికీ తల్లివేరు ఒకటే. అంతే కాదు... వాలి, సుగ్రీవులు వానర రాజులు. కిష్కింధ సామ్రాజ్యాధినేతలు. రాముడికి బలం వానరులు. రావణ సంహార సారథికి వారివే అండదండలు. సీతమ్మ జాడను కనుగొన్నది వారు. వారధి కట్టి లంకకు చేటు తెచ్చిందీ వారు. ఇంతకీ ఈ వానరులు ఎవరు? ఎక్కడి వారు? ఆంధ్రులేనా? రాముడికి సాయం చేసింది తెలుగువారేనా?

ఒకటి రాయలవారి సామ్రాజ్యపు మూలం కిష్కింధలో ఉందనేది.. రెండు వానరులు ఆంధ్రులేనన్నది. ఈ రెంటికీ లంకె ఉంది. వానరులకూ, కృష్ణదేవరాయలకూ విడదీయరాని సంబంధం ఉంది. సుగ్రీవుడి నుంచి రాయలవారి దాకా రాచరికపు అనుబంధం కొనసాగింది. త్రేతాయుగంలో వానరులు, కలియుగంలో కృష్ణరాయలు ఇద్దరి మధ్యా ఎలా లంకె పడింది అనుకోవచ్చు. కానీ, విజయ నగర సామ్రాజ్యానికి కిష్కింధే మూలం. కిష్కింధకూ, రాయలకూ ముడిపెట్టడమేమిటి? దీని వెనుక లాజిక్కేమిటి? సహజంగానే వచ్చే ప్రశ్నే ఇది.. కానీ, ఇది నిజం.. కిష్కింధ నుంచి హంపి దాకా అవిచ్ఛిన్నంగా నాగరికతా ప్రస్థానం సాగింది. రాయలేలిన సీమకు, సుగ్రీవ రాజ్యానికి మూలాలు ఒకే చోట ఉన్నాయి. ఒకటిగా ఉన్నాయి. కోదండరాముడు విశ్రమించిన రుష్యమూకమే.. విజయనగరానికి కేంద్రస్థానంగా నిలిచింది. చరిత్ర మరచిన సత్యమిది.. రామాయణం నుంచి రాయల కాలం దాకా అవిచ్ఛిన్నంగా సాగిన జాతి మూలాలివి.

రావణుడు సీతమ్మను ఎత్తుకెళ్లిన తరువాత ఆమె జాడను వెతుక్కుంటూ వెళ్లిన



**విజయనగర సామ్రాజ్య వైభవాన్ని ఇవాళ చాటుతున్న హంపీయే నాటి కిష్కింధ సామ్రాజ్యానికీ రాజధాని. చిత్తూరు నుంచి బళ్లారి-హంపి దాకా విస్తరించిన సామ్రాజ్యం కిష్కింధ. వేల సంవత్సరాల తరువాత తెలుగు జాతి కీర్తిపతాకను విశ్వవ్యాప్తం చేసిన రాయల రాజ్యానికి మూల వ్యవస్థ. కృష్ణదేవరాయల కాలంలో స్వర్ణయుగాన్ని అనుభవించిన ప్రాంతం అంతా నాటి కిష్కింధ సామ్రాజ్యంలో భాగమే. సాంకేతికంగా రుజువైన వాస్తవం.**

రామలక్ష్మణులను రుష్యమూకం వద్ద హనుమంతుడు కలిసాడు. అక్కడి నుంచి సుగ్రీవుడితో స్నేహం కుదిరింది.. అప్పటికే వాలిసుగ్రీవుల మధ్య విభేదాలు భగ్గుమంటున్నాయి. వాలిని చెట్టుచాటు నుంచి సంహరించి సుగ్రీవుడికి పట్టం కట్టిన వాడు రాముడు. ఆ తరువాత వానర సేన కిష్కింధ నుంచి బయలుదేరి సీతాన్వేషణ చేపట్టింది. లంకలో సీతమ్మను కనుగొన్న తరువాత రాముడితో కలిసి వానరసేన లంకకు చేరుకుని మహారాక్షస సంహార కార్యక్రమాన్ని పూర్తి చేసింది. ఆ తరువాత తిరిగి కిష్కింధకు చేరుకుని రామరాజ్యంలో వానరులు గడిపారు. రామాయణంలో కిష్కింధకున్న ప్రాధాన్యం ఇది. అంతమాత్రం చేత విజయనగర సామ్రాజ్యానికి, కిష్కింధకూ సంబంధంలేదని అనుకోలేం. ఎందుకంటే 16వ శతాబ్దంలో రాయలేలిన రతనాలసీమే రామాయణ కాలం నాటి కిష్కింధ. విజయనగర సామ్రాజ్య వైభవాన్ని ఇవాళ చాటుతున్న హంపీయే నాటి కిష్కింధ సామ్రాజ్యానికీ రాజధాని. చిత్తూరు నుంచి బళ్లారి-హంపి దాకా విస్తరించిన సామ్రాజ్యం కిష్కింధ. వేల సంవత్సరాల తరువాత తెలుగుజాతి కీర్తిపతాకను విశ్వవ్యాప్తం చేసిన రాయల రాజ్యానికి మూల వ్యవస్థ.

కృష్ణదేవరాయల కాలంలో స్వర్ణయుగాన్ని అనుభవించిన ప్రాంతం అంతా నాటి కిష్కింధ సామ్రాజ్యంలో భాగమే. సాంకేతికంగా రుజువైన వాస్తవం. రామాయణ కాలం నాటి నుంచీ రాయలకాలం దాకా కూడా ఇది రక్షణాత్మకంగా, వ్యూహాత్మక స్థావరంగా కొనసాగింది. రాముడు రావణుడిపై ఇక్కడి నుంచే యుద్ధవ్యూహం రచించాడు. రాయల యుద్ధ పిపాస కూడా ఈ విజయనగరం కేంద్రంగానే సాగింది. విజయనగర శిథిలాలను మాత్రమే కాదు, రామాయణ కాలం నాటి అనేక ఆనవాళ్లను మనం ఇక్కడ రుజువులతో సహా చూడవచ్చు. అయోధ్య నుంచి లంక దాకా రాముడు ప్రయాణం చేసిన ప్రాంతం అంతటా ఆయన గుర్తులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. కిష్కింధ ఇందుకు ఉదాహరణ. నాడు దండకారణ్యంలో భాగంగా ఉన్న కిష్కింధ ఇవాళ్టి దక్షిణ కన్నడ రాజ్యంలో హంపిగా కనిపిస్తోంది. ఈ రాజ్యాన్నే నాడు సుగ్రీవుడు ఏలుకున్నాడు. ఆ తరువాత ఇదే ప్రాంతంలో కాకతీయుల పతనానంతరం హరిహర రాయలు, బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించారు. ఆ సామ్రాజ్యపు వారసుడే రాయలు.






**హంపిలో కిష్కింధ ఆనవాళ్లు**

వాలి.. సుగ్రీవుడి అన్న.. ఇద్దరూ మంచి సోదరులే. ఓ రోజు వాలితో యుద్ధానికి దుందుభి అనే రాక్షసుడు అర్ధరాత్రి వస్తాడు.. అతణ్ణి తరుముతూ వెళ్లిన వాలి ఓ గుహలోకి వెళ్తాడు.. దాదాపు సంవత్సరం పాటు గుహలో యుద్ధం జరిగింది. ఇది రామాయణంలో జరిగిన కథ.. ఈ గుహను మనం ఇవాళ్టికీ చూడవచ్చు. ఈ గుహలో ఒక శివలింగం కూడా కనిపిస్తుంది. ఈ శివలింగాన్ని అంతకు ముందు భస్మాసురుడు ప్రతిష్ఠించినట్లు మరో కథ ప్రచారంలో ఉంది.

ఏడాదైనా అన్న తిరిగి రాలేదనుకున్న సుగ్రీవుడు పట్టాభిషేకం చేసుకున్నాడు. అదే సమయానికి తిరిగి వచ్చిన వాలి అతణ్ణి తరిమేసేసరికి రుష్యమూక పర్వతంపైకి వెళ్లి దాక్కున్నాడు. ఆ రుష్యమూకం పంపాసరోవర తీరంలో ఉంది. ఈ సరోవరం వద్దే సీతమ్మవారి నగలు ఆంజనేయుడికి లభించాయి. రుష్యమూకానికి సమీపంలోనే అంజనగిరి కూడా ఉంది.. కిష్కింధలో ఆంజనేయుడి నివాసమిది. తుంగభద్రానదికి ఉత్తర తీరంలోనే ఈ పర్వతం ఉంది. ఈ పర్వతంపై హనుమంతుడి గుడి కూడా ఉన్నది. అంజనగిరికి మరోవైపు మాల్యవంత పర్వతం ఉంది. సుగ్రీవుడితో స్నేహం తరువాత సీత జాడ తెలిసేంతవరకూ ఆయన ఈ పర్వతంపైనే ఉన్నాడు.. ఇప్పుడీ హిల్స్‌పైన అత్యద్భుతమైన రఘునాథ రాముడి దేవాలయం కనిపిస్తుంది. కిష్కింధలో రాముడు వాలిని చంపిన ప్రదేశాన్ని కూడా మనం చూడవచ్చు. రుష్యమూ కానికి కొద్ది దూరంలోనే నింబాపురం అనే గ్రామం ఉంది. ఈ గ్రామంలోనే వాలిని రాముడు సంహరించాడు. దీని ఆనవాళ్లు కూడా మనకు ఇక్కడ కనిపిస్తాయి. ఈ గ్రామంలోని కొండపై రామచంద్రుడి పాదాలు వున్నాయి. ఈ

పర్వతం చూడటానికి చాలా టిపికల్‌గా కనిపిస్తుంది. ఇక్కడే వాలి సుగ్రీవుల మధ్య యుద్ధం జరిగింది. ఇక్కడే చెట్టు చాటు నుంచి వాలిని రాముడు చంపాడని స్థానికుల విశ్వాసం.

రామాయణ కాలం తరువాత హంపిలో మొట్టమొదటి ప్రాచీన ఆనవాళ్లు ఫస్ట్ సెంచరీకి ముందు మనకు కనిపిస్తాయి. ఇక్కడ పురావస్తు శాఖ జరిపిన తవ్వకాల్లో వేల సంవత్సరాల నాటి శిథిలాలు చాలా వెలుగు చూశాయి. చిత్తూరు నుంచి హంపి వరకు వానర సామ్రాజ్యం విస్తరించిన గుర్తులు మనకు కనిపిస్తున్నాయి. తిరుమల ఏడు కొండల్లో అంజనాద్రి పర్వతం హనుమంతుడి జన్మస్థలంగా భావిస్తున్నారు. అక్కడి నుంచి వానరజాతి కిష్కింధ దాకా విస్తరించిందని ఒక అభిప్రాయం. సీతను వెతకటానికి ఒక వానర బృందాన్ని తూర్పు వైపు పంపించాడు సుగ్రీవుడు. తూర్పున చివరంటా వెతికి రావాలని ఆదేశించాడు. హంపి సమీపంలోని కిష్కింధలో ఉన్న ఉదయ పర్వతంపై బంగారు రంగులో మూడు కొమ్మలున్న తాళ వృక్షాన్ని చూసినట్టుగా శిల్పం కనిపిస్తుంది. దక్షిణ అమెరికాలోని పిస్కో తీరంలోని అండెస్ పర్వతంపై ఇలాంటి వృక్షం బయట పడటం రామాయణపు చరిత్రను నిరూపిస్తున్నది. ఇది 820 అడుగుల ఎత్తులో ఉంది.

వానరులు దక్షిణ భారతంలో నివసించిన ఒక ట్రైబల్ జాతి. అంతా అనుకుంటున్నట్లు వానరులు అంటే కోతులు ఎంతమాత్రం కాదు. వీళ్లు మనుషులే.. కాకపోతే వీరికి తోక ఒకటి ఉండేదని అందువల్లే వీళ్లను 'వా'నరులని పిలిచేవారంటారు. దక్షిణాపథాన వీళ్లది ప్రధాన రాజ్యం. త్రేతాయుగం నుంచి ద్వాపర యుగం దాకా కొనసాగిన సుదీర్ఘ రాజ్య వ్యవస్థ కిష్కింధ మాత్రమే. మహాభారత కాలంలో పాండవుల్లో చివరివాడైన సహదేవుడు కిష్కింధకు వచ్చి వెళ్లాడు. అదే సమయంలో దండకారణ్యంలో రెండు రాజ్యాలుగా ఉన్న ఆంధక, తెలింగలను జయించాడు.

కిష్కింధ ఒక బలమైన రాచరిక వ్యవస్థకు పునాది కనుకనే మన కాలంలో దానికి పునర్వైభవం కలిగింది. ఆనాటి స్వర్ణయుగాన్ని దాదాపు మూడు వందల సంవత్సరాల పాటు విజయనగర సామ్రాజ్యలక్ష్మి తిరిగి అందించింది. కృష్ణదేవరాయల కాలం రత్నాలు రాసులుగా పోసి వీధుల్లో అమ్మిన మహాయుగం. నాటి కిష్కింధే.. రాయల విజయనగరం.. మనకు హంపి. ఇవాళ్టి కన్నడ రాజ్యంలో ఉన్న నాటి మన తెలుగు నగరి బళ్లారి... కిష్కింధ నుంచి హంపి దాకా సాగిన భారత జాతి నాగరికతా ప్రస్థానం ఇది. మన జాతి మూలాలను పదిలపరచుకున్న పవిత్ర ప్రాంతం కిష్కింధ. సుగ్రీవుడి నుంచి కృష్ణరాయల దాకా అపూర్వమైన చారిత్రక వైభవాన్ని తెలుగువారికి అందించిన నగరం హంపి.. మన మౌలిక మూలాలలో బలమైన మూలం కిష్కింధ.. దక్షిణాపథాన అసమాన సామ్రాజ్య వైభవ చిహ్నం కిష్కింధ. దానికి మరోపేరే విజయనగరం.. ఇంకోపేరు హంపి.

# మహాభారతం మహా రహస్యం

*హస్తినాపురం వినాశనం ఎలా జరిగింది?*

*జరాసంధుని జన్మస్థలమేది? శకుని గాంధారమెక్కడ?*

*ఘటోత్కచుని ఆశ్రమం ఆనవాళ్లున్నాయా? కురుక్షేత్రంలో ఉన్న గుర్తులేమిటి?*

భారత మహారహస్యం బయటపడింది. కురుపాండవుల ఉనికి మళ్లీ స్పష్టమైంది. హస్తిన ఆనవాళ్లు ఖచ్చితంగా కనిపిస్తున్నాయి. కౌరవులు, పాండవులే కాదు.. భారత కాలంలోని చాలామంది మంది వ్యక్తుల గుర్తులు.. ప్రతీకలు మహాభారత మహా రహస్యాన్ని ఛేదిస్తున్నాయి. మహా భారతం విశ్వాసం కాదు... ఇతిహాసం కాదు... పురాణం అంతకంటే కాదు.. మహాభారతం ఒక చరిత్ర.. ప్రపంచానికి నడక నేర్పిన చరిత్ర.. విశ్వానికి నడత తెలిపిన చరిత్ర. ప్రపంచాన్ని అబ్బుర పరచిన నగరాలు..ఆశ్చర్యపరిచే పరిజ్ఞానం.. విస్మయపరిచే సామర్థ్యం.. మహా.. భారతం. కజకిస్తాన్ నుంచి.. కన్యాకుమారి దాకా.. తూర్పు నుంచి పడమర దాకా అఖండంగా విస్తరించిన భారతం.. హస్తిన నుంచి అజేయంగా విస్తరించిన సామ్రాజ్యం. కురుపాండవ సమరాగ్నుల రణక్షేత్రం ఇది. ప్రపంచంలో అత్యంత ప్రాచీనంగా భావించే ఈజిప్టు పిరమిడ్‌ల నిర్మాణానికి ముందే సాంకేతిక నాగరిక సమాజాన్ని అందించిన మహాభారతం ఆనవాళ్లు ఇప్పటికీ ఉన్నాయి. అయిదు వేల సంవత్సరాల నాటి సాంస్కృతిక అఖండ భారతం ఇప్పటికీ అతి వైభవంగా ఆవిష్కారమవుతోంది. కురుపాండవుల ఉనికి మాత్రమే కాదు.. మహాభారత కాలంలోని అనేక రాజ్యాల దృశ్యాలు కళ్లకు కట్టినట్లుగా కనిపిస్తున్నాయి. శిథిలాల్లోనే అపురూపమైన నాగరిక మహా సామ్రాజ్యపు నీడలు కదలాడుతున్నాయి.

కజకిస్తాన్‌గా మారిన కాంభోజ..ఆఫ్గనిస్తాన్‌గా మారిన గాంధారం.. బీహార్‌లో మగధ..





**ఉత్తర భారతంలో మహాభారత ఆనవాళ్లు... హర్యానాలో కృష్ణుడు గీతోపదేశం చేసిన ప్రదేశం... బీహార్‌లో జరాసంధ అఖారా... కులు మనాలీలో ఘటోత్కచుని ఆనవాళ్లను చెప్తున్న హిడింబాలయం**

ఉత్తరప్రదేశంలో హస్తిన.. ఇంద్రప్రస్తం.. ఘటోత్కచ ఆశ్రమం.. కురుక్షేత్రం.. ద్వారక ఎన్నని చెప్పేది.. ఎంత వైభవ నాగరికత.. ఎంత చరిత్ర.. ఎంత సాంస్కృతికత.. వేల ఏళ్ల పాటు నిరంతరాయంగా కొనసాగుతున్న జీవన విధానానికి ఆనాటి రాజ్యాల ఆనవాళ్లు అద్దం పడుతున్నాయి. శకుని పుట్టిన రాజ్యం.. ఘటోత్కచుని ఆశ్రమాలు.. జరాసంధుని రాజగృహం మహాభారత రహస్యాన్ని విప్పి చెప్తున్నాయి.. ఒకప్పుడు మన భారతదేశం ఎలా ఉండేది? ఏయే రాజ్యాలు ఎక్కడెక్కడ ఉండేవి.. అఖండ భారతం ఎంతదాకా విస్తరించి ఉండేది? మనలో చాలా మందికి తెలియని విషయాలివి.. భారతం అంటే కేవలం ఒక ఇతిహాసంగానే చూడటం మనకు ఇప్పటి వరకు తెలిసిన సంగతి. దాన్ని విశ్వాసంగానో, పురాణంగానే మనవాళ్లు చెప్తూ వస్తున్నారు. కానీ, దీని చారిత్రక ఆనవాళ్ల మాటేమిటి? ఆర్కియాలజిస్టులు సుస్పష్టంగా ప్రకటించిన హస్తిన, మగధ, గాంధార వంటి రాజ్యాలు మహాభారత అస్తిత్వాన్ని సగర్వంగా చాటుతున్నాయి.

క్రీ.పూ.3000 నుంచి 2000 వరకు మహాభారత స్వర్ణయుగం. వేదవ్యాసుడు మహాభారతంలో నమోదు చేసినంత వరకు బర్హి అనే రాజు నుంచి పరీక్షిత్తు దాకా యాభై మంది రాజులు పరిపాలించిన కాలం. ఈ టైమ్‌లోనే మహాభారత యుద్ధం కురుపాండవుల మధ్య జరిగింది. క్రీస్తుపూర్వం 3229 ఆగస్టు 15న ధర్మరాజు జన్మించాడు. ఏడాది తరువాత అంటే క్రీస్తుపూర్వం 3228 సెప్టెంబర్ 3న భీముడు, 4న దుర్యోధనుడు జన్మించారు. అప్పుడే అసలైన భారతం మొదలైంది. మహారణస్థలిగా అఖండ భారతాన్ని మార్చేసింది. రక్తపుటేరులు పారించింది. కురుక్షేత్రంలో మహా మారణకాండ సాగింది. ఇంత మహాయుద్ధానికి కేంద్రబిందువైన హస్తినాపురం ఆ తరువాత ఏమైంది? దుర్యోధనుని జయించిన తరువాత 36 సంవత్సరాల పాటు భారత దేశాన్ని పరిపాలించాడు ధర్మరాజు.. అతని తరువాత పరీక్షిత్తు రాజయ్యాడు. పరీక్షిత్తును తక్షకుడు హతమార్చిన తరువాత అతని కుమారుడు జనమేజయుడు రాజయ్యాడు.. ఇంతవరకు మనకు తెలిసిన కథే ఇది. కానీ, జనమేజయుని తరువాత హస్తినాపురం ఏమైంది? దాని ఆనవాలు ఇప్పటికి బయటపడింది. హస్తినాపురం అంటే మనందరికీ తెలిసింది ఇప్పటి ఢిల్లీయేనని. కానీ, నిజమైన హస్తినాపురం ఉత్తరప్రదేశ్‌లోని మీరట్ జిల్లాలో ఉంది. ఇది ఢిల్లీకి 110 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ప్రస్తుత ఢిల్లీ ఒకనాడు పాండవులు ఏలిన ఇంద్రప్రస్థం. ఢిల్లీలో ఇవాళ శిథిలమై కనిపించే పురానా ఖిల్లానే నాటి పాండవుల కోట. దీన్నే హస్తినాపురం మౌంట్ అంటారు. దీనికి తూర్పువైపు నుంచి గంగానది ప్రవహిస్తుంది. 1949లోనే హస్తినాపురం మౌంట్ సమీపంలో తవ్వకాలు జరిగాయి. పశ్చిమం వైపు పింగాణీ వస్తువులకు సంబంధించిన ముక్కలు లభించినా, తూర్పు వైపు మాత్రం ఏవీ దొరకలేదు. జనమేజయుని తరువాత గంగానదికి భారీగా వచ్చిన వరదలు హస్తినాపురాన్ని ముంచెత్తినట్లు పురావస్తు శాస్త్రవేత్తలు కనుగొన్నారు. ఇవాళ మనం హస్తినాపురానికి వెళ్తే.. ఏమాత్రం మార్పు కనిపించదు.. అయిదువేల ఏళ్లనాటి హస్తిన మళ్లీ కనిపిస్తుంది. ఎందుకంటే ఇక్కడి ప్రజలు ఆనాటి పద్ధతిలోనే ఇళ్లు

నిర్మించుకుంటారు. అవే వీధులు. అవే ఇళ్లు.. అదే నగరం.. ఏమాత్రం మార్పు వున్నట్లుగా కనిపించదు. గంగాతీరంలో వెలసిన మహానగరం భూమిలోని వివిధ లేయర్లలో ఇప్పటికీ కనిపిస్తుంది. ఆనాటి కోటలో అంతఃపురాలతో పాటు వివిధ అంతరాల్లో రకరకాల సౌకర్యాలతో గదులు అన్ని వర్గాల వారికి, సిబ్బందికి ఉండేవి.. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మనం సొంతంగా చేసిన పరిశోధనలో వెల్లడైన నిజాలివి. ఒక మహా రాజ్యంలో, మహా సంగ్రామానికి సాక్షీభూతంగా నిలిచిన మహానగరానికి సంబంధించిన సంస్కృతి ఇది. మనకు మాత్రమే చెందిన, మనదే అయిన జీవన విధానమిది. హస్తినాపురం భారత యుద్ధానికి సెంట్రల్ పాయింట్. కానీ, అసలు యుద్ధానికి మూల పురుషుడు మామ శకుని. శకుని ఉన్న చోట శని ఎందుకని సామెత. కౌరవులను యుద్ధానికి ప్రేరేపించింది.. లక్షలాది జనహననానికి కారకుడు శకుని.. ఈ శకుని ఎవరు? దుర్యోధనుడి మేనమామ. ఇతనిది గాంధార రాజ్యం. ఇంతకీ ఈ గాంధార రాజ్యం ఎక్కడుంది? గాంధార రాజ్యం.. ధృతరాష్ట్రుడికి అత్తవారి ఇల్లు. ఆయన భార్య గాంధారీ దేవి తమ్ముడే శకుని. తన తండ్రిని తాతగారు మోసం చేశారన్న అలకతో దుర్యోధనుడు గాంధార దేశంపై దాడి చేసి ఆక్రమించేసుకుని అందరినీ తీసుకువచ్చి జైల్లో బంధించేశాడు. అంతా పోగా మిగిలిన శకుని దుర్యోధనుడి దగ్గరే ఉండిపోయాడు. పాండవులతో సంధి పొసగనీయకుండా, యుద్ధానికి ఉరికొల్పి కురురాజ్యాన్ని సర్వనాశనం చేశాడు. ఈ గాంధార రాజ్యం ఎక్కడుందో తెలుసా? ఇవాళ్టి ఆఫ్ఘనిస్తానే నాటి గాంధార రాజ్యం. ఇప్పటి కాందహార్ దాని రాజధాని. పాకిస్తాన్‌లోని కొంత భాగం కూడా ఈ రాజ్యంలో కలిసి ఉంది. ఇది కేవలం భారత కాలం నాటిదే అనుకుంటే పొరపాటు. గాంధార దేశానికి రామాయణ కాలం నుంచీ అస్తిత్వం ఉన్నది. రాముడి సోదరుడు భరతుడు ఈ ప్రాంతాన్ని పరిపాలించాడు.. అతని వారసత్వంగానే గాంధార రాజ్యం కొనసాగుతూ వచ్చింది. శకుని ఆ వంశంలోని వాడే.. ఆఫ్ఘనిస్తాన్‌లోని పదహారు జనపదాలు కలిపి గాంధార రాజ్యంగా ఏర్పడింది. గాంధార రాజ్యం శిథిలాలు ఇప్పటికీ మనకు కనిపిస్తాయి. అక్కడ ఉన్న కోట అయిదున్నర వేల ఏళ్ల నాటి ఆనవాళ్లకు నిలువుటద్దం. శకుని తరువాత వారసత్వంగా చాలామంది రాజులు గాంధారాన్ని ఏలారు. గాంధారాన్ని అలెగ్జాండర్ ఆక్రమించే నాటికి అంభికుమార్ అనే రాజు పరిపాలించాడు. అతను శకుని వంశానికి నేరుగా వారసుడు. మనకు ఖచ్చితమైన చారిత్రక ఆధారాలు గాంధారంలో లభిస్తున్నాయి. అంభికుమార్ తరువాత బౌద్ధం అక్కడ విస్తరించిందనటానికి తగిన ఆధారాలు కూడా అక్కడ కనిపిస్తాయి. పెషావర్, తక్షశిల వంటి గొప్ప నగరాలు గాంధార రాజ్యంలో భాగంగా ఉండేవి. పెషావర్‌ను నాడు పురుషపురమని పిలిచేవారు. తక్షశిల గురించి తెలియందెవరికి? సరస్వతి నది కూడా గాంధార రాజ్యం మీదుగా ప్రవహించినట్టు తెలుస్తోంది. గాంధార రాజ్యానికి వయసు తాజా తవ్వకాల ప్రకారం 30 వేల సంవత్సరాలు. ఇంతే వయసున్న మరో రాజ్యం మగధ.. శ్రీకృష్ణుడికి ప్రత్యక్ష అనుబంధం ఉన్న మహా రాజ్యాలలో మగధ ఒకటి. మగధతో

పాటు భీమ కుమారుడు ఘటోత్కచుని ఆశ్రమమూ, ఆయన తల్లి హిండిబాదేవి ఆలయమూ భారత కాలమానాన్ని, చరిత్రను సాకారంగా నిరూపిస్తున్నాయి. హిమాచల్‌ప్రదేశ్.. భారతీయులంతా దేవభూమిగా పవిత్రంగా భావించే ప్రాంతం... ఇక్కడ మరో ప్రత్యేకత కూడా ఉంది తెలుసా? హిడింబాదేవి ఆలయం. ఈ తరం వారికి ఈమె పేరు పెద్దగా తెలిసే అవకాశం లేదు లెండి.. ఈమె పాండవులలో రెండవ వాడైన భీమసేనుడి భార్య. వారణాసిలో లక్క ఇంట్లో తమను సజీవదహనం చేసేందుకు దుర్యోధనుడు ప్రయత్నించినప్పుడు పాండవులు తప్పించుకుని ఇప్పుడు మనం మనాలీగా పిలుచుకుంటున్న ప్రాంతానికి వచ్చారు. ఇక్కడే హిండింబి సోదరుడిని భీముడు హతమార్చి ఆమెను వివాహం చేసుకున్నాడు. ఆమెకు కలిగిన సంతానమే ఘటోత్కచుడు. హిడింబాదేవి ఆలయం భారత ఆలయాలలోనే చాలా చాలా అందమైన ఆలయం. ఇక్కడ కనిపించే కొమ్ములు, ఇతర ప్రాచీన వస్తువులు ఘటోత్కచునికి సంబంధించినవని చెప్తారు.

మగధ సామ్రాజ్యం అంటే ముందుగా గుర్తుకు వచ్చేది చంద్రగుప్తుడు.. ఆ సామ్రాజ్యానికి ఆయన ఎన్నవ రాజో మీకు తెలుసా? 128వ రాజు. బృహద్రథుడితో ప్రారంభమైన మగధ సామ్రాజ్యం అశోకుడి దాకా ఆ తరువాత కూడా అవిచ్ఛిన్నంగా కొనసాగింది. బృహద్రథ వంశంలోని వాడే జరాసంధుడు. బీహార్‌లోని రాజగిర్‌లో జరాసంధుడి కోట ఆనవాళ్లు ఇవాల్టికీ కనిపిస్తాయి. రాజ్‌గిర్‌నే నాడు గిరివ్రజపురంగా పిలిచేవారు. ఇందులోనే భీముడు, జరాసంధుడు మల్ల యుద్ధానికి దిగారు. జరాసంధుని భీముడు వధించింది కూడా ఇక్కడే. జరాసంధుడు మార్షల్ ఆర్ట్స్‌కి ప్రసిద్ధి.. అందుకే ఇక్కడి జరాసంధ అఖారాలో ఇప్పటికీ మార్షల్ ఆర్ట్స్‌ను ప్రాక్టీస్ చేస్తారు. కురుక్షేత్రంలో క్షిపణి ప్రయోగాలు చేయటానికి చాలా కాలానికి ముందే జరాసంధుడు మధుర మీద క్షిపణిని ప్రయోగించాడు. అంతకు ముందు 17సార్లు శ్రీకృష్ణుడు మగధను జయించాడు. చివరకు జరాసంధుడి క్షిపణి ప్రయోగాల నుంచి మధుర ప్రజలను రక్షించేందుకు యుద్ధం చేయకుండా ద్వారకకు ప్రజలతో సహా తరలివెళ్లాడు. జరాసంధుడి తరువాత మగధను పరిపాలించిన ఏడో వంశం వాడు చంద్రగుప్త మౌర్యుడు. ఈయన తరువాతి నుంచి ఈ ప్రాంతం బౌద్ధానికి ప్రసిద్ధమైంది.

హస్తిన, గాంధార, మగధ, హిమాచల, ఇంద్రప్రస్థ.. ఇలా చెప్పుకుంటూ పోతే ఉత్తర భారతంలోని ప్రతి అణువూ మహాభారత గాధను విప్పి చెప్తుంది. ప్రతి కణమూ భారతేతిహాసాన్ని ప్రతిధ్వనింపచేస్తుంది. ఇది రహస్యం కాదు.. కళ్లముందు కనిపిస్తున్న వాస్తవం. ఇది మిత్ అని, విశ్వాసం మాత్రమే అని, పుక్కిటి పురాణమని కొట్టిపారేసే వాళ్లకు అర్థం కాని, అంగీకరించటానికి ఇష్టపడలేని చరిత్ర. వేల సంవత్సరాల అత్యున్నత విశ్వనాగరికతకు ప్రతీక. ఇది మహాభారతం.. అఖండ భారతం. అనన్యభారతం.

# 18 రోజులు



ఒక కుటుంబం.. అన్నదమ్ముల మధ్య అధికార తగాదా, చిలికి చిలికి గాలివానగా మారింది. అన్న భార్యను తమ్ముడు అవమానించాడు.. ఇంకేం యుద్ధమేఘాలు కమ్ముకున్నాయి. ఇరువర్గాలూ రణరంగానికి సర్వం సన్నద్ధమయ్యాయి. అధికారం అన్నదమ్ముల మధ్య చిచ్చు పెట్టింది. అహంకారం పగల్ని రగిల్చింది. మహా మారణహోమాన్ని సృష్టించింది.. ప్రపంచ నాగరిక చరిత్రలో కనీవినీ ఎరుగని సామూహిక జనహననం అది. ఒక కుటుంబం కోసం ఒక దేశం బలైపోయింది. రాజరికపు దుష్టజూదానికి సామంత రాజ్యాలు హరించుకుపోయాయి. మాయదారి యుద్ధం లక్షల మందిని పొట్టన పెట్టుకుంది. ఇదంతా అయిదున్నర వేల సంవత్సరాల క్రితం జరిగిన కథ.. మన దేశంలోనే జరిగిన కథ. ఇన్ని వేల సంవత్సరాల తరువాత కూడా ఇప్పటి రాజకీయ వ్యవస్థ సైతం అనుసరిస్తున్న రాజనీతిని అందించిన చరిత్ర. ఇది మహాభారత గాథ.. అయిదుగురు పాండవులు, నూరుగురు కౌరవులను అతి తేలిగ్గా ఓడించిన ఇతిహాసం. తమ రాజ్యాధికారాన్ని అన్యాయంగా స్వాధీనం చేసుకున్న కౌరవులపై పాండవులు ప్రతీకారం తీర్చుకున్న కథ. తమ భార్యను పదిమందిలో వివస్త్రను చేసేందుకు యత్నించిన దుర్మార్గులను పాండవులు మట్టుబెట్టిన కథ.

వార్ హెడ్ విమానాలు..వైమానిక దాడులు.. జీవరసాయన ఆయుధాలు.. అణ్వస్త్ర ప్రయోగాలు. రోజుకు రెండు లక్షల మంది..18 రోజుల్లో 36 లక్షల మంది.. మహా మారణ హోమంలో సామూహిక జన హననం.. ప్రళయాన్ని సృష్టించిన మహా యుద్ధం.. కురుక్షేత్రం. తొలి ప్రపంచ సంగ్రామం ఎక్కడ జరిగిందో తెలుసా? 1914 అని జికె తెలిసిన కుర్రోళ్లు ఠక్కున చెప్పేస్తారు.. కానీ, అది తప్పు.. ముమ్మాటికీ తప్పే.. మొదటి ప్రపంచ సంగ్రామం క్రీస్తుపూర్వం 3138లో జరిగింది. అదీ మన దేశంలో, భారత

ఉపఖండంలో– రెండు కుటుంబాల మధ్య జరిగిన యుద్ధం, రెండు ప్రపంచ సంగ్రామాల కంటే దారుణమైన వినాశనాన్ని సృష్టించింది. అంతకు ముందు, ఆ తరువాత, ఇవాళ్టికి సైతం కనీవినీ ఎరుగని బాంబు పేలుళ్లతో ప్రళయాన్ని సృష్టించిన మహా సంగ్రామానికి మనమే వారసులం. కేవలం 18 రోజుల్లో మానవ సమూహమే నాశనమైపోయింది. మానవ జాతికి మరపునకు రాని చరిత్రను అందించిన మహాయుద్ధం అది. దాయాదుల మధ్య అధికార కాంక్షతో అంతులేని మారణకాండ జరిగిపోయింది.

క్రీస్తు పూర్వం 3138, డిసెంబర్ 25, మంగళవారం, మార్గశిర మాసం, శుక్లపక్షం, త్రయోదశి మహా సంగ్రామానికి ముహూర్తం కుదిరింది. ఈ ముహూర్త బలం వల్లనేమో 18 రోజుల్లో 36 లక్షల మంది హతమయ్యారు. ఈ యుద్ధంలో అత్యాధునిక ఆయుధాలు ఉపయోగించారు. అణ్వస్త్రాలు, జీవ రసాయనాయుధాలు, ఎయిర్ బ్యాటిల్, ఈనాటి అగ్రరాజ్యాలను సైతం నివ్వెరపరిచే ఆధునిక యుద్ధ తంత్రాలు ప్రయోగించారు. నేటి ప్రపంచానికి యుద్ధ నీతిని అందించిన మహారణం ఈ కురుక్షేత్రం.

అణ్వస్త్రం.. అమెరికా వాడు తయారు చేశాడు.. చంద్రుడి మీదకు అమెరికా వాడు ముందు వెళ్లాడు.. యుద్ధం చేయటం అమెరికా వాడికే తెలుసు.. ప్రజాస్వామ్యం అమెరికా నుంచి నేర్చుకోవాలి.. నియంతృత్వం అమెరికా నుంచే తెలుసుకోవాలి.. పసుపుపై పేటెంటు అమెరికాదే.. ప్రపంచంపై పేటెంటు అమెరికాదే.. ప్రపంచ పోలీసు సర్వాంతర్యామి.. మనది కొంచెం తెలివైతే.. వాడిది అతి తెలివి.. ఇదంతా దేనికని అనుకోకండి.. ఇప్పు డున్న ట్రెండ్ అలాంటిది.. ప్రపంచంలో అన్నీ అమెరికాలోనే పుట్టాయనుకునే జనరేషన్ మనది.. కానీ, సోకాల్డ్ అమెరికా వంటి ప్రపంచ దేశాలన్నింటికీ మించిన సాఫిస్టికేటెడ్ టెక్నాలజీలో మనం ఎంతో ముందున్నామన్న నిజం తెలుసా? మహా భారత యుద్ధమే ఇందుకు తార్కాణం. ఒక పర్‌ఫెక్ట్ వార్ టెక్నాలజీకి మోడల్‌గా మహాభారత యుద్ధాన్ని చెప్పుకోవచ్చు. ఇవాళ్టికి 5150 ఏళ్ల కింద జరిగిన మహాభారత యుద్ధాన్ని గురించి పెద్ద ఎత్తున పరిశోధనలు జరిగాయి. మహాభారత ఇతిహాసంలో చెప్పిన అంశాలు, న్యూఢిల్లీ, దాని చుట్టు పక్కల ప్రాంతాల్లో, హరప్పా, మొహంజదారో నాగరికతలు వెలువడ్డ ప్రాంతాల్లో ప్రపంచ ప్రసిద్ధులైన ఆర్కియాలజిస్టుల రీసర్చ్ మహాభారత యుద్ధం నాటి అనేక విషయాలను వెలుగులోకి తీసుకువచ్చాయి.

ఏన్షియెంట్ వార్‌లో అత్యంత శక్తిమంతమైన బాంబు పేలుళ్లు జరిగాయి. అర్జునుడు అణ్వస్త్రాన్ని ప్రయోగించినట్లు తెలుస్తోంది. యుద్ధం జరిగింది 18 రోజులే అయినా, అయిదువేల ఏళ్ల తరువాత కూడా దాని రేడియేషన్ ప్రభావం సజీవంగా కనిపించటం విశేషం. కురుక్షేత్రంలో జరిగిన యుద్ధంలో ఊహకందని అంశాలు కనిపిస్తాయి. వివిధ దేశాలు ఇవాళ్టి ఆర్మీలో అనుసరిస్తున్న అనేక విభాగాలు కౌరవ, పాండవుల సైన్యంలో మనకు కనిపిస్తాయి.

ఆనాటి ఒక ఆర్మీవింగ్‌ను అక్షౌహిణి అని పిలిచేవారు.ఒక అక్షౌహిణిలో 1,09, 000వేల మంది సైనికులు, 21,870 రథాలు, 21,870 యుద్ధ ఏనుగులు, 65,610 హార్స్‌రైడర్‌లు ఉంటారు. ఆర్మీ జనరల్‌గా మహా సేనాపతి ఉంటాడు. ఆయన కింద లెఫ్టినెంట్ జనరల్, మేజర్ జనరల్, బ్రిగేడియర్, కల్నల్, లెఫ్టినెంట్ కల్నల్, మేజర్, కెప్టెన్, లెఫ్టినెంట్‌లుగా రకరకాల స్థాయిల్లో సైనికాధికారులు ఉండేవారు. కాకపోతే అప్పటి పేర్లు వేరు. ఇప్పటి పేర్లు వేరు. సైన్యం మోహరింపు కూడా స్పెసిఫిక్ వ్యూహం ప్రకారం ఉండేది. ఒక రథం, ఒక వార్ ఎలిఫెంట్, ముగ్గురు హార్స్ రైడర్లు, అయిదుగురు సైనికులు ఇది ఒక టీమ్ అన్నమాట. ఇదేమీ ఆషామాషీ మోహరింపు కాదు. ఒకసారి ఈ సైనిక వ్యూహంలో చిక్కుకున్నవాడు ఎంత గొప్పవాడైనా సరే ప్రాణాలతో బయటకు రావటం ఈజీ కాదు. అభిమన్యుడు ఇలాంటి పద్మవ్యూహంలో చిక్కుకుని ప్రాణాలు పోగొట్టుకున్నవాడే. యుద్ధంలో ఎత్తుకు పైఎత్తులు, కూటనీతి, మోసాలు, పవర్ ఆఫ్ వెపన్స్ వంటివన్నీ మహాభారత యుద్ధంలో స్పష్టంగా కనిపిస్తాయి. ఆధునిక యుద్ధవ్యూహాలు కురుక్షేత్ర యుద్ధం ముందు ఎందుకూ  కొరగావు.

కురుక్షేత్ర యుద్ధం నాటికి కౌరవ పాండవ సైన్యాలు ఆనాటికి అత్యంత ఆధునికమైన ఆయుధ సంపత్తిని సమకూర్చుకున్నాయి. ఇవాళ మనం ఏలియన్స్‌గా పిలుచుకునే గ్రహాంతర వాసులు వారికి టెక్నాలజీ విషయంలో సహకరించారని గ్రహాంతర వాసుల గురించి పరిశోధనలు చేస్తున్న శాస్త్రవేత్తలు అంచనా వేస్తున్నారు.. ఈ ఏలియన్సులే భారత కాలంలో దేవతలు కావచ్చు. కురుక్షేత్ర యుద్ధంలో  ఇరుపక్షాలూ చాలా శక్తిమంతమైన ఆయుధాలనే వాడాయి. కత్తులు, కటార్లు, బాణాలు, గదలు వంటి ట్రెడిషనల్  ఆయుధాలు ఎలాగూ వున్నాయి. వీటితో పాటు ప్రమాదకరమైన వార్‌హెడ్స్ ఉన్న మిస్సైల్స్ ప్రయోగాలు భారత వీరులు ఆనాడే చేసినట్లు తెలుస్తోంది. క్షిపణి ప్రయోగంలో భీష్మ, అర్జున, కర్ణులు గ్రేట్ వారియర్స్ అని చెప్పవచ్చు. అంతే కాదు.. వైమానిక దాడుల్లోనూ కురుపాండవ సైన్యాలు పాల్గొన్నాయి. పాండవసైన్యం వైమానికదాడి ద్వారా ఇందూస్ వ్యాలీలో న్యూక్లియర్ వెపన్ ప్రయోగించటం వల్ల అక్కడ సర్వనాశనం జరిగిందని ఆర్కియాలజిస్టుల అంచనా. దీని కాలాన్ని కూడా 5వేల సంవత్సరాల పైనేనని అంతర్జాతీయ నిపుణులు సైతం ధృవీకరించారు.

న్యూక్లియర్ వెపన్ టెక్నాలజీని పాండవులు అరణ్యవాస కాలంలో సాధించినట్లు తెలుస్తోంది. అడవిలో ఉన్న పన్నెండు సంవత్సరాల కాలాన్ని యుద్ధానికి తగిన ఆయుధాలను సమకూర్చుకోవటానికి పాండవులు అనుకూలంగా మార్చుకున్నారు. అణ్వస్త్రంతో పాటు దానికంటే వంద రెట్లు శక్తిమంతమైన పాశుపతాస్త్రాన్ని సైతం అర్జునుడు సంపాదించాడు. కానీ, దాన్ని అతను భారత యుద్ధంలో ప్రయోగించలేదు.

వైమానిక దాడుల్లో మన వారు ఆనాడే మంచి టెక్నాలజీని వాడారు. భారత కాలంలో ఉపయోగించిన రవాణా, యుద్ధ విమానాల్లో మెర్క్యురీని ఇంధనంగా వాడారు. ఈ



**పద్మవ్యూహం గురించి వినని వారు ఉండరు. ఈ పద్మవ్యూహం కురుక్షేత్ర యుద్ధంలో శత్రువును మట్టుపెట్టడానికి వేసిన పన్నాగం.. అర్జునుడి కుమారుడు అభిమన్యుడు ఈ పద్మవ్యూహంలో చిక్కుకుని విలవిల్లాడిపోయాడు.. తప్పించుకుని బయటకు ఎలా రావాలో తెలియక చనిపోయాడు. పద్మవ్యూహం మాదిరిగా సైన్యాన్ని ఒక చిక్కుముడిలా మోహరించటంలో ద్రోణాచార్యుడు సిద్ధహస్తుడు.**

విమానాలు కూడా ఇవాళ్టి యుద్ధ విమానాలకు ఎంతమాత్రం తీసిపోవు. ఇప్పటి విమానాల మాదిరిగానే, నాటి విమానాలు సైతం వార్‌హెడ్‌లను కలిగి ఉన్నట్లు తెలుస్తోంది. ఆధునిక ఆయుధాలు ఎన్ని వాడినా, సంప్రదాయ అస్త్రాలైన బాణాలకే భారత యుద్ధంలో ప్రాధాన్యం ఎక్కువ లభించింది. యుద్ధంలో పాల్గొన్న యోధులందరిలో దాదాపు 60 శాతం మంది విలుకాళ్లే కావటం విశేషం.. రకరకాల విష పూరిత అస్త్రాలతో శత్రువులపై దాడి చేయటంలో వీళ్లను మించిన వాళ్లు లేరు. మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 3138 డిసెంబర్ 25న ప్రారంభమై 18 రోజుల్లో సుమారు 36 లక్షల మంది ప్రాణాలను బలిగొంది. ఇరువైపులా రాటుదేలిన యుద్ధ తంత్ర నిపుణులు ఉండటంతో కురుక్షేత్రం అస్తిపంజరాల గుట్టగా మారిపోయింది. చివరకు పోయినోళ్లందరూ పోగా మిగిలింది పదకొండు మంది.

పద్మవ్యూహం.. దీని గురించి విననివారు బహుశా ఉండరు.. ఎవరైనా ప్రత్యర్థి వలలో చిక్కుకుపోతే ఒక జాతీయం లాగా అంటే ఇడియమెటిక్ ఎక్స్ప్రెషన్‌లా దీన్ని వాడతారు. ఈ పద్మవ్యూహం కురుక్షేత్ర యుద్ధంలో శత్రువును మట్టుపెట్టడానికి వేసిన పన్నాగం. అర్జునుడి కుమారుడు అభిమన్యుడు ఈ పద్మవ్యూహంలో చిక్కుకుని విలవిల్లాడిపోయాడు. తప్పించుకుని బయటకు ఎలా రావాలో తెలియక చనిపోయాడు. పద్మవ్యూహం మాదిరిగా సైన్యాన్ని ఒక చిక్కుముడిలా మోహరించటంలో కురుపాండవుల గురువు ద్రోణాచార్యుడు సిద్ధహస్తుడు. ఇలాంటి ఎత్తుగడలను కురుక్షేత్ర యుద్ధంలో ఇరుపక్షాలూ పెద్ద ఎత్తున వినియోగించుకున్నాయి. ఇటు కృష్ణుడు, దృష్టద్యుమ్నుడు, అటు భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు రెండు సైన్యాలకు థింక్‌ట్యాంక్‌గా ఉపయోగపడ్డారు.

18 రోజుల్లో జరిగిన యుద్ధంలో దాదాపు 19 వ్యూహాలను.. కురుపాండవులు ఒకరిపై ఇంకొకరు పన్నారు. అందులో పద్మవ్యూహం ఒకటి. ఇవి కాకుండా క్రౌంచ, మకర, చక్ర, గరుడ, మండల, వజ్ర వ్యూహాల్లాంటివి చాలా ఉన్నాయి. ప్రత్యక్ష యుద్ధంలో ఒకరి సైన్యంపై

**శల్యుణ్ణి మత్తు ఇచ్చే పాండవులు వశం చేసుకున్నారు.. కర్ణుడు నాగాస్త్రంతో విషప్రయోగం చేశాడు.. అర్జునుడు రెండుమూడు సార్లు సమ్మోహకాస్త్రాన్ని ప్రయోగించాడు. యుద్ధం లో కౌరవులు పెద్ద ఎత్తున విష సర్పాలను శత్రువులపైకి వదిలేశారు. గెలుపే ధ్యేయం.. ప్రత్యర్థిని ఓడించటమే లక్ష్యం.. శత్రువును ఏమార్చి పరిమార్చటం ఎలాగో మహాభారత యుద్ధం మనకు చెప్తోంది.**



మరొకరి సైన్యం తలపడి యుద్ధం చేయాల్సిన పరిస్థితి. విమాన దాడులు, బాంబు పేలుళ్లకు ఇలాంటి వ్యూహాలు అవసరం లేదు. నేరుగా అస్త్ర ప్రయోగాలు జరుగుతాయి. జస్ట్ టార్గెట్ ఉంటే చాలు.. కురుక్షేత్రంలో చోటు చేసుకున్నది ప్రత్యక్ష పరోక్షాలు కలగలిసిన సమరం.. అందుకే వ్యూహ ప్రతివ్యూహాలతో యుద్ధంలో ఇరుపక్షాల వైపు నుంచి పాల్గొన్న యావత్ సైన్యం నామరూపాల్లేకుండా సమసిపోయింది.

అన్నింటికీ మించి కురుక్షేత్రంలో జరిగిన జీవరసాయనాయుధాల ప్రయోగం.. పాములతో విషప్రయోగం చేయటం.. క్షిపణుల ద్వారా మత్తు వాయువులు గాల్లోకి వెదజల్లటం, రహస్యంగా మత్తుమందులు ఇవ్వటం వంటి ప్రయోగాలు కురుక్షేత్ర యుద్ధంలోనే జరిగాయి. నాగాస్త్రాలు, సమ్మోహకాస్త్రాలు తెలుగు సినిమాల్లో బాణాలుగానే కనిపిస్తాయి. కానీ, ఇవన్నీ ఆనాడు మనవాళ్లు వాడిన జీవ, రసాయన ఆయుధాలు. శల్యుణ్ణి మత్తు ఇచ్చే పాండవులు వశం చేసుకున్నారు.. కర్ణుడు నాగాస్త్రంతో విషప్రయోగం చేశాడు.. అర్జునుడు రెండుమూడు సార్లు సమ్మోహకాస్త్రాన్ని ప్రయోగించాడు. యుద్ధంలో కౌరవులు పెద్ద ఎత్తున విష సర్పాలను శత్రువులపైకి వదిలేశారు. గెలుపే ధ్యేయం.. ప్రత్యర్థిని ఓడించటమే లక్ష్యం.. శత్రువును ఏమార్చి పరిమార్చటం ఎలాగో మహాభారత యుద్ధం మనకు చెప్తోంది.

దాదాపు పదేళ్ల పాటు సాగిన రెండు ప్రపంచ యుద్ధాల్లో సుమారు రెండు కోట్ల మంది ప్రజలు, సైనికులు హతులయ్యారు.. కురుక్షేత్రంలో కేవలం 18 రోజుల్లోనే 36లక్షల మంది చనిపోయారు.. మన ప్రపంచ యుద్ధాలు జరిగినట్లు పదేళ్ల పాటు జరిగితే భూమి మీద ప్రాణి అంటూ మిగులుతుందా? అసలు భూగోళమే ఉంటుందా? ఇంతమందిని మృత్యువాత పడేసేంత శక్తి కురుపాండవులకు ఉందా? వారి దగ్గర ఉన్న శక్తి సంపద ఏమిటి? కురుక్షేత్ర యుద్ధంలో ఎవరు ఎంత సత్తా చూపించారు? ఇరుపక్షాల నుంచి

పాల్గొన్న సైన్యం 18 అక్షౌహిణులు. యుద్ధం జరిగిన రోజులు 18.. అంతా 18 చుట్టూనే భారతమంతా తిరిగింది. యుద్ధం జరిగిన 18 రోజుల్లో ఏరోజు ఏం చోటు చేసుకుంది.?

***క్రీస్తు పూర్వం 3153, జూన్ 17....కౌరవ పాండవుల మధ్య జూదం***

***క్రీస్తుపూర్వం 3153, జూలై 3....పాండవుల అరణ్యవాసం ప్రారంభం***

***క్రీస్తు పూర్వం 3141, జూలై 3.. అజ్ఞాత వాసం ప్రారంభం***

***సంవత్సరం తరువాత సమాప్తమైన అజ్ఞాతవాసం***

***క్రీస్తుపూర్వం 3139, కృష్ణుడి శాంతి చర్చలు విఫలం***

***క్రీస్తుపూర్వం 3138...కురుక్షేత్ర యుద్ధం***

మహా భారత యుద్ధంలో ప్రధాన సన్నివేశాలు జరిగిన సమయం ఇవన్నీ.. ఇదేమీ పుక్కిటి పురాణం కాదు. భారత యుద్ధంపై ప్రపంచ వ్యాప్తంగా విస్తృతంగా జరిగిన పరిశోధనల సారం ఇవి. మన పుస్తకాలు పక్కన పెట్టి వివిధ ప్రాంతాల్లో జరిగిన ఆర్కియాలజీ రీసర్చ్ ఫలితం మహాభారత కాలం.

అయిదో శతాబ్దానికి చెందిన ఆర్యభట్టు మహాభారత కాలాన్ని క్రీస్తు పూర్వం 3100గా గణించాడు. ప్రొఫెసర్ సి.వి. వైద్య, ప్రొఫెసర్ ఆప్టె 3101గా భారత కాలాన్ని గణించారు. తెలుగు వాడైన కోట వెంకటాచలం మహాభారత కాలాన్ని క్రీస్తు పూర్వం 3139గా నిర్ధారించారు. పీవీ వర్తక్ మాత్రం మహాభారత యుద్ధం ప్రారంభమైన తేదీని క్రీస్తు పూర్వం 5561 అక్టోబర్ 16 అన్నారు. అయితే ఎక్కువ మంది శాస్త్రవేత్తలు మాత్రం క్రీస్తు పూర్వం 3100 నుంచి 3139నే మహాభారత కాలంగా నిర్ధారిస్తున్నారు. కోట వెంకటాచలం రాసిన 'ది ప్లాట్ ఇన్ ఇండియన్ క్రోనాలజీ' అనే గ్రంథం ఈ గణాంకాలను హేతుబద్ధంగా నిరూపిస్తున్నది.

కురుక్షేత్ర యుద్ధ రంగంలో ఇప్పటికీ ఆనాటి ఆనవాళ్లు మనకు కనిపిస్తాయి.. భీష్ముడు అంపశయ్యపై తలవాల్చిన ప్రదేశం, శ్రీకృష్ణుడు అర్జునునికి గీతోపదేశం చేసిన ప్రదేశం కురుక్షేత్రంలో ఇవాళ్టికీ ఉన్నాయి. కురుక్షేత్ర ప్రస్తుతం హర్యానాలో ఉంది. పాండవులు ఏలిన ఇంద్రప్రస్థం కూడా దీనికి సమీపంలోనే ఉంది. ఢిల్లీలోని కొంత ప్రాంతం, దానికి దక్షిణాన ఉన్న మిగతా ప్రాంతాలు కలిసి ఆనాడు హస్తినాపురంగా పిలిచారు. ఈ హస్తిన గద్దె కోసమే ఇంత యుద్ధం జరిగింది.

ఈ గ్రేట్ వార్‌లో భారత ఖండంలోని అన్ని దేశాల సైన్యాలు ఏదో ఒక పక్షం వైపు చేరి పాల్గొన్నాయి. నాటి మహేంద్రగిరి, నేటి కన్యాకుమారి నుంచి నాటి గాంధారం-నేడు ఆఫ్ఘనిస్తాన్‌లోని కాందహార్ దాకా అన్ని రాజ్యాలు కురుపాండవ యుద్ధంలో భాగస్వాములే. మన ఆంధ్రులు సైతం కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొన్నారు.. నాడు వీరు కౌరవుల పక్షాన

**అత్యంత కీలక పాత్ర పోషించిందీ, కింగ్ మేకర్‌గా ఎత్తుకు పై ఎత్తులు వేసింది శ్రీకృష్ణుడే. పాండవులను లేకుండా చేసేందుకు దుర్యోధనుడి అన్ని ప్లాన్‌లను నిర్వీర్యం చేసింది కృష్ణుడే. చివరకు కురుక్షేత యుద్ధంలో తాను ఆయుధం పట్టనన్నాడు కానీ, చేయాల్సిందంతా చేశాడు. తానే ముందుండి పాండవులను విజయం వైపు తీసుకువెళ్లాడు.**



నిలబడి పోరాటం చేయటం విశేషం. కురుపాండవుల వ్యవహారంలో అత్యంత కీలక పాత్ర పోషించిందీ, కింగ్ మేకర్‌గా ఎత్తుకు పైఎత్తులు వేసింది శ్రీకృష్ణుడే. కౌరవుల విషయంలో శకుని, కర్ణులు ఎంతగా ప్రభావితం చేసినా, కృష్ణుడే అంతా తానే అయి చక్రం తిప్పాడు. పాండవులను లేకుండా చేసేందుకు దుర్యోధనుడి అన్ని ప్లాన్‌లను నిర్వీర్యం చేసింది కృష్ణుడే. చివరకు కురుక్షేత యుద్ధంలో తాను ఆయుధం పట్టనన్నాడు కానీ, చేయాల్సిందంతా చేశాడు. తానే ముందుండి పాండవులను విజయం వైపు తీసుకువెళ్లాడు. సూర్యోదయంతో మొదలయ్యే యుద్ధం సూర్యాస్తమయంతో పూర్తయ్యేది. రాత్రి పూట యుద్ధం చేయటం ఆనాడు నిషేధం. అంతే కాదు.. బలహీనుడిపై, ఆయుధం లేని వాడిపై, ఆడవాళ్లపై యుద్ధం చేయకూడదన్న రూల్ కూడా ఆనాడు ఉంది. శుభకృత మార్గశిర త్రయోదశి మంగళవారం నాడు కురుక్షేత్ర యుద్ధం మొదలైంది. అప్పటికి ధర్మరాజు వయస్సు 91 సంవత్సరాల రెండు నెలల తొమ్మిది రోజులు. యుద్ధం ప్రారంభానికి ముందు ఇరుపక్షాల సైన్యాలు వ్యూహ ప్రతివ్యూహాల గురించి రిహార్సల్స్ చేసి మరీ బరిలో దిగాయి. తొలినాడే అర్జునుడు శత్రువర్గాన్ని చూసి యుద్ధం చేయలేనంటూ చేతులెత్తేశాడు. దీంతో కృష్ణుడు హితబోధ చేయక తప్పలేదు. చెడు చేసినవాడు, నేరగాడు ఎలాంటి వాడైనా, బంధువైనా సరే శిక్షించాల్సిందేనని కృష్ణుడు గీతోపదేశం చేశాడు.

పాండవుల వైపు ఆర్మీ చీఫ్‌గా దృష్టద్యుమ్నుడు, కౌరవుల వైపు భీష్ముడు సర్వసైన్యాధ్యక్షుడిగా వ్యవహరించారు. మొదటి రోజు కౌరవులు పశ్చిమానికి ముఖం చేసి మోహరిస్తే, పాండవులు తూర్పు వైపు ముఖం చేసి మోహరించారు. చుట్టూ పెట్టని కోటలా ఏనుగులు, మధ్యలో



**పదో రోజు దాకా పాండవ సైన్యం భీష్మ ద్రోణుల కారణంగా తీవ్రంగా నష్టపోయింది. శత్రువు బలవంతుడైనప్పుడు అతని బలహీనత ఏదో కనుక్కొని దాని ద్వారా కార్యం సాధించాలన్నట్లు, శిఖండిని అర్జునుడి రథం ముందు నిలబెట్టి భీష్ముడిని అర్జునుడి ద్వారా అంపశయ్యపైకి పంపించాడు కృష్ణుడు. శిఖండితో యుద్ధం చేయకూడదన్నది పితామహుడు తనకు తాను విధించుకున్న మారటోరియం.**

రాజులు, వారికి ఇరువైపులా రక్షణగా ఇతర సైనిక విభాగాలు పటిష్ఠంగా కౌరవ సైన్యం నిలబడింది. అటు పాండవ సైన్యం తక్కువ కావటంతో గరుడాకారంలో ప్రత్యర్థికి ఎదురు నిలిచింది. ఆర్మీ చీఫ్ భీష్ముడు కావటంతో అతని వ్యవహారాలు చూసే మిలటరీ ఆఫీసర్ ఇన్‌చార్జ్‌గా దుర్యోధనుడి తమ్ముడు దుశ్శాసనుడు ఉన్నాడు.

మొదటి రోజు భీష్ముడు పాండవ సైన్యాన్ని ఛిన్నాభిన్నం చేసేశాడు.. పాండవుల పక్షం ఉత్తర కుమారుడితో సహా చాలామంది సైన్యాన్ని తొలిరోజే కోల్పోయింది.

రెండవ రోజు అర్జునుడు రియలైజ్ అయి, భీష్ముడి ధాటిని నిలువరించే ప్రయత్నం చేశాడు.. అటు భీముడిపైకి దుర్యోధనుడు కళింగ సైన్యాలను పంపించాడు. రెండో రోజు కౌరవ సైన్యం తీవ్రంగా నష్టపోయింది. పాండవుల వైపు కేవలం ఏడు అక్షౌహిణుల సైన్యమే ఉంది. ఇందులో ఒకటిన్నర అక్షౌహిణుల సైన్యాన్ని అంటే దాదాపు మూడు లక్షల మంది సైనికులను భీష్ముడొక్కడే హతమార్చాడు. జీవ రసాయన ఆయుధాలను ప్రయోగించాడు. వార్‌హెడ్ మిస్సైళ్లను కూడా భీష్ముడు ఉపయోగించాడు కాబట్టే, అతని చేతిలో భారీ వినాశనం జరిగింది. మూడో రోజున భీముడి కొడుకు ఘటోత్కచుడు యుద్ధంలో ఎంటర్ అయి ఎయిర్ బ్యాటిల్ చేశాడు. నాలుగో రోజున ఘటోత్కచుడు దుర్యోధనుడి సోదరులను చాలామందిని హతమార్చాడు. అయితే భీష్ముడి ధాటిని మాత్రం పాండవులు ఎదుర్కోలేకపోయారు.. అయిదో రోజు నుంచి పదో రోజు దాకా పాండవ సైన్యం భీష్మ ద్రోణుల కారణంగా తీవ్రంగా నష్టపోయింది. శత్రువు బలవంతుడైనప్పుడు అతని బలహీనత ఏదో కనుక్కొని దాని ద్వారా కార్యం సాధించాలన్నట్లు, ఓ హిజ్రా(శిఖండి)ను అర్జునుడి

రథం ముందు నిలబెట్టి భీష్ముడిని అర్జునుడి ద్వారా అంపశయ్యపైకి పంపించాడు కృష్ణుడు. హిజ్రాలతో యుద్ధం చేయకూడదన్నది పితామహుడు తనకు తాను విధించుకున్న మారటోరియం. పది రోజుల పాటు ఊహించిన దాని కంటే వేగంగా కౌరవులకు గెలుపు దిశగా సాగిన యుద్ధం, ఒక్కసారిగా డౌన్‌ఫాల్ కావటం మొదలుపెట్టింది. ఈ యుద్ధంలో చెప్పుకోదగ్గ విశేషాలు చాలానే కనిపిస్తాయి. రణరంగంలో అన్ని వైపుల నుంచీ ఇరుపక్షాల ఆర్మీ వింగ్స్ శత్రువుపై అందివచ్చిన పద్ధతిలో యుద్ధం చేస్తూ వచ్చాయి. అందుకే కురుక్షేత్రంలో పలుచోట్ల బాంబుపేలుళ్లు జరిగిన ఆధారాలు కనిపిస్తాయి. అంతే కాకుండా తొలి మూడు, నాలుగు రోజుల్లో జరిగిన యుద్ధంలో ఎగిరే రథాలతో వార్ జరిగినట్లు తెలుస్తోంది.

పదో రోజున భీష్ముడు అంపశయ్యపై పడిపోయిన తరువాత 11వ రోజున ఆయన పదవిని ద్రోణాచార్యుడు తీసుకున్నాడు. ఇతని పద్మవ్యూహంలోనే అభిమన్యుడు చిక్కుకుపోయాడు. కురుక్షేత్ర యుద్ధంలో 13వ రోజున అభిమన్యుడు చనిపోయాడు. అప్పటికి అభిమన్యుడి వయస్సు కేవలం 32 సంవత్సరాలే. అంతే కాదు.. అతను ఉత్తరతో వివాహ జీవితం గడిపింది కేవలం ఆరు మాసాలే. అప్పటికి ఆమె గర్భవతి కూడా. ఈమె కొడుకే పరీక్షిత్తు.. పాండవుల తరువాత రాజయ్యాడు.

అభిమన్యుడి మరణం తర్వాత అర్జునుడు చెలరేగిపోయాడు. 14వ రోజున సైంధవుణ్ణి హతమార్చటమే కాదు.. మహా మారణాయుధాలతో అయిదు అక్షౌహిణుల సైన్యాన్ని ఒక్కపూటే మట్టుపెట్టాడు. దాదాపు పదకొండు లక్షల మంది కౌరవ సైన్యం ఒకే ఒక్కరోజు నాశనమైంది. అంటే అర్జునుడు ఎంత శక్తిమంతమైన మారణాయుధాలను ప్రయోగించాడో అర్థం చేసుకోవచ్చు.

ద్రోణాచార్యుడు కురుపాండవులందరికీ గురువు.. అతని ధాటికి పాండవుల సైన్యంలో ఒక అక్షౌహిణి అంటే సుమారు రెండు లక్షల మంది మృత్యువాత పడ్డారు. కురుక్షేత్ర యుద్ధం మొదలైన 15వ రోజున ద్రోణాచార్యుని ద్రౌపది తమ్ముడు దృష్టద్యుమ్నుడు హతమార్చాడు. ఇందుకోసం ధర్మరాజు అబద్ధం కూడా ఆడాల్సి వచ్చింది. అదే రోజు.. అంటే 16వ రోజున ఆర్మీచీఫ్‌గా దుర్యోధనుడి మిత్రుడు కర్ణుడు బాధ్యతలు చేపట్టాడు. అర్జునుడు తప్ప, మిగతా నలుగురు పాండవులు కర్ణుడి ముందు కాసేపు కూడా నిలవలేకపోయారు. కర్ణుడి ధాటికి రెండున్నర అక్షౌహిణుల పాండవ సైన్యం హతమైంది. అంటే సుమారు అయిదు లక్షల మంది అన్నమాట. అర్జునుడితో సమానంగా మారణాయుధాలు ప్రయోగించిన వాడు కురుక్షేత్ర యుద్ధంలో కర్ణుడొక్కడే. విష సర్పాలను సైన్యంలోకి వదిలాడు. మత్తు గాలులను, బాష్ప వాయువును, వాతావరణంలోకి వెదజల్లాడు.. పాండవ సైన్యాన్ని చెల్లాచెదరు చేశాడు. ఘటోత్కచుని అంతం చేశాడు.

అప్పటికే అర్జునుడు సుమారు ఏడు అక్షౌహిణుల కౌరవ సైన్యాన్ని హతమార్చాడు.

మిగతా పాండవులు మూడు అక్షౌహిణుల సైన్యాన్ని పర లోకాలకు పంపించారు. పదహారో రోజున భీముడు దుశ్శాసనుని అతి కిరాతకంగా చంపాడు.. అతని రక్తాన్ని తాగాడు..

చివరకు కర్ణుడి రథం భూమిలోకి కుంగిపోయిన సమయంలో అదను చూసి అర్జునుడు అతణ్ణి చంపాడు. కర్ణుడి చావుతో కౌరవుల వైపు మహావీరుల పరంపర ముగిసినట్లయింది.

కర్ణుడి చావు తరువాత అర్జునుడు దుర్యోధనుడి సైనిక క్యాంపులపైన, శిక్షణా కేంద్రాలపైన వైమానిక దాడులు చేశాడు. ఈ సందర్భంలోనే అణ్వాయుధాన్ని ఆయన ఉపయోగించినట్లు సింధూలోయలో దొరికిన ఆర్కియాలజీ ఆధారాలు చెప్తున్నాయి. కౌరవుల రాజధాని హస్తినాపురం అప్పటికే పాక్షికంగా ధ్వంసమైంది. కౌరవులకు ఓటమి దాదాపు ఖరారైంది. అంతా పోయిన తరువాత కూడా దుర్యోధనుడు ఓటమిని అంగీకరించలేదు. కర్ణుడు సైన్యాధ్యక్షుడిగా ఉన్నది రెండున్నర రోజులే. ఆ తరువాత శల్యుడు ఆ స్థానాన్ని చేపట్టినా, ఒక్క పూట మాత్రమే రణరంగంలో నిలవగలిగాడు. శల్యుని ధర్మరాజే స్వయంగా హతమార్చాడు. అదే రోజున శకునిని సహదేవుడు చంపాడు. దీంతో దుర్యోధనుడు నీటి లోపలికి వెళ్లి దాక్కున్నాడు. పాండవులు అతణ్ణి వెతికి పట్టుకుని భీముడితో ముఖాముఖి మల్లయుద్ధం చేయించారు. ఈ యుద్ధానికి బలరాముడు రెఫరీగా వ్యవహరించాడు.. ఈ పోరాటంలో దుర్యోధనుడు తీవ్రంగా గాయపడ్డాడు.. ఒక రోజు తరువాత అతను చనిపోయాడు. మహా భారత యుద్ధం ప్రారంభానికి మూడు రోజుల ముందే సంపూర్ణ సూర్య గ్రహణం సంభవించింది. తరువాత యుద్ధం ప్రారంభమైన పదోరోజున అంటే భీష్ముడు గాయపడిన రోజున మరో గ్రహణం వచ్చింది.. పదహారో రోజున మూడో గ్రహణం వచ్చింది. చాలా తక్కువ వ్యవధిలో ఇలా మూడు గ్రహణాలు రావటం మంచి శకునం కాదంటారు. మహాభారత మారణహోమం అందుకే జరిగిందని విశ్వసించేవారూ ఉన్నారు.. ఏమైతేనేం.. 18 రోజుల మహాయుద్ధంలో ఇరు పక్షాల సైన్యం సమూలంగా హతమైంది. చివరకు మిగిలింది కేవలం 11 మంది మాత్రమే. పాండవుల వైపు అయిదుగురు అన్నదమ్ములతో పాటు కృష్ణుడు, సాత్యకి, యుయుత్సులు మాత్రమే మిగిలారు. కౌరవుల వైపు కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ బతికి బయటపడ్డారు. కురుక్షేత్రం ఎంత భీకరమైన యుద్ధమో చెప్పటానికి ఈ ఉదాహరణ ఒక్కటి చాలు. కనీసం గెలిచిన వారి వైపు కూడా ఎనిమిది మంది మినహా ఎవరూ మిగలకపోవటం మారణకాండ తీవ్రతకు నిదర్శనం. ఒక్కమాటలో చెప్పాలంటే కురుక్షేత్ర యుద్ధం అధికారం కోసం కాదు.. చావు కోసం జరిగినట్లు అనిపిస్తుంది. మృత్యువును కోరి కొని తెచ్చుకోవాలన్న బలమైన కోరికతోనే యుద్ధం చేశారేమో..!

# ఎలా గెలిచారు?

కురుక్షేత్రంలో ఏరోజు ఏం జరిగిందన్నది స్పష్టంగానే తెలిసింది. కానీ గెలుపోటముల మధ్య ముందస్తుగా సాగిన ఎత్తుగడలేమిటి? ఏమిటీ స్ట్రాటజీ.. కేవలం అయిదుగురు.. అదీ అడవుల్లో ఉన్నవాళ్లు.. ఎవరికీ తెలియకుండా అజ్ఞాతంలో ఏడాది పాటు దాక్కున్న వాళ్లు.. అటుపక్క వంద మంది వెనుక ఉన్న అపార మందీ మార్బలాన్ని అలవోకగా జయించేశారు. ఒక్కర్ని కూడా మిగల్చకుండా మట్టుబెట్టారు. ఒక భారీ సైనిక వ్యవస్థను ఒక చిన్న సైన్యం విచ్ఛిన్నం చేయగలగటంలోనే అసలైన ఎత్తుగడ దాగి ఉంది. అదే యుద్ధ నీతి. అదే గెలుపు మంత్రం. ఇవాల్టి రాజకీయ వ్యవస్థకూ మార్గదర్శనం చేస్తున్న ఈ మంత్రం ఏమిటి? మనకు అవసరం లేదేమో కానీ.. ఈ యుద్ధనీతిని గురించి అమెరికా వాడు మాత్రం తెగ ఆలోచిస్తున్నాడు.

ఇవాళ మహాభారత యుద్ధం అగ్రరాజ్యం అమెరికాలో హాట్ టాపిక్ అయిపోయింది. ఒకరికి పది మంది వ్యాస మహాభారతాన్ని అదే పనిగా ముందేసుకుని తెగ పరిశోధనలు చేసేస్తున్నారు. ఒబామా సర్కారు ఇందుకు ఫండింగ్ కూడా చేస్తోందిట. కొంతకాలంగా ఆర్థికంగా అల్లాడిపోతున్న అమెరికా, హార్థికంగా ఏకాకిగా మారుతున్న అమెరికాకు ఇంటెలెక్చ్యువల్ వ్యూహం అవసరమైంది. ప్రపంచంపై ఆధిపత్యం కొనసాగటానికి రాజనీతి ఎలా ఉండాలి? పాండవులు కౌరవులను ఎలా జయించారు? యుద్ధంలో గెలిచేందుకు పాండవులు ఎలాంటి ఎత్తుగడలు వేశారు? ఒకరిపై ఒకరు ఎలాంటి పన్నాగాలు పన్నారు? గెలుపు కోసం అయిదుగురు అన్నదమ్ములు ఎలా పావులు కదిపారు? ఈ విషయాల్ని ఎలా ఛేదించాలి? అన్నవాటిపై రీసర్చ్ మొదలెట్టింది. ఇప్పుడంటే అమెరికా ఈ రకమైన పరిశోధనలకు శ్రీకారం చుట్టింది కానీ, భారత యుద్ధం జరిగింది మన దగ్గర కదా.. పాండవుల విన్నింగ్ స్ట్రాటజీ గురించి మనలో ఎంతమందికి అవగాహన ఉంది?



**పాండవుల విన్నింగ్ స్ట్రాటజీ గురించి మనలో ఎంతమందికి అవగాహన ఉంది? రామాయణ, భారతాలను నిందించటమే తప్ప, అందులో మనకు పనికొచ్చే విషయాలేమున్నాయని ఆలోచించిందెవరు? ఇదిగో ఇప్పుడు ప్రపంచ పోలీసు ఆలోచిస్తున్నాడు...ఇంతకీ ఈ విన్నింగ్ మంత్రమేమిటి?**

రామాయణ, భారతాలను నిందించటమే తప్ప, అందులో ఇప్పటికీ మనకు పనికొచ్చే విషయాలేమున్నాయని ఆలోచించిందెవరు కనుక? ఇదిగో ఇప్పుడు ప్రపంచ పోలీసు ఆలోచిస్తున్నాడు. ఇంతకీ ఈ విన్నింగ్ మంత్రమేమిటి? పాండవులది రాజనీతా.. కూటనీతా?

మహాభారత యుద్ధం క్రీస్తుపూర్వం 3138లో జరిగింది. రెండు బలమైన శక్తుల మధ్య జరిగిన యుద్ధం అది. ఈ యుద్ధంలో బలం కంటే వ్యూహమే గెలిచింది. ఏ విధంగా చూసినా యుద్ధం జరిగే నాటికి కౌరవుల కంటే పాండవుల శక్తి, సంపదలు తక్కువ. పాండవులు పవర్ కోల్పోయి అడవుల పాలై అప్పటికే పదమూడు సంవత్సరాలు గడిచిపోయింది. అందులో చివరి సంవత్సరం వేషాలు మార్చుకుని అజ్ఞాతంలో ఉండాల్సి వచ్చింది. కౌరవులేమో అధికారాన్ని పూర్తి స్థాయిలో అనుభవిస్తున్నారు. అటు ఆర్థిక బలం, ఇటు అంగబలం పుష్కలంగా ఉన్నాయి. ఎత్తుకు పైఎత్తులు వేసి క్షణాల్లో శత్రువును చిత్తు చేయగల పవర్‌ఫుల్ మేజర్ జనరల్స్ చాలా మందే ఉన్నారు. అధికారంలో ఉంటే అందివచ్చే అవకాశాలకూ కొదవ లేదు. అన్నింటికీ మించి ఫండింగ్ సమస్య ఎంతమాత్రం లేదు.

పైగా దుర్యోధనుడి మిత్రుడు కర్ణుడు దేశమంతా తిరిగి యుద్ధాలు చేసి చాలా రాజ్యాలను జయించుకు వచ్చాడు.. ఆ రాజ్యాల బలాబలాలన్నీ కూడా కౌరవుల పక్షమయ్యాయి. చివరకు శ్రీకృష్ణుడి రాజ్యంలో ఆయన తప్ప మిగతా సైన్యం అంతా కూడా కౌరవుల వైపే నిలిచింది. పాండవులకు విద్యలన్నీ నేర్పిన గురువులే కౌరవుల పక్షాన నిలిచారు. పాండవులతో సమానమైన వీరులు కౌరవుల పక్షాన ఉన్నారు.. అయినా, కౌరవ సైన్యం ఓడిపోయింది. కౌరవులు మట్టి కరుచుకుపోయారు.

ఒక్కరంటే ఒక్కరు కూడా మిగలలేదు.. ఇంత దారుణంగా ఎలా ఓడిపోయారు.. పాండవులు ఎలా గెలువగలిగారు? ధర్మం గెలిచింది అనీ, అధర్మం ఓడిపోయిందనే మాటలు చెప్పుకోవటానికి బాగానే ఉంటాయి. కానీ, వాస్తవం వేరు.. యుద్ధంలో బలమైన ప్రత్యర్థిని జయించటం మాటలు కావు.. కేవలం ధర్మాన్ని ఆచరించటం వల్లనే గెలుపు సాధ్యమవుతుందనుకోవటం తప్పు.. యుద్ధం చేసేందుకు తగిన ఆర్థిక వనరులు, మానవ వనరులను సమకూర్చుకోవటం అంత తేలిక కాదు. ప్రత్యర్థిని వీక్ చేసి గెలుపును సాధించటం ఓ గొప్ప విద్య.. అదే యుద్ధనీతి. ఆ విద్య, ఆ నీతి పాండవులకు బాగా తెలుసు.. అదే వారిని విజయం వైపు నడిపించింది. చరిత్ర సృష్టించింది. యుద్ధంలో పాండవుల గెలుపు సులభం కాలేదు.. అడవుల్లో పన్నెండేళ్లు... ఏడాది పాటు అజ్ఞాతంలో ఉన్నారు. ఓ పక్క అధికారం లేదు.. ఆర్థిక వనరులు లేవు.. కేవలం మజిల్ పవర్‌తో గెలుపు సాధ్యం కాదని వారికి తెలుసు. తమ వీక్‌నెస్‌ను తెలుసుకుని దాన్ని అధిగమించేందుకు ప్రయత్నాలు ప్రారంభించారు. అజ్ఞాతంలోకి వెళ్లటానికి ముందు నుంచే అయిదుగురు అన్నదమ్ములూ ఒక్కో అడుగు నెమ్మదిగా ముందుకు వేస్తూ వెళ్లారు.

***అర్జునుడు పవర్ ఫుల్ ఆయుధాలను సమకూర్చటంపై దృష్టి పెట్టాడు. అణ్వస్త్రం అని చరిత్రకారులు భావిస్తున్న పాశుపతాస్త్రాన్ని సంపాదించాడు. భీముడు హనుమంతుడిని కలిసి గదావిద్యలో మరింత బలాన్ని సంపాదించాడు.. అటు గంధర్వుల దగ్గరకు వెళ్లి వారి మిత్రత్వాన్ని సంపాదించాడు.***

ఇక ధర్మరాజేమో.. మిత్రపక్షాలపై దృష్టి పెట్టాడు. తన టార్గెట్ ఏమిటో ఆయన ముందే డిసైడ్ చేసుకున్నాడు. ఇటు కృష్ణుడితో, అటు ద్రౌపది తండ్రి ద్రుపదుడితో మంతనాలు జరుపుతూ భారత దేశమంతటా పవర్‌ఫుల్ మిత్ర పక్షాలను ఏర్పాటు చేసుకున్నాడు. అంతకంటే ముందు పాండవులు ద్రౌపది కాకుండా విడివిడిగా చేసుకున్న వివాహాల ద్వారా బలమైన ఆర్థిక శక్తులను కూడగట్టుకున్నారు.

*ధర్మరాజు, దేవికల వివాహంతో కేకయ రాజ్యం.. భీముడు, బలంధరల పెళ్లితో కాశీ.. అర్జునుడు సుభద్రల పెళ్లితో ద్వారక.. అర్జునుడు, ఉలూచిల పెళ్లితో నాగులు.. నకులుడు, కిరణ్మయిల పెళ్లితో చేది.. సహదేవుడు, విజయల వివాహంతో మగధ రాజ్యాలు దగ్గరయ్యాయి. వీరిలో నాగులు మాత్రం యుద్ధంలో పాల్గొనలేదు.*

పాండవులు అడవుల్లో ఉన్నా, కృష్ణుడు అవసరమైన సన్నాహాలన్నీ చేసిపెట్టాడు.. మిత్రులను సమకూర్చి ఉంచాడు.. సంధి రాయబారానికి వెళ్లి భీష్మ, ద్రోణులకు, కర్ణుడికి మధ్య చిచ్చు పెట్టాడు.. దీని ద్వారా భీష్ముడు, కర్ణుడు ఒకేసారి యుద్ధరంగంలోకి దిగకుండా అడ్డుకట్ట వేయగలిగాడు. భీష్ముడు చనిపోయిన తరువాత కానీ, కర్ణుడు రంగంలోకి రాలేదు.

యుద్ధ నాయకత్వం విషయంలోనూ చాలా స్ట్రాటెజిక్‌గా వ్యవహరించారు. మొత్తం బలగాలను డీసెంట్రలైజ్ చేశారు.. ఏడు ఆర్మీ డివిజన్ల(అక్షౌహిణులు)లో ఒక్కో డివిజన్‌కు ఒక్కో కమాండర్. అందరికీ కలిపి ఒక జనరల్. దీంతో వ్యూహాన్ని, ఎత్తుగడల్ని పంచుకోవటం కానీ, ఇంప్లిమెంట్ చేయటం కానీ చాలా సులువు అయిపోయింది. టీమ్ స్పిరిట్.. పాండవులకు పెద్ద బలం.. ఒకే టీమ్.. ఒకే మాటపై నడిచే సైన్యం. ఎవరికీ వ్యక్తిగత ప్రయోజనాలు లేవు . అందరిదీ ఒకే టార్గెట్.. కౌరవులను ఓడించటం.. ప్రతీకారం తీర్చుకోవటం.. అధికారాన్ని హస్తగతం చేసుకోవటం... అందరూ ఆ గోల్ కోసమే యుద్ధం చేశారు.. ఎలాగైనా గెలిచి తీరాలనే ముందుకు వెళ్లారు. కో ఆపరేషన్, కో ఆర్డినేషన్.. సహకారం, సమన్వయం.. ఈ రెండూ పాండవులకు పెద్ద బలం.. బలగం.

కురుక్షేత్ర యుద్ధంలో పాండవుల గెలుపు వ్యూహం చాలా కీలకమైంది.. 18 రోజుల పాటు యుద్ధం జరిగిన తీరు గమనిస్తే.. ఆశ్చర్యం వేస్తుంది.. విస్మయం కలుగుతుంది. ఒక్కొక్కరినీ, ఒక్కో రకంగా, ఒక్కో ఎత్తుగడ వేసి హతమార్చిన వైనం పాండవుల, వారి జనరల్స్ యుద్ధనీతికి నిదర్శనం.. కౌరవుల దగ్గర ఈ వ్యూహమే లోపించింది. అంతా నిరంకుశంగా సాగిన రణతంత్రం వారిని పూర్తిగా దెబ్బతీసింది.



**కృష్ణుడికి జవాబు చెప్పటానికి ముందు దుర్యోధనుడు తన కోర్ టీమ్‌లోని దుశ్శాసన, కర్ణ, శకునిలతో సీరియస్‌గానే చర్చించాడు. ఏ విధంగా చూసినా తమ దగ్గర ఉన్న వీరులు కానీ, ఆయుధ బలగాలు కానీ, ఎక్కువ.. తన శక్తిసంపదలపై అతి విశ్వాసం పెట్టుకున్నాడు.. నిజంగా కూడా కౌరవుల వాస్తవ బలం ముందు పాండవుల బలం తక్కువే. ఆ ధైర్యంతోనే యుద్ధానికి దుర్యోధనుడు సై అన్నాడు.**

కృష్ణుడు రాయబారానికి వెళ్లినప్పుడు దుర్యోధనుడు సంధికి ఒప్పుకోకపోవటానికి సరైన కారణమే ఉంది. కృష్ణుడికి జవాబు చెప్పటానికి ముందు దుర్యోధనుడు తన కోర్ టీమ్‌లోని దుశ్శాసన, కర్ణ, శకునిలతో సీరియస్‌గానే చర్చించాడు. శత్రుబలాలను పూర్తిగా అంచనా వేసుకున్నారు. ఏ విధంగా చూసినా తమ దగ్గర ఉన్న వీరులు కానీ, ఆయుధ బలగాలు కానీ ఎక్కువ. తన శక్తిసంపదలపై అతి విశ్వాసం పెట్టుకున్నాడు. నిజంగా కూడా కౌరవుల వాస్తవ బలం ముందు పాండవుల బలం తక్కువే. ఆ ధైర్యంతోనే యుద్ధానికి దుర్యోధనుడు సై అన్నాడు.

పాండవులు అడవులకు వెళ్లగానే, ఇక తమకు ఎదురు లేదని కర్ణుణ్ణి ఇతర దేశాలపైకి మిలిటరీ మిషన్‌పై పంపించారు. అన్ని దేశాలను జయించి సామంతులను, సంపదను పెంచుకున్నట్లే శత్రువులనూ పెంచుకున్నారు. కనీసం అధికార వికేంద్రీకరణ అయినా ఉందా అంటే అదీ లేదు.. ఏ నిర్ణయం తీసుకోవాలన్నా ఆ నలుగురే. సామంతులు కాకుండా తోడుగా నిలిచిన మిత్రపక్షాలు శకునికి చెందిన గాంధార.. అంటే ఇవాల్టి కాందహార్, సైంధవుడికి చెందిన సింధు, భగదత్తుడికి చెందిన కంబోడియా అంటే కాంభోజలు మాత్రమే. యుద్ధం జరుగుతున్నప్పుడు సైతం 11 ఆర్మీ వింగ్స్ ఉన్నా, నాయకత్వం ఒకరి చేతుల్లోనే ఉండిపోయింది. దీంతో సైనికులు, సైన్య విభాగాల మధ్య కమ్యునికేషన్ గ్యాప్ చాలా పెరిగిపోయింది. పైగా ఎవరికి వారు వాళ్ల వాళ్ల ప్రయోజనాల కోసమో, ఎప్పుడో చేసిన కమిట్‌మెంట్ల కోసమో యుద్ధం చేశారే తప్ప, దుర్యోధనుణ్ణి గెలిపించేందుకు ఎవరూ ప్రయత్నించలేదు. కర్ణుడికి లైఫ్‌టైమ్ గోల్ అర్జునుణ్ణి గెలవటం, భీష్ముడికి అప్పుడెప్పుడో సింహాసనాన్ని కాపాడతానన్న తన ప్రతిజ్ఞ ప్రధానం.. ఇలా ఒక్కొక్కరికీ ఒక్కో గోల్ కావటంతో టీమ్ స్పిరిట్ లేకుండా పోయింది.

అంతే కాదు.. దుర్యోధనుడు, అతని నలుగురు కోర్ టీమ్‌కు తప్ప మిగతా వాళ్లెవరికీ యుద్ధం ఇష్టం లేదు. బలవంతంగానే రణరంగంలోకి వచ్చారు.. వీరిలో పెద్ద తలకాయలకు

పాండవ పక్షపాతం. ఈ వీక్‌నెస్‌ను పాండవులు చక్కగా వాడుకున్నారు. ఒక్కొక్కరిని వేరు చేసి విడివిడిగా హతమారుస్తూ వచ్చారు. పది రోజులు బీభత్సం సృష్టించిన భీష్ముడి వీక్‌నెస్ శిఖండి.. అతణ్ణి ప్రయోగించి ఆయన్ను పక్కకు తప్పించారు. కొడుకే బలహీనత అయిన గురువు ద్రోణుణ్ణి చంపేందుకు ధర్మరాజు అబద్ధం అడేందుకు వెనుకాడలేదు. కర్ణుడికి సకల అవలక్షణాలు ఉన్నాయి. అవన్నీ రణరంగంలో అతనికి శాపాలుగా మారాయి. అతణ్ణి నిరాయుధుణ్ణి చేసి మరీ చంపారు. దీనికి తోడు పాండవుల కోవర్ట్ శల్యుడు.. ఇతను కర్ణుడి సారథి.. అతనికి ఇది పెద్ద దెబ్బ. అంతా ఒక్కటై నిలిస్తే పాండవులు గెలిచే వారే కారు.. అందుకే ఏకాకుల్ని చేసి మరీ అంతం చేశారు. ఈ వ్యూహాన్ని దుర్యోధనుడు అర్థం చేసుకునే సరికే తాను ఏకాకి అయిపోయాడు. అంతం అయ్యాడు.

మన బలహీనతల్ని బలంగా మార్చుకోవాలి. శత్రువులను మిత్రపక్షాలుగా మలచుకోవాలి. బాధ్యతలను అందరితో సమంగా పంచుకోవాలి. సరైన టీమ్‌ను ఎంచు కోవటం, టీమ్ స్పిరిట్‌తో నడుచు కోవటం ముఖ్యం. బలమైన నాయకత్వం చాలా అవసరం. టీమ్ మొత్తం ఒకే గోల్ కోసం స్ఫూర్తితో ముందుకు వెళ్లాలి.. ప్రత్యర్థి శిబిరంలో బలహీనతల్ని సొమ్ము చేసుకోవటానికి వ్యూహాత్మకంగా పావులు కదపాలి. బలవంతులను ఐక్యంగా వుంచటం కంటే వీక్ చేసి శత్రు శిబిరాన్ని విచ్ఛిన్నం చేయాలి..

పాండవుల విజయ రహస్యం ఇదే.. ఆచితూచి పావులు కదిపి అధికారాన్ని హస్తగతం చేసుకున్న వీరులు. సొంత బలంపై అతి విశ్వాసానికి పోతే ఎలాంటి పరిణామాలు వుంటాయో 9/11 నాడు ఒసామా బిన్ లాడెన్ అమెరికాకు రుచి చూపించాడు. అందుకే ఇప్పుడు అమెరికాకు తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోవటం అవసరమైంది. అమెరికా మాటెలా ఉన్నా, మనకు మన బలాన్ని, బలగాన్ని సెల్ఫ్ అసెస్ చేయాల్సిన అవసరం ఉంది. ప్రపంచంలో అగ్రరాజ్యంగా ఎదగాలని కలలు కంటున్న పాలకులు ఒక్కసారి మహాభారత రాజనీతిని, కూటనీతిని, యుద్ధనీతిని జస్ట్ ఫాలో అయితే వాళ్ల కల నెరవేర్చుకోవటం పెద్ద కష్టం ఏమీ కాదు.

మన భారతం మనం ఎలా ఉండాలో చెప్తోంది. మన రాజకీయ వ్యవస్థ ఎలా వుండాలో డైరెక్ట్ చేస్తోంది. ఎక్స్‌టర్నల్ పాలసీనీ, ఎకనమిక్ పాలసీని సైతం ఓ రోల్‌మోడల్‌గా భారతం చెప్తోంది. ఒక్కమాటలో చెప్పాలంటే, భారతంలో అసలు కథ అన్నదమ్ముల గొడవే కానీ, దాని వెనుక ఉన్నది మాత్రం అతి పెద్ద ప్రజాస్వామిక వ్యవస్థ జన జీవన విధానం.

# పద్మవ్యూహం

పద్మవ్యూహం.. భారత యుద్ధ కళల్లో కీలకమైన స్ట్రాటెజీ. శత్రువును అన్ని వైపుల నుంచి చుట్టుముట్టి మట్టుపెట్టడంలో దీన్ని మించిన వ్యూహరచన మరొకటిలేదు. అయిదున్నర వేల సంవత్సరాల క్రితం నాటి మన ప్రాచీన యుద్ధకళ.. మహాభారత యుద్ధంలో ఇదొక కీలకఘట్టం. దీన్ని ఛేదించటంలో పాండవులు ఎందుకు విఫలమయ్యారు? అభిమన్యుడు ఒక్కడే లోపలికి ఎలా వెళ్లగలిగాడు? ఈ వ్యూహంలోని రహస్యం ఏమిటి?

క్రీస్తు పూర్వం 3138, నవంబర్ 25.. మహాభారత యుద్ధంలో కీలక ఘట్టం చోటు చేసుకున్న సందర్భం అది. పద్మవ్యూహంతో కౌరవుల చెలగాటం పాండవులకు ప్రాణసంకటంగా మారిన సందర్భం.. అతిరథ మహారథులతో ఒకే ఒక్కడు.. అదీ బాలవీరుడు అయిన అభిమన్యుడు ఒంటరి యుద్ధం చేసిన రోజు.. ఒక పక్క పదులకొద్దీ అక్షౌహిణులు.. మరో పక్క ఒకే ఒక్క వీరుడు.. అబ్బురమైన సందర్భం. గురువు ద్రోణుడి వ్యూహాన్ని ఛేదించేందుకు పాండవుల వద్ద తెలివి చాలకపోయింది. బలం ఉన్నా.. వ్యూహ రహస్యం తెలియదు.. అది తెలియకపోతే.. ఎంతటి వీరుడైనా మట్టి కరవక తప్పని వ్యూహం.. ప్రత్యక్ష యుద్ధంలో ప్రత్యర్థిని మట్టుపెట్టడానికి అద్భుతమైన ఎత్తుగడ.. భారతీయ ప్రాచీన యుద్ధనీతుల్లో ప్రత్యర్థి పాలిటి అత్యంత ప్రమాదకరమైన ఎత్తుగడ.. ఇందులోకి ప్రవేశించటమే కష్టం.. ప్రవేశిస్తే బయటకు రావటం ఇంకా కష్టం. యోధానుయోధులను ఎదుర్కొంటూ వ్యూహాన్ని దెబ్బతీయటం అసంభవం.. అది పద్మవ్యూహం.. భారత యుద్ధాన్ని కీలక మలుపు తిప్పిన వ్యూహం.. ఒకే ఒక్క వీరుడు.. అదీ చిన్న పిల్లవాడు.. అభిమన్యుడు.. మహామహుల వ్యూహాన్ని దెబ్బతీసి లోపలికి వెళ్లాడు.. మధ్యలో చిక్కుకుపోయాడు.. ఒక్కడై.. ఒంటరై.. వీరమరణం పొందాడు.

ఈ పద్మవ్యూహం నమూనా హిమాచల్ ప్రదేశ్‌లోని హమీర్ పూర్‌లోని రాజ్‌నౌన్ గ్రామంలో కొండమీద రహస్యంగా ఒక రాతి శిల్పంపై బయటపడింది. వలయాలు వలయాలుగా అయోమయంగా గజిబిజి నిర్మాణంతో ఈ నమూనా ఉంది. దీని మొదలెక్కడో.. తుది ఎక్కడో అంత తేలిగ్గా అర్థమయ్యే వ్యవహారం కాదు. ఇది పాండవులు ప్రాక్టీసు కోసం ఏర్పాటు చేసుకున్న నమూనాగా చెప్పుకుంటారు. దీన్ని చూస్తేనే పద్మవ్యూహాన్ని ఛేదించటం ఎంత కష్టమో అర్థమవుతుంది. ఏడు వలయాలు.. ఏ వలయం నుంచి తేలిగ్గా లోపలికి వెళ్లాలో.. వలయాన్ని ఎంత ఒడుపుగా చీల్చుకుంటూ వెళ్లాలో ఈజీగా అర్థమయ్యేది కాదు. ఒక వలయంలో ఒక సైనికుడిని హతమారిస్తే.. సెకను వ్యవధిలో మరో సైనికుడు ఆ స్థానాన్ని భర్తీ చేస్తూ పోతుంటాడు.. ఇలాంటి వలయాన్ని ఛేదిస్తూ

ముందుకు వెళ్లటానికి నైపుణ్యం కావాలి. ఇది చాలా రహస్యమైంది.. చాలా కొద్ది మందికి మాత్రమే దీని గురించి తెలుసు.. ఈ వ్యూహం తెలుసుకుంటే.. ఎలాంటి యుద్ధాన్నైనా జయించవచ్చంటే.. ఇది ఎంత ముఖ్యమైందో అర్థం చేసుకోవచ్చు. మహాభారత కాలంలో పద్మవ్యూహాన్ని రూపొందించిన ద్రోణాచార్యుడితో పాటు.. అర్జునుడు, శ్రీకృష్ణుడు, ఆయన కుమారుడు ప్రద్యుమ్నుడు, ప్రద్యుమ్న కుమారుడైన అనిరుద్ధుడికి మాత్రమే పద్మవ్యూహాన్ని ఛేదించటం తెలుసు. సుభద్రాకుమారుడైన అభిమన్యుడికి కొంతవరకు మాత్రమే తెలుసు. తల్లి గర్భంలో ఉన్నప్పుడే శ్రీకృష్ణుడు పద్మవ్యూహంలోకి ఎలా ప్రవేశించాలో సుభద్రకు చెప్తుండగా అభిమన్యుడు విని నేర్చుకున్నాడు. అదే ఆ పదమూడో రోజు పాండవులకు అక్కరకొచ్చింది. యుద్ధంలో ఏదో ఒక రోజు పద్మవ్యూహాన్ని ఛేదించాల్సి వస్తుందని పాండవులకు ముందే తెలుసు. దీనికోసం వాళ్లు చాలా కసరత్తే చేశారు. అందులో భాగమే ఈ నమూనా. అర్జునుడు మినహా మిగతా పాండవులంతా ఈ నమూనాను ముందుంచుకుని ఇందులోకి ఎలా ప్రవేశించాలో.. ఎలా బయటకు రావాలో చాలా ప్రాక్టీస్ చేశారు.. ఈ వలయాల్లోకి ఒక వైపు నీళ్లు పోసి ఆ నీళ్లు పారుతూ.. ఎటువైపు నుంచి బయటకు వస్తాయో చూస్తూ వ్యూహ భేదనను తెలుసుకున్నారు. ప్రతిరోజూ ఒక దగ్గర నీరు పోయటం.. దాని ప్రవాహపు తీరును గమనించటం నెలల తరబడి చేశారు. కానీ, చివరకు అసలు వ్యూహం దగ్గరకు వచ్చేసరికి నలుగురు దిగ్గజాలూ చేతులెత్తేశారు.

యుద్ధం మొదలైన 13వ రోజున అంటే క్రీస్తుపూర్వం 3138 నవంబర్ 25వ తేదీన ద్రోణుడి చేత పద్మవ్యూహాన్ని పన్నేలా చేశాడు దుర్యోధనుడు. దీని రహస్యం తెలిసిన అర్జునుడిని, కృష్ణుడిని సుశర్మ రెచ్చగొట్టి యుద్ధభూమికి దూరంగా తీసుకుపోయాడు. ఆ తరువాత పద్మవ్యూహాన్ని చీల్చే మొనగాడే పాండవ సైన్యంలో లేకుండా పోయాడు. అప్పుడు ధర్మరాజుకు మిగిలిన ఒకే ఒక ఆప్షన్ అభిమన్యుడు. అతని వయసు అప్పటికి 32 సంవత్సరాలే.. పెళ్లయి ఆరు నెలలు కూడా కాలేదు.. అతని భార్య ఉత్తర గర్భవతిగా వుంది. ఆ సమయంలో అభిమన్యుడు రంగంలోకి దిగక తప్పలేదు. అభిమన్యుడికి పద్మవ్యూహం గురించి కొద్దిగా మాత్రమే తెలుసు.. ఆ కాస్త పని కానిస్తే తామంతా అతని వెనువెంటే వ్యూహంలోకి చొచ్చుకుపోవచ్చని ధర్మరాజు తలచాడు. అభిమన్యుడికి అంతా ధైర్యం చెప్పి పంపించారు. పద్మవ్యూహం తొలి వలయం ముందు సైంధవుడు కాపలా వున్నాడు. ఆ వలయాన్ని నేరుగా చీల్చటం సాధ్యం కాని పని.. వలయాన్ని తన కుడివైపునకు ఏటవాలుగా చీల్చుకుంటూ అభిమన్యుడు లోపలికి వెళ్లిపోయాడు. అతను చేసిన ఖాళీని మిగతా కౌరవ సైన్యం అతి వేగంగా భర్తీ చేసుకుంటూ పోయింది. అభిమన్యుడి వెన్నంటి ఉండేందుకు మిగతా పాండవులకు అవకాశమే లేకుండా పోయింది. పద్మవ్యూహం మొత్తం ఏడు వలయాలుగా ఏర్పడుతుంది. ఒక్కో వలయాన్ని ఒక్కో విధంగా ఏర్పాటు చేస్తారు. తొలి వలయాన్ని ఛేదించినట్లే ఆరు వలయాలను చెల్లా చెదరు చేసుకుంటూ ఏడో వలయం దగ్గరకు వచ్చాడు.. అక్కడ అతని ప్రయాణం ఆగిపోయింది. అప్పటి వరకు ఉన్న కౌరవ

సైన్యం వేరు.. ఏడో వలయం దగ్గరున్న అతిరథ సేనావాహిని వేరు.. ఏడో వలయం దాటితే దుర్యోధనుడిని బంధించే అవకాశం అభిమన్యుడికి చిక్కేది.. కానీ, ఏడో వలయాన్ని ఛేదించటం అతని వల్ల కాలేదు. ఒకరు కాదు.. ఇద్దరు కాదు.. ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, శకుని, శల్యుడు, కర్ణుడు, దుశ్శాసనుడు, కృతవర్మ, అశ్వత్థామ అంతా కలిసి ఒక్కసారిగా.. ఒక్కుమ్మడిగా అభిమన్యుడిపై అన్ని వైపుల నుంచి దాడి చేశారు.. అప్పటి యుద్ధ నియమాల ప్రకారం ఒక వీరుడితో ఒక్కరు మాత్రమే పోరాడాలి.. కానీ, అభిమన్యుడిని అన్ని వైపుల నుంచి చుట్టుముట్టి నిరాయుధుణ్ణి చేసి హతమార్చారు. అతను చనిపోయిన రోజు మార్గశిర కృష్ణ దశమి. అంతకు ముందు జ్యేష్టమాసంలోనే ఉత్తర గోగ్రహణం తరువాత అభిమన్యుడి వివాహం జరిగింది. ఆరునెలల మ్యారేజి లైఫ్ కూడా గడపకుండానే అతను నేలకొరిగాడు.

కురుక్షేత్రంలో మహామారణకాండ జ్ఞాపకాలు ఇంకా కనిపిస్తున్నాయి. ఇదిగో ఇక్కడ ఈ పద్మవ్యూహ నమూనా మన రణనీతికి నిలువుటద్దమైంది. కానీ, దీని ఆలనాపాలనా చూసే వాళ్లే కరవయ్యారు. ఈ నమూనా.. హమీర్‌పూర్‌లోని రాజ్‌నౌన్ దగ్గర ఉంది. కానీ దీని దగ్గరకు ఎలా వెళ్లాలో మీకు తెలుసా? మీకే కాదు.. ఈ నమూనా ఉన్న జిల్లా అధికారులకు సైతం తెలియనంత అటవీప్రాంతంలో ఉంది.. ఎప్పుడో అరణ్యవాస కాలంలో అంటే క్రీస్తు పూర్వం 3150లో ఈ నమూనాను పాండవులు రూపొందించుకుని ప్రాక్టీస్ చేసినట్లు కార్బన్ డేటింగ్ వల్ల తెలుస్తున్నది. ఎక్కడో మారుమూల అటవీ ప్రాంతంలో.. కొండ గుట్టల నడుమ దారీ తెన్నూ లేని చోట అనాథగా పడి ఉంది. కనీసం దీనికి దారి కూడా లేకుండా పోయింది.

అధికారుల్ని అడిగితే.. అదో రాయి మాత్రమే అని.. దానికి చారిత్రక ప్రాధాన్యం లేనే లేదని కొట్టి పారేస్తారు.. చెట్టూ పుట్టల మధ్య భారత రణతంత్రానికి ఈ పద్మవ్యూహ నమూనా ఒక్కటే ఆధారం. ఆనాడు మన యుద్ధ నీతులు ఎలా ఉండేవి.. ప్రత్యక్ష యుద్ధంలో శత్రువును అణచివేసేందుకు.. బంధించేందుకు ఎలాంటి వ్యూహాలు ఉండేవనటానికి ఈ నమూనా కీలకం.. ప్రాచీన యుద్ధ నీతుల గురించి నేటి తరానికి చెప్పటానికైనా.. చూపించటానికైనా మిగిలిన ఒకే ఒక్కటి ఈ నమూనా.. పద్మవ్యూహం నమూనా. ఒకటి కాదు.. రెండు కాదు.. అయిదున్నర వేల సంవత్సరాల నాటి చరిత్ర.. ఆఫ్గనిస్తాన్ నుంచి మధ్యభారతం దాకా మహాభారత కాలం నాటి గుర్తులు బయటపడ్డాయి. హస్తినాపురం ఎక్కడుందో.. ఎలా ఉందో.. అది ఎలా శిథిలమైపోయిందో.. బ్రిటిష్ వాళ్లు వెలికి తీసి చెప్పేదాకా మనకు తెలియలేదు.. కనీసం ఆ తరువాతైనా దాన్ని జాతి సంపదగా కాపాడుకునే ప్రయత్నం జరిగిందా అంటే అదీ లేదు.

# మందాకిని

*ప్రపంచంలో పావు జనాభాకు ఆమే.. తల్లి*
*అనంత జీవరాశికి ఆమే ప్రాణాధారం*
*ఆమె స్పర్శతోనే రోగాలన్నీ మటుమాయం*
*ఆమె నిశ్వాస సోకితేనే అంతులేని చైతన్యం*
*దివినుంచి భువికి దిగివచ్చిన జలదేవత*



ఆ నదిలో స్నానం చేస్తేనే జన్మజన్మల పాపాలు పోతాయట.. చనిపోయే ముందు ఆ నదిలో నీళ్లు తాగితే డైరెక్టుగా స్వర్గానికి వెళ్లిపోతారట. ఈ దేశానికి అది అతి ప్రవితం. ఇంకా చెప్పాలంటే దివినుంచి భువికి దిగివచ్చిన దేవత. అది ప్రవహించే మార్గం అంతా పవిత్రమే.. హిందువుల పాలిటి ప్రాణాధారం.

స్వర్గంలో ఆమె మందాకిని, భూలోకంలో అలకనంద, పాతాళానికి వెళ్లాక భోగవతి, ముల్లోకాలలో తిరిగిన పుణ్యవతి, అందరికీ ఇష్టమైన పేరు గంగ, ఆ నీరు సోకితేనే అన్ని పాపాలు పరిహారం. ఆ నీరు తాగితే నూరు పున్నమల పుణ్యం. దాని తరంగాల నుంచి వచ్చే గాలి సోకితేనే చైతన్యం. ఆ మట్టి శరీరానికి రాసుకుంటే రోగాలన్నీ మటుమాయం. ఆధారం లేని వారికి ఆధారం. దేవతలకు అమృతం. మనకేమో గంగ.

ఒక జీవనదిని వంద కోట్ల మంది ప్రజలు దేవతగా కొలుస్తున్నారు. అమ్మగా భావిస్తు న్నారు. ఆ నదీతీరంలో చనిపోవటమే భాగ్యంగా భావిస్తారు కొందరు. చనిపోయిన తమవారి ఆస్థికలను ఆ నదిలో కలిపితే ధన్యమని భావిస్తారు ఇంకొందరు. సాధువులకు అది తపోభూమి. ఇక్కడ తపస్సు చేయటం కోసం, ఉపాసనకోసం సిద్ధులు, సాధువులంతా తరలివస్తారు. ఏమిటీ గంగానది ప్రత్యేకత? మిగతా నదుల్లాగే అదీ పుట్టింది. కానీ, మిగతా వాటికంటే దీన్ని పవిత్రంగా భావించటానికి కారణం ఏమిటి? ప్రపంచంలో ఏ నదికీ లేని ప్రాధాన్యం గంగానదికి మాత్రమే ఉంది..

గంగానది.. మన ఆధ్యాత్మిక సంస్కృతిలో ఒక భాగం.. భక్తి మార్గంలో గంగ హిందువులకు సంబంధించినంత వరకు కీలకమైన పాత్ర పోషిస్తుంది. అటు విష్ణు భక్తులకు, ఇటు శివభక్తులకు కూడా పవిత్రమైంది నది. నీటిని దేవతగా కొలవటం మన దగ్గర మాత్రమే ఉన్న సంప్రదాయం. అదీ గంగానదికున్న ప్రత్యేకతే వేరు.. రుగ్వేదంనుంచి రామాయణకాలం దాకా గంగానది ప్రస్తావన ఉంది. భారతదేశంలో తూర్పునుంచి పడమరకు

ప్రవహిస్తున్న నదులన్నింటినీ పవిత్రంగా చెప్పుకుంటూ వచ్చారు..

గంగావతరణం గురించి ఆసక్తికరమైన కథలు ప్రచారంలో ఉన్నాయి. రాముడి ముత్తాత భగీరథుడు శాపం వల్ల భస్మం అయిన పితృదేవతలను పుణ్యలోకాలకు పంపించేందుకు గంగ అవసరమైంది. ఆమెకోసం తపస్సు చేసి సాధించాడు. ఆమె ఆకాశం నుంచి దిగిరావటం కోసం, ఆమె దూకుడును అడ్డుకోవటం కోసం పరమేశ్వరుడే దిగి రావలసి వచ్చింది. శివుడి జటాజూటం నుంచి కిందకు దిగిన గంగ జహ్నుముని ఆశ్రమాన్ని ముంచెత్తిందట.. ఆయన గంగనంతా చిటికెలో తాగేశాడట. మళ్లీ భగీరథుడు ప్రార్థించటంతో చెవి నుంచి గంగను కిందకు వదిలాడట. అప్పటి నుంచి ఆమె పేరు జాహ్నవి అయింది. భూమినుంచి పాతాళందాకా ప్రవహించి గంగ పాతాళంలోని భగీరథుని తాతలకు ఉత్తమ గతులను కల్పించింది.

గంగానది ఎంతదూరం విస్తరించింది.. అది ఎంత పవిత్రమైందో చెప్పేందుకే ఈ కథ. వారణాసిలో గంగానది తీరంలోనే సత్యహరిశ్చందుడు కాపలా కాసిన స్మశాన వాటిక ఉంది. ఈ తీరంలో చనిపోవటం కోసమే చాలామంది కాశీకి వచ్చి ఉంటారు. ఈ నదికి ఈ దేశంలో ఉన్న ప్రాధాన్యం అది.

అఘోరాలు, నాగా సాధువులు, ఇతర సిద్ధ పురుషులంతా ఈ తీరంలోనే ఉపాసన చేస్తుంటారు.. సాధారణ ఉపాసకులే కాకుండా వామాచార వాదులు, సిద్ధులు సైతం ఇక్కడే తపస్సు చేస్తారు. గంగానదికి ఉన్న పవిత్రత అలాంటిది. గంగ నీటిని కొంచెం తీసుకెళ్లి పూజగదిలో ఉంచుకుంటారంటే, హిందువులు ఎంతగా దీన్ని కొలుస్తారో అర్థం చేసుకోవచ్చు. ఈ నదికి ఇంత ప్రాధాన్యం ఇవ్వటం వెనుక కారణాలు లేకపోలేదు. దీని వెనుక కేవలం భక్తిభావమే కాదు.. ఆర్థిక, సాంకేతిక, వైద్య సంబంధమైన కారణాలు చాలా ఉన్నాయి. ఇది ప్రపంచానికే ఒక సమున్నతమైన సాంస్కృతిక నాగరికతను అందించిన నదీతీర ప్రాంతం.

మన కల్చర్ ఒక చిత్రమైన జీవన విధానాన్ని జాతికి అందించింది. మన దేశంలో భూమిని దేవతగా పూజిస్తారు.. నీటిని దేవతగా పూజిస్తారు. నిప్పును దేవుడిగా కొలుస్తారు. గాలిని దేవుడిగా పూజిస్తారు. ఆకాశాన్నీ దేవుడిగా పూజిస్తారు.. ప్రకృతిలోని అన్నీ కూడా దేవతలతో సమానమే.. గంగానదిని దేవతగా కొలవటం కూడా అందులో భాగమే. మన దేశంలోనే ఇలాంటి పద్ధతి ఉంది. బహుశా ముక్కోటి దేవతలు అందుకే ఏర్పడ్డారేమో.

ఉత్తరాఖండ్ రాష్ట్రంలో విస్తరించిన హిమాలయాల్లో గంగోత్రి దగ్గర గంగానది పుట్టినట్లుగా మనకు కనిపిస్తుంది. దీన్నే భాగీరథి అని పిలుస్తారు.. ఇది కిందకు ప్రవహిస్తూ దేవ ప్రయాగ దగ్గరకు చేరిన తరువాత అలకనందగా పేరు మార్చుకుంటుంది. అక్కడి నుంచి మరికొంత కిందకు వెళ్లిన తరువాత ఇది గంగగా మారుతుంది. అలా 2,510

కిలోమీటర్ల మేర ప్రవహించి భారత్ నుంచి బంగ్లాదేశ్ దాకా విస్తరించిన మహానది. గంగ తొలి బిందువు గంగోత్రి దగ్గరే కనిపిస్తుంది కానీ, ఇది అంతర్వాహినిగా ప్రవహిస్తోందనేది మరో వాదన. ఇది టిబెట్‌లోని మౌంట్ కైలాస్ పాదం దగ్గర ఉన్న మానస సరోవరం నుంచి అంతర్వాహినిగా ప్రవహించి గంగోత్రి దగ్గర బయటపడుతుందిట. మానస సరోవరానికి, గంగోత్రికి అంతర్లీనంగా గంగానదీ పాయ అనుసంధానంగా వుందని చెప్తారు. అయితే ఇది బయటకు స్పష్టంగా కనిపించని విషయం. కానీ, గంగోత్రి దగ్గరే ఇది భాగీరథిగా పుట్టినట్లు ఖచ్చితంగా చెప్పలేం. ఎందుకంటే నదీపాయ ఇక్కడ ఉద్భవించటం కంటే కూడా వేరే చోటి నుంచి వచ్చినట్లే కనిపిస్తుంది.

అంతేకాదు బద్రీనాథ్ కూడా గంగకు జన్మస్థానమంటారు. ఎందుకంటే, బద్రీనాథ్ విష్ణుమూర్తి నివాసమని విశ్వాసం. అదే వైకుంఠం అని అంటారు. ఆ పాదపీఠం నుంచే గంగ పుట్టిందని భావిస్తారు. ఇందులో నిజానిజాలను చర్చించటం కష్టం. గంగానది సముద్రమట్టానికి పదివేల అడుగుల ఎత్తు పైనుంచి పల్లానికి రెండున్నర వేల కిలోమీటర్ల పైచిలుకు ప్రవహించి బంగాళాఖాతంలో కలిసిపోతుంది. అంత ఎత్తు నుంచి రావటం వల్లనే కాబోలు.. దీన్ని ఆకాశగంగ అని పిలిచారు.

విచిత్రమేమంటే ఇన్ని వేల కిలోమీటర్లలో గంగమ్మ ప్రవహించినంత మేర భూమినంతా పవిత్రంగానే భావిస్తారు. తీరం వెంట హరిహరుల దేవాలయాలకైతే అంతే ఉండదు.. లెక్కించటానికి వేళ్లే నొప్పులు పెడతాయి. ఇక్కడి ప్రజలకు ఆమె గంగమ్మ తల్లి. భవానీయే గంగామాత. పావన గంగ.. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ దేశంలో నీళ్లు అన్న పదానికి పర్యాయ పదం గంగ. అంతగా ఇక్కడి జీవితాలతో గంగ ముడివేసుకుపోయింది. భారతదేశ ఆర్థిక వ్యవస్థకు, చరిత్రకు, సంస్కృతికి గంగతో ఎక్కడ లేని అనుబంధం ఉంది. మన నాగరికత మొత్తం అభివృద్ధి చెందిందే గంగాతీరంలో. ప్రపంచంలో మిగతా నదులకు, గంగకూ స్పష్టమైన తేడా ఉంది. ప్రపంచ జనాభాలో సుమారు పది శాతం ప్రజలకు గంగాతీరం నివాసం. అంటే ప్రతి పన్నెండు మందిలో ఒకరు గంగాతీరంలోనే ఉంటారు.

గంగానది హరిద్వార్ దగ్గర మైదాన ప్రాంతంలో ప్రవేశిస్తుంది. త్రోవలో బోలెడు ఉపనదులు కలుస్తాయి. యమున కూడా గంగకు ఉపనదే. కాకుంటే ఇది పెద్ద నది కాబట్టి దీన్ని విడిగా పిలుస్తారు. ఈ రెండు నదుల ఒడ్డున ఉత్తర భారతదేశంలోని ప్రధాన నగరాలన్నీ అభివృద్ధి చెందాయి. బెంగాల్‌కు చేరేసరికి గంగ చీలి హుగ్లీ ప్రారంభమవుతుంది. అక్కడి నుంచి బంగ్లాదేశ్‌లోకి ఎంటరవుతుంది. ఏడాదిలో మూడు పంటలు పండే డెల్టా గంగాతీరంలో ఉంది. దేశంలోనే అతి పెద్ద వ్యవసాయ క్షేత్రం గంగాతీరంలోనే అభివృద్ధి చెందింది. అభయారణ్యం, అద్భుత వనాలు గంగాతీరంలో తిరుగులేని పచ్చదనానికి ప్రతీక. అన్నింటికీ మించి రాయల్ బెంగాల్ పులి, డాల్ఫిన్, మంచినీటి షార్క్‌లు అన్నీ కూడా గంగానదికే ప్రత్యేకం. గంగానదిలో ప్రవహించే నీటికి కొన్ని ప్రత్యేక లక్షణాలు

వున్నాయి. ఈ నీటిలో ఔషధ గుణాలు ఉన్నాయి. అందుకే ఈ నీటిని తాగితే ఆరోగ్యానికి మంచిదని చెప్తారు. ఈ నీటిలో ఉన్న ప్రత్యేక ఓషధ గుణాల వల్లనే ఈ నదీతరంగాలపై నుంచి వీచిన గాలులు కూడా శరీరాన్ని తేలికపరుస్తాయి. అందుకే ఈ తీరంలో సాధు సంతులు ఇక్కడ ఎక్కువకాలం జీవించగలుగుతారు. మన జీవితానికి, మన వ్యవసాయానికి, మన నాగరికతకు, మన సంస్కృతికి, మన ఆరోగ్యానికి.. ఏ రకంగా చూసినా గంగ ఆధారభూమిక.. అందుకే ఆమె మన దేవత.. దివ్య ఉషస్సులున్న భవాని.. వందల కోట్ల మందికి ఆమె ఆరాధ్య దేవత.. నలభై కోట్ల మందికి ఆమె అమ్మ ఒడి.. ఆమె ఒడిలో మరణించినా అది అదృష్టమేనని భావిస్తారు.. చనిపోయిన తరువాత తమ చితాభస్మాన్ని ఆ ఒడిలో చేర్చటం కోసం తపిస్తారు.. కోట్ల మందికి ఆమె ఆకాశం నుంచి దిగి వచ్చిన దేవత.. ఆదరించి అన్నం పెట్టే అన్నపూర్ణ.. సిద్ధులకు, సాధువులకు.. ఆమె లోగిలి ఒక తపోభూమి.. ఆమె వాకిలి ఒక సిద్ధభూమి.. ప్రపంచంలో అతి పెద్ద జల భూమి అది.. అతి పెద్ద నాగరికతా సమాజానికి నివాసస్థానం..

గంగ వంద కోట్ల మందికి ప్రాణవాయువు అందిస్తోంది. నలభై కోట్ల మందికి జీవితాన్నిస్తోంది. అరుదైన జంతురాశికి నివాసమైంది. అంతులేని పక్షి సంపదకు వాయులీనమైంది. అపురూప వృక్షసంపదకు ఆలవాలమైంది. ప్రపంచంలో మరెక్కడా లేని అద్భుతమైన వాతావరణం.. 21వేల చదరపు కిలోమీటర్ల సుదీర్ఘమైన పరీవాహక ప్రాంతం.. పన్నెండున్నర వేల అడుగుల సగటు లోతు.. పశ్చిమాన హిమాలయ శ్రేణి నుంచి మొదలై.. తూర్పున బంగ్లాదేశ్ దాకా విస్తరించిన మహా నదీతీరం ఇది. ప్రత్యక్షంగా, పరోక్షంగా రోజూవారి అవసరాల కోసం మిలియన్ల కొద్దీ భారతీయులు నూటికి నూరు శాతం ఆధారపడి ఉన్న పరీవాహక ప్రాంతం. కోట్ల మందికి ఇది మాత్రమే జీవనాధారం.. ఇక్కడి వ్యవసాయం.. ఇక్కడి అటవీ ప్రాంతం... ఇక్కడి వైల్డ్‌లైఫ్.. ఇక్కడి నాగరికత.. ప్రపంచంలోనే అతి పెద్ద జీవ సాంద్రత కలిగిన నదీతీరంగా పేరు పొందింది. ప్రపంచంలో అనేక నదులు ఉండవచ్చు. నదీనదాలు ప్రవహిస్తుండవచ్చు. కానీ, గంగానది అంత స్వచ్ఛమైంది.. పవిత్రమైంది మరొకటి లేదు.

గంగ హిందూ విశ్వాసాన్ని మించి శక్తిమంతమైంది. ఒక గొప్ప దేశ ఆర్థిక వ్యవస్థకు గంగానది వెన్నుదన్ను. ఎందుకంటే ప్రపంచ జనాభాలో ప్రతి పది మందిలో ఒకరు ఈ నదీతీరంలోనే నివసిస్తున్నారు మరి. రుగ్వేదంలోని నదీస్తుతిలో తూర్పునుంచి పడమర వరకు ప్రవహిస్తున్న నదుల పేర్లు ప్రస్తావనకు వస్తాయి. వీటిలో గంగానదీ గురించి చాలా గొప్పగా వివరణ కనిపిస్తుంది. “వీరులారా మీ వంశగృహం.. మీ పవిత్ర స్నేహం.. మీ సంపద అంతా జాహ్నవి ఒడ్డున ఉన్నాయి” అని గంగ గురించిన వివరణ ఉంటుంది. అంతే కాదు.. ఈ వివరణ ఉన్న శ్లోకం తరువాతి రెండు వరుస శ్లోకాలలో గంగలో ఉండే డాల్ఫిన్ చేపల గురించి కూడా ప్రస్తావించారు.. అంటే రుగ్వేదంనాటికే వేల కిలోమీటర్ల విస్తీర్ణంలో ఒక గొప్ప నాగరికత విలసిల్లిందన్నది ఈ శ్లోకాలతో అర్థమవుతుంది.

ఉత్తరాఖండ్ రాష్ట్రం పరిధిలో హిమాలయ పర్వత ప్రాంతంలోని గంగోత్రి ఓ హిమానీనదం.. అంటే గ్లేసియర్... ఈ గంగోత్రి నుంచి భాగీరథి ఉద్భవిస్తున్నది. నిజానికి టిబెట్‌లోని మౌంట్ కైలాస్ దగ్గరే గంగ అదృశ్య రూపంలో పుట్టి గంగోత్రిని చేరుకుంటుందని మరో నమ్మకం... గంగోత్రి నుంచి ప్రవహించే భాగీరథి దేవ ప్రయాగ దగ్గర అలకనందగా మారిపోతుంది.. అలకనందా నదీపాయ దేవ ప్రయాగలో భాగీరథిలో కలిసి బద్రీనాథుడిని స్పృశిస్తూ కదులుతుంది.. అక్కడి నుంచే ఇది గంగగా మారుతుంది. హరిద్వారం దగ్గరకు వచ్చేసరికి మైదాన ప్రాంతంలో ప్రవేశిస్తుంది. హరిద్వారం దగ్గర గంగానదిని ఒక్కసారి చూస్తే అది ఎంత స్వచ్ఛంగా ఉంటుందో తెలుస్తుంది. హరిద్వార్ దగ్గర గంగ అడుగుభాగం స్పష్టంగా చూసేంత స్వచ్ఛంగా ఇక్కడి నీరు ఉంటుంది. అందుకే దీన్ని పవిత్రమని పిలిచేది. నీటికి రంగు, రుచి, వాసన అన్నవి ఏవీ లేవని సైన్స్ చెప్తుంది.. అలాంటి నీరు మనిషికి ప్రాణాధారంగా మారుతుందని కూడా సైన్స్ చెప్తుంది.. ఆ సైన్స్ చెప్పే అచ్చమైన, స్వచ్ఛమైన నీటిని మనం హరిద్వారలో గంగానదిలో చూడవచ్చు.. తాగవచ్చు. అన్ని రోగాలను మటుమాయం చేసుకోవచ్చు.

మైదాన ప్రాంతంలో ప్రవేశించాక కోసి, గోమతి, శోణ వంటి ఉపనదులు గంగతో సంగమిస్తాయి. అలహాబాద్ దగ్గర యమున, సరస్వతిల పవిత్ర సంగమం జరుగుతుంది. ఈ మూడు నదుల తీరంలో ఉత్తర భారత దేశంలో అతి పెద్ద నగరాలు ఉన్నాయంటేనే అర్థం చేసుకోవచ్చు. దేశ రాజధాని ఢిల్లీ, కాన్పూరు, వారణాసి, అలహాబాద్, పాట్నా, కోల్‌కతా వంటి మహానగరాలు ఈ నదీతీరంలోనే అభివృద్ధి చెందాయి. యమున పెద్ద నదే కానీ, సాంకేతికంగా మాత్రం గంగకు ఉపనదే. ఒకటి కాదు.. రెండు కాదు.. వందల కొద్దీ నదులు గంగానదిలో కలిసిపోతున్నాయి.. బెంగాల్ వరకు అప్రతిహతంగా ప్రవహించే ఈ మహానది.. అక్కడ రెండుగా చీలిపోతుంది.. హుగ్లీనదిగా ఇక్కడి నుంచి గంగ పాయ విడిగా వేరుదారిలో ప్రయాణిస్తుంది. ఈ నది ఒడ్డునే కోల్‌కతా ఉంది.. భారత దేశ జనజీవనం నేచర్‌తో దగ్గరి అనుబంధాన్ని కలిగి ఉంటుంది. ఇందుకు ఉదాహరణ గంగాబేసిన్.. గంగాబేసిన్ భారతదేశ జీవన విధానంతో సంపూర్ణంగా ముడిపడి ఉండటం వల్లనే దీనికి దేనికీ లేని పవిత్రత వచ్చింది.. అతి పెద్ద మైదాన ప్రాంతం.. విశాలమైన డెల్టా.. అద్భుతమైన వనాలు.. అభయారణ్యాలు.. ఇవన్నీ గంగానది సొంతం. కోల్‌కత్తా దగ్గర హుగ్లీ–గంగా విశాలమైన డెల్టా ప్రారంభమవుతుంది. ఇక్కడ గంగానదిని మాల్దా అని పిలుస్తారు. మరి కొంత దూరం వెళ్లిన తరువాత పద్మగా పేరు మార్చుకుంటుంది.. బంగ్లాదేశ్‌లోకి ప్రవేశించిన తరువాత బ్రహ్మపుత్రానది చీలిక అయిన జమునతో కలుస్తుంది. అక్కడి నుంచి బంగ్లాదేశ్ మైదానాలలో గంగా మహాప్రవాహం సాగుతుంది. మధ్యలో మేఘన వచ్చి గంగతో సంగమిస్తుంది.. ఒకటా.. రెండా.. ఎన్ని నదులు.. ఎన్ని వాగులు.. లెక్కలేనన్ని ఈ విశాల నదీ ప్రవాహంలో కలిసిపోయి తమను తాము పునీతం చేసుకున్నాయి. సుందరమైన వనాలు.. తోటలు.. వ్యవసాయ క్షేత్రాలు.. డెల్టా మీదుగా రకరకాలుగా



**వేల రకాల పక్షులు, ఇతర భూ, వాయుచరాలు గంగా పరివాహక ప్రాంతంలో చాలా చాలా కనిపిస్తాయి. హరప్పా సివిలైజేషన్ నుంచి ఇప్పటి వరకూ ఈ ప్రాంతం ఎకో రీజియన్‌గానే ఉంది. కొంత పొల్యూట్ అయినా, ప్రధానమైన పర్యావరణ, అభయారణ్య రక్షిత ప్రాంతాలు ఇంకా సజీవంగానే ఉండటం విశేషం.**

చీలుతూ.. అనేక రకాలుగా కలుస్తూ చివరకు బంగాళాఖాతంలో కలిసిపోతుంది గంగ.

గంగానదీ తీరం అంతటా అతి విస్తారమైన నాగరికత విలసిల్లిందనటానికి ఇక్కడ అభివృద్ధి చెందిన నగరాలే తార్కాణం. లక్ష జనాభా కంటే ఎక్కువగా ఉన్న నగరాలు గంగానదీతీరంలో 23 ఉన్నాయి. 50వేల జనాభా కంటే ఎక్కువ ఉన్న పట్టణాలు 48, నగరాలు 29 ఉన్నాయి. నైసర్గిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, రాజకీయ, ఆహార అంశాలు గంగానదీ తీరాన్ని భూమికగా చేసుకున్నాయి. గంగోత్రిలో భాగీరథిగా పుట్టి అలకనందగా ప్రవహించిన చోటి నుంచి బంగాళాఖాతంలో కలిసేంత వరకు ఈ తీరంలో ఎన్ని సుందర వనాలు ఉన్నాయో లెక్కలేదు.. అభయారణ్యాల గురించి అయితే చెప్పనే అవసరం లేదు. భారత జాతీయ జంతువు పులి సంఖ్యాపరంగా ఎక్కువగా ఉన్నది గంగా బేసిన్‌లోనే.

గంగా పరీవాహక ప్రాంతంలో సుమారు 400 పెద్ద పులులు మనుగడ సాగిస్తున్నాయి. ప్రపంచంలోని షార్క్‌లలో గంగానదిలో ఉన్న షార్క్‌లకు ప్రత్యేకత ఉంది. ఇక్కడ కనిపించే షార్క్ చాలా అరుదైన జాతికి సంబంధించింది. దీన్ని శాస్త్రీయంగా గ్లిఫిస్ గాంగెటికస్ అంటారు.. బెంగాలీలు ఈ షార్క్‌ను బాగ్ మాచ్ అని పిలుస్తారు.. అంటే టైగర్ ఫిష్ అని అర్థం.. ఈ షార్క్ కేవలం మంచినీటిలోనే కనిపిస్తుంది. కనీసం ఆరు అడుగుల ఆరు అంగుళాల పొడవున్న అతిపెద్ద షార్క్ ఇది. ప్రపంచంలోని ఇరవై అరుదైన షార్క్‌లలో గంగలోని షార్క్ ఒకటి. ఇది మామూలు చేప కాదు. మనుషులపై దాడి కూడా చేయగల సత్తా ఉన్నది. గంగానదిలో మరో విచిత్రమేమంటే కళ్లులేని డాల్ఫిన్‌లు ఉన్నాయి. గంగ, బ్రహ్మపుత్ర రివర్ బేసిన్‌లో కనిపించే అరుదైన జాతి డాల్ఫిన్‌లు ఇవి.. మేల్ డాల్ఫిన్‌ల కంటే ఫిమేల్ డాల్ఫిన్‌లు ఎక్కువ పొడవు ఉంటాయి. మేల్ డాల్ఫిన్ 7 అడుగుల పొడవు వుంటే, ఫిమేల్ డాల్ఫిన్ 9 అడుగుల పొడవు ఉంటాయి.

ప్రపంచ నదీతీరాల్లో ఇంత విస్తారమైన జనసాంద్రత ఉన్న తీరప్రాంతం మరొకటి లేదు.. ఇంత అద్భుతమైన వన్యప్రాణి సంపద ఇంకోచోట కనిపించదు.. మానవ వికాసానికి,

ఆరోగ్యానికి, సుసంపన్నతకు ఆలవాలంగా నిలిచింది కాబట్టే గంగానది ఈ దేశానికి దేవత అయింది.. వైష్ణవులకు విషువు పాదాల దగ్గర పుట్టిన నది కాగా, శైవులకు శివుడి జటాజూటంలో చిక్కుకున్న మహాదేవిగా పూజలందుకుంటోంది. గంగానదీ తీర ప్రాంతంలో 75శాతం వ్యవసాయ క్షేత్రం గానీ, అర్బన్ ప్రాంతంగా కానీ అభివృద్ధి చెందినవే.. మిగతా తీర ప్రాంతం అభయారణ్యంగా ఉన్నాయి.

గంగా పరీవాహక ప్రాంతంలో రాజాజీ నేషనల్ పార్క్, జిమ్ కార్బెట్ నేషనల్ పార్క్, దుధ్వా నేషనల్ పార్క్‌లు అతి పెద్దవి. ఆసియా వైల్డ్ ఎలిఫెంట్‌లు ఈ అటవీ ప్రాంతంలో ఎక్కువగా ఉంటాయి. టైగర్లు, స్లాత్ బీయర్స్, వైల్డ్ క్యాట్, తోడేళ్లు, నక్కలు, రాయల్ బెంగాల్ టైగర్లు, బారాసింహాలు ఈ అడవుల్లో మనకు ఎక్కువగా కనిపిస్తాయి. గంగా డెల్టా ప్రాంతం మొసళ్లకు ప్రసిద్ధి. ఇక చేపలకైతే లెక్కే లేదు.. దాదాపు 150 రకాల జాతులకు చెందిన చేపలు గంగానదిలో మనకు కనిపిస్తాయి. ఒక నదిలో ఇన్ని రకాల జీవులు మనుగడ సాగించటం మరెక్కడా లేదు. ఇక పక్షులు.. గంగాతీరానికే ప్రత్యేకం.. కోయిలలు, కాకులు, గద్దలు.. బాతులు, నెమళ్లు, అబ్బో.. ఒకటా రెండా వేల రకాల పక్షులు, ఇతర భూ, వాయుచరాలు గంగా పరివాహక ప్రాంతంలో చాలా చాలా కనిపిస్తాయి. ప్రీ హరప్పా సివిలైజేషన్ నుంచి ఇప్పటి వరకూ ఈ ప్రాంతం ఎకో రీజియన్‌గానే ఉంది. కొంత పొల్యూట్ అయినా, ప్రధానమైన పర్యావరణ, అభయారణ్య రక్షిత ప్రాంతాలు ఇంకా సజీవంగానే ఉండటం విశేషం.

అపారమైన జనరాశి.. అంతులేని జీవరాశి గంగానదీ తీరంలో మనుగడ సాగిస్తున్నదంటే అది గంగకున్న శక్తే.. దీని నీటిలోని స్వచ్ఛత.. ఇందులోని ఔషధ గుణాలు.. దీనిపైనుంచి వెళ్లే గాలిలోని పవర్ అన్నీ గంగాతీరానికి అపూర్వమైన శక్తిసంపదలనిచ్చింది. ఇంత విస్తారమైన జనజీవన స్రవంతి గంగానదీ స్రవంతితో అనుసంధానం కావటానికి ఈ నీటిలోని, ఈ గాలిలోని లక్షణాలే కారణం. మన పురాణాలు కానీ, ఇతిహాసాలు కానీ, మత గ్రంథాలు కానీ, ఏ ఒక్క దానికీ నిరాధారంగా ఎలాంటి పవిత్రతలు ఆపాదించ లేదనటానికి గంగ ఉదాహరణ. గంగను దేవతగా పూజించటానికి కారణం భారతీయ నాగరికత అంతా కూడా ఇక్కడే అభివృద్ధి చెందటం.

భూమ్మీద జీవరాశి అస్తిత్వానికి కన్నతల్లిగా నిలిచింది కాబట్టే గంగ పవిత్రమైంది.. దేవత అయింది.. భాగీరథి.. అలకనంద.. గంగ, హుగ్లీ, పద్మ, మేఘన.. ఎన్ని పేర్లతో పిలిచినా పలికే అమ్మ అయింది.

# నరకం ద్వారాలు

*యముడి మహిషపు లోహ ఘంటలు*
*ఖణేల్ మంటున్నాయి*
*యమలోకపు ద్వారాలు తెరుచుకుంటున్నాయి*
*నరకలోకపు జాగిలాలు సంకెళ్లు*
*తెంచుకుని ఉరికిపడుతున్నాయి*
*పాపుల చిట్టా పుటలు చిరుగుతున్నాయి*
*రక్తమాంసాల కాసారం వైతరిణి మరిగిపోతోంది*
*కుంభీపాకం.. క్రిమిభోజనం వంటి నరక శిక్షలు*
*నరుడి కోసం సిద్ధంగా ఉన్నాయి.*



మీరు పుణ్యం చేశారా? అయితే ఇబ్బంది లేదు లెండి.. మీకోసం స్వర్గంలో బోర్డింగ్ రిజర్వ్ అయ్యే ఉంటుంది. పాపం చేశారా? ఇంకేం నరకానికి వెళ్లేందుకు రెడీ కండి.. నరక బాధలు అనుభవించేందుకు సిద్ధం కండి.. పదుల కొద్దీ శిక్షలు దారుణంగా అమలు చేసేందుకు యమభటులు కాచుక్కూచున్నారు. రక్తమాంసాల చెరువు వైతరిణి, పాపులను ముంచెత్తేందుకు సిద్ధంగా ఉంది. స్వర్గం లేదు.. నరకం లేదు.. అని తేలిగ్గా కొట్టిపారేయొద్దు. గరుడ పురాణంలో చెప్పిందేదీ కట్టుకథ కాదు.. నరకం ఉంది.. అసలు నరకం మాటెలా ఉన్నా భూమిపైనే ఆరు చోట్ల నరకాలు ఉన్నాయి. అపరిచితుడు సినిమా గుర్తుంది కదా... పాపం చేసిన వాళ్లకు, తప్పులు చేసిన వాళ్లకు నరక శిక్షలు ఎలా ఉంటాయో రుచి చూపించిన సినిమా... అంధకూపం.. కుంభీపాకం, క్రిమిభోజనం వంటి పదాలు ఇప్పటికీ మార్మోగుతూనే ఉంటాయి. సినిమాలో అయితే ఏదైనా ఓకే.. కానీ, నిజంగా నరకం వుంటే.. అందులో ఈ శిక్షలు అమలవుతూ ఉంటే.. అనుభవించాల్సిందేనా? యస్.. చనిపోయిన తరువాత ప్రతి ఒక్కరూ వెళ్లే నరకం నిజంగా ఎలా ఉంటుందో.. గుండెను దిటవు చేసుకుని చదవండి.

ఒకే ఒక్క క్షణం.. శరీరం నుంచి ప్రాణం వెళ్లిపోతోంది... వందల కొద్దీ తేళ్లు ఒక్కసారిగా కుట్టిన బాధ, ఏమీ చేయలేని అసమర్థత... ఒక్కసారిగా నిశ్శబ్దం...మనిషి చనిపోయాడు.. ఆ తరువాత...ఏం జరుగుతుంది? పొడవాటి జుట్టు... వికృతమైన ఆకారాలు.. పాశం పట్టుకుని యమదూతలు జీవుడిని తీసుకువెళ్లేందుకు సిద్ధంగా ఉంటారు.. క్షణాల్లో యమలోకానికి ఆ జీవుడు ప్రయాణమైపోతాడు.. కటిక చీకటి.. ఎండ.. కార్చిచ్చు.. చెట్టుకు వేలాడ దీసి ముళ్ల గదతో కొట్టడం.. తాళ్లతో కట్టి చర్మం ఒలిచేయటం.. సలసల కాగే నూనెలో వేయించటం.. క్రిమికీటకాలతో భోజనం.. రక్తంతోనే స్నానం.. అన్నీ బాధలే..

భరించలేని బాధలు.. సహించలేని యాతన.

మనిషి చనిపోయాక అతను చేసే బాధలను అనుసరించి శిక్షలు అనుభవిస్తారు.. ఒక్కో నరకంలో ఒక్కో శిక్ష.. ఒక్కో శిక్షకు ఒక్కో ప్రత్యేకత.. ఒకటి కాదు.. రెండు కాదు.. ఏకంగా 84 లక్షల నరకాలు.. నరక బాధలు.. మనిషి కోసం.. మన కోసం.. పాపం చేసిన వారి కోసం కాచుక్కూచున్నాయి.

గరుడ పురాణంలో నరకం గురించి చాలా విషయాలే చెప్పారు.. యమపురి.. యమధర్మరాజు నివాసం.. పాపులకు శిక్షలు విధించే సుప్రీం కోర్టు ఎక్కడుంది? భూమికి 86 వేల యోజనాలు.. అంటే సుమారు మనకు కోటీ 11లక్షల 80వేల కిలోమీటర్ల దూరంలో నరకం.. నరకానికి దారిలో 16 చిన్న యమ నగరాలు ఉన్నాయి. మనిషి చనిపోయిన తరువాత జీవుడు ఈ నగరాల మీదుగానే వెళ్తాడట. రోజుకు పగలూ రాత్రి కలిసి 247 యోజనాలు అంటే సుమారు 3211 కిలోమీటర్లు ప్రయాణం చేస్తాడట. చనిపోయిన తరువాత 13 రోజుల పాటు కర్మకాండ జరిగినంత సేపు అతను అంటే జీవుడు భూమిపైనే ఉంటాడు. కర్మ భాగాన్ని స్వీకరించిన తరువాత యమపురికి బయలుదేరుతాడు. 348రోజులు పూర్తయిన తరువాత అంటే సరిగ్గా చనిపోయిన ఒక ఏడాదికి మూడు రోజుల ముందు తన గమ్యానికి చేరుతాడన్నమాట. అప్పుడు మూడు రోజుల పాటు భూమిపై సంవత్సరీకం జరుగుతుంది. అప్పుడు వైతరిణి నదికి చేరుకుం టుంది. నరకానికి దక్షిణం వైపున వైతరిణి నది ఉంటుంది.. ఇది రక్తమాంసాలతో అతి భయంకరంగా ఉంటుంది. పాపాలు చేసిన వాళ్లు ఈ నదిని దాటి నరకంలోకి ప్రవేశించాల్సి ఉంటుంది. పాపికి తొలి హర్డిల్ ఇదే. ఇది వంద యోజనాల పొడవుంటుంది. అంటే 1300 కిలోమీటర్లన్న మాట.

గరుడ పురాణంలోనే కాదు.. ఇస్లాం, క్రిస్టియానిటీలోనూ నరకం గురించి, గేట్స్ ఆఫ్ హెల్ గురించి సవివరంగా ఉంది.. నరకం ద్వారాలు ఎక్కడెక్కడ ఉన్నాయి, ఎంత దూరంలో ఉన్నాయి అన్న విషయాలు ఈ గ్రంథాల్లో స్పష్టంగానే వివరణలు కనిపిస్తాయి. వీటిని ఆధారం చేసుకుని నిర్వహించిన పరిశోధనలు చాలానే జరిగాయి. ఇస్లాం కూడా నరకానికి ఏడు ద్వారాలుంటాయని చెప్పింది. జహన్నామ్, లజా, అల్‌హుతామా, సాఇర్, సఖర్, అల్ జహీమ్, హానియా అంటూ ఇస్లాం చెప్పిన నరకాల్లోనూ పాపికి తాగటానికి చీమూ నెత్తురూ ఇస్తారని, భయంకరమైన శిక్షలు విధిస్తారని ఉంది. ప్రజలు తప్పులు చేయకుండా కేవలం భయపెట్టేందుకే మతాలు స్వర్గ, నరకాల ప్రస్తావన చేసినట్లు హేతువాదులు చెప్తారు. కానీ, భూమిపైనే ఆరు నరక నగరాలు ఉన్నాయి. అత్యంత భయంకరమైన, దుర్గమమైన ప్రాంతాలు, మనిషి దగ్గరకు వెళ్లటానికి కలలోనైనా ఊహించలేని ప్రదేశంలో యమ పురులు ఉన్నాయి. వాటి గురించి ఖురాన్, బైబిల్‌లు కూడా ప్రస్తావించాయి. చర్చించాయి. ఇప్పుడు సైంటిఫిక్ పరిశోధనలు వాటినే గేట్స్ ఆఫ్ హెల్‌గా నిర్ధారిస్తున్నాయి. స్వర్గం భూమికి పై భాగాన ఉంటుందని, నరకం భూమికి కింద ఉండే లోకాలలో

వుంటుందని అన్ని మతాలు చెప్తున్నాయి. అయితే, నరకం ఎక్కడ ఉంటుంది? భూమి కిందకు వెళ్లేదెలా? చనిపోయిన వ్యక్తులు ఏ విధంగా నరకానికి చేరుతారు? భూమి నుంచి నరకానికి వెళ్లేందుకు దారి ఎక్కడినుంచి ఎలా ఉంది? భూమ్మీదే ఆరు చోట్ల నరకానికి దారులున్నాయని ఆధునిక చరిత్రకారులు చెప్తున్నారు. వీటిని గుర్తించారు కూడా.

నికరాగువా రాజధానికి కూతవేటు దూరంలో అతి పెద్ద వాల్కెనో.. పేరు మసాయా. ప్రాణుల్ని గభాలున మింగేసేందుకు ఆబగా తెరుచుకున్న నరకపు నోరు అది.. మైళ్ల కొద్దీ లోతుల్లోంచి ఎగిసి పడే మంటలు.. భయంకరమైన విషవాయువులు.. అంతం ఎక్కడో తెలియనంత డీప్ హోల్.. ఫైర్ లోపల మరేదో ఉంది.. అక్కడ మరేదో తెలియని అండర్ వరల్డ్ యూనివర్స్ ఉంది. లోపలికి వెళ్లడం అంత ఈజీ కాదు. మసాయాకు మరో వైపు నుంచి లోపలికి వెళ్లేందుకు ఓ పెద్ద చీకటి గుహ ఉంది. మసాయా నరకపు ద్వారం. క్రిస్టియన్లు, సుమేరియన్లు, జోరాస్ట్రియన్‌లు దీన్ని గేట్ ఆఫ్ హెల్‌గా నమ్ముతారు. రిమోట్ ఏరియాలో రహస్యంగా ఉన్న ఈ గుహ మసాయా వాల్కెనో లోతుల్లోకి దారి చూపుతుంది. కానీ, ఇందులోకి వెళ్లడం ఆషామాషీ కాదు. 1940లలో రాబిన్‌సన్ అనే ఆర్కియాలజిస్టు దీన్ని ఛేదించే ప్రయత్నంచేసి విఫలమయ్యాడు. అతను ప్రయాణించిన విమానం మసాయా గుహకు సమీపానికి రాగానే ఉన్నట్టుండి ప్రమాదానికి గురైంది. ఒక్కసారిగా మంటలు కమ్ముకున్నాయి. క్షణాల్లోనే తెల్లని పొగ తుపానులా విరుచుకు పడింది. మరు క్షణంలోనే చుట్టూ చీకట్లు అలుముకున్నాయి. ఇది నిజంగా జరిగిన ఘటన. అతని ఎడమవైపు శరీర భాగమంతా కాలిపోయింది. జీవించటానికి అతనికి రెండో అవకాశం లభించింది. బైబిల్ మసాయాను మౌత్ ఆఫ్ హెల్ అని వర్ణించింది. మసాయా నిప్పుల గుండం నుంచే పాపులు నరకానికి వెళ్తారని, ఆ లోపల రకరకాల శిక్షలను అమలు చేస్తారని చెప్పింది.

మసాయాకు నాలుగు వందల మైళ్ల దూరంలో సెంట్రల్ అమెరికా పరిధిలో గ్జిబల్బా అనే మరో అగ్ని పర్వతం ఉంది.. దీని గురించిన ప్రస్తావన అన్ని మతాల్లోనూ ఉంది. ఇక్కడికి మనుషులు నీటిలోపలి నుంచి వెళ్లాల్సి ఉంటుంది. దీని లోపల మినీ గుహలు వున్నాయి. కత్తుల గుహ, గబ్బిలాల గుహ, తోడేళ్ల గుహ, మంచు గుహ, అగ్ని గుహ, వీటితో పాటు రక్తనది కూడా ఉంటుంది. ఇదంతా మేయన్ బైబిల్‌లో ఉన్న అంశాలు. గరుడ పురాణంలోనూ నరకం గురించి పేర్కొన్న పదహారు పురాలు ఇలాంటివే. ఇక్కడ ఉన్న ఎరుపు నది హిందూయిజంలో పేర్కొన్న వైతరిణి. అటు బైబిల్‌లోనూ దీన్ని రక్తనదిగా చెప్పారు. ఏడవ శతాబ్దంలో కొందరు లోపలికి వెళ్లేందుకు ప్రయత్నించి ప్రాణాలు త్యాగం చేయాల్సి వచ్చింది. గ్జిబల్బా అగ్ని గుహలో చాలా వరకు హ్యూమన్ రిమెయిన్స్ కనిపించాయి. కత్తుల గుహలో 20 ఏళ్ల యువతి అస్తిపంజరం కూడా లభించింది.

అండర్ ది ఎర్త్‌లో అధోలోకాలు ఉంటాయని మన పురాణాలు చెప్తున్నాయి. అన్ని మతాల గ్రంథాలూ ఈ విషయాన్ని ధృవీకరించాయి. భూమిపై నుంచే నరకానికి దారులు వున్నాయనటానికి ఈ అగ్ని గుహలే సాక్ష్యంగా నిలుస్తున్నాయని అంటారు. వీటిపై చేసిన

రీసర్చ్‌లో చాలా విషయాలు వెలుగులోకి వచ్చాయి. మత గ్రంథాలలో చెప్పిన కొన్ని అంశాలు.. ఇక్కడ కనిపిస్తున్న దృశ్యాలతో సరిపోలుతున్నాయి. ప్రపంచ ప్రాచీన నాగరికతకు సింబల్‌గా నిలిచే ఈజిప్టులోని గిజా పిరమిడ్ కాంప్లెక్స్‌లో మధ్య పిరమిడ్ కింద అండర్ వరల్డ్ ఉందిట. పిరమిడ్‌పై రాసిన రాతల్లోనూ, వివిధ శాసనాల్లో పిరమిడ్ కింద నరకం ఉందని, అందులో పాపులకు శిక్షలు పడతాయని చెప్తారు. మృత్యువుకు అధిపతి ప్లూటో అని గ్రీకు మైథాలజీ చెప్తోంది. అతనే నరకానికి రాజుగా చెప్తున్నారు.

ఈజిప్టు దగ్గర్లో అండర్‌వరల్డ్ గాడ్‌హేడ్స్ గుహ ఉంది. ఇందులో మృత్యుదేవత కొలువై ఉంటుందని నమ్మకం. ఇస్లాంలో, జోరాస్ట్రియన్ టెక్ట్స్‌లో కూడా హేడ్స్ గురించి చర్చించారు. నీళ్లలోనుంచి గుహలోకి వెళ్లాల్సి ఉంటుంది. ఇంత భయంకరమైన గుహ ప్రపంచంలో మరెక్కడా కనిపించదు. లోపలికి వెళ్తున్నకొద్దీ వెళ్లటమే తప్ప ముగింపులేని గుహ. దీన్ని కత్తుల గుహ అని కూడా అంటారు. ఇందులోనూ హ్యూమన్ రెలిక్స్ కనిపించాయి. దీని లోతుల్లో మనకు అంతుపట్టని నరక ప్రపంచం ఉందని గ్రీకు మైథాలజీ చెప్తుంది. నరకానికి అయిదో దారి అట్లాంటిక్ ప్రాంతంలో ఐస్‌లాండ్‌మధ్య హెక్లా వాల్కెనో ఉంది. దట్టమైన చీకట్లో, చుట్టూ మంచు మధ్యలో.. రెండు వేల డిగ్రీల ఉష్ణోగ్రతలో వేడి ఉబికుబికి రావటం హెక్లా బీభత్సానికి నిదర్శనం. దీని తరువాత సేలమ్ అగ్ని పర్వతం మరో నరకం. దట్టమైన అడవి మధ్య ఉన్న ఈ వాల్కెనో లోపల ఉన్నదేమిటో ఇంతవరకు అంతుపట్టలేదు.. వాల్కెనో చుట్టుపక్కలకు వెళ్లటం ఇప్పటి వరకు ఎవరికీ సాధ్యపడలేదు. నరకంలో లక్షలాది శిక్షలు ఉన్నాయని అన్ని మత సిద్ధాంతాలు చెప్తున్నాయి. రక్తకాసారాలు.. క్రిమిభోజనం, అంధకూపం, కుంభీపాకం వంటి కఠిన శిక్షలు అన్ని మైథాలజీలూ చెప్తున్నాయి. నరకానికి మనకు తెలిసిన మార్గాలు ఆరు మాత్రం మనకు దొరికాయి. ఇవి భూమ్మీద ఉన్న నరకాలు. హిందూ ధర్మం చెప్తున్న నరకానికి మాత్రం దారి ఎవరికీ దొరకలేదు. దొరికిన వాళ్లు (చనిపోయాక) ఎలాగూ తిరిగి రాలేరు. మరణం తరువాత ఏమవుతుందో.. ఆత్మ అనేది ఉన్నదో లేదో ఎవరికీ తెలియదు. మరణం తరువాత జీవితం అనేది ఉందా? లేక స్వర్గనరకాలు అన్నీ కల్పితాలేనా? అసలు చావు అంటేనే ఏమిటో ఎలా వస్తుందో ఇంతవరకు తెలియనప్పుడు, ఇక మరణం తరువాత ఏమిటన్నది తెలిసేదెలా? నరకం ఉందో లేదో, యమధర్మరాజు ఎలా ఉంటాడో తెలియదు. మనిషి మంచివాడిగా ఉండేందుకు అతనికి పాప పుణ్యాల భయం పెట్టడం అన్ని మతాలకూ అవసరంగా కనిపించింది. ఈ భయం పెట్టేందుకే స్వర్గం నరకం కాన్సెప్ట్‌ను తీసుకువచ్చారు. అయితే, ఈ కాన్సెప్ట్‌కు అతీతంగా, ఈ భూమికి కింద ఏదో ఉన్నదన్నది మాత్రం వాస్తవం.. రిమోట్ ఏరియాలో అగ్ని గుండాలు నరక ద్వారాలని ఆర్కియాలజిస్టులు చెప్తున్నారు.. మైథాలజీని తమ పరిశోధనలకు ఆధారంగా చూపుతున్నారు. వీటి లోతుల్లో ఏమున్నదన్నది ఇప్పటికైతే తెలియకపోయినా, తెలుసుకోవటం అసాధ్యం కాకపోవచ్చు.

# నాగా



*హుక్కా ..గుట్కా..నార్కోటిక్స్..ప్రతీదీ వాళ్లకు ప్రసాదమే..*
*ఎండా.. వానా.. చలి..అన్ని కాలాల్లో ఆనందమే..*
*వంటిపై నూలుపోగు ఉండదు. విభూతే వారికి వస్త్రం..*
*త్రిశూలమే అస్త్రం.. అందరూ ఈశ్వరుడి ప్రతిరూపాలే..*

ఏమైనా అనుకోండి.. పిచ్చివాళ్లని నిందించుకోండి... వెర్రిబాగుల వాళ్లని వెక్కిరించండి... వంటిమీద నూలుపోగైనా లేకుండా తిరుగుతున్నారని ఆక్షేపించండి... శరీరంనిండా విభూతి రాసుకున్నారని నొసలు నొక్కుకొండి.. హుక్కా పీలుస్తున్నారంటూ ఆశ్చర్యపోండి... మీరేమనుకున్నా వారికి మీ ఊసులు అక్కరలేదు.. వారికి మీ అభిప్రాయాలతో పని లేదు.. వారికి లోకంతో పని లేదు.. లోకం తమ గురించి ఎన్ని మాట్లాడుకున్నా వారికి అవసరం లేదు.. ఎవరు వారు? ఎక్కడి నుంచి వచ్చారు? ఎక్కడ ఉంటారు? ఏం చేస్తారు?

ఇంటి నుంచి బయటకు కాలు మోపితే, అంతా మనల్నే చూడాలని ఎంత తాపత్రయ పడతాం? ఆడామగా తేడా లేకుండా అద్దం ముందు నిలబడి గంటల తరబడి తయారవటం తెలిసిందే.. ఒంటి అలంకారం కోసం వాడే కాస్మోటిక్స్ అన్నీ ఇన్నీ కావు. పర్ఫ్యూమ్స్ గురించయితే చెప్పనే అక్కర్లేదు.. వంద గ్రాముల పర్ఫ్యూమ్‌ను వంద పదులైనా సరే కొనటానికి వెనుకాడం. కానీ, ఇవన్నీ అక్కరలేని జాతి నాగా. ఇది మన దేశంలోనే ఉంది.. మన మధ్యలోనే ఉంది.. ఆ జాతికి వీటితో పనే లేదు.. ఎవరితోనూ ఆ జాతికి సంబంధమూ లేదు.. వారు ఎవరికీ అర్థం కారు..ఎవరి అపార్థాలతో వారికి పని లేదు..అలంకారాలు అక్కర లేదు.. జుట్టు జడలు కట్టినా పట్టింపులేదు.. ఆహార్యం ప్రధానం కాదు.. నగ్నత్వమే వారి వేషం.. ఆహారం ముఖ్యం కాదు.. దొరికిందే తింటే చాలు.. రుచితో పనిలేదు.. శరీరంపై మోహం లేదు.. మృత్యువంటే భయం లేదు.. హిమాలయ సానువుల్లో నివాసం... పుష్కరం వస్తేనే జనంలోకి ప్రవాహం.. అడుక్కునే వాళ్లంటూ తిట్టేవాళ్లున్నారు.. అవధూతలని అర్చించేవారూ ఉన్నారు.. ఎవ్వరితోనూ వారికి అవసరం లేదు.

సాధారణంగా మనం నిత్యం చూసే సాధు సంతులకు కాషాయం, కమండలం, దండం అస్తిత్వాలు.. మిగతా రెంటి మాటెలా ఉన్నా, కాషాయం సన్యాసానికి ఒక విధంగా యూనిఫామ్ లాంటిది. ఎందుకంటే కాషాయం త్యాగానికి చిహ్నం. సన్యాసులు అన్నింటినీ త్యాగం చేసి వెళ్తారు కాబట్టి, సాధారణంగా వారు కాషాయాన్నే ధరిస్తారు.. ఇది కామన్

ఎలిమెంట్.. ఇందులో ఎవరికీ ఎలాంటి అభ్యంతరాలు లేవు.. కానీ ఎవరికీ అంతుపట్టని సాధువుల సమాజం వాళ్లది.. అది అత్యంత రహస్య సమాజం. హిమాలయ పర్వత శ్రేణుల్లో ఎక్కడ ఉన్నాయో తెలియని అఖారాల్లో ఉండే సాధు జాతి.. దాని పేరు నాగా. ఆ సన్యాసులే నాగా సాధువులు. మిగతా సొసైటీతో వీరికి ఎలాంటి సంబంధం లేదు.. తమ లోకంలోనే వారు జీవిస్తుంటారు.. అన్నింటినీ వదిలిపెట్టేసిన వారు.. చివరకు శరీరంపై బట్టల్నీ విడిచిపెట్టిన వాళ్లు.. నాగా సాధువులు. వీరు జనావాసాల్లోకి పుష్కరాల సమయంలోనే వస్తారు.. ఒకే ఒక్క ఊరేగింపుగా వచ్చి పవిత్ర స్నానాలు ఆచరించి పుష్కరాలు పూర్తికాగానే తిరిగి వారి ఆవాసాలకు వెళ్లిపోతారు. అంతే కాదు.. జనం మధ్యలోకి వచ్చినప్పుడు వీరి చేష్టలు విచిత్రంగా ఉంటాయి.. విడ్డూరంగా కనిపిస్తాయి.. త్రిశూలాలు ధరిస్తారు.. కత్తులు పట్టుకుంటారు.. వాటితో వీరంగం వేస్తారు.. వీరనాట్యాలు చేస్తారు.. కర్రసాము చేస్తారు.. హుక్కా, చిలుమ్ వంటి వాటి ద్వారా పొగాకు, నార్కొటిక్స్ వంటివి పీలుస్తారు. ఇలాంటి చర్యలకు పాల్పడే వారిని సాధువులని పిలవటం ఏమిటి? అదే మిస్టరీ... అతి కఠినమైన యోగ సాధనకు పరాకాష్ట.. సభ్య సమాజానికి ఏవైతే నిషేధాలో... అవన్నీ వారు చేస్తారు.. బట్టలు ధరించకపోవటమే ఒక సమస్య అనుకుంటే, హుక్కా, చిలుమ్ పీల్చటం, ఏది పడితే అది తినేయటం, ఒంటిని శుభ్రంగా కూడా ఉంచుకోకపోవటం, అన్నీ నెగెటివ్ షేడ్సే.. ఏమిటీ రహస్యం? పవిత్ర గంగా తీరంలో పుష్కరాలు వచ్చినప్పుడు నాగా సాధువులు విభూతి అలంకారాలతో శివ పంచాక్షరి నినదిస్తూ రావడం ఒక అపురూప సన్నివేశం.

హిమాలయాలు.. దేవతల ఆవాసాలంటారు.. నాగా సాధువులు ఉండేది కూడా ఈ హిమాలయాల పర్వత శ్రేణుల్లోనే.. కాకపోతే బయటి ప్రపంచానికి అందుబాటులో లేని మారుమూల పర్వత ప్రాంతాలను ఏరికోరి ఎంచుకుని మరీ తమ మెడిటేషన్‌ను



**హిమాలయాల్లో ఎక్కడ ఉన్నాయో తెలియని అఖారాల్లో ఉండే సాధు జాతి.. దాని పేరు నాగా. మిగతా సొసైటీతో వీరికి ఎలాంటి సంబంధం లేదు.. అన్నింటినీ వదిలిపెట్టేసిన వారు.. చివరకు శరీరంపై బట్టల్నీ విడిచిపెట్టిన వాళ్లు.. నాగా సాధువులు. వీరు జనావాసాల్లోకి పుష్కరాల సమయంలోనే వస్తారు.. ఒకే ఒక్క ఊరేగింపుగా వచ్చి పవిత్ర స్నానాలు ఆచరించి పుష్కరాలు పూర్తికాగానే తిరిగి వారి ఆవాసాలకు వెళ్లిపోతారు.**

**విభూతి అంటే ఐశ్వర్యం. నాగా సాధువులకు ఈ విభూతే ఐశ్వర్యం.. సర్వ సంపదలూ ఈ విభూతే. పరమేశ్వరుడే స్వయంగా ధరించిన విభూతే వారికి సర్వాలంకారం. చూసే మనబోటి వాళ్లకు విచిత్రంగా అనిపించవచ్చు. కానీ, వారికి అది అవసరం లేదు. అత్యంత కఠినమైన యోగసాధన చేసి అన్నింటికీ అతీతమైన దశకు చేరుకున్న శివసైనికులు వీరు.**

కొనసాగిస్తారు. వారికి ఎండ లేదు.. వాన లేదు.. చలి లేదు.. విభూతే వారి శరీరాన్ని అన్నింటి నుంచీ కాపాడుతుంది. చిలుమ్, హుక్కా వంటివి శరీరంలో వేడిని కలిగిస్తాయి.. మనసుకు ఏకాగ్రతను కలిగిస్తాయి.. వారు శివుడిని, అగ్నిని ఆరాధిస్తారు.. మిగతా దేవుళ్లందరినీ పూజిస్తే వాళ్లు స్పందించే సరికి చాలా సమయం పడుతుందిట.. అగ్నిని ఆరాధిస్తే.. ఆయనకు ఆహుతులను అర్పిస్తే వెంటనే విభూతి రూపంలో ఫలితాన్ని అందిస్తాడట.. ఆ విభూతే నాగా సాధువులకు సర్వస్వం అవుతోంది.. విభూతి అంటే ఐశ్వర్యం. నాగా సాధువులకు ఈ విభూతే ఐశ్వర్యం.. సర్వ సంపదలూ ఈ విభూతే. పరమేశ్వరుడే స్వయంగా ధరించిన విభూతే వారికి సర్వాలంకారం. చూసే మనబోటి వాళ్లకు విచిత్రంగా అనిపించవచ్చు. కానీ, వారికి అది అవసరం లేదు. అత్యంత కఠినమైన యోగసాధన చేసి అన్నింటికీ అతీతమైన దశకు చేరుకున్న శివసైనికులు వీరు.

ఉజ్జయిని.. మహా కాళేశ్వరుడిగా శివుడు పూజలందుకునే పవిత్ర పుణ్యక్షేత్రం. జ్యోతిర్లింగ క్షేత్రాల్లో ఉజ్జయిని కూడ ఒకటి. దేశంలోని మిగతా శైవ క్షేత్రాల కంటే ఉజ్జయినిలో ఒక విశిష్టమైన ఆచారం ఉంది. ప్రతి రోజూ రాత్రి పూట ఉజ్జయిని స్మశాన వాటికలో అప్పటికప్పుడు తాజాగా మండిన చితిలో నుంచి భస్మరాశిని తీసుకువచ్చి మహాకాళేశ్వరుడికి అభిషేకం చేస్తారు.. భస్మరాశి విభూతిగా మారిపోతుంది... మన శరీరమే విభూతి అని చెప్పటానికి ప్రతీక ఈ అభిషేకం..

నాగా సాధువులు తమ శరీరానికి రాసుకునే విభూతి కూడా ఇదే. శరీరం ఎప్పటికైనా భస్మరాశిగానే మారాల్సి ఉంటుందనటాన్ని ఎక్స్‌ప్రెస్ చేయటమే దీని ఉద్దేశం. సాధువుల్లో నాగాలను సృష్టించింది దత్తాత్రేయుడని చెప్తారు. ఎప్పుడు, ఎలా సృష్టించిందీ ఎవరికీ తెలియదు.. సనాతన ఆధ్యాత్మిక ధర్మాన్ని రక్షించేందుకు ఆదిశంకరాచార్య నాగా సాధువులందరినీ ఒకటి చేశారని అంటారు.

మనం ఉంటున్న ఈ మెటీరియలిస్టిక్ వరల్డ్‌ను వీరు కేర్ చేయరు. ఆర్మీలో ఓ రెజిమెంట్‌లాగా నాగా సాధువులు ఉంటారు. వీళ్లు శివుడికి సైనికుల్లా వ్యవహరిస్తారు.. ఎవరినీ దగ్గరకు రానివ్వరు.. అఘోరాల్లా అతి తీవ్రంగా లేకపోయినా, వీరి దారి వేరు.. చాలా ఆవేశపరులు.. వారి ఆగ్రహం ప్రదర్శించటానికి బెస్ట్ ఆప్షన్‌గా పరిగెడ్తారు..

ఇంకొందరు హింసాత్మకంగా కూడా మారతారు. వారి ఆశ్రమాల్లోకి కూడా ఎవరినీ రానివ్వరు.. సామాన్యులకు అసాధారాణమైన యోగాసనాల్లో నాగా సాధువులు కనిపిస్తారు. సామాన్యంగా కనిపించే సన్యాసులకు, వీరికి అదే తేడా... అందుకే వీరిని నాగాలన్నారు.

సాధువులుగా మారటం తేలికే.. సన్యాసం తీసుకోవటమే కష్టం. అన్ని సుఖాలను వదిలేసి ఆశ్రమ జీవితం గడపటం ఇంకా కష్టం. కానీ ఈ ఆశ్రమ జీవితాన్నీ వదిలేసి, శరీరాన్ని గాలికి వదిలేసి, నిద్ర, ఆహారాలను నిర్లక్ష్యానికి అప్పజెప్పేసి పూర్తిగా నాగాలుగా మారటం  ఊహించినంత తేలిక కాదు. చాలా, చాలా కష్టపడ్డ తరువాత కానీ, నాగాలుగా మారటం కుదరనే కుదరదు. నాగా సాధువులు అంటే  ప్రధానంగా దిగంబరులు.. ఇదెలా సాధ్యం? జీవితాంతం ఇలా ఉండటం ఎలా వీలవుతుంది? అదీ మంచు కొండల్లో.. గడ్డకట్టే చలిలో నూలుపోగైనా లేని ఒంటిని కేవలం విభూతి ఎలా రక్షిస్తుంది.. కాస్త మోతాదులో తీసుకునే మత్తు పదార్థాలు ఏమూలకు పనికి వస్తాయి? మరి వీళ్లెలా వుండగలుగుతున్నారు?

నిజం.. ఇలా ఉండటం సామాన్యుడికైతే క్షణమైనా సాధ్యం కాదు.. నాగాలుగా మారేందుకు ఈ సాధువులు చాలా హార్డ్‌వర్క్ చేయాల్సి ఉంటుంది. సర్వస్వం త్యాగం చేసి నాగాలుగా మారాలని అనుకున్న వారు ముందుగా ఇల్లూ వాకిలీ వదిలేసి సాధారణ సన్యాసం స్వీకరించాలి. ఆరు సంవత్సరాల పాటు కఠినమైన బ్రహ్మచర్యాన్ని అవలంబించాలి. అన్ని రుచులను వదిలేయాలి. అన్ని వాసనలకూ దూరంగా ఉండాలి. అన్ని సుఖాలను త్యాగం చేయాలి. అన్ని మోహాలను వదిలిపెట్టాలి. చివరకు వస్త్రాల్నీ వదిలేయాలి. ఇవన్నీ అనుకున్నంత ఈజీ ఏమీ కాదు.. ప్రతి విషయంపైనా ఏకాగ్రత సాధించటానికి చాలానే కష్టపడతారు. ఆ తరువాత అయిదుగురు గురువుల దగ్గర తమను తాము అన్నింటికీ అతీతంగా ఉండగలుగుతున్నట్లు నిరూపించుకోవలసి ఉంటుంది.

ఆరు సంవత్సరాల బ్రహ్మచర్యంలో సాధువులు కౌపీనం అంటే లంగోటీ ధరించి వుంటారు.. ఒక్కో దానిపై మోహం తీరిపోయాక చివరగా ఆ కౌపీనాన్ని సైతం విడిచిపెడతారు. అంటే ఈ మెటీరియలిస్టిక్ వరల్డ్‌లోని సంసారం నుంచి తనను తాను నాగా సాధువు వేరు చేసుకున్నట్లని అర్థం. నేను అనే అహాన్ని విడిచేయడమే నాగా సాధువుల్లోని ప్రత్యేకత. బయటి శరీరం కంటే, లోపల ఆత్మ అన్నది ఒకటుందని వీరు గాఢంగా నమ్ముతారు.. ఆ ఆత్మే ప్రధానంగా జీవిస్తారు.. మిగతా శరీరంతో వారికి పని లేదు. కాబట్టి దాని గురించి పట్టించుకోరు. నాగా సాధువులు ఎక్కువగా ప్రయాణాలు చేయరు.. ఎక్కడికీ వెళ్లరు.. కేవలం కుంభమేళాలు జరిగినప్పుడే బయటకొస్తారు. ఈ లోకంలో ఈశ్వరుడికి అచ్చమైన ప్రతీకలు నాగాలు..

# భూతలిపి

ఒక విచిత్రమైన భాష .. బుర్రలు బద్దలు కొట్టుకున్నా అర్థం కాని భాష. విచిత్రమైన బొమ్మల మధ్య, చిత్రమైన అక్షరాలు.. విద్దూరమైన ఆకారాలు.. దేంతో రాశారో తెలియదు.. ఎవరు రాశారో తెలియదు.. కానీ వాటిని చూస్తేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది.. దాని వెనుక ఏదో తెలియని గుబులు పుడుతుంది.. ఏమిటిదన్న ఆందోళన నెమ్మదిగా మొదలవుతుంది. మిగతా ప్రపంచానికి ఇదేమిటన్నది తెలియదు.. స్థానిక ప్రజలు మాత్రం దీన్ని భూతాల భాష అంటారు.. అవును.. ఇది భూతాలు రాసుకున్న భాష.. భూతాలు ఏర్పరుచుకున్న లిపి.. భూత లిపి.. ఇవి నరమానవులకు అర్థం కాని భూతాక్షరాలు.. మరణాన్ని శాసించే రక్తాక్షరాలు.. అవును ఇది దెయ్యాల భాష..ఘోష. వాటి మధ్య కమ్యునికేషన్ కోసం ఏర్పాటు చేసుకున్న పర్‌ఫెక్ట్ ఒకాబ్యులరీ. ఇవి.. భూతాలు రాసుకున్న పురాణాలు.. అవి తీర్చిదిద్దుకున్న మంత్ర తంత్రాలు.. అవి పలికితే.. అంతే సంగతులు.. అవి చదివితే.. అంతులేని రక్తచరిత్ర.. మానవుడు శ్వాస కూడా తీసుకోలేడు!

ఈ లిపిని చూస్తే.. అనేక అనుమానాలు కలుగుతాయి.. అంతకు మించిన ఆందోళన రేగుతుంది. ఏమిటో అర్థం కాదు.. భూతాలకు, జీవకోటికి మధ్య యుద్ధం జరుగుతోందా? ఎందుకోసం ఈ పోరాటం? ఎవరు రగిల్చారు ఈ చిచ్చు? ఈ అక్షరాలు చెప్తున్నదేమిటి? వీటిలోని రహస్య సంకేతాలేమిటి? మన డెత్‌డేట్‌ను భూతాలు డిసైడ్ చేస్తున్నాయా? కాలజ్ఞానాన్ని భూతజ్ఞానం శాసిస్తున్నదా?హఠయోగానికి తప్ప అంతుపట్టని రహస్యం ఇది.

ఇది భూతాలకు సంబంధించిన భాష.. పిశాచాలకు మాత్రమే అర్థమయ్యే భాషగా హఠయోగులు చెప్పుకుంటారు. కిరాటులు.. కిన్నెరులకు మాత్రమే తెలిసిన భాష అని అంటారు. నిజంగా ఇది ప్రపంచంలో ఎవరూ చదవలేని రహస్యమయ భాష.. దీనిపై వున్న బొమ్మలు భయం కొల్పేలా ఉంటాయి. వీటిని ఎవరు రాశారో తెలియదు. రాసిన దానికి అర్థం ఏమిటి? ఇది నిజంగా భూతాల భాషేనా? చూస్తేనే వెన్నులో వణుకు పుట్టిస్తున్న ఈ లిపి వెనుక ఉన్న రహస్యం ఏమిటి? అంటే అంత తేలిగ్గా వంటబట్టే అంశం కాదు. హిమాలయాల్లో అనేక రహస్యాలు దాగి ఉన్న పంజయ్ గ్రామ శివారుల్లోని పర్వత ప్రాంతంలో ఈ లిపి కనిపిస్తోంది. శవాలను పీక్కుతినే రాబందులకు ఇది డైనింగ్ స్పాట్ అన్నంత భయంకరంగా ఉండే చోటు అది. భూతాలు, ప్రేతాలు, పిశాచాలు, జీవాత్మలు తిరిగే చోటుగా ప్రజలు భయపడుతుంటారు. కొండకు అటు పక్కనున్న భూతానికి ఇటు పక్కనున్న భూతం ఉత్తరాలు రాస్తుందని.. అది రాతిపై లిపిలా ఉంటుందని అమాయకులు నమ్ముతుంటారు... దెయ్యాల మధ్య మంచి చెడులు చర్చ జరుగుతుందన్నంత నమ్మకాలూ షికార్లు చేస్తుంటాయి.  వాటికీ ఓ లాంగ్వేజి ఉందంటారు.. వర్ణమాల కూడా ఉందంటారు.



**కొండకు అటు పక్కనున్న భూతానికి ఇటు పక్కనున్న భూతం ఉత్తరాలు రాస్తుందని.. అది రాతిపై లిపిలా ఉంటుందని నమ్ముతుంటారు... దెయ్యాల మధ్య మంచి చెడుల చర్చ జరుగుతుందన్నంత నమ్మకాలూ షికార్లు చేస్తుంటాయి. వాటికీ ఓ లాంగ్వేజి ఉందంటారు. వర్ణమాల కూడా ఉందంటారు. చైనీయులకు మాదిరిగా చిత్రలిపి ఉందంటారు. వీళ్ల మాటల్లో సంకేతాక్షరాలు కూడా ఉన్నాయి. ఈ లిపిని ఎవరు సృష్టించారు?**

చైనీయులకు మాదిరిగా చిత్రలిపి ఉందంటారు. వీళ్ల మాటల్లో సంకేతాక్షరాలు కూడా వున్నాయి. తెలుగు వారికి తమిళం అర్థం కానట్టే.. తమిళం వారికి బెంగాలీ అర్థం కానట్టే.. భూతాల భాష మనుషులకూ అర్థం కాదు. కొందరికి మాత్రం అర్థమవుతాయి. ఈ లిపిని ఎవరు సృష్టించారు? అంటే భూతగణాధిపతి త్రినేత్రం నుంచి పుట్టిన భాష ఇదని చెప్తారు. ఈ ధ్వనులన్నీ.. శివుడి రుద్రతాండవం నుంచి ఉద్భవించిన ధ్వనులు.. భూతలిపిలో రాసిన మంత్రాలను పైన పొందుపరచిన చిత్రంలో చూడవచ్చు. జాగ్రత్తగా గమనించండి. ఈ భూత్‌లిపి కొద్ది కొద్దిగా దేవనాగరి లిపికి దగ్గరగా ఉంది. సంస్కృత భాష మాదిరిగా కనిపిస్తుంది. కానీ, ఇది దేవనాగరి లిపి కానీ, సంస్కృత భాష కానీ కానే కాదు. ఇది అన్నింటికీ భిన్నమైన భాష.. దీన్ని అర్థం చేసుకునే కొందరి అభిప్రాయం ప్రకారం ఇది సంస్కృతం కంటే చాలా పురాతనమైన భాష. సంస్కృతం పరిశుద్ధమైన భాష.. ఈ భూతలిపికి ఎలాంటి వ్యాకరణం ఉన్నట్లు కనిపించదు. కొన్ని శబ్దాలకు అర్థాలే కనపడవు. మరి ఇది ఎలాంటి భాష.. ఎప్పటి భాష? నిజంగా భూతాలు, ప్రేతాల భాషేనా? లేక ఏదైనా కిరాట జాతికి సంబంధించిన భాషనా? అంటే జవాబులు దొరకవు.

మామూలుగా అయితే మనం భూత వైద్యుల గురించి విన్నాం.. వారిని కన్నాం..

**కులు నుంచి పంజయ్ వరకు రకరకాల గ్రామాల్లో భూతలిపి ఉన్న శిలాశాసనాలు మనకు కనిపిస్తాయి. ఇవి మామూలు మనుషులకు అర్థం కావు.. భూతవిద్య తెలిసిన వాళ్లు మాత్రం ఈ మంత్రాలను చదవటం ద్వారా వాటిని ఎప్పుడు కావాలంటే అప్పుడు తమ దగ్గరకు రప్పించుకుంటారంటారు. ఈ అక్షరాలను అర్థం చేసుకోవటం సంగతి దేవుడెరుగు.. కనీసం వీటి ధ్వనులను విని కూడా అవగాహన చేసుకోవటం సాధ్యం కాదు**

వీళ్లందరూ గ్రామాల్లో అమాయకులను మోసం చేసి సొమ్ములు చేసుకునే వారు. అలాగే భూత విద్య, భూతలిపి అభూత కల్పనలనీ, మూఢ నమ్మకాలనీ మనం ఇంతకాలంగా విశ్వసిస్తూ వస్తున్నాం. కానీ, భూత విద్య అన్నది నిజంగానే ఉన్నదని, దానికి ఓ లాంగ్వేజీ కూడా ఉన్నదని అది నేర్చుకోవటానికి, అర్థం చేసుకోవటానికి చాలా తంతే ఉంటుందని తాంత్రికులమని చెప్పుకునే వాళ్లు వాదిస్తున్నారు. భూత ప్రేతాలను నమ్మటమే లేనప్పుడు, వాటికో లిపి ఉన్నదంటే మాత్రం ఎలా నమ్మేది అంటే.. దేవుణ్ణి నమ్మినప్పుడు భూత, ప్రేతాలను కూడా నమ్మాలి మరి.

హిమాచల్ ప్రదేశ్‌లోని పంజయ్ గ్రామ పరిసరాల్లో హిమాలయ పర్వత శ్రేణుల్లో కొన్ని బండరాళ్లపై చిత్రవిచిత్రమైన అక్షరాలు, బొమ్మల రూపంలో వున్న సంకేతాలను భూతలిపి అంటున్నారు. ఇక్కడ వామాచార పద్ధతుల్లో తాంత్రికోపాసన చేస్తున్న కొందరు యోగులకు ఈ లిపి లభించింది. దీనిపై వాళ్లు పరిశోధనలు ప్రారంభించారు. వీళ్ల కథనం ప్రకారం పరమేశ్వరుడు హిమాలయాలను సృష్టించి తాను అక్కడ ఆవాసం ఏర్పాటు చేసుకున్నప్పుడు.. తనతో పాటుగా యక్ష, రాక్షస, గంధర్వ, కిన్నెర, కిరాట, కింపురుషులకు రకరకాల ప్రదేశాల్లో చోటు కల్పించాడట.. వాళ్ల కోసం ప్రత్యేక భాషను సృష్టించి రాక్షస గురువు శుక్రాచార్యుడికి ఇచ్చాడట భూతనాథుడు. అప్పటి నుంచి భూత, పిశాచ గణాల మధ్య కమ్యునికేషన్ భూతభాషలో మొదలైందని ప్రచారంలో ఉన్న కథనం. కులు నుంచి పంజయ్ వరకు రకరకాల గ్రామాల్లో భూతలిపి ఉన్న శిలాశాసనాలు మనకు కనిపిస్తాయి. ఇవి మామూలు మనుషులకు అర్థం కావు.. భూతవిద్య తెలిసిన వాళ్లు మాత్రం ఈ మంత్రాలను చదవటం ద్వారా వాటిని ఎప్పుడు కావాలంటే అప్పుడు తమ దగ్గరకు రప్పించుకుంటారంటారు. ఈ అక్షరాలను అర్థం చేసుకోవటం సంగతి దేవుడెరుగు.. కనీసం వీటి ధ్వనులను విని కూడా అవగాహన చేసుకోవటం సాధ్యం కాదు.. భూత విద్య తెలిసిన వాళ్లు ఈ లిపిని డీకోడ్ చేశామని చెప్తున్నారు. వాళ్ల కథనం ప్రకారం, దేవనాగరిలో ఉన్నట్లే, భూతలిపిలో మొత్తం 54 అక్షరాలు ఉన్నాయిట.

వీటిని బీజాక్షరాలని వాళ్లు పిలుస్తారు.. వీటి ఉచ్చారణ మామూలు మనుషులు మాట్లాడే

రీతికి పూర్తి భిన్నంగా ఉంటుంది. వీటికి ఓ సౌండ్ ఉంటుంది. రిథమ్ ఉంటుంది. ఆ టోన్‌లో.. ఆ రిథమ్‌లో.. ఆ ట్యూన్‌లో పలికితేనే ఆ భాష అర్థమవుతుందన్నది ఈ యోగుల బలమైన భావన. ఈ యోగుల అభిప్రాయం ప్రకారం భూతలిపిని తెలుసుకోవటం వల్ల తంత్రం అంటే ఏమిటో తెలుస్తుంది. తంత్ర విద్యను తెలుసుకోవచ్చు. తంత్ర యోగాన్ని సాధించవచ్చు. దీనికోసం ప్రత్యేక గ్రంథం అంటూ ఏదీ లేదు. గురుశిష్యపరంపర ద్వారా తెలుసుకున్నది, అధ్యయనం చేసింది మాత్రమే బతికి ఉన్నది. నిజానికి ఇది భూతాలు, ప్రేతాలు రాసుకునే లిపి కాదు.. ఇది ఒక రకమైన తంత్ర సాధనకు సంబంధించిన లిపి.. వామాచార పద్ధతిలో ఉపాసకులు కఠినంగా హఠయోగం చేసేందుకు ఉపయోగించే మంత్రాలు. దీని ఉపాసన చాలా తీవ్రంగా ఉంటుంది. మామూలు పరిస్థితిలో చదవగలిగే మంత్రాలు కావివి. అంత తేలిగ్గా పట్టుబడేవి కావు కూడా.. వీటిని తప్పుగా ఉచ్చరించినా.. దాని నెగెటివ్ వైబ్రేషన్స్ తీవ్రంగానే ప్రభావం చూపుతాయి. ఒక పద్ధతిలో, నిష్ఠతో ముందుకు సాధన చేస్తే తప్ప లొంగని మంత్రాలివి.

రుద్రుడు.. అంటే శివుడి మరో రూపం.. ఈ రుద్రుడి ఉపాసనతో పాటు భైరవి ఉపాసన కూడా ఉంటుంది. కాళి, తార, ఛిన్నమస్త, ధూమవతి, భగళముఖి ఉపాసనలు వామాచార పద్ధతిలో ప్రత్యేకంగా ఉంటాయి. ఈ పద్ధతుల్లో తంత్ర సాధన, యోగ సాధన విపరీతంగా ఉంటాయి. వాటిలో మంత్రాలు, దానికి సంబంధించిన లిపి, చిత్రాలు కూడా అంతే విపరీతంగా కనిపిస్తాయి. యోగ, తంత్ర సిద్ధి కోసం ఈ రహస్యమయ మంత్రాలను తీవ్రంగా ఉపాసన చేస్తుంటారు. కులు నుంచి మానస సరోవరం దాకా వేలాది సిద్ధులు, నాగాలు, అఘోరాలు ఈ మంత్రాలను ఉపాసిస్తుంటారు.

విచిత్రమేమంటే, ఈ మంత్రాలన్నీ కూడా దేవతలకు వ్యతిరేకంగా, వారిని నిందిస్తూ నిందాస్తుతిలో ఉంటాయి. మనం సాధారణంగా వినే క్షుద్ర మంత్రాలంటే ఇవే. వీటిని ఉపాసించిన వారికి కొన్ని సిద్ధులు లభిస్తాయని, భూతాలను వశం చేసుకుని వాటిచేత కావలసిన పనులు కూడా చేయించుకోవచ్చని స్థానికులు నమ్ముతారు. దీన్ని పాందు లిపి అని కూడా అంటారు. దేవీదేవతలను నిందించే విధంగా ఉన్న మంత్రాలు కాబట్టే వీటిని చూస్తే అపశకునంగా కూడా స్థానికులు బలంగా విశ్వసిస్తారు. ఇంకో విచిత్రం ఏమంటే ఈ మంత్రాలను రాసేందుకు మనిషి రక్తాన్ని, జంతు రక్తాన్ని ఇంక్‌గా వాడతారని కూడా చెప్తారు. అందుకే ఈ లిపిని చూసినా, చదువుతుంటే విన్నా అశుభమేనని విశ్వసిస్తారు. ఈ భూతలిపికి ఓ శాస్త్రం లేదు.. వ్యాకరణం లేదు.. కేవలం గురుశిష్య పరంపర ద్వారా ఇది వ్యాపిస్తూ వస్తున్నదే తప్ప.. దీనికి ఓ అస్తిత్వం అంటూ లేదు.

కొందరికి మాత్రమే.. ఉపాసన చేస్తున్న వారికి మాత్రమే వీటి పరిభాష అర్థమవుతుంది. ఇవి నిజంగా ఎంతవరకు సిద్ధిస్తాయి.. ఎంతవరకు డీకోడ్ అవుతాయనేది వారికి మాత్రమే తెలుసు. మనం వాటి వింతలను వినటమే తప్ప.. హేతుబద్ధతను ఖచ్చితంగా నిర్ధారించలేం.

# బుద్ధుడు విష్ణువు అవతారమా?



విష్ణుమూర్తి దశావతారాలు.. మత్స్యకూర్మ వరాహ నారసింహ.. ఇలా చెప్పేసుకుంటూ వెళ్తాం.. ఈ వరుసలోనే విష్ణుమూర్తి తొమ్మిదవ అవతారంగా విష్ణుమూర్తి బుద్ధుడిగా ఆవిర్భవించాడని హిందువులు విశ్వసిస్తారు.. కానీ, నిజంగా విష్ణువే బుద్ధుడిగా అవతరించాడా? బుద్ధుడు విష్ణువేనా? అసలు ఈ బుద్ధుడు ఎవరు? ప్రపంచ వ్యాప్తంగా ప్రచారంలో ఉన్న బౌద్ధమతానికి ఆది గురువైన గౌతమబుద్ధుడేనా? ఈయనేనా ఆ విష్ణువు.. లేక దశావతారాల్లోని బుద్ధుడు మరెవరైనా ఉన్నారా? అసలు బుద్ధుడి రహస్యం ఏమిటి?

అప్పటిదాకా ప్రపంచం ఒక మార్గంలో నడుస్తోంది.. ఒక ధర్మాన్ని అనుసరిస్తూ వెళ్లింది.. ఆ మార్గంలో ఉన్న ముళ్లను తొలగించి.. ఆ ధర్మంలో ఉన్న లోపాలను ఎత్తి చూపి సరికొత్త మార్గాన్ని చూపించిన ఆధ్యాత్మిక గురువు గౌతమబుద్ధుడు. దాదాపు పదిహేను వందల సంవత్సరాల క్రితం మనకు తెలిసిన కాలంలో.. మనకు తెలిసిన చరిత్రలో ఈ భూమిపై నడచిన మూర్తి.. హిందు జాతిలో ఉన్న విశ్వాసాలతో విభేదిస్తూ ఒక విధమైన విప్లవాత్మకమైన ధోరణితో దూసుకువచ్చిన వాడు బుద్ధుడు.

ఇప్పుడున్న నేపాల్‌లోని కపిలవస్తునగరాన్ని ఏలుతున్న మహారాజు కడుపున పుట్టి శక్తిమంతుడైన మతాచార్యుడిగా అవతరించిన పుణ్యమూర్తి. జీవితం–చావు.. ఈ రెండింటి గురించి సిద్ధార్థుడనే రాజకుమారుడికి తీవ్రంగా వచ్చిన సందేహాలు అతణ్ణి బుద్ధుడిగా మార్చేశాయి. ఊరూరా తిరిగి తిరిగి అలసిపోయిన యువరాజుకు గయలో ఓ బోధి వృక్షం ఆశ్రయమిచ్చింది.. జ్ఞానాన్ని ప్రసాదించింది... సందేహాలన్నింటినీ పటాపంచలు చేసింది. 375 జన్మలు ఎత్తిన వాడు.. ఆ తరువాత కూడా ఆచార్యుడిగా అవతరిస్తున్న వాడు.. అన్ని కాలాల్లో ఉన్నవాడు.. అన్ని ధర్మాలకు అతీతమైన ధర్మాన్ని లోకానికి అందించిన వాడు.. ఈయనకు విష్ణుమూర్తికి సంబంధం ఏమిటి? విష్ణువు దశావతారాలతో ఉన్న అనుబంధం ఏమిటి? నారాయణుడే తన తొమ్మిదవ అవతారంలో గౌతమబుద్ధుడిగా అవతరించాడా? ఇది నిజమేనా? దశావతారాల్లో ఉన్న బుద్ధుడికి, గౌతమబుద్ధుడికి సంబంధమే లేదా? అలాంటప్పుడు ఆ అవతారంలో ఉన్న బుద్ధుడు ఎవరు? విష్ణువు

దశావతారాలు ఒట్టి కథలు కావు.. పుక్కిటి పురాణాలుగా వీటిని కొట్టిపారేయలేం.. వీటి వెనుక పౌరాణిక వాస్తవాల సంగతి ఎలా ఉన్నా.. వీటి వెనుక సైంటిఫిక్ లాజిక్ మాత్రం అత్యద్భుతంగా ఉంటుంది. భూమ్మీద జీవరాశి పుట్టినప్పటి నుంచి దాని పరిణామ క్రమాన్ని వ్యక్తం చేసేంది దశావతారం కాన్సెప్ట్. అందులో తొమ్మిదో అవతారం బుద్ధుడని హిందువులు విశ్వసిస్తారు.. అయితే ఆ బుద్ధుడు.. గౌతమబుద్ధుడేనా అన్నదాంట్లో క్లారిటీ ఉందా?

పురాణాల ప్రకారం విష్ణువు వందల అవతారాలు ధరించాడట.. కానీ మనకు తెలిసినవి పదే.. అందులో తొమ్మిది ఇప్పటికే అవతరించేశాడు.. పదో అవతారం కోసం ఇప్పుడున్న ప్రజానీకం చాలా ఆసక్తిగా ఎదురుచూస్తున్నారు. ఇప్పుడు అందరి విశ్వాసమూ ఈ గౌతమ బుద్ధుడే విష్ణుమూర్తి తొమ్మిదో అవతారమని. అద్వైత, విశిష్టాద్వైత మతాల మధ్య హిందువుల్లో సంక్లిష్టంగా మారిన విశ్వాసాలు పెడదారిన పడినప్పుడు అవతరించిన వాడు బుద్ధుడనేది అందరి నమ్మకం.. కానీ, మనకు తెలిసిన బుద్ధుడు విష్ణువు కాదనేది మరో వాదన. ఎందుకంటే, దశావతారాల్లో ఉన్న బుద్ధుడు వేరే ఉన్నాడు. దుష్టశిక్షణ సక్రమంగా జరిగేందుకు విష్ణువు రామకృష్ణుల అవతారాల మధ్యలో బుద్ధుడిగా ఆవిర్భవించాడు.

మనకు తెలిసిన గౌతమబుద్ధుడు మరో అవతార పురుషుడే కానీ, దశావతారాల్లో ఒకరు కాకపోవచ్చు. క్రీస్తు పూర్వం 563వ సంవత్సరంలో భారతదేశంలో శైవ, వైష్ణవ, శాక్తేయ మతాలను ధిక్కరిస్తూ.. అందులోని లోపాలను తిప్పికొడుతూ గౌతమబుద్ధుడు సమాజానికి కొత్త దిక్సూచి అయి నిలిచాడు. ఇప్పుడు నేపాల్‌లో ఉన్న కపిలవస్తు నగరాన్ని ఏలుతున్న శుద్ధోధనుడనే రాజుకు జన్మించిన సిద్ధార్థుడు.. అందరిలాగే రాజభోగాలను అనుభవించిన వాడే. దాదాపు 29 సంవత్సరాలు అన్ని సుఖాలనూ అనుభవించాడు. వైవాహిక జీవితాన్నీ అనుభవించాడు. ఓ కుమారుడికి తండ్రి అయ్యాడు. కానీ ఆ తరువాతే ఆయన జీవితం మారిపోయింది. సందేహాల పుట్టగా మారి, చివరకు జీవించటమే నరకంగా భావించే పరిస్థితి నెలకొంది. ఇల్లు, సంసారం వదిలి బయటకు వెళ్లిన సిద్ధార్థుడు, కౌండిన్యుడనే యోగి దగ్గర కొంతకాలం శిష్యరికం కూడా చేశాడు. కానీ, ఆ శిష్యరికం సంతృప్తినివ్వలేదు, సందేహాలు తీరలేదు. గురువునూ వదిలి తిరిగి తిరిగి చివరకు గయకు చేరుకున్నాడు. అక్కడ ఓ రావిచెట్టు సిద్ధార్థుడికి ఆశ్రయాన్నిచ్చింది.. ఆ చెట్టే ఆయనకు నివాసమైంది. ఆ చెట్టు కిందే జ్ఞానోదయమైంది. ఈ జ్ఞానంతో సిద్ధార్థుడు గౌతముడయ్యాడు.. గౌతముడు బుద్ధుడయ్యాడు.. త్రిపీటికలతో నూతన ఆధ్యాత్మిక ప్రపంచానికి ఆదిగురువై నిలిచాడు. ఆయన బోధనలు ప్రపంచానికి తలమానికమై నిలిచాయి. సత్యాహింసలు మహాస్త్రాలుగా తయారయ్యాయి. అందువల్లే ఆయన విష్ణుమూర్తి అవతారంగా భావిస్తారు. ఆయన బోధనలు.. ధర్మ రక్షణా మార్గం ఆయన్ను అవతారపురుషుడిగా మార్చాయి.

బుద్ధుడిగా మనకు విడిగా కనిపిస్తున్న మరో రూపం పౌరాణిక గాథల్లో ప్రముఖంగా కనిపిస్తుంది. ఇది చాలా మందికి తెలియని విషయం. గౌతమ బుద్ధుడి మాదిరిగానే

పౌరాణిక బుద్ధుడికీ రావిచెట్టుతో అనుబంధం ఉంది. పౌరాణిక బుద్ధుడు విష్ణుమూర్తి అంశతోనే అవతరించాడు. యుగాలకు అందని పౌరాణిక గాథ ఇది. జనాలను నానా అవస్థలు పెడుతున్న త్రిపురాసురుడనే రాక్షసుణ్ణి విష్ణుమూర్తి చంపాల్సి వచ్చింది. కానీ, అతణ్ణి హతమార్చటం ఎవరివల్లా కావటం లేదు. కారణం ఏమిటో తెలియదు.. ఏం చేయాలో దేవతలకు అర్థం కావటం లేదు. చివరకు అతని ప్రాణాలను కాపాడుతున్నది అతని భార్యలేనని విష్ణుమూర్తికి అర్థమైంది. వాళ్ల పాతివ్రత్యం వల్లనే త్రిపురాసురుడు బతకగలుగుతున్నాడని ఫైనల్ కన్‌క్లూషన్‌కు వచ్చేశాడు నారాయణుడు. అప్పుడు ఆ రాక్షసుడి భార్యల పాతివ్రత్యాన్ని భంగం చేసేందుకు విష్ణుమూర్తి వాళ్ల దగ్గరకు బుద్ధుడి వేషంలో వెళ్లి అశ్వత్థ వ్రతాన్ని చేయమని ఉపదేశిస్తాడు. వ్రతం ముగిసిన తరువాత అశ్వత్థ వృక్షాన్ని కౌగిలించుకోవాలని చెప్తాడు. వాళ్లు అలా చేస్తున్న సమయంలో అశ్వత్థవృక్షంగా తానే నిలిచి పాతివ్రత్యభంగం చేస్తాడు. ఆ తరువాత త్రిపురాసుర సంహారం తేలిగ్గా జరిగిపోతుంది. ఇక్కడ అశ్వత్థ వృక్షం అంటే మరేదో కాదు.. రావిచెట్టే... ఇదే బోధి వృక్షం.. ఇక్కడ పతివ్రతలకు వ్రతభంగం చేసిన వాడు మరెవరో కాదు.. విష్ణువే.. ఇతడే దశావతారాల్లో మనకు కనిపించే బుద్ధుడు.. కాకపోతే ఈ కథనానికి విష్ణుకథల్లో పెద్దగా ప్రాధాన్యం కనిపించదు.. అశ్వత్థ వృక్షాన్ని పూజించటం.. పతివ్రతల గొప్పతనాన్ని వివరించటం కోసమే ఈ కథనం చెప్పుకొచ్చారు.

నిజానికి దశావతారాలను ఒక క్రమ పరిణామం ప్రకారం కనుక స్వీకరించినట్లయితే, గౌతమ బుద్ధుడిని తొమ్మిదో అవతారంగా గుర్తించాల్సి ఉంటుంది. ఎందుకంటే, విష్ణువు అవతారాల్లో మొదటి అయిదు.... అంటే మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన– అన్నీ కృతయుగంలో జరిగాయి. ఆ తరువాత త్రేతాయుగానికి వచ్చేసరికి పరశురామ, రామావతారాలు వచ్చాయి. ద్వాపరంలో కృష్ణావతారం సంభవించింది. కృష్ణ నిర్యాణంతోనే ద్వాపరం ముగిసిపోయి కలియుగం మొదలైంది. కలియుగంలో హిందూ సమాజానికి సంబంధించినంత వరకు అవతరించిన మహాపురుషుడు గౌతమ బుద్ధుడే. అందుకే దశావతారాల బుద్ధుడు పౌరాణిక బుద్ధుడు కాదు.. కపిల వస్తుపురంలో జన్మించిన సిద్ధార్థుడే ఈయన. ద్వాపరాంతంలో కృష్ణ నిర్యాణానికీ, క్రీస్తుపూర్వం 563లో గౌతమబుద్ధుడు అవతరించటానికి మధ్యలో సాగిపోయిన 2500 సంవత్సరాల కాలం ప్రపంచ సమాజాన్ని అస్తవ్యస్తం చేసిన కాలం. అన్ని మతాల మధ్యన సామరస్యం లోపించిన సమయంలో గౌతమ బుద్ధుడు అత్యున్నతమైన అహింస, ధర్మ పరిరక్షణ మార్గాలుగా మతాన్ని నిర్మించిన మహాపురుషుడాయన. ఆయన విష్ణువా, కాదా అన్నది ప్రశ్న కానే కాదు.. ఆయన విశ్వానికి మార్గదర్శి.. ఇది మాత్రమే సత్యం.. ఇదే నిజం. గౌతమబుద్ధుడు జీవితం ఎలా గడపాలో చెప్పిన వాడు.. మానవత ఆయన మతం.. ధర్మం ఆయన మార్గం... అహింస ఆయన వ్యక్తిత్వం. అందుకే అందరికీ ఆయన శరణయ్యాడు.. బుద్ధం శరణం గచ్ఛామి.

# ప్రవాహ సరస్వతి

గంగ-యమున-సరస్వతి మన భారత జాతికి జీవధారలు. మన నాగరికత, జీవన వికాసం, అభివృద్ధి అంతా.. ఈ త్రివేణిలతోనే సంగమించాయి. గంగ మనకు తెలుసు.. యమునను చూశాం.. పవిత్ర స్నానాలు చేశాం.. మరి సరస్వతి.. త్రివేణి సంగమమని అంటారు కానీ, ఎక్కడుంది? సరస్వతీ నదిని కళ్లారా చూసిన వాళ్లు ఎవరైనా ఉన్నారా? పురాణాలు బోలెడు చెప్తాయి. కానీ, కళ్ల ముందు కనిపించని దాన్ని ఉన్నదని ఎలా నమ్మేది? కానీ.. మహా సరస్వతి మళ్లీ దర్శనమిస్తోంది. ఇంతకాలం మిథ్యగా భావిస్తూ వచ్చిన సరస్వతీ నది.. వేల సంవత్సరాల తరువాత ఉబికుబికి పైకి వస్తోంది. మహానది సాకారంగా కనిపిస్తున్నది. ఆమె అస్తిత్వం రుజువైంది.

1986లో మొదలైన సరస్వతి నది అన్వేషణ మొత్తం మీద ఫలితాలను ఇచ్చింది. మొదట్లో కొన్ని స్వచ్ఛంద సంస్థలే ఈ పనిని మొదలు పెట్టాయి. హర్యానాలోని సరస్వతీ శోధ్ సంస్థాన్ చేపట్టిన పనికి అక్కడి సర్కారు ఊతమిచ్చింది. 2002లో కేంద్ర ప్రభుత్వం 40 అడుగుల వెడల్పు, 12 అడుగుల లోతు, 50 కిలోమీటర్ల పొడవున రూప్‌నహర్ కాలువను తవ్వించింది. ఇది రుగ్వేదంలో స్పష్టంగా చూపించిన సరస్వతీ నది బెడ్‌లోనే తవ్వించింది. దీంతో కాలచక్రం వెనక్కి తిరిగింది. మహాభారత కాలం కంటే ముందు నాటి వాస్తవం బయటపడింది. వేల సంవత్సరాల క్రితం మాయమైపోయిన సరస్వతీనది ఉరుకురికి.. ఉబికుబికి పైకి వచ్చేసింది. దూర దూరాల వరకూ విస్తరించిన ఎడారి ఇసుక.. మధ్యలో భూమి లోపలి నుంచి జలధార బయటకు వచ్చింది.

ఒక రోజు కాదు.. రెండు రోజులు కాదు.. నెలల తరబడి అప్రతిహతంగా నీళ్లు వస్తూనే ఉన్నాయి. ఈ నీళ్ల కోసం ఎవరూ బోరు వేయించలేదు.. పైపులు వేయలేదు.. కాలువలు తవ్వలేదు. సబ్‌మెర్సిబుల్ పంపులు వేయలేదు. కానీ, భూమి లోపలి నుంచి నీళ్లు ఆగలేదు. అసలే థార్ ఎడారి.. అక్కడ భూమిలోంచి నీళ్లు రావటం అంటే అందరికీ ఆశ్చర్యమే వేసింది. కానీ, ఈ నీటిని కార్బన్ డేటింగ్ చేయటంతో అసలు విషయం తెలిసింది. థార్ ఎడారిలో వేల అడుగుల లోతుల్లో సరస్వతి నది ప్రవహిస్తోందని.. అదే నీరు ఇప్పుడు బయటకు వస్తున్నదని. ఇప్పుడు ఎడారి భూమిని సరస్వతి నది జలధార సస్యశ్యామలం చేస్తోంది. నిజంగా ఇది ఒక అపూర్వమైన విషయం. ఇది సాగుకే కాదు.. తాగటానికీ చక్కగా ఉపయోగపడుతోంది. వేల సంవత్సరాల నాటి మహానది ఆనవాలు ఇది. దీని ఆధారం చేసుకుని జైసల్మేర్ ఎడారి ప్రాంతంలో ఇప్పటికి 13 చోట్ల బోరుబావులు తవ్వితే 35 అడుగుల లోతునే అమృత ధార బయటపడింది.







*థార్ ఎడారిలో భూమినుంచి ఉబికి వచ్చిన సరస్వతి*

---

**హిమాలయాల్లో సరస్వతి పుట్టింది.. అక్కడి నుంచి అనేక ప్రాంతాల నుంచి ప్రవహించి ప్రయాగలో గంగాయమునలతో సంగమిస్తుంది.. ఈ విషయాన్ని చరిత్రకారులు ఇంతకాలంగా కొట్టిపారేస్తూ వచ్చారు. లేనిదాన్ని ఉన్నట్లుగా చూపించి మభ్యపెడుతున్నారని గొడవ చేశారు. కానీ, సరస్వతి నది గురించి ఇంతకాలం ఉన్న నమ్మకం ఇప్పుడు నిజంగా మారింది. ఉత్తరాఖండ్‌లోని హిమాలయ పర్వత శ్రేణుల్లోంచే సరస్వతి నది అనేక పాయలుగా కిందకు ప్రవహిస్తోందని అంతర్జాతీయ అంతరిక్ష ఉపగ్రహాల ఛాయాచిత్రాలు నిరూపిస్తున్నాయి.**

ఇవేవీ ఒట్టి మాటలు కావు. అయిదు వేల సంవత్సరాల మన నాగరికతకు ఆనవాలు. ప్రపంచానికి దిక్సూచిగా నిలిచిన ఒక జాతి అస్తిత్వపు మూలం. భారత దేశ చరిత్రను నిర్మించిన మహానది చరిత్ర. భారత జాతికి జీవధారలను అందించిన జలశారద, సింధు నాగరికత వికసింపచేసిన నది, మహర్షుల తపస్సులకు వరాలిచ్చిన నది, మహాభారతానికి సాక్షీభూతంగా నిలిచిన నది, పాండవులను పునీతులను చేసిన నది, రామాయణాన్ని వినిపించిన నది, నాలుగు వేదాలను మనిషికి అందించిన నది సరస్వతి. అంతర్వాహినిగా ప్రవహిస్తున్న సరస్వతి మహానది భూతలంపైకి రావటం అపురూపం.

హిమాలయాల్లో సరస్వతి పుట్టింది.. అనేక ప్రాంతాల మీదుగా ప్రవహించి ప్రయాగలో గంగాయమునలతో సంగమిస్తుంది. ఈ విషయాన్ని చరిత్రకారులు ఇంతకాలంగా కొట్టిపారేస్తూ వచ్చారు. లేనిదాన్ని ఉన్నట్లుగా చూపించి మభ్యపెడుతున్నారని గొడవ చేశారు. కానీ, సరస్వతి నది గురించి ఇంతకాలం ఉన్న నమ్మకం ఇప్పుడు నిజంగా మారింది. ఉత్తరాఖండ్‌లోని హిమాలయ పర్వత శ్రేణుల్లోంచే సరస్వతి నది అనేక పాయలుగా కిందకు ప్రవహిస్తోందని అంతర్జాతీయ అంతరిక్ష ఉపగ్రహాల ఛాయాచిత్రాలు నిరూపిస్తున్నాయి.

బద్రీనాథ్ సమీపంలోని మానా గ్రామం.. ఇక్కడ పవహిస్తున్నది ఒక నదీపాయ. ఇది సరస్వతీ నది పాయగా చెప్తారు. ఈ నది ఇక్కడి నుంచి కొన్ని మైళ్ల వరకు వెళ్లి అక్కడ అలకనంద నదిలో కలుస్తుంది. అక్కడి నుంచి పాతాళ మార్గంలో దాదాపు పదహారు వందల కిలోమీటర్ల పొడవున ప్రవహించి అలహాబాద్ వద్ద గంగ, యమునలతో సంగమించి మోక్ష సాధకుల పుణ్యలక్ష్యాన్ని నెరవేరుస్తుంది. హర్యానా, హిమాచల్ ప్రదేశ్ ప్రాంతాల్లో సరస్వతీ నదికి సంబంధించిన ఆనవాళ్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అక్కడి స్థానిక పురావస్తు శాఖ విడుదల చేసిన చిత్రాల్లో సరస్వతీ నది ఛాయ ఉత్తరాఖండ్ మీదుగా, హర్యానా, హిమాచల్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, గుజరాత్‌లలో ప్రవహించి ఆ రాష్ట్రంలోని కచ్ సింధుశాఖ వద్ద అరేబియా సముద్రంలో కలుస్తుంది.

ఈ నది ఇప్పుడు ఈ రకంగా ఇన్ని వేల సంవత్సరాల తరువాత ఎలా బయట పడింది? ఇప్పుడు బయటపడిన నీరు సరస్వతీనదికి సంబంధించిందేనని ఎలా నమ్మాలి? మనం ఒత్తిగా నమ్మక్కర్లేదు.. ఇప్పుడు సైన్సే చెప్తోంది.. సరస్వతీ నది ఉనికి గురించి. ఉత్తరాఖండ్‌లోని బద్రీనాథ్ సమీపంలో హర్ కీ ధున్ దగ్గర సరస్వతీ నది పుట్టింది. అక్కడి నుంచి 1600 కిలోమీటర్లు ప్రయాణించి కచ్ వద్ద శ్రీకృష్ణుడి ద్వారకా నగరం ఉన్న చోట అరేబియా సముద్రంలో కలుస్తుంది. ఇస్రో, భాభా అటామిక్ రీసర్చ్ సెంటర్లు విడుదల చేసిన ఛాయా చిత్రాలు ఈ విషయాలను స్పష్టం చేస్తున్నాయి. ఈ నది ప్రవహించిన తీరం వెంట విస్తరించిన సామ్రాజ్యాల ఆనవాళ్లు.. వాటికి సంబంధించిన ఇతిహాసాలు కూడా సరస్వతినది ఉనికిని చాటుతున్నాయి. క్రీస్తుపూర్వం 5000–3000 సంవత్సరాల మధ్య కాలంలో శివాలిక్ హిల్ రేంజ్‌లో అతి పెద్ద టెక్టానిక్ ఈవెంట్ చోటు చేసుకుంది. భూమిలో టెక్టానిక్ పలకలు తీవ్ర స్థాయిలో కదిలిపోయాయి. దీని ప్రభావం ఇవాళ్టి పాకిస్తాన్ లోని పోత్వార్ ప్రాంతం నుంచి, భారత్‌లోని అసోం దాకా కనిపించింది. భూమిలో ఈ ప్రకంపనలు సరస్వతి నదిని ఇంతకాలం కనిపించకుండా చేసేశాయి. హిమాలయ పర్వత శ్రేణుల్లో 0.8 మైళ్ల స్పాన్‌తో 3000 మీటర్ల ఎత్తున టెక్టానిక్ ఆక్టివిటీ వందల సంవత్సరాల పాటు జరుగుతూ వచ్చింది. కొండలకు కొండలే కదిలిపోయే పరిస్థితి.. ప్రళయమంటే ఇదేనేమో, ఈ ప్రళయంలోనే సరస్వతి అంతర్ధానమైపోయింది. అలాంటి చోట.. ఇన్ని వేల సంవత్సరాల తరువాత లున్ కరన్‌సర్, దిద్వానా, సంభార్, జైసల్మేర్, పాచ్‌పాదా లాంటి ప్రాంతాల్లో మళ్లీ సరస్వతి నది పైకి వస్తోంది.

రుగ్వేదంలో సరస్వతి నది ప్రస్తావన ఎన్నిసార్లు ఉందో మీకు తెలుసా? అక్షరాలా అరవైసార్లు. సింధులోయలోని ఏడు పుణ్య నదులలో చివరి నదిగా సరస్వతిని ప్రస్తావించారు. ఇది చాలా పాయలుగా విడిపోయి ప్రవహిస్తుందని కూడా రుగ్వేదం చెప్పింది. సరస్వతి నది వరదలకు తల్లి.. ఉత్తమ తల్లి, ఉత్తమ దేవత అని రుగ్వేదంలో కీర్తించారు. పంజాబ్, హర్యానాలలో కనిపించే గఘ్గర్–హాక్రా నది సరస్వతి నదికి పాయ అనే చెప్తారు. అంతేకాదు

**మన ప్రాచీన నాగరికతలు హరప్ప, సింధులోయ వంటివన్నీ కూడా సరస్వతీ నదీతీరంలోనే వికసించాయి. హిందూ పురాణాల ప్రకారం కూడా ముని ఆశ్రమాలు, యజ్ఞకుండాలు, యజ్ఞహోమాదులన్నీ కూడా సరస్వతీనదీ తీరంలోనే ఎక్కువగా జరిగాయి. పాండవుల స్వర్గారోహణ ప్రయాణం అంతా సరస్వతీ తీరం వెంబడే సాగింది.**

జియోలాజికల్ ఆధారాలతో సహా వేదాల్లోనే కనిపిస్తుంది. ఒక పక్కన సరస్వతీ నది ప్రళయకాలంలో భూగర్భంలో అంతరించిపోయిందన్న కథనాలు వచ్చాయి. ఇంకో పక్క పాండవులు రాజ్యాన్ని వదిలేసి స్వర్గలోకానికి వెళ్లే సమయంలో సరస్వతీ నదిని దర్శనం చేసుకునే ప్రయాణం చేశారట.. సింధు, ఝీలం, చెనాబ్, సట్లెజ్, బీస్, రావి, సరస్వతిలు సప్త సింధు నదులు. వీటిలో ఝీలంను వితస్థగా, చెనాబ్‌ను అశ్కిని అని, సట్లెజ్‌ను శతధు అని, రావిని ఇరావతి అని వేదాలు చెప్తున్నాయి. వీటిలో సరస్వతి తప్ప మిగతావన్నీ ఇప్పటికీ ప్రవహిస్తూనే ఉన్నాయి.

ఇవాళ్టికి దాదాపు 8 వేల సంవత్సరాల క్రితం వేదాల ఉనికి మనకు తెలుస్తోంది. అప్పటి నుంచే కొన్ని నదుల అస్తిత్వమూ బయటపడింది. మన ప్రాచీన నాగరికతలు హరప్ప, సింధులోయ వంటివన్నీ కూడా సరస్వతీ నదీతీరంలోనే వికసించాయి. హిందూ పురాణాల ప్రకారం కూడా ముని ఆశ్రమాలు, యజ్ఞకుండాలు, యజ్ఞహోమాదులన్నీ కూడా సరస్వతీనదీ తీరంలోనే ఎక్కువగా జరిగాయి. పాండవుల స్వర్గారోహణ ప్రయాణం అంతా సరస్వతీ తీరం వెంబడే సాగింది. పాండవులు ద్రౌపదిని వెంటబెట్టుకుని స్వర్గానికి ప్రయాణమయ్యారు. దారి కఠినంగా ఉంది. కానీ, ప్రయాణం మాత్రం ఆగలేదు. వాళ్ల దారి మధ్యలోనే సరస్వతీ నది ప్రచండంగా ప్రవహిస్తూ కనిపించిందిట. ఆకాశమంత ఎత్తు నుంచి భూమ్మీదకు దూకి.. మళ్లీ ఆకాశాన్నంటుతోందా అన్నంతగా సరస్వతీ జలధార ఎగిసిపడుతోందట.. దాన్ని దాటుకుని వెళ్లటం పాండవులకు కష్టమైంది. ద్రౌపది భయంతో వణికి పోయిందిట. భీముడు నదికి పెద్ద గండశిలతో వంతెన నిర్మించి నదిని దాటించాడట. మానా గ్రామ సమీపంలో ఈ శిలా వంతెన ఇవాళ్టికీ దర్శనమిస్తుంది. క్రీస్తు పూర్వం 3700 నాటి వేదిక్ సివిలైజేషన్ అంతా సరస్వతి, దిశధ్వతి నదీతీరాల్లో ఎక్కువగా సాగింది. దాదాపు అయిదు వేల సంవత్సరాల క్రితం సరస్వతీ నది అంతర్ధానమైంది. ఇప్పుడు మళ్లీ ప్రత్యక్షమైంది. ఎడారిలో పచ్చదనాన్ని సృష్టిస్తోంది. ఇది భారత జాతి మూలాలకు సాక్ష్యం. రాబోయే కాలంలో మరో సూపర్ పవర్ సివిలైజేషన్‌కు మరోసారి సరస్వతీ నదే నాంది కావచ్చు.

# ఆంజనేయుడి పెళ్లి



*కఠోర బ్రహ్మచారికి పెళ్లి జరిగిందా?*
*పెళ్లి కాని వారందరికీ ఆరాధ్య దైవం*
*ఆంజనేయుడికి పెళ్లి జరిగిన మాట వాస్తవమేనా?*
*సువర్చలాదేవి ఎవరు?*
*ఆమెను హనుమంతుడు ఎలా పెళ్లి చేసుకున్నాడు..?*
*హనుమంతుడు బ్రహ్మచారులకు దేవుడా?*
*లేక సంతాన దేవుడా?*

ఆంజనేయుడు... బ్రహ్మచారులకు ఆరాధ్య దైవం.. ఎందుకంటే ఆయన ఆజన్మ బ్రహ్మచారి కాబట్టి.. బ్రహ్మచారులకు ఆదర్శం హనుమంతుడు. పెళ్లంటే మొహం మొత్తిన వారికి మంచి మిత్రుడు హనుమాన్.. అలియాస్ అంజి. కానీ, వీళ్లంతా అనుకుంటున్నట్లు హనుమంతుడు నిజంగా బ్రహ్మచారి కాదని మరో కథనం. ఒక వేళ ఆయన పెళ్లి చేసుకున్నట్లయితే.. ఆయన బ్రహ్మచారి కాదని తెలిస్తే.. ఈ బ్రహ్మచారుల గుండెలు పగిలిపోవూ..!

హనుమంతుడు కఠిన నియమానికి, కఠోర బ్రహ్మచర్యానికి సింబల్. మరణమే లేని వరం పొందిన నవమ బ్రహ్మ.. ప్రతి ఊరికీ ఆయన క్షేత్ర పాలకుడు.. అంటే కాపాడే వాడు. అలాంటి అంజి పెళ్లెప్పుడు చేసుకున్నాడు? బ్రహ్మచర్యానికి ఆదర్శ పురుషుడైన తానే బ్రహ్మచర్యానికి తిలోదకాలిస్తే.. పాపం ఆయన ఫోటో పెట్టుకుని ఘోటక బ్రహ్మచర్యం చేస్తున్న వారి గతేం కావాలి? రామభక్త హనుమాన్ గురించి ఒకరికి ఒకరు చెప్పేదేముంది? పిల్లల దగ్గరినుంచి పెద్దల దాకా హనుమంతుడంటే ఒక విశ్వాసం.. ఆంజనేయుడి ఫోటో పక్కన ఉంటే పసివాళ్లకు ధైర్యం.. పవనసుతుణ్ణి తలుచుకుంటే పెద్దలకు బలం.. అంజిని అర్చిస్తే యువతకు బుద్ధి.. ఒక వర్గానికి, ఒక జాతికి, ఒక కులానికి అని కాకుండా అన్నింటికీ అతీతంగా, అందరికీ ఆప్యాయంగా ఉండే దేవుడు ఎవరంటే హనుమంతుడే.

ప్రతి ఊరి ప్రారంభంలో హనుమంతుడి విగ్రహం ఉందంటే ఆ ఊరు ఆయన సంరక్షణలో ఉందని అర్థం. కాలనీ కొత్తగా వెలసిందంటే ముందుగా ఏర్పడేది హనుమంతుడి ఆలయమే.. ఆ తరువాతే ఏదైనా.. ఇంతగా ప్రజల్లో పాపులారిటీ ఉన్న గాడ్ ఆంజనేయుడు. మామూలుగా హనుమంతుడి గురించి చెప్పాల్సి వచ్చినప్పుడు మొదటగా చెప్పేది ఆయన

బ్రహ్మచర్యం గురించే.. కానీ ఇప్పుడా బ్రహ్మచర్యానికే ముప్పు వచ్చిపడింది.. భావి బ్రహ్మ అయిన ఆంజనేయుడి బ్రహ్మచర్య దీక్షను సువర్చలా దేవి అనే సూర్యుని కుమార్తె భగ్నం చేసిందిట.. అంతటి కఠోర దీక్షలో ఉన్న హనుమంతుడు సువర్చలాదేవిని వివాహం చేసుకోవటం నిజమేనా అన్న ఆశ్చర్యం కలగకపోదు. నిజానికి ఆంజనేయుడి పాత్ర ప్రధానంగా మనకు కనిపించే రామాయణంలో ఈ పెళ్లి ప్రస్తావన లేదు. ఆ రామాయణాన్ని రాసిన వాల్మీకికి హనుమంతుడికి పెళ్లయిన సంగతి తెలుసో లేదో తెలియదు కానీ, అందులో పవనసుతుడి పాత్ర అంతా రాముడికి సేవ చేయటంతోనే సరిపోయింది. రామాయణంలో తీవ్రమైన బ్రహ్మచర్యాన్ని అవలంబించిన మన ఆంజనేయుడికి పరాశర సంహిత వంటి కొన్ని పురాణాలు ప్రేమ పడి పెళ్లి చేసేశాయి. అలా పెళ్లి చేస్తే వచ్చిన భార్యే సువర్చలా దేవి.. ది డాటర్ ఆఫ్ గాడ్ సన్.. సువర్చలాదేవి.. సూర్యుని కూతురు.. ఆమెను ఆంజనేయుడు పెళ్లి చేసుకున్నాడట. హనుమజ్జయంతి రోజునే ఆయన పెళ్లి వేడుకలనూ దేశంలోని అనేక ఆలయాల్లో జరపటం ఆనవాయితీగా కూడా మారిపోయింది.

హనుమంతుడు పసివాడిగా ఉన్నప్పుడే సూర్యుణ్ణి పండుగా భావించి ఎగిరి అందుకోబోయాడట. అలా సూర్యుణ్ణి చేరిన హనుమంతుడు ఆయన దగ్గరే సకల విద్యలనూ అభ్యసించాడు. విద్యలన్నీ పూర్తయిన తరువాత సూర్యుడు హనుమంతుడిని కోరిక కోరాడట. తన కుమార్తె సువర్చలా దేవిని వివాహం చేసుకోవాలన్నది ఆ కోరిక. గురువుగారి కోరిక విని హనుమంతుడి గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది. తానేమో ఘోటక బ్రహ్మచారి.. తానెలా పెళ్లి చేసుకోవటం.. అదే గురువుగారికి చెప్పుకున్నాడు.. కానీ, సూర్యభగవానుడు ఒత్తిడి చేయటంతో సంసార బాధ్యతలతో నిమిత్తం లేకుండా నామమాత్రంగా వివాహం



**హనుమంతుడు పసివాడిగా ఉన్నప్పుడే సూర్యుణ్ణి పండుగా భావించి ఎగిరి అందుకోబోయాడట.. అలా సూర్యుణ్ణి చేరిన హనుమంతుడు ఆయన దగ్గరే సకల విద్యలనూ అభ్యసించాడు.. విద్యలన్నీ పూర్తయిన తరువాత సూర్యుడు.. తన కుమార్తె సువర్చలా దేవిని వివాహం చేసుకోవాని కోరాడట. తానేమో ఘోటక బ్రహ్మచారి.. తానెలా పెళ్లి చేసుకోవటం.. అదే గురువుగారికి చెప్పుకున్నాడు.. కానీ, సూర్యభగవానుడు ఒత్తిడి చేయటంతో సంసార బాధ్యతలతో నిమిత్తం లేకుండా నామమాత్రంగా వివాహం చేసుకునేందుకు అంగీకరించాడట.**

**భక్తి అనేది ఒక కోతిని భగవంతునిగా మార్చింది.. చంచలమైన మనసు కలిగిన మనిషిని స్థిరచిత్తంతో ఉంచే లక్ష్యానికి ప్రతిరూపమే హనుమంతుడు. ఇవాళ ప్రపంచం అంతా మెడిటేషన్ చుట్టూ తిరుగుతోంది... మన ఆంజనేయుడు దీన్ని ఆనాడే చేసి చూపించాడు.. అంతే కాదు.. మానవుడైన రాముడికి సేవ చేయటం ద్వారా మనిషికి సేవ చేస్తే భగవంతునికి సేవ చేసినట్లేనని రుజువు చేసిన వాడు హనుమంతుడు.**

చేసుకునేందుకు ఆంజనేయస్వామి అంగీకరించాడట. అలా సువర్చలా దేవితో హనుమంతుడికి వివాహం అయిందని పురాణాల్లో చెప్పారు. శ్రీరామ నవమినాడు సీతారామ కల్యాణాన్ని ఎలాగైతే జరుపుకుంటామో.. అలాగే హనుమత్ జయంతి రోజున సువర్చలాంజనేయుల వివాహాన్ని వైభవంగా జరుపుకుంటున్నారు. అయినా చాలామందిలో మాత్రం హనుమంతుడికి వివాహం చేయటం అనేది వింతగా కనిపిస్తోంది.. మరి కొందరిలో ఆగ్రహాన్నీ తెప్పిస్తోంది. ఏవో పురాణాల్లో ఏవేవో కథలు ఉన్నాయని చూపించి బ్రహ్మచర్యానికి ఆదర్శపురుషుడైన ఆంజనేయుడికి వివాహం చేయటం సబబు కాదని ఇంకొందరి వాదన. పెళ్లిళ్లు చేసే వారికి మాత్రం ఇవేవీ అవసరం లేదు.. తమ స్వామి వారు బ్రహ్మచారి కానే కాదన్నది వారి బలమైన విశ్వాసం.. అదే వారికి నిజం.

హనుమంతుడి వివాహంపై చాలా చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి. ఆయన పెళ్లి కథ ఒకటైతే... సంతానం కథ ఇంకోటి.. ఆ సంతానంతో ఫైట్ చేసిన కథ మరోటి. పరాశర సంహిత చెప్పిన కథనం ప్రకారం సూర్యుడి కోరికతో సువర్చలా దేవిని ఆంజనేయుడు వివాహం చేసుకున్నాడు. ఆమెను వివాహం చేసుకున్నా.. ఆంజనేయుడు బ్రహ్మచర్య దీక్షను విడిచిపెట్టలేదట. అందుకే ఆయనకు వివాహం చేయటమూ తప్పు కాదు.. ఆయన పేరుతో బ్రహ్మచర్య దీక్షలు చేపట్టడమూ తప్పు కాదంటారు ఆధ్యాత్మిక వేత్తలు. మరి కొడుకెలా పుట్టాడన్నది ప్రశ్న. దానికీ హేతువు లేకపోలేదు. లంకానగరంలో సీతాదేవిని అన్వేషించటానికి హనుమంతుడు వెళ్లినప్పుడు రావణుడు ఆయన తోకకు నిప్పంటించాడు. ఆ నిప్పుతో లంకను ఆంజనేయుడు కాల్చేశాడు. ఆ తరువాత ఆంజనేయుడు సముద్రంలో తోకకు అంటిన అగ్గిని ఆర్చుకుని తిరిగి వెళ్తున్నప్పుడు ఆయన చెమట బిందువు సముద్రంలో ఒక చేప మింగిందిట.. తద్వారా ఆ చేప పుత్ర సంతానాన్ని పొందింది.. ఆ కుమారుడి పేరు మకరధ్వజుడు..

ఈ మకరధ్వజుడు పెరిగి పెద్దవాడై, మైరావణుడి ప్రాణాలకు కాపలా ఉన్నాడట.. మైరావణుడి ప్రాణాలను హరించటానికి వచ్చిన ఆంజనేయుడు.. కుమారుడితో యుద్ధం చేయాల్సి వచ్చిందిట. యుద్ధం తరువాత వాస్తవం తెలుసుకుని కుమారుణ్ణి ఆశీర్వదించి వెళ్లాడట ఆంజనేయుడు. హనుమంతుడి గురించి ఇలా ఎన్ని కథనాలైనా ప్రచారంలో వుండి ఉండవచ్చు. కానీ, ఆయన బ్రహ్మచర్యానికి ఉన్న బలం ఈ కథనాలకు ఎంతమాత్రం

కనిపించదు. హనుమత్ దీక్షలు స్వీకరించేవారు.. ఆయనను ఆజన్మ బ్రహ్మచారిగానే విశ్వసించేవారు ఎక్కువమంది ఉన్నారు.

## హనుమంతుడి రూపం

మన దేశంలో దేవుళ్లకు సంబంధించిన కథలు ఊరికే పుట్టవు.. ఒకే దేవుడికి సంబంధించి రకరకాల కథనాలు ఉంటాయి.. అసలు ఒక్కో దేవుడికి ఒక్కో ఆకారాన్ని కల్పించటం కూడా మన దగ్గర వింతే... ఎందుకంటే మన దేశంలో దేవతలకు సంబంధించిన అంశాల్ని డిస్కస్ చేసే పురాణాలు కానీ, ఇతర ఇతిహాసాల్లో కానీ ఒక సీక్రసీ తప్పనిసరిగా ఉంటుంది.. అంటే పైకి కనిపించే కథ వేరు...దాని వెనుక ఇండైరెక్ట్‌గా ఉండే ఉద్దేశ్యం వేరు. ఇక హనుమంతుడికి కోతి రూపమే ఎందుకు ఉండాలి? జస్ట్ మీలో మీరు ప్రశ్నించుకోండి... మీకే జవాబు దొరికిపోతుంది..

***పాయింట్ నెం.1 : కోతి మనిషికి పూర్వరూపం అని అంటారు..***

***పాయింట్ నెం.2 : కోతి అత్యంత చంచల స్వభావం కలిగింది.***

***పాయింట్ నెం.3 : కోతి మనసు ఎప్పుడూ స్థిరంగా ఉండదు..***

***పాయింట్ నెం.4 : మనిషి మనసు కూడా ఎప్పుడూ చంచలంగానే ఉంటుంది***

***పాయింట్ నెం.5 : ఇలాంటి చంచల స్వభావం కలిగిన వాళ్ల మనసులను స్థిరంగా వుంచటం ఎలా?***

***పాయింట్ నెం.6 : మెడిటేషన్ ఒక్కటే మార్గం..***

***పాయింట్ నెం.7 : దాన్నే భక్తి అంటారు.***

భక్తి అనేది ఒక కోతిని భగవంతునిగా మార్చింది.. చంచలమైన మనసు కలిగిన మనిషిని స్థిరచిత్తంతో ఉంచే లక్ష్యానికి ప్రతిరూపమే హనుమంతుడు. ఇవాళ ప్రపంచం అంతా మెడిటేషన్ చుట్టూ తిరుగుతోంది... మన ఆంజనేయుడు దీన్ని ఆనాడే చేసి చూపించాడు.. అంతే కాదు.. మానవుడైన రాముడికి సేవ చేయటం ద్వారా మనిషికి సేవ చేస్తే భగవంతునికి సేవ చేసినట్లేనని రుజువు చేసిన వాడు హనుమంతుడు. ఇక సువర్చలా దేవితో వివాహం సంగతి... దీని వెనుక కూడా లాజిక్ లేకపోలేదు.. ప్రపంచంలో విద్యలన్నింటికీ సింబల్ వెలుగు.. వర్చస్సు అన్నా వెలుగే.. సు.. వర్చస్సు అంటే మంచి వెలుగు అని అర్థం.. ఉత్తమమైన విద్యలన్నింటినీ హనుమంతుడు సూర్యుడి దగ్గర నేర్చుకున్నాడు. సూర్యుడి నుంచి పుట్టిన వెలుగే ఈ విద్యలు.. ఆ వెలుగే సువర్చల.. ఆమెనే హనుమంతుడికి సూర్యుడు అందించాడు.. సువర్చలా వివాహంలోని రహస్యమిదే.

# అమ్మోరు



*చెరువు కట్టకు మైసమ్మ..*
*కాలువ గట్టుకు గంగమ్మ*
*పొలిమేరలకు పోలేరమ్మ..*
*రోగాల పాలిటి నల్ల పోచమ్మ*
*అమ్మలకు అమ్మ పెద్దమ్మ..*
*రూపం లేదు.. వేషం లేదు..*
*రాయిూరప్పా అన్నీ అమ్మ రూపాలే..*
*ఆ తల్లుల అనుగ్రహమే..*
*పల్లెసీమలకు సంక్షేమం..*

చెరువుకో దేవత.. కాలువకో దేవత.. రోగాల బారి నుంచి రక్షించేందుకు ఓ దేవత.. పొలం గట్టున దేవత.. పొలిమేరల్లో దేవత.. తలుపుకో దేవత.. తలపుల్లో దేవత.. ఊరూరా దేవతలే.. రూపం ఉండదు.. ఆకారం ఉండదు.. వింత ఆచారాలు.. విచిత్ర సంప్రదా యాలు.. గుళ్లూ గోపురాలూ ఉండవు.. రోడ్డు పక్కనో.. కాలువ గట్టునో.. చిన్న నీడ కల్పించి అందులోనే పూజిస్తారు.. రాయి..రప్పా, చెట్టు.. కొమ్మా.., కుంకుమ భరిణ, ఇవన్నీ గ్రామ దేవతలే.. పసుపు కుంకుమలే అలంకారం.. వేపమండలే ఆహార్యం.. వీరంగమే ఆనందం.. పోతురాజులే పౌరుషం.. మైసమ్మ, పోలేరమ్మ, పెద్దమ్మ.. లక్ష్మి, పార్వతి, సరస్వతి.... ఏమిటీ తేడా... అందరిదీ ఒక స్వరూపం కాదా? గ్రామ దేవతలకు.. సంప్రదాయ దేవతలకూ తేడా ఎందుకు? ఆచారాల్లో పూజల్లో అంతరాలు దేనికి? గ్రామ దేవతల్లో అమ్మవారికే ప్రాధాన్యం దేనికి? జానపద జాతరల్లో వింత వీరంగాలు, పూనకాలు ఎలా వస్తాయి? దేవీ పూనకం నిజమేనా? భవిష్యవాణి సాధ్యమేనా?

లక్ష్మి, సరస్వతి, పార్వతి దేవతల గురించి మనకు తెలుసు.. భారతంలోనో, రామాయణంలోనో, వేర్వేరు పురాణాల్లోనో వాళ్ల గురించి ఉంది కాబట్టి కొద్దో గొప్పో తెలుసు.. వాళ్లకంటూ ఏవేవో లోకాలున్నాయనీ, ఆ లోకాల్లో నుంచి భూమిపై వున్న మనల్ని రక్షిస్తుంటారని భావిస్తాం.. వీళ్ల కోసం పెద్ద పెద్ద ఆలయాలు.. వాటిలో అర్చనలు, నైవేద్యాలు.. పెద్ద ఎత్తున చేస్తాం... మరి ఈ గ్రామాల్లో దేవతల మాటేమిటి? వీరి ప్రస్తావన ఎక్కడుంది? ఇంత నిరాడంబరంగా అలంకారాలు, ఆహార్యం లేకుండా ప్రజలను దీవిస్తున్న ఈ మూలపుటమ్మలు ఎక్కడి నుంచి వచ్చారు?

ఒక చోట బోనం.. ఇంకోచోట నిలువెత్తు బంగారం.. మరో చోట విచిత్ర వేషాలు..



**పెద్ద పెద్ద ఆలయాలు.. బంగారం, వజ్రాలు పొదిగిన ఆభరణాలు.. పట్టు వస్త్రాలు.. నైవేద్యాలు.. నీరాజనాలు.. హిందూ దేవాలయాల్లో కనిపించే భక్తి సంప్రదాయ వైభవం కనిపిస్తుంది. కానీ, ఆ వైభవం గ్రామదేవతల జాతరల్లో కనిపించదు. అమ్మవారికి బోనమే నైవేద్యం, పసుపు, కుంకుమలే అలంకారం, బెల్లమే బంగారం.**

జానపదుల జాతరల్లో ఎందుకిలా జరుగుతాయి.. ఆలయాల్లో కనిపించే క్రమశిక్షణ.. పూజాపునస్కారాల విధానం ఈ జాతరల్లో వేరే విధంగా ఎందుకు ఉంటాయి? సంప్రదాయ దేవతలకు, గ్రామదేవతలకు తేడా ఏదైనా ఉందా? పెద్ద పెద్ద ఆలయాలు.. బంగారం, వజ్రాలు పొదిగిన ఆభరణాలు.. పట్టు వస్త్రాలు..నైవేద్యాలు.. నీరాజనాలు.. హిందూ దేవాలయాల్లో భక్తి సంప్రదాయ వైభవం కనిపిస్తుంది. కానీ, ఆ వైభవం గ్రామదేవతల జాతరల్లో కనిపించదు.. అమ్మవారికి బోనమే నైవేద్యం... పసుపు, కుంకుమలే అలంకారం.. బెల్లమే బంగారం. వేదం చదువుతూ, అర్చనలు చేసే విధానం ఆ ఆలయాలది.. పూనకాలతో వీరంగం వేస్తూ, ఎలుగెత్తి అమ్మను ఆవహించమని పిలుస్తూ ఆదుకొమ్మని ఆరాధించే అరమరికలు లేని ఆరాధన ఈ జానపదులది.

గ్రామీణ దేవతలంతా అడవి బిడ్డలకు అమ్మలు. తమకు తెలిసిన విధానంలో, తమకు తోచిన ఆచారంలో, తమకు దొరికిన పదార్థాలనే నైవేద్యంగా పెట్టి తమకు పవిత్రంగా కనిపించిన రూపాన్ని స్వచ్ఛంగా కొలిచే అపురూపమైన భక్తి ఉద్యమం ఇది. ఫలం, పుష్పం, తోయం అన్నారు పెద్దలు. భగవంతునికి భక్తితో ఏది సమర్పించినా ప్రేమతో స్వీకరిస్తాడట.. ఈ గ్రామదేవతల జాతరల్లో అచ్చంగా జరుగుతున్నది అదే.. అందుకే అమ్మ వెంటనే కరుణిస్తుంది.. భక్తులను పూనుతుంది.. వారి ద్వారానే మిగతావారి కోరికలను తీరుస్తుంది.

మేడారంలో సమ్మక్క-సారలమ్మ జాతర.. విజయనగరంలో పైడితల్లి జాతర.. తూర్పు గోదావరిలో సత్తెమ్మతల్లి, తలుపులమ్మల జాతర... ఇక హైదరాబాద్‌లో చెప్పవశమా..? ఆషాఢం వచ్చిందంటే.. బోనాల సంబరం మిన్నంటుతుంది. విచిత్రమేమంటే.. మిగతా జాతరలన్నీ పల్లెల్లోనే జరుగుతాయి.. బోనాలు మాత్రం మహానగరం భాగ్యనగరంలో జరుగుతాయి.. అదే విశేషం.. అలా ఇలా కాదు.. ఆషామాషీ కాదు.. ఒకరోజు రెండు రోజులు కాదు.. ఒక చోట కాదు.. ఒక గుళ్లో కాదు..ఒక అమ్మవారు కాదు.. రాజధాని



**ఆషాఢ మాసంలో ఆదివారం వచ్చిందంటే చాలు.. హైదరాబాద్‌లో తెలంగాణకు చెందిన వారి ప్రతి ఇంటా బోనం లేస్తుంది. అమ్మకు భోజనం పెట్టడానికి పురుషులు, ఇల్లాళ్లు, కన్నెపిల్లలు.... ఇలా ఒకరేమిటి వయోలింగ భేదం లేకుండా అంతా ఆలయాలకు తరలివెళ్తారు. శివసత్తులు చిందులేసి అమ్మకు వినోదాన్ని అందిస్తారు.**

అంతటా.. భాగ్యనగరం నిండైన పసుపు కుంకుమలతో నిండు ముత్తైదువలా అలరారుతుంది. నెల రోజుల పాటు సంబరాలు చేసుకుంటుంది.

ఆషాఢ మాసంలో ఆదివారం వచ్చిందంటే చాలు.. హైదరాబాద్‌లో తెలంగాణకు చెందిన వారి ప్రతి ఇంటా బోనం లేస్తుంది. అమ్మకు భోజనం పెట్టడానికి పురుషులు, ఇల్లాళ్లు, కన్నెపిల్లలు.... ఇలా ఒకరేమిటి వయోలింగ భేదం లేకుండా అంతా ఆలయాలకు తరలివెళ్తారు. శివసత్తులు చిందులేసి అమ్మకు వినోదాన్ని అందిస్తారు. ఇక పోతరాజుల వీరంగం సరేసరి..బలిష్ఠమైన వ్యక్తులు శరీరం అంతా పసుపు రాసుకుని, కాలికి గజ్జెలు కట్టుకుని వీర నాట్యం చేస్తుంటే అది చూడటానికి రెండు కళ్లు చాలవు..

ఘటాల సమర్పణ, తొట్టెల ఊరేగింపు, పోతరాజుల హడావుడి నాగరికులకు తెలియని, అంతుపట్టని, అపురూప సన్నివేశాలు.. చూసేందుకు వేయి కన్నులున్నా సరిపోదు. అమ్మవారు భక్తులపై పూనటం ఈ జాతరల్లో ప్రత్యేక సన్నివేశాలు. భక్తుల నోటివెంట దేవతే భవిష్యవాణి చెప్పిస్తుంది. ఇది హేతువాదులకు నమ్మశక్యం కాదు. కానీ, ఇలా ఒక చోటనే జరగదు. జానపదుల జాతరలన్నిటిలో.. గ్రామదేవతల పూజలన్నింటిలో పూనకాలు సహజంగానే వస్తాయి.. వీరంగాలు ఇంతకంటే సహజంగా జరుగుతాయి. వీటిమీద విశ్వాసం అలాంటిది.. పల్లె ప్రజలపై గ్రామదేవతల ఆధిపత్యం అలాంటిది.

లక్ష్మి, సరస్వతి, పార్వతిల గురించి మనకు తెలుసు. భారతంలోనో, రామాయణంలోనో, వేర్వేరు పురాణాల్లోనో వాళ్ల గురించి ఉంది కాబట్టి కొద్దో గొప్పో తెలుసు. వాళ్లకంటూ ఏవేవో లోకాలున్నాయనీ, ఆ లోకాల్లో నుంచి మనల్ని రక్షిస్తుంటారని చదువుకున్నాం. వీళ్ల కోసం పెద్ద ఆలయాలు. వాటిలో అర్చనలు, నైవేద్యాలు పెద్ద ఎత్తున చేస్తాం.

మరి ఈ గ్రామాల్లో దేవతల మాటేమిటి? వీరి ప్రస్తావన ఎక్కడుంది? ఇంత నిరాడంబరంగా అలంకారాలు, ఆహార్యం లేకుండా ప్రజలను దీవిస్తున్న ఈ మూలపు టమ్మలు ఎక్కడి నుంచి వచ్చారు? అడవితల్లి బిడ్డలు ఆ అడవినే నమ్ముకుని ఉండేవాళ్లు.. ఆ అడవిని విడిచి రాలేని వాళ్లు.. నాగరికులకు దూరంగా ఉండేవారు ఏర్పరుచుకున్న రూపాలు గ్రామ దేవతలు.. చెరువు కట్ట తెగిపోకుండా ఉండేందుకు కట్ట పక్కన ఒక

రూపాన్ని ఏర్పాటు చేసుకుంటే అక్కడ కట్టమైసమ్మ వెలిసింది... కాలువ గట్టు తెగకుండా కాపాడేందుకు గట్టు మైసమ్మ వచ్చింది.. పోలియో, చికెన్ పాక్స్ వంటి వ్యాధుల బారి నుంచి పల్లెను కాపాడేందుకు పోలేరమ్మ అవతరించింది. ఊరిని కాపాడేందుకు శివార్లలో ఇప్పుడు మనకు హనుమంతుడి విగ్రహాలు అతి పెద్దవి కనిపిస్తున్నాయి కానీ, గతంలో గ్రామదేవతలే అక్కడి ప్రజలకు సర్వస్వం.. వాళ్లు తినే తిండి.. తాగే కల్లు, జంతు బలులు ఇవే అమ్మవారికి నైవేద్యం.. ఆ కల్లు తాగి అమ్మవారి ముందు వీరంగం వేస్తారు.. జాతరలో అది తప్పు కాదు.. అలా చేస్తేనే అమ్మ అనుగ్రహిస్తుందని విశ్వాసం. పూజల్లో ప్రాధాన్యం లభించేది పసుపు, కుంకుమ, వేప, బెల్లం వంటి పదార్థాలకే.. ఇవన్నీ ఏదో విధంగా అన్ని రకాల వ్యాధులకు మందులుగా ఉపయోగపడేవే.. జంతు బలులు మినహా మిగతా వన్నీ జానపద సమాజంతో ముడిపడి ఉన్నవే.. అందుకే మేడారంలో ఎర్రని ధూళి ఎగిసెగిసి పడుతున్నా.. నిలువెత్తు పసుపు కుంకుమలు ఆ ధూళిని అణచేస్తాయి.. గొప్ప యాంటీ బయటిక్‌గా పసుపు పనిచేస్తుంది.

ఇప్పుడు పట్టణాల్లోనూ ఈ జాతరలు జరుగుతున్నాయంటే కారణాలు లేకపోలేదు.. హైదరాబాద్ వంటి నగరాలు ఇవాళ మహానగరంగా విస్తరించి ఉండవచ్చు. కానీ, ఇప్పుడు బోనాలు జరుగుతున్న ప్రతి గుడిని ఒక్కసారి గమనించండి.. ప్రతిచోటా గతంలో చెరువులో, కుంటలో, కాలువలో ఉన్నట్లు స్పష్టంగా చారిత్రక ఆనవాళ్లు చెప్తాయి. కట్టమైసమ్మలైనా, మహంకాళి అయినా గతంలో గ్రామీణ భాగ్యనగర ప్రజలు అర్చించినవే.. గ్రామం పోయి పట్టణాలు వెలిసినా, నగరాలుగా మారినా ట్రెడిషన్‌లో మాత్రం మార్పు రాలేదు.. ఈ జాతరల్లో, బోనాల్లో పాల్గొనే నాగరికులంతా గ్రామీణ నేపథ్యం ఉన్నవాళ్లే. వాళ్లు ఎంతగా ఎదిగినా తమ ట్రెడిషన్‌ను మాత్రం మర్చిపోలేదు.. కాకపోతే.. సంపద పెరిగింది.. గ్రామీణ నేపథ్యం నుంచి క్రమంగా ఎదిగిన సమాజం ఆచారాల్లో కూడా కొద్ది కొద్దిగా మార్పులు తీసుకువచ్చింది. సంప్రదాయ దేవతలతో సమానంగా గ్రామదేవతలకు ఆలయాల నిర్మాణం జరిగింది.. అర్చనలు.. నైవేద్యాలు, పూజలు శాస్త్రోక్తంగా జరుగుతున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే దేవతలంతా ఒక్కటిగా ట్రాన్స్‌ఫామ్ అయ్యారు.. ఏక రూపంలో ప్రజలకు కనిపిస్తున్నారు.. హిందూ ధర్మంలో భక్తికి సంబంధించి ఫ్లెక్సిబిలిటీ ఉంటుంది.. ఎలాంటి నిర్బంధాలు ఉండవు.. దేవుణ్ణి కొలవటంలో, ఉపాసించటంలో ఎవరికి తోచిన మార్గాన్ని వాళ్లు అనుసరించవచ్చు. విధి నిషేధాలు లేవు.. అందువల్లే ఈ దేశంలో.. ఈ జాతిలో, ఈ ధర్మంలో లెక్కలేనన్ని దేవతలు.. లెక్కలేనన్ని మతాలు.. లెక్కలేనన్ని ఆచారాలు..

# యజ్ఞం

***1984 డిసెంబర్ 3: భోపాల్ విషవాయువుతో స్మశానమైంది***
***2011 మార్చి 11: సునామీతో జపాన్ కాష్టాల దిబ్బగా మారింది***
***అణువులు బద్దలైపోయాయి ఆకాశమంతటా రేడియేషన్ సెగలు***
***టోక్యో నుంచి రష్యాదాకా నిండుకున్న హాలాహలం***

ఇప్పుడు ప్రపంచం వణికిపోతోంది.. ఒక అణువుకు భయపడిపోతోంది.. అది విడుదల చేసే అతి భయంకరమైన శక్తికి బెంబేలెత్తిపోతోంది. అందులోంచి వచ్చే ధూళికి దిగాలు పడిపోతోంది. ఒక ప్రాంతాన్ని, ఒక నగరాన్ని, ఒక దేశాన్ని మట్టి కరిపించిన ఆ దుమ్ము.. ఇప్పుడు ప్రపంచానికి సవాలుగా మారింది. కష్టపడి తయారు చేసుకుని టన్నుల కొద్దీ నిలువ చేసుకున్న అణువులు ఒక్కసారిగా బద్దలైపోతే, ఈ అణువులను చూపి ప్రపంచాన్ని ఏలుతున్న పెద్దన్నలంతా అయోమయంలో పడిపోయారు. ప్రపంచ దేశాలను బెదిరించేం దుకు.. పెత్తనం చెలాయించేందుకు టన్నుల కొద్దీ ఆ పదార్థాన్ని పోగేసుకున్న ప్రపంచ పోలీసులు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డారు. వెన్నులోంచి వణుకుపుట్టుకొస్తోంది. ఏ చిన్న పొరపాటు జరిగినా మహా వినాశనం తప్ప నియంత్రణ సాధ్యంకాదు. ఎందుకంటే క్షణాల్లో సర్వనాశనమే జరుగుతుంది.

అణు విద్యుత్తు.. అణ్వస్త్రం.. దీంతో ప్రపంచాన్ని జయించవచ్చనే ధీమాతో ఉన్న రాజ్యాలకు అవే తమకు ప్రాణాంతకంగా మారుతున్నాయని జపాన్ ఉదంతంతో తేలిపోయింది. ఇవన్నీ పైపైకి బీరాలు బాగానే పలుకుతున్నాయి. ఎలాంటి సమస్య లేదని.. అన్నింటినీ అధిగమిస్తామంటూ డంబాలు పోతున్నాయి. కానీ, ఈ అణువులు ఒక్కసారి బద్దలైతే.. మూడువేల భూగోళాలను ఒక్క క్షణంలో నాశనం చేసే శక్తిని విడుదల చేస్తుంది. అంటే మనం చేసిన ఈ పనికి మొత్తం పాలపుంతే ఉనికి లేకుండా పోతుందా? అవును.. మన సౌరమండలాన్ని మనమే నాశనం చేసుకునే దిశగా అణు సంపదను తయారు చేసుకుని పెట్టుకున్నాం. ఇప్పుడేం చేయాలి? ఏమీ అర్థం కావటం లేదు. ఈ సమస్యకు పరిష్కారం లేదా? ఉంది.. మన వేదం చూపిన పరిష్కారం ఇది. పెనుముప్పును సైతం తప్పించే రక్షణ కవచం. అణు ధార్మికతకు కవచం.. రేడియేషన్‌ను తరిమేసే మహాశక్తి, మన వేదాలు మనకు అందించిన గొప్ప సైన్స్, విధ్వంసం నుంచి విముక్తి కోసం మృత సంజీవని యజ్ఞం. ఆలయాల్లో.. వివిధ సందర్భాల్లో మన ఇళ్లల్లో చిన్నగా చేసుకునే యజ్ఞయాగాలే ప్రపంచాన్ని పెను ముప్పునుంచి కాపాడే ఏకైక ప్రక్రియ. ఇది హేతువాదానికి



**రావి, మోదుగ, మామిడి, జువ్వి, మేడి చెట్టుకు సంబంధించిన కొమ్మలను సమిధలుగా చేసి యజ్ఞంలో ఉపయోగిస్తారు. ఇవి కాకుండా జిల్లేడు, నేరేడు కొమ్మలను కూడా ఇందులో ఉపయోగిస్తారు. అగ్ని నిరంతరంగా ప్రజ్వరిల్లేందుకు ఆవు నెయ్యిని స్వాహాకారాలతో హోమకుండంలో పోస్తుంటారు. వీటికి తోడుగా మరికొన్ని పదార్థాలను ఇందులో సమిధలను చేస్తారు. వేదాల్లో నాలుగు వందల రకాల యజ్ఞాల గురించిన ప్రస్తావన ఉంది.**

అర్థం కాని అబ్బురం.. సైన్స్‌కు సైతం ఆశ్చర్యం కొలిపే అద్భుతం. ఇది ఆరోగ్యానికి, ఆనందానికి, జీవితానికి ఆలంబనగా నిలిచే మహాశక్తి ఆవిర్భావానికి చేసే ప్రయత్నం. మనకు మాత్రమే తెలిసిన, మనం మాత్రమే చేయగలిగిన వేద విజ్ఞానం.

ఒక్కసారిగా నమ్మకం కుదరకపోవచ్చు. ఆశ్చర్యం వేయవచ్చు. పుక్కిటిపురాణంగా తోచవచ్చు. కానీ, ఇదే వాస్తవం. యజ్ఞమే మన ముందున్న ఏకైక పరిష్కారం. ప్రపంచాన్ని, విశ్వాన్ని కాపాడే ఒకే ఒక్క ప్రక్రియ.. అవును, ఇవాళ ప్రపంచాన్ని ఒక్కసారిగా కుదిపేసిన రేడియేషన్ తరంగాలను ఆపే శక్తి కేవలం యజ్ఞానికే ఉంది. ఇది కేవలం భక్తి కార్యక్రమమే కాదు.. దీని వెనుక అసాధారణ శక్తి దాగుంది.

మనకు తెలిసినంత మేరకు యజ్ఞం అనేది, పైలోకాల్లో ఉన్న దేవతలను సంతృప్తి పరచి, కోరుకున్న కోరికలను తీర్చుకునే ఒకానొక ఆధ్యాత్మిక పక్రియ. ఇందుకోసం ఒక యజ్ఞకుండం ఏర్పాటు చేసి అందులో నిప్పును రాజేసి, సమిధలను వేస్తూ.. నెయ్యిని పోస్తూ.. మంత్రాలు చదువుతూ నిర్వహించే ఒక విధానం. రావి, మోదుగ, మామిడి, జువ్వి, మేడి చెట్టుకు సంబంధించిన కొమ్మలను సమిధలుగా చేసి యజ్ఞంలో ఉపయోగిస్తారు. ఇవి కాకుండా జిల్లేడు, నేరేడు కొమ్మలను కూడా ఇందులో ఉపయోగిస్తారు. అగ్ని నిరంతరంగా ప్రజ్వరిల్లేందుకు ఆవు నెయ్యిని స్వాహాకారాలతో హోమకుండంలో పోస్తుంటారు. వీటికి తోడుగా మరికొన్ని పదార్థాలను ఇందులో సమిధలను చేస్తారు.

వేదాల్లో నాలుగు వందల రకాల యజ్ఞాల గురించిన ప్రస్తావన ఉంది. వీటిని ఎప్పుడు

ఎలా ఏ విధంగా నిర్వహించాలో వివరణ ఉంది. ఇంట్లో చేసే యజ్ఞానికి, సమాజం కోసం సామూహికంగా నిర్వహించే యాగానికి తేడాలు ఉన్నాయి. కొన్ని యజ్ఞాలు నిమిషాల్లో పూర్తవుతాయి. మరి కొన్ని, కొద్ది గంటల్లో ముగుస్తాయి. ఇంకొన్ని రోజులకొద్దీ.. సంవత్సరాల కొద్దీ కొనసాగుతాయి కూడా. ఇవన్నీ బాగానే ఉన్నాయి. యజ్ఞాలు చేసుకోవచ్చు. దేవతలనే వాళ్లు ఉంటే వాళ్లను సంతృప్తి పరచి వాళ్ల నుంచి వరాలు పొందితే పొందవచ్చు. దీనికీ రేడియేషన్‌కీ సంబంధం ఏమిటి? హవనం వల్ల రేడియేషన్‌ను ఎలా తరిమేయవచ్చు..? అంటే జవాబు యజ్ఞమే చెప్తుంది.

యజ్ఞం అనేది గాలిని పరిశుభ్రం చేస్తుంది. భూమిని శుద్ధి చేస్తుంది. నీటిని ప్రొటెక్ట్ చేస్తుంది. వాతావరణంలో అనేకానేక టాక్సిన్ గ్యాస్‌లను రాకుండా అడ్డుకుంటుంది. ఎందుకంటే పొల్యూషన్ అనేది వాతావరణంలోంచే మన శరీరాల్లోకి ఎంటరవుతోంది. ఈ కాలుష్యాన్ని అడ్డుకోవటానికి వాతావరణాన్ని నియంత్రణలో ఉంచుకోవటమే ముఖ్యం. అందుకు యజ్ఞం ఉపయోగపడుతుంది. అందులో వేసే సమిధలు సహకరిస్తాయి. అందులో పోసే ఆవునెయ్యి కీలకంగా పనిచేస్తుంది. స్వాహా సమయంలో ఉచ్చరించే మంత్రం వెలువరించే ధ్వని తరంగాలు ఉపయోగపడతాయి.

మన దగ్గరున్న ఒకే ఒక బలహీనత పొరిగింటి పుల్లటి కూరైనా రుచిగా ఉందని మెచ్చుకోవటం.. మన ఇంట్లో కూర ఎంత అద్భుతంగా ఉన్నా దాన్ని పట్టించుకోకపోవటం.. మన కల్చర్‌లో, మన నాగరికతలో ఎన్నుంటే ఏం లాభం చెప్పండి? అవి మనకు అర్థం కావు.. అర్థమయ్యేలా చెప్పేవాళ్లు లేరు.. చెప్పినా విని నమ్మే పరిస్థితిలో మనం లేము. కానీ, ఒక్కసారి అన్నింటినీ పక్కకు పెట్టి ఆలోచించండి.. యజ్ఞం ఎందుకు చేస్తారని? దాన్ని నిర్వహించటం వెనుక లాజిక్ ఏముందో ఒక్కసారి తెలుసుకోండి. యోగం.. తంత్రం.. వైద్యం.. భక్తి.. మోక్షం ఈ అయిదు కలిస్తే అది యజ్ఞం. హోమకుండం, ఘృతం, సమిధ, దర్భ, మంత్రం ఇవన్నీ దీనికి ఉపకరణాలు. హోమకుండం కుండలినీ యోగశక్తికి ప్రతీక. మనిషిలో శక్తి చైతన్యాన్ని పెంపొందించుకోవటానికి ఇది ప్రతీక. యజ్ఞంలో మేటర్ కంటే మెటీరియల్‌దే ప్రధాన భూమిక పోషిస్తుంది. ప్రత్యేకమైన స్థాయిల్లో మంత్రం ఉచ్చరిస్తున్నప్పుడు అది మన చుట్టూ ఒక రక్షణ వలయాన్ని ఏర్పాటు చేస్తుంది.

సాధారణ సమయాల్లో మన చుట్టూ రెండున్నర అర్థమీటర్ల వ్యాసంలో ఓరా ఉంటే.. యజ్ఞం వల్ల 14.5 అర్థమీటర్ల ఓరా అంటే రక్షణ వలయం ఏర్పాటు అవుతుంది. వీటి నుంచి వచ్చే తరంగాలు మనపైనా, మన చుట్టూ ఉండే వాతావరణంలోని ఎలక్ట్రానిక్ తరంగాలపైనా రకరకాల తీవ్రతల్లో ప్రభావం చూపిస్తాయి. యజ్ఞంలో ఉపయోగించే సమిధల్లో పంచపల్లవాలు ప్రధానమైనవి. యాగం మొత్తం సమిధలుగా మారిన పల్లవాలతోనే సాగుతుంది. ఇవి అగ్నిలో దహనం అయి రేణువుల్లా మారి వాతావరణంలో కలిసి వాతావరణంలోని విషవాయువులను శుద్ధి చేస్తాయి. ఈ సమిధలన్నీ ఔషధ మూలికలే.

మామూలుగా మనకు మందులు కావాలంటే ఎన్నో టన్నులు అవసరమవుతాయి. ఇవి వాతావరణంలో కలిసిపోవటం వల్ల వీటి శక్తి రెట్టింపుగా విడుదల అవుతుంది. విష వాయువులు మేఘాలతో కలిస్తే యాసిడ్ వర్షాలు కురుస్తాయి. ఇందుకు సంబంధించిన రుజువులు కూడా ఇటీవలి కాలంలో వివిధ దేశాల్లో చూశాం. జపాన్‌లో విడుదలైన రేడియేషన్ కూడా వర్షంగా రూపాంతరం చెందే అవకాశం లేకపోలేదన్న ఆందోళనా వ్యక్తం అవుతోంది. వీటిని నియంత్రించటానికి యజ్ఞం ఒక్కటే మార్గం. యజ్ఞంలో వేసిన సమిధలు దాదాపు మూడు కిలోమీటర్ల ఎత్తున అంతే విస్తీర్ణంలో ఒక వలయంగా ఏర్పడతాయి. పైనుంచి వచ్చే ఎలాంటి నెగెటివ్ ఫోర్స్‌నైనా ఈ వలయం అడ్డుకుంటుంది.

యజ్ఞంలో మనం అన్నింటికంటే ఎక్కువగా, కీలకంగా ఉపయోగించేది నెయ్యి. స్పిర్చ్యువల్ పరిభాషలో దీన్నే ధృతం అంటారు. ఇందులో ఆవు నెయ్యిని వాడతారు. అది దొరకని సందర్భాల్లో గేదె నెయ్యినీ ఉపయోగిస్తుంటారు. ఆవు నెయ్యి అనేది వాతావరణంలో చాలా ప్రభావం చూపిస్తుంది. యజ్ఞం జరిగిన ప్రదేశంలో మొత్తం ఎనిమిదిన్నర కిలోమీటర్ల ఎత్తు వరకు ఈ నేతి ప్రభావం ఉంటుంది. అగ్నిహోత్రం ద్వారా గాలిలో రేణువుల్లా కలిసి పోయిన తరువాత ఈ నెయ్యి శీతలీకరణ కణాలను వాతావరణంలో సృష్టిస్తుంది. ఇది రేడియేషన్ ప్రభావాన్ని పూర్తిగా తగ్గిస్తుంది. వాతావరణంలో వేడిని తగ్గిస్తుంది. దీంతోపాటు ఆక్సీజన్ పరిమాణాన్ని కూడా అధికమొత్తంలో పెంచుతుంది. జర్మనీలోని రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వరల్డ్ స్పిర్చ్యువాలిటీ నిపుణులు ప్రయోగాత్మకంగా నిరూపించిన సత్యం ఇది.

ఓంకారం సంపూర్ణ సృష్టిని సూచిస్తుంది. యజ్ఞం పూర్తి విశ్వాన్ని ప్రతిబింబిస్తుంది. మంత్రానికి ఉచ్చరించే వ్యక్తికి ఉన్న గ్రహణశక్తికి మించిన సహజమైన అర్థం ఉంటుంది. వాటి నుంచి వచ్చే తరంగాలకు అగ్నిహోత్రం నుంచి వెలువడే రేణువులు కలిసి వాతావరణాన్ని పూర్తిగా సమతుల్యం చేస్తాయి. దీని ప్రభావం భూమిపై.. అక్కడ ఉన్న జీవులపై కొన్ని గంటల నుంచి కొన్ని సంవత్సరాల దాకా ఉంటుంది.. ఇదంతా సామాన్య శాస్త్రానికి అంతుపట్టని వేదశాస్త్ర రహస్యం.. యజ్ఞ రహస్యం.

భోపాల్‌లో విషవాయువు ప్రమాదం జరిగినప్పుడు అదే నగరంలోని అగ్నిహోత్ర సమాజానికి చెందిన పదకొండు కుటుంబాలకు ఎలాంటి ఆపద వాటిల్లలేదు.. ఇది కళ్లముందు కనిపిస్తున్న వాస్తవం. ఎందుకంటే ఈ పదకొండు ఇళ్లలో నిత్యం అగ్నిహోత్రం వెలుగుతుంటుంది. హోమం జరగని రోజంటూ ఉండదు. ఈ హోమ ద్రవ్యాల కారణంగా ఆ ఇంటి పరిసర ప్రాంతంలో విష ప్రభావం ప్రవేశించకుండా ఆగిపోయింది. దీనిపై బ్రిటిష్ శాస్త్రవేత్తల బృందం ఒకటి పరిశోధన జరిపి నిర్ధారణ చేసింది కూడా. యజ్ఞం చేసినప్పుడు అందులో ఆహుతులైన వస్తువులన్నీ రూపాంతరం చెంది పొగరూపంలో, ధూళి రూపంలో, రేణువుల రూపంలో వాతావరణంలో కలిసిపోతాయి. మంత్రం వైబ్రేషన్ వీటిని ఒక రక్షణ కవచంగా ఏర్పడటానికి వలయాకారంలో ప్రసరిస్తుంది. ఒకరకంగా

చెప్పాలంటే ఉపగ్రహాన్ని నిర్దిష్టమైన కక్ష్యలో ప్రవేశపెట్టడానికి రాకెట్ ఉపయోగపడినట్లే ఇది కూడా ఉంటుంది. రేడియేషన్ తీవ్రత స్థాయిని ఈ వలయమే తగ్గించుకుంటూ పోతుంది. ఒక మెగాటన్ అణుధార్మికత విడుదలైనప్పుడు అది 4 దశల్లో వాతావరణంపై ఇంపాక్ట్ చూపిస్తుంది. జీరోగ్రౌండ్‌లో బ్లాక్ రేడియేషన్ విడుదలవుతుంది. ఇది అ రియాక్టర్ పరిధి దాటి బయటకు రాదు.. దీనిపై అగ్నిహోత్రం ప్రభావం ఏదీ ఉండదు. రెండో దశలో అయొనైజ్‌డ్ రేడియేషన్ విడుదలవుతుంది. ఇది సుమారు 7 కిలోమీటర్ల మేర విస్తరిస్తుంది. మూడో దశలో థర్మల్ రేడియేషన్ బయటకు వస్తుంది. ఇది మరింత ఎక్కువ ప్రాంతానికి విస్తరిస్తుంది. నాలుగో దశ ఫార్ అవుట్ దశ. ఇది క్రమంగా కొంత కొంతగా ఆకాశంలో విస్తరించుకుంటూ వెళ్తుంది. ఇది చాలా ప్రమాదకరమైన దశ.. ఇలా రేడియేషన్ విస్తరించిన ప్రాంతంలో గడ్డి కూడా మొలవదు.

ఈ విధంగా వ్యాపిస్తున్న రేడియేషన్‌ను యజ్ఞం నుంచి వెలువడిన రేణువులు సక్సెస్‌ఫుల్‌గా నిరోధించగలుగుతాయి. అంతే కాదు.. మనకు అనూహ్యంగా వచ్చేస్తున్న వైరల్ రోగాలన్నీ కూడా గాల్లోంచి విస్తరించి అంటుకుంటున్నవే.. ఎయిడ్స్ నుంచి స్వైన్‌ఫ్లూ, డెంగ్యూ వంటి వ్యాధులన్నీ గాలి కాలుష్యం నుంచి వ్యాపించినవే.. యజ్ఞంలో ఉపయోగించే ఔషధ మూలికలు అన్నీ వీటిని ముందుగానే నిరోధిస్తాయి. రోగాల్ని నిరోధించే శక్తి యజ్ఞవాయువును పీల్చటం ద్వారా మనకు వస్తుంది.

భారతీయ సైంటిఫిక్ స్పిర్చ్యువాలిటీకి యజ్ఞం తిరుగులేని ఉదాహరణ. ఏదో చేద్దామని.. ఏదేదో సృష్టిద్దామని.. ఎవరినో శాసిద్దామని.. మహా మారణాయుధాలను మంచం కింద పెట్టుకుని, హాయిగా నిద్రిస్తున్నామనుకుంటున్నాం.. మనం పెంచిన పాములు మనల్నేం చేస్తాయన్న ధీమాతో ఉంటున్నాం.. కానీ, ఆ ఆయుధాలనే పాములు మాటేసుకుని వున్నాయి. కాలం కోసం ఎదురు చూస్తున్నాయి. చిన్న అవకాశమొచ్చినా ప్రళయం సృష్టించేందుకు సిద్ధంగా ఉన్నాయి. దీన్ని నియంత్రించటం అవసరం. దానికి యజ్ఞం ప్రపంచానికి ఒకదారి చూపిస్తోంది.. దాన్ని ఏదో ఒక రూపంలో ప్రపంచం అనుసరించటం మానవాళికే ప్రయోజనం. వేదాల్లో అన్నీ ఉన్నాయిష అని గురజాడ అప్పారావు కన్యాశుల్కంలో ఓ పాత్ర వెక్కిరిస్తుంది. ఇది భారతీయ కల్చర్‌పై ఒకవిధంగా మిటకరించటమే. దేవుణ్ణి నమ్మవచ్చు.. నమ్మకపోవచ్చు.. కానీ, మనవాళ్లు చెప్పుతున్న విషయాల్లో వాస్తవం ఏమిటన్నది తెలుసుకునేందుకైనా ప్రయత్నించాలి. వేదాల్లో యజ్ఞం ఒక పార్ట్ మాత్రమే.. వాటిని మత గ్రంథాలుగా చూడకుండా, అందులోని సాంకేతిక నైపుణ్యాన్ని గ్రహించటం వల్ల ప్రయోజనం తప్ప చెడుమాత్రం కలగదు.

# దేవుని రథం

*దేవుళ్లు.. భూమికి ఎలా వచ్చేవారు?*

*వ్యోమగాములా దేవుళ్లు?*

*జంతు వాహనాలు నిజమేనా?*

*దేవుళ్లు వాడిన వాహనాలేమిటి?*

*టూవీలర్సా? ఫోర్ వీలర్సా?*

*లేక రథాలేనా వారి వాహనాలు?*

*అవి ఎలా నడిచేవి?*

*వాడిన ఇంధనం ఏమిటి?*

*ఎగిరే రథాలున్నాయా?*



నలభై వేల ఏళ్ల క్రితం దేవుళ్లు భూమ్మీదకు తరచూ వచ్చేవారా? వాళ్లు వ్యోమగాములా? అంతరిక్షం నుంచి అవనిలోకి ఎలా వచ్చేవారు? ఏ వాహనంపై వచ్చేవారు? టూవీలర్స్ ఉండేవా? లేక ఫోర్ వీలర్సా.. అసలు వీల్సే లేని ఫ్లైయింగ్ సాసర్లా? ఎలా వచ్చే వారు? ఒక వేళ ఫ్లైయింగ్ మిషన్ అయితే అది ఎలా ఉండేది? అందులో ఏ ఇంధనాన్ని వాడేవారు? బోలెడు ప్రశ్నలు. జవాబులు వెతుక్కున్నా దొరుకుతాయో లేదో తెలియని ప్రశ్నలు.. మనం సినిమాల్లో చూసినట్లు దేవుళ్లు అనుకున్న సమయానికి మాయమై.. అనుకున్న చోటికి క్షణాల్లో చేరిపోవాలి కదా. మరి ఈ వాహనాలేమిటి? వీటి కథా కమామిషు ఏమిటి?

రోదసి నుంచి భూమి మీదకు... భూమి నుంచి తిరిగి రోదసిలోకి... సూపర్ సోనిక్ రాకెట్ కంటే వేగం.. మనం ఇవాళ ఉపగ్రహాలలో వ్యోమగాములను అంతరిక్షంలోకి పంపిస్తున్నట్లే, నాడు ఇతర గ్రహాల నుంచి కూడా భూమి మీదకు రాకపోకలు సాగాయి. అద్భుతమైన టెక్నాలజీతో తయారు చేసిన చారియట్‌లలో భూమ్మీదకు ప్రయాణాలు జరిగాయి. ఆ వచ్చిన వారు రోమ్ ప్రజలకు ఏంజిల్స్ అయితే, భారత దేశానికి దేవుళ్లయ్యారు.. మరి వారి వాహనాలు సూపర్ టెక్నాలజీకి రుజువులు. వాతావరణంలో ఉన్నా, శూన్యంలో ఉన్నా, భూమిపై అయినా, ఆకాశంలో అయినా, వాయువు అందుకోలేని వేగం. కాల వేగాన్ని మించిన స్పీడ్. ఒక గ్రహం నుంచి వేరే గ్రహానికి ఒక మిల్కీవే నుంచి మరో మిల్కీవే వరకు అలవోకగా జర్నీ. గాల్లో ఎగురుతాయి. శూన్యాన్ని చీల్చుకుని వెళ్తాయి. రోదసి నుంచి భూమ్మీదకు. ఫ్లైయింగ్ డివైస్‌లలో రాక. వెహికిల్స్‌లో వాడిన ఇంధనం

ఏమిటి? ఆనాడు పెట్రోలు ఉందా? మరింకేదైనా ఇంధనమా? ఇంజన్ స్పీడ్ ఎంత? హెల్మెట్లు ధరించేవారా?

పురాణాల్లో, ఇతిహాసాల్లో భక్తులకు దేవుడు దర్శనమివ్వటం మనకు తెలుసు. ఎన్టీయార్ సినిమాల్లో ఇలాంటి సీన్లు మామూలే.. తపస్సు చేస్తే దేవుడు ప్రత్యక్షమవుతాడు.. యజ్ఞం చేస్తే దేవుడు వచ్చేస్తాడు.. నోములు నోస్తే అమ్మవారు కరుణిస్తుంది. దివి నుంచి భువికి దిగి వచ్చి కోరిన వరాలను కొండంత ఇచ్చి వెళ్లిపోతారు. నిజానికి వాళ్లు ఎలా వచ్చేవారు.. ఎలా వెళ్లి పోయేవారు? వారు ఉపయోగించిన వెహికిల్స్ ఏమిటి? అన్నది ఇప్పటికీ మిస్టరీయే. మన దేవుళ్లకేమో ఉన్న వాహనాలు విచిత్రంగా ఉంటాయి. మహాశివుడికి నంది వాహనం.. విష్ణుమూర్తికేమో గరుత్మంతుడు, అమ్మల్లో ఒక అమ్మకేమో సింహం, మరో అమ్మకు హంస... ఇంద్రుడికి ఏనుగు.. గణపతికి ఎలుక.. కుమారస్వామికి నెమలి, అయ్యప్పకు పెద్ద పులి.. ఏమిటివి? వాహనాలేనా? దేవుళ్లను చూస్తేనేమో మనలాగే కనిపిస్తారు. కాకపోతే వేషంలో కాస్త డిఫరెంట్.. మరి అలాంటప్పుడు ఈ జంతువులపై దేవుళ్లు తిరగటమేమిటి? భక్తుల కోర్కెలు తీర్చేందుకు ఈ వాహనాలపైనే వాళ్లు వచ్చేవారా? లేక వేరే వాహనాలేమైనా ఉన్నాయా? అసలు దేవుళ్లకు ఉన్న వాహనాలేమిటి? దేవుళ్లకు జంతు వాహనాలన్నది మన ఇతిహాసాల్లో ప్రతీకాత్మకంగా చెప్పిందే తప్ప.. మరేమీ కాదు.. ఆయా దేవీ దేవతల స్వరూప స్వభావ సామర్థ్యాలను బట్టి ఆయా జంతు వాహనాలను మనమే కల్పించుకున్నాం. కానీ, వాళ్లు ఇంతకంటే జెట్‌స్పీడ్ వాహనాల్లో తిరిగారు.

గుర్రాలు పూన్చిన రథాలపై రామాయణ, మహాభారత యుద్ధాలు జరిగాయన్నది మనకున్న సినిమా నాలెడ్జి. కానీ అంతకంటే అడ్వాన్స్‌డ్ టెక్నాలజీ మన వాళ్ల సొంతం. రోదసి నుంచి గాడ్స్ సూపర్ టెక్నలాజికల్ ఎయిర్ వెహికిల్స్‌పై తిరిగేవారు. ఒక గ్రహం నుంచి మరో గ్రహానికి వెళ్లేవారు.. మనుషులకూ హెల్ప్ చేసేవారు. ఇవే వారికి రథాలు.. మనకు విమానాలు.. జస్ట్ అంతే తేడా. గ్రహాంతర వాసులు, గాడ్స్ భూమ్మీదకు వచ్చి వెళ్లినట్లు ప్రీ–హిస్టారిక్ ఆనవాళ్లు చాలా ఉన్నాయి. పెరూ ఇందుకు పెద్ద ఉదాహరణ.. పెరూలోని నాజ్కా పాంతంలో 40 వేల ఏళ్ల నాటి ఎయిర్‌ఫీల్డ్‌లు కనిపించాయి. గాడ్స్ ఎయిర్‌క్రాఫ్ట్‌లకు సంబంధించిన నమూనాలు కూడా వరల్డ్ ఆర్కియాలజిస్టులకు లభించాయి. అంతే కాదు.. పెరూలో కనిపించిన కొన్ని బొమ్మల్లో ఇతర గ్రహాల నుంచి వచ్చిన వాళ్లవీ ఉన్నాయి. వాళ్లు హెల్మెట్ కూడా ధరించినట్లు తెలుస్తోంది.

జీసెస్‌కు సంబంధించిన బైబిల్ చిత్రాల్లో, రామాయణ భారతాలకు చెందిన ప్రాచీన పెయింటింగ్స్‌లో ఏంజిల్స్ ఎయిర్‌క్రాఫ్ట్‌ను మనం చూడవచ్చు. ఎగిరే రథాలపై తిరుగుతూ యుద్ధాలు కూడా చేసినట్లు ఈ బొమ్మలు చెప్తున్నాయి. అంటే మన పురాణాలు, ఇతిహాసాల్లో పేర్కొన్న అంశాలు, బైబిల్ చెప్తున్న కథలు, ఖురాన్ విప్పి చెప్పిన విషయాలు పూర్తిగా సత్యదూరం కావన్నమాట. మనం ఇవాళ ఉపగ్రహాలను పంపిస్తున్నాం. స్పేస్ రీసర్చ్

కోసం వ్యోమగాములు వాటిలో వెళ్తున్నారు. స్పేస్ టూరిజం కూడా డెవలప్ అవుతోంది.. స్టోన్ ఏజ్‌లో కూడా ఇతర గ్రహాల నుంచి మన ప్లానెట్‌పైకి గ్రహాంతర వాసులు వచ్చేవారా? అవుననటానికి చాలా ఆధారాలున్నాయి. చిత్రాల్లో సాక్ష్యాలు కనిపించాయి. ఆర్కియాలజికల్ ఎవిడెన్స్ కూడా చాలినంత ఉంది.. దేవుళ్లు కూడా భూమికి ఆవల ఉండేవారు కాబట్టి వాళ్లూ గ్రహాంతర వాసులే కదా... మనిషికి సహాయం చేసేందుకు వారూ ఇలాగే వచ్చేవారా?

1969 జూలై 20 నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రుడిపై తొలి అడుగు మోపిన మనిషి.. ఈ భూమ్మీద నుంచి మరో గ్రహానికి వెళ్లిన తొలి వ్యక్తి. జస్ట్‌లైక్ గ్రహాంతర వాసి. 2008 మే నెలలో వాటికన్ ఒక ప్రెస్ రిలీజ్ చేసింది. ఇతర గ్రహాల్లో జీవులు ఉన్నట్లు ఆధారాలున్నాయన్నది ఆ ప్రెస్‌నోట్ సారాంశం. ఇప్పుడు మార్స్‌లో ఐస్ కనిపించింది.. నీటి ఆధారాలు ఉన్నట్లు తేలింది. ఇవన్నీ ఇతర గ్రహాల్లో జీవులు ఉన్నారనటానికి క్రమంగా బలపడుతున్న ఆధారాలు.. వీటన్నింటికీ మించి 1968లో అంటే నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ వాడిన విమానాల్లో మెర్క్యురీని ఇంధనంగా వాడినట్లు తెలుస్తోంది. భూవాతావరణంలో ఆనాడు వారికి హైడ్రోజన్ అవసరం రాలేదు. మెర్క్యురీని ఇంధనంగా ఉపయోగించారు. దీని వల్ల గాడ్స్ వెహికిల్స్ కంటే తక్కువే అయినా, ఇవాళ మనం ఉపయోగిస్తున్న విమానాల కంటే ఎన్నో రెట్లు వేగంగా ప్రయాణించేవి. ఈ వెహికిల్స్‌లో ఇంజన్‌లు కూడా రాకెట్లలో వాడే జెట్ ఇంజన్ల లాంటివేనని ఖగోళ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. దీనివల్లనే స్పీడీనెస్‌ను సాధించగలిగి ఉండవచ్చు. భారతీయ విమాన శాస్త్రంలో చూపించిన నమూనాల్లోనూ జెట్ ఇంజన్ ప్రస్తావన ఉంది. నాటి విమానాలకు వార్‌హెడ్స్ కూడా ఉన్నట్లు తెలుస్తోంది. ప్రాచీన నాగరికతలో దొరికిన ఆనవాళ్లు, మనుషులకు టెక్నాలజీపరంగా గాడ్స్, గ్రహాంతర వాసుల నుంచి పూర్తి సహకారం అందినట్లు చెప్తున్నాయి. గ్రహాంతర వాసులను గాడ్స్‌గా వాటికన్ సిటీ పరోక్షంగా అంగీకరించింది. మన ఇతిహాసాలు, చారిత్రక ఆధారాలు, ఖగోళ పరిశోధనలు వీటిని ఎప్పుడో నిర్ధారించాయి. చారియట్స్ ఆఫ్ గాడ్స్ రచయిత ఎరిక్ వాన్‌డానికెన్ వాళ్ల ఉనికిని స్పష్టం చేస్తున్నాడు. ప్రపంచంలో ప్రాచీన నాగరికత అభివృద్ధికి వాళ్లు దోహద పడ్డారనటానికి అన్ని రకాల ఆధారాలను చూపిస్తున్నాడు. ఇక ఎంతమాత్రం ఖండించే వీలు లేదని స్పష్టం చేస్తున్నాడు.

## దేవతల రాక..పోకలు

సూర్య నారాయణుడు.. యహోవా.. అల్లా.. ఆదిశక్తి.. త్రిమూర్తులు యూదుల దేవుడు.. అంతా ఈ భూమ్మీదకు వచ్చి వెళ్తున్నారు.. చతుర్వేదాలు.. అష్టాదశ పురాణాలు.. ఇతిహాసాలు.. బైబిల్.. ఖురాన్ దేవతల రాకపోకలకు ప్రత్యక్ష సాక్ష్యాలు. ఇవి మిథ్య కాదు. పుక్కిటి కథలు కానే కావు. మానవుల కంటే సమర్థులు. వెయ్యిరెట్లు శక్తిమంతులు. కాల గమనాన్ని సైతం శాసించగలవారు. రోదసిలోంచి అనంత సౌరమండలం ఆవలి నుంచి జాడ తెలియని దేవలోకం నుంచి భూమ్మీదకు వచ్చివెళ్తున్నారు. లక్షల సంవత్స



**రోదసిలోంచి అనంత సౌరమండలం ఆవలి నుంచి జాడ తెలియని దేవలోకం నుంచి భూమ్మీదకు వచ్చివెళ్తున్నారు. లక్షల సంవత్స రాలుగా భూమికి వారు అతిథులు. భూమికి ఓ రూపాన్నిచ్చిన వారు. పంచభూతాలతో నిర్మాణం చేసిన వారు. మట్టిమనిషికి టెక్నాలజీ నేర్పిన వారు. అనంతశక్తి సంపన్నులు.**

రాలుగా భూమికి వారు అతిథులు. భూమికి ఓ రూపాన్నిచ్చిన వారు. పంచభూతాలతో నిర్మాణం చేసిన వారు. మట్టిమనిషికి టెక్నాలజీ నేర్పిన వారు. అనంతశక్తి సంపన్నులు.
అనంత కాంతిపుంజం వారిని ఆవరించింది. ఆకాశంలో ఉరుములు ఒరిగిపడుతున్నాయి. మబ్బులు జారిపోతున్నాయి. ఆకసాన్ని చీల్చుకుని అంతులేని వేగంతో భగవంతుడు దిగివస్తున్నాడు. మన ఇతిహాసాలు, మత గ్రంథాలు, గోడలపై శిల్పాలు, చిత్రాలు అన్నీ నిజమేనని ఇప్పుడు శాస్త్రవేత్తలు అంటున్నారు. టర్కీ.. ప్రపంచంలో అతి గొప్ప ఆర్కియాలజికల్ మాన్యుమెంట్స్‌కు ఈ చిన్న నగరం సెంటర్‌పాయింట్ అయింది. క్రీస్తు పూర్వం 1200లో ట్రోజన్ వార్‌కు ప్రధాన రణస్థలి టర్కీ. గ్రీకు ప్రాచీన చరిత్ర ప్రకారం ట్రోజన్‌లు అంటే దేవీ దేవతలన్న మాట.. దేవతలకు మరణం లేకపోయినప్పటికీ.. అప్పుడప్పుడూ హర్ట్ అవుతుంటారట.. ఈ దేవతల మధ్య ప్రస్తుతం టర్కీ ఉన్న ప్రాంతంలో మహాయుద్ధం జరిగిందని కథనం.. రెండు శతాబ్దాల క్రితం వరకు ఇది ఒక కథగానే వుండిపోయింది. కానీ, క్రీస్తుశకం 1868లో ప్రముఖ ఆర్కియాలజిస్ట్ హెన్రిచ్ శ్లీమన్ టర్కీలో ఈ యుద్ధం జరిగిన ప్రాంతాన్ని ఆధారాలతో సహా కనుగొన్నాడు. ట్రాయ్ వంశం పరిపాలించిన టర్కీలోని ఉత్తర ప్రాంతంలోనే దేవతల యుద్ధం జరిగిందని ప్రకటించాడు. శ్లీమన్ చెప్పిన మాటే నిజమైతే.. దేవతలు భూమ్మీదకు దిగి వచ్చినట్లే భావించాలి.. అదే వాస్తవమైతే గ్రీకుల ప్రాచీన ఇతిహాసాలు, పురాణాల్లోనూ వాస్తవాలున్నాయని అనుకోవాలి. అత్యంత శక్తిమంతులైన దేవతలు నిజంగానే ఉన్నట్లయితే వాళ్లంతా ఎక్కడి నుంచి వస్తున్నారు? ఎలా వస్తున్నారు? దేవలోకం ఎక్కడుంది? గ్రీకు.. ప్రపంచంలోని తొలి నాగరికతలకు పుట్టినిల్లు.. ఇక్కడి పార్థనాన్ దేవాలయాన్ని చూసేందుకు రోజూ వేల మంది పర్యాటకులు వస్తుంటారు. ఈ ప్రాచీన నిర్మాణాలు.. ఈ భూమిని వేల, లక్షల సంవత్సరాల క్రితం మనుషుల కంటే శక్తిమంతులైన వారు పరిపాలించిన వైనానికి ప్రతీకలుగా కనిపిస్తాయి. గ్రీకు ప్రాచీన ఇతిహాసాలు దేవతల గురించిన వివరాలు చాలా చెప్పుకుంటూ వచ్చాయి.



**దేవతలు స్వర్గం నుంచి దిగి వచ్చారు. ప్రపంచంలోని అనేక మాన్యుమెంట్స్‌ను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. దేవతలు నేలకు దిగి వచ్చేప్పుడు కాలానికి అతీతమైన వేగంతో వచ్చేవారట. వాళ్లు నేలకు దిగి వస్తున్నప్పుడు వారి చుట్టూ మబ్బులు ఆవరించి పొగలు కమ్ముకున్నట్లుగా ఉండేదిట. సూర్య కాంతికంటే ఎన్నో రెట్లు ఎక్కువ కాంతి వారితో పాటే భూమికి ప్రయాణించేదిట. ఇదెంత వరకు నిజం?**

దానికి సింబల్‌గా ఈ నిర్మాణాలు నిలుస్తున్నాయి. దేవతలు స్వర్గం నుంచి దిగి వచ్చారు. ప్రపంచంలోని అనేక మాన్యుమెంట్స్‌ను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. దేవతలు నేలకు దిగి వచ్చేప్పుడు కాలానికి అతీతమైన వేగంతో వచ్చేవారట. వాళ్లు నేలకు దిగి వస్తున్నప్పుడు వారి చుట్టూ మబ్బులు ఆవరించి పొగలు కమ్ముకున్నట్లుగా ఉండేదిట. సూర్య కాంతికంటే ఎన్నో రెట్లు ఎక్కువ కాంతి వారితో పాటే భూమికి ప్రయాణించేదిట. ఇదెంత వరకు నిజం? ఒక్క గ్రీకులోనే కాదు.. ప్రపంచ వ్యాప్తంగా.. అన్ని ప్రాంతాల్లో ఎవరికీ అంతుపట్టని విధంగా లభిస్తున్న వస్తువులు కానీ, బయటపడుతున్న నిర్మాణాలు కానీ, బెర్ముడా ట్రయాంగిల్ లాంటి ప్రాంతాల్లో పరిమితికి మించిన మాగ్నెటిక్ పవర్ దేవతల ఉనికి చాటుతున్నాయి. వాళ్లు భూమికి ఇప్పటికీ వస్తున్నారనే సైంటిస్టులు విశ్వసిస్తున్నారు. విశ్వంలో ఎక్కడో ఏదో ఒక చోట ఉన్నారని భావిస్తున్న గ్రహాంతర వాసులే మతాలు నమ్ముతున్న దేవీ దేవతలా? వీళ్లనే, అంటే ఈ గ్రహాంతర వాసులనే మన ప్రాచీనులు దేవతలుగా భావించి ఉండవచ్చు. స్టీఫెన్ హాకింగ్ వంటి ప్రఖ్యాత శాస్త్రవేత్తలు చెప్తున్నట్లుగా ఏలియన్స్ ఉన్నాయన్న మాటే వాస్తవమైతే వీళ్లను మన పూర్వీకులు చూసి ఉంటారా? వీళ్లు మనకన్నా శక్తిమంతులై వాళ్ల నుంచి మేలును పొందారా? ప్రపంచంలోని అన్ని దేశాల్లో ఒకే రకమైన ఆలోచన.. దేవతలు ఆకాశం నుంచి భూమ్మీదకు దిగివచ్చారు.. అన్ని మతాల్లోనూ ఒకే రకమైన అభిప్రాయం లేదా విశ్వాసం. దేవతలు మనకంటే శక్తిమంతులని.. దివ్యశక్తులు కలిగిన వారని.. ఈ భూమి వారి కనుసన్నల్లోనే ముందుకు సాగుతోందని.. ఎలా సాధ్యం? ప్రాచీన నాగరికతలకు సంబంధించి మనకు లభించిన చాలా ఆనవాళ్లు దాదాపు ఒకేలా ఉన్నాయి. ఇవన్నీ విశ్వ రహస్యాలను విప్పిచెప్పే ప్రాథమిక సాక్ష్యాధారాలుగా మనకు కనిపిస్తున్నాయి. కేవలం ఊహాపోహాలే అయితే.. ఇన్ని డిఫరెంట్ కల్చర్స్‌లో ఒకే రకంగా దేవీదేవతల రాకపోకల గురించి ఊహించటం సాధ్యమేనా? క్రీస్తుపూర్వం 3800 సంవత్సరం నాటి సుమేరియన్ నాగరికత ఆనవాళ్లలో

ఆకాశం నుంచి భూమికి దేవతలు దిగివచ్చిన లివింగ్‌బీయింగ్స్ స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆకాశం నుంచి వచ్చిన దేవతలు మనుషులతో అనుబంధాలు పెంచుకున్నట్లు కూడా సుమేరియన్ చరిత్ర చెప్తోంది. దేవతలంటే గ్రహాంతర వాసులే కావచ్చు. కానీ, వాళ్లు సూపర్ నేచురల్ పవర్ ఉన్నవాళ్లు. వాళ్లు మనిషితో మమకారం పెంచుకున్నారు. వీళ్లు దేవతలా కాదా అన్నది ఖచ్చితంగా చెప్పలేకపోయినప్పటికీ, మనకంటే శక్తిమంతులైన జీవులన్నది స్పష్టం. మన పూర్వీకులకు సాంకేతిక పరిజ్ఞానం కొరవడటం వల్ల వీళ్లను దేవుళ్లుగా భావించి ఉండవచ్చు. మౌంట్ ఒలింపస్.. గ్రీస్‌లో అత్యంత ఎత్తైన పర్వతం.. ప్రాచీన ఆధ్యాత్మిక వాదం ప్రకారం ఇది దేవుడి నివాసం.. యూదుల భగవంతుడు ఇక్కడ నివాసముంటాడట.. దీని శిఖరంపై భవ్యమైన మందిరం ఉందని.. సామాన్య మానవులకు ఇది కనిపించదని చెప్తారు. దాదాపు 52 శిఖరాలు ఉన్న ఈ ఒలింపస్ పర్వతం 12 మంది గ్రీకు దేవుళ్లకు ఆవాసంగా విశ్వసిస్తారు. నిజానికి ఇది ఏలియన్‌ల స్థావరమని శాస్త్రవేత్తల అభిప్రాయం. ఈ పర్వత ఉపరిభాగంపై తరచూ ఏలియన్‌లకు సంబంధించిన విమానాలు వచ్చి వెళ్తుంటాయి.. ఈ శిఖరంపై తీవ్రమైన అయస్కాంత శక్తి ఉంటుంది. దీనిపై సాధారణ మనిషి పాదం మోపటం అంత ఈజీ కాదు. వాళ్లు ఈ ఒలింపస్ పర్వతంపై దిగుతున్నప్పుడు సామాన్యంగా ఉండదు.. ఒక పెద్ద పిడుగు ఉరుములతో కలిసి వచ్చేస్తుందిట.. వాళ్లు వచ్చినప్పుడు వెలువడే కాంతి వెలుగులను అంచనా వేయటం తేలిక కాదు..ఈ పర్వతంపై దేవుడి కాంతి బంగారు వెండి వెలుగులతో నిండి ఉంటుంది. చేతిలో ఒక శక్తిమంతమైన ఆయుధాన్ని ధరిస్తాడు.. దాన్ని ప్రయోగించినప్పుడు అందులోనుంచి వేల వాట్ల విద్యుత్తు శక్తి వెలువడుతుంది. ఈ శక్తి ఒక్కసారిగా మొత్తం ప్రపంచాన్నే నాశనం చేస్తుంది. కొన్ని వందల సునామీలు.. భూకంపాలను సృష్టిస్తుంది. మనకు సూర్యుడు ప్రత్యక్ష నారాయణుడు.. గ్రీకులకు నారాయణుడంటే ఎవరో తెలుసా? అపోలో.. ఎసెస్ట్ బ్యూటిఫుల్ గాడ్ ఆఫ్ గ్రీక్.. అగ్ని రథంపై భూమ్మీదకు వచ్చేవాడట. భూమ్మీద మనుషులకు సాంకేతిక పరిజ్ఞానాన్ని అందించిన దేవుడు అపోలో.. భారతీయులకు త్రిమూర్తులు ఎలాంటి వారో.. గ్రీకు నాగరికతలో అపోలో ఈశ్వరుడితో సమానమన్నమాట. క్రిస్టియానిటీ, ఇస్లాం వంటి మతాలు ఆవిర్భవించటానికి ముందు విలసిల్లిన నాగరికతల్లో భగవంతుడిని మనుషులు దర్శించుకున్నారనే చెప్తారు..వాళ్లు చూసింది దేవతలనేనా? సూపర్ నేచురల్ బీయింగ్స్‌నే దేవతలని భ్రమిస్తున్నారా?అపోలో.. అగ్ని రథాన్ని ఎక్కి వస్తుంటే నిప్పుకణికలు విశ్వమంతా విరజిమ్ముతూ ఉండేవట.. ఆయన రథానికి రకరకాల జంతువులు సారథ్యం వహించేవట. ఈయనే భూమి మీద నిర్మాణపు పరిజ్ఞానాన్ని మనిషికి అందించిన వాడు. పర్వతాలపై ఎలాంటి నిర్మాణాలు చేపట్టాలి.. భూమ్మీద ఎలాంటి నిర్మాణాలు ఉండాలి అన్న విషయాలపై మనిషికి అవగాహన కల్పించిన వాడు..ఖగోళ శాస్త్రాన్ని గ్రీకులకు అందించిన వాడు  అపోలో..కాలక్రమంలో గ్రీకు దేవతలే, రోమన్ల దేవుళ్లుగా ట్రాన్స్‌ఫామ్ చెందారు. వాయవ్య ఫ్రాన్స్‌లో ఒక ప్రాంతంలో దాదాపు రెండు

మైళ్ల విస్తీర్ణంలో ఒక విచిత్రమైన రాళ్లు వరుసల్లో నిలబెట్టి ఉన్నాయి. ఇవన్నీ దాదాపు క్రీస్తుపూర్వం 4500 సంవత్సరాల క్రితం నాటివి.. రాతియుగం ముగింపు సందర్భంలోనివని ఒక అంచనా... ఒక్కొక్కటి 350 టన్నుల బరువున్న రాళ్లను ప్రీహిస్టారిక్ ప్రజలు ఎందుకు ఉంచారు? ఇవి సహజంగా ఏర్పడినవి ఎంతమాత్రం కావు.. వీటిని జాగ్రత్తగా గమనిస్తే.. టిపికల్ ట్రయాంగిల్ షేప్‌లో కనిపిస్తాయి. మాథమెటిక్స్‌లోని పైథాగ్రస్ సిద్ధాంతాన్ని ఇవి ప్రతిబింబిస్తున్నాయి. రాతియుగం నాటి ప్రజలకు ఈ సిద్ధాంతం తెలిసే అవకాశమే లేదు. అలాంటప్పుడు ఈ రాళ్ల ఏర్పాటు ఏన్షియెంట్ గాడ్స్ పనా? వాళ్ల మార్గదర్శనంలో మనుషులు చేసిన మహా నిర్మాణాలేనా?

నోర్స్.. స్కాండినేవియా ప్రాంతంలో విస్తరించిన ఆధ్యాత్మిక నాగరికత.. నోర్స్ మైథాలజీకి.. గ్రీకు మైథాలజీకి చాలా పోలికలున్నాయి. వీళ్ల దేవీ దేవతల రూపాల్లోనూ పోలికలున్నాయి. గ్రీకుల జ్యూస్.. నోర్స్‌కు చెందిన ఓడెన్‌కు సంబంధించిన చరిత్ర దాదాపు ఒకే విధంగా కనిపిస్తుంది.. ఇతని ఆయుధం శక్తిమంతమైన సుత్తి. దీనితో అతను దేన్నైనా విధ్వంసం చేయగలడు.. ఇక మన దేశానికి వస్తే మహాభారతంలో కానీ, అష్టాదశ పురాణాల్లో కానీ, వేదాలు కానీ, విస్పష్టంగా దేవీ దేవతల రాకపోకల గురించిన విశ్లేషణ విస్తారంగా జరిగింది.. వాళ్లు వచ్చి భూమిపై మనుషులకు సహాయ సహకారాలను అందించటమూ తెలుసు. దేవతలు సాఫిస్టికేటెడ్ మెషిన్లలో ప్రయాణించే వారట.. దీన్ని మనవాళ్లు విమానాలు అన్నారు.. ఇతరులు యుఎఫ్ఓలుగా చెప్పుకున్నారు.. ప్రాచీన కథనాలు.. అన్ని మైథాల జీలన్నీ దేవీదేవతల రాకపోకలను నిర్ధారించాయి. వాటికి ఇప్పటి పరిశోధనలు బలం చేకూరుస్తున్నాయి. ఇతర గ్రహాల నుంచి యుఎఫ్ఓలు భూమ్మీదకు రావటం గ్రహాంతర వాసులు వచ్చి వెళ్తున్నారన్న డాక్యుమెంట్ ఎవిడెన్స్ దేవతలున్నారన్న కథనాలను మరింత నిజం చేస్తున్నాయి. వాళ్లు ఇప్పుడూ వస్తున్నారా? అంటే దానికి మాత్రం ఎవరి దగ్గరా జవాబు లేదు.. మనుషులు ప్రవేశించని ప్రదేశాలకు వాళ్లు వచ్చి వెళ్తున్నారన్న సంకేతాలను ఏలియన్ సైంటిస్టులు నిజం అంటున్నారు.. ఏలియన్లు హ్యూమన్ డిఎన్ఏపై ప్రయోగాలు కూడా చేస్తున్నారని వాళ్ల అనుమానం. వేల సంవత్సరాలుగా దేవతలతో మనిషికి ఉన్న సంబంధాలను గురించిన చర్చ జరుగుతూనే ఉంది. నిజాలు మాత్రం ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి. గ్రహాంతర వాసుల అస్తిత్వం ఇప్పుడిప్పుడే తెలుస్తోంది. అనంత విశ్వంలో మనం ఒంటరి వాళ్లం కాదని, ఎక్కడో ఏదో గ్రహంలో జీవులు ఉన్నారని సైంటిస్టులు బల్లగుద్ది వాదిస్తున్నారు.. వాళ్లు దేవతలా? లేక కేవలం మనలాగే ఇతర గ్రహాల్లో నివసిస్తున్న జీవులా? ఈ విషయం తేలటానికి ఎంత టైం పట్టినా... దేవతలు లేదా గ్రహాంతర వాసులు ఈ భూమ్మీదకు వచ్చి వెళ్లారన్నది మాత్రం వాస్తవం. మనకు మేలు చేసి వెళ్లారన్నదీ నిజం.

# దేవుడి ఇల్లు



అమర్ మెరూలోని డోర్ ఆఫ్ గాడ్

దేవలోకం తలుపులు.. భూమిని పాలించే మహర్లోకం.. మనిషి వెళ్లలేని దివ్యలోకం.. దేవుడు నివసించే లోకం.. స్వర్గసుఖాల్ని అందించే లోకం.. దేవలోకం జాడ తెలిసింది.. ఆ ఇంటి తలుపులు తెరుచుకున్నాయి.

మనిషికి దేవుడి ఇల్లు కనపడటం ఏమిటి? కాస్త కన్ఫ్యూషన్‌గా ఉన్న మాట వాస్తవమే. కానీ, ఇది వాస్తవం. అది కూడా భూమ్మీదే లభించింది. ఎందుకంటే ప్రపంచం నమ్ముతున్న విశ్వాసం ఇది. ప్రస్తుతం ప్రపంచంలో అతి ప్రాచీన నాగరికతలు లభ్యమవుతున్న చోటే కనిపించిందీ దేవుడి ఇల్లు.

పెరు.. దక్షిణ అమెరికాకు పశ్చిమంగా ఉన్న రిపబ్లిక్ దేశం. మనిషి నాగరికతకు అత్యంత ప్రాచీనమైన మూలాలు బయట పడిన ప్రదేశం ఇది.. ఆది మానవుడి అవశేషాలు దొరికిన ప్రదేశం.. ఇప్పుడు దేవుడి ఇల్లు జాడ చెప్తోన్న ప్రదేశం..ఇక్కడే దేవుడి ఇల్లును కనుగొన్నది.. మనుషులు లేని సమయంలో ఈ తలుపు తెరుచుకుంటుంది. దేవుడు భూమిపైకి వచ్చి మళ్లీ ఇక్కడి నుంచే తిరిగి తన లోకానికి వెళ్లిపోతాడు. పెరులోని చాలా మంది స్థానికులకు ప్రత్యక్షంగా అనుభవంలోకి వచ్చిన విషయమిది. ప్రపంచంలో ఎక్కడా కనిపించని చాలా మూలాలు బయటపడింది పెరూ లోనే. భూమ్మీద తొలి మానవ జంట ఆడమ్, ఈవ్‌లను దేవుడు ఇక్కడే సృష్టించాడంటారు. ఈ అడవుల్లోనే వాళ్లు తిరిగారు.. ఆడుకున్నారు.. దేవుడి ఆజ్ఞను ధిక్కరించి ఆపిల్ పండు తిన్నారు. ఇవాల్టి ఈ సృష్టికి మూల కారణమయ్యారనీ నమ్ముతారు. ఈ ఆది మానవుణ్ణి సృష్టించడానికి దేవుడు భూమిపైకి వచ్చిన ప్రాంతమే దేవుడి నివాసమని భావిస్తున్నారు. ఆయన తన నివాసం నుంచి బయలు దేరి ఆ తలుపులోంచి భూమ్మీదకు వచ్చాడు. దక్షిణ పెరులో 12,800 అడుగుల ఎత్తైన ఆండెస్ పర్వత శ్రేణుల్లో విచిత్రమైన ఈ నిర్మాణం కనిపిస్తుంది. వేల సంవత్సరాల నుంచి భూమ్మీద ఉన్న మిస్టీరియస్ నిర్మాణం ఇది. ఈ కొండకు ఒక ద్వారం ఉంది. దానికి ఒక కీహోల్ కూడా ఉంది. ఇందులోంచే దేవుడు భూమ్మీద కాలు మోపాడన్నది ఒక విశ్వాసం.

ఈ ద్వారం గుండా లోపలికి ప్రవేశించగలిగితే.. దేవుడి నివాసానికి వెళ్లే దారి కనిపిస్తుందిట. అది మామూలుగా ఉన్నప్పుడు రాయి లాగానే ఉంటుంది. కొన్ని సందర్భాల్లో ఆక్టివేట్ అవుతుంది. అప్పుడు మాత్రమే అది తెరుచుకుంటుంది. అది యాక్టివేట్ అయినప్పుడు అక్కడున్న ప్రతి వారికీ విచిత్రమైన ఎక్స్‌పీరియన్స్ కలుగుతుంది. ఇది ఒక

సాండ్ స్టోన్.. అదీ చతురస్రాకారంలో ఉంది. దీని పేరు అమర్ మెరు. సైంటిఫిక్‌గా చూస్తే ఇది ఒక రాతి కట్టడం మాత్రమే. దీన్ని దేవుడి తలుపుగా ఎలా భావించాలి? స్థానికుల విశ్వాసాన్ని ఎలా ప్రాతిపదికగా తీసుకోవాలి? కానీ, ఇదే నిజం.. ఇది స్థానికుల విశ్వాసం మాత్రమే కాదు.. అక్కడికి వెళ్లే ప్రతి పర్యాటకుడికీ ఎదురయ్యే అరుదైన అనుభవం. దేవుడి తలుపు ఒక నిజం. అది యాక్టివేట్ కావటమూ నిజం.

అమర్‌మెరూ డోర్‌వే వెనుక శక్తులు ఉన్నాయనే అక్కడికి వెళ్లిన ప్రజలంతా విశ్వసిస్తారు. దాని వెనుక సైన్స్‌కు అంతుపట్టని ఏవో తరంగాలు పని చేస్తున్నాయి. దాని దగ్గరకు వెళ్లిన వారికి విచిత్రమైన అనుభవం కలుగుతోంది. అక్కడ దైవశక్తి ప్రబలంగా ప్రభావితం చేస్తుంది. అక్కడి గాలిలో, ధూళిలో, నేలలో, ఆకాశంలో అంతటా దైవమే కనిపిస్తుంది. ఆ తలుపు వెనుకే మహర్లోకపు మార్గముండటం వల్లనే ఇదంతా జరుగుతుందని అందరి నమ్మకం. దక్షిణ పెరులో టిటికాకా సరస్సు ప్రాంతంలో అమర్ మరు డోర్‌వే ఉంది. ఇది సాండ్ స్టోన్‌తో ఉన్న నిర్మాణం. ఇది మానవ నిర్మితమనటానికి ఎలాంటి ఆధారాలు లభించలేదు. ఆకాశం నుంచి దిగి వచ్చిన వారికి సంబంధించిన నిర్మాణమే ఇదని అంతా నమ్ముతారు. ఈ నమ్మకం తప్ప దీనికే ఆధారంలేదు.. సైంటిఫిక్‌గా ఏ విధంగానూ రుజువు కాని మిస్టరీ ఇది. సాండ్ స్టోన్ మౌంటెన్ ఒక పద్ధతి ప్రకారం ఎలా ఏర్పడిందన్నది ఇంతవరకూ తేలలేదు. చతురస్రాకారంగా ఒక పర్వతం తనంత తానుగా ఏర్పడటం ఎలా సాధ్యం? దీనిపై రకరకాల పరిశోధనలు చేశారు. కాల నిర్ణయం కోసం కార్బన్ డేటింగ్ చేశారు. కానీ, ఏదీ స్పష్టం కాలేదు. ఏదీ అర్థం కాలేదు. కానీ, దీని దగ్గర ఎలక్ట్రో మాగ్నెటిక్ పవర్ లాంటిది ఏదో ఇక్కడ దాగి ఉంది. ఇదేదో ఆషామాషీగా చెప్పుతున్న సంగతేం కాదు.. మీరూ చూడవచ్చు. టిటికాకా సరస్సుకు షికారుకు వచ్చిన జెర్రీ అనే వ్యక్తి డోర్‌వే గురించి తెలుసుకోవాలనుకున్నాడట.. ఎర్రని షాల్ చుట్టూ కప్పుకుని డోర్‌వేలోకి ఎంటర్ అయిపోయాడు.. కొద్ది సేపటికే ఎలక్ట్రో తరంగాలు అతణ్ణి చుట్టుముట్టాయి. అంతా చూస్తుండగానే ఒక్కసారిగా అతను మాయమైపోయాడని చెప్తారు. డోర్‌వే ముందు నిలుచున్న జెర్రీకి ఉన్నట్టుండి ముందుకు పడిపోతున్న ఫీల్ కలిగింది. ఏం జరుగుతోందో అర్థం కాలేదు.. ముందు ఒక గొప్ప వెలుగుతో ఉన్న దారి కనిపించింది. అంతా చూస్తూనే ఉన్నారు.. కళ్ల ముందే జెర్రీ ఒక్కసారిగా మాయమైపోయాడు.. ఏం జరిగిందో అర్థం అయ్యే లోగానే.. మళ్లీ ఎలా మాయమయ్యాడో.. అలాగే ప్రత్యక్షమై పోయాడు.. ఇదంతా జరిగేసరికి ఒకటిన్నర నిమిషం వ్యవధిలోనే జరిగిపోయింది. ఇదెట్లా సంభవించిందంటే ఎవరికీ తెలియదు.. సైన్స్ కూడా ఇప్పటికీ డిఫైన్ చేయలేకపోయింది.

ఇక్కడే మరో విచిత్రం ఉంది. ఈ దేవుడి తలుపుకు ఒక కీహోల్ వంటి రంధ్రం కూడా ఉంది. దీని ద్వారానే గేట్ తెరుచుకుంటుందని, ఇందులోంచే దైవ శక్తి తరంగాలు వెలుపలికి వస్తాయని అంటారు. పెరులో ప్రాచీన మానవ నాగరికతకు సంబంధించిన చాలా చాలా

ఆనవాళ్లు బయటపడ్డాయి. కానీ, దేనికీ లేని ప్రాధాన్యం డోర్‌వే ఆఫ్ అమరు మెరుకు వుంది. భూమ్మీద మరెక్కడా కనిపించని మిస్టీరియల్ పవర్ ఇక్కడ స్పష్టంగా ప్రతి ఒక్కరికీ అనుభవంలోకి వస్తుంది. అన్నింటికీ మించి ఈ డోర్‌కు ఉన్న కీహోల్ రహస్యం ఏమిటి? టిటికాకా సరస్సు పక్కనే నివసించే స్థానికులు రోజూ ఉదయాన్నే ఈ దేవుడి తలుపుకు సంప్రదాయ బద్ధంగా పూజలు చేస్తారు. వీళ్లంతా పేద రైతులు. ఈ దేవుడి తలుపుకు ఎదురుగా ఉన్న పొలాల్లో వ్యవసాయమే వీళ్లకు ఆధారం. ఇక్కడ మాత్రమే వీళ్లు వ్యవసాయం చేస్తారు. ఈ ప్రాంతాన్ని వదిలి ఇంకెక్కడికీ వెళ్లరు. తరాల కొద్దీ కొనసాగుతున్న సంప్రదాయమే ఇది. రాత్రి పూట మాత్రం ఏ ఒక్కరూ కూడా ఈ దేవుడి తలుపు దరిదాపుల్లోకి కూడా రారు. ఎందుకంటే స్థానికులకు ఇక్కడ చాలా అనుభవాలు ఎదురయ్యాయి. దీనికి ఎదురుగా ఆడుకోవటానికి వెళ్లిన పిల్లలు మాయమైపోయారని చెప్తారు. పెరులో దొరికిన శాసనాల ప్రకారం తొలి మత గురువుల్లో ఒకరైన అమరు మెరు.. ఈ గేట్‌వేను తెరిచేందుకు ప్రత్యేక పరికరాన్ని తయారు చేశాడు. ఇది ఒక గోల్డెన్ డిస్క్ ఆకారంలో ఉంటుంది. ఈ గేట్‌వేను ఈ గోల్డెన్ డిస్క్ సహాయంతోనే యాక్టివేట్ చేసేవారు. ఇది ఒకసారి యాక్టివేట్ అయితే.. దీని లోపలికి వెళ్లి రావటానికి దారి ఏర్పడుతుంది. ఈ గోల్డెన్ డిస్క్ ఆకాశంలోంచి వచ్చిందని మరో కథనం ప్రచారంలో ఉంది. ఆర్కియాలజిస్టులు ఎగ్జామిన్ చేసినప్పుడు డోర్‌వేలో సర్క్యులర్ డిస్క్ ఆకారం కనిపించింది. ఇదంతా చూస్తే, వింటే రబ్బిష్ అని అనిపిస్తుంది. కానీ, దీని వెనుక ఎక్స్ట్రా టెర్రెస్టియల్ పవర్స్ బయటపడ్డాయి. ఈ విషయాన్ని శాస్త్రవేత్తలే ఒప్పుకుంటున్నారు.. మామూలు మనుషులకే దీని పవర్ ఏమిటన్నది అనుభవంలోకి వచ్చింది. ఇతర గ్రహాల నుంచి వచ్చిన ఇద్దరు స్పేస్ బ్రదర్స్, దీన్ని యాక్టివేట్ చేసినట్లు చెప్పుకుంటారు. గేట్ ఆఫ్ గాడ్ ఒక్కసారి యాక్టివేట్ అవుతే.. విశ్వంలో ఒక చివరి నుంచి మరో చివరకు వెళ్లే అవకాశాలు ఉన్నాయని అంటారు. గ్రహాంతరవాసులు యుఎఫ్ఓల్లో లేక్ టిటికాకా సమీపంలో దిగినట్లుగా చెప్తారు. ఇప్పుడు ఈ ఎక్స్ట్రా టెర్రెస్ట్రియల్ పవర్స్ గురించి సైంటిస్టులు పాజిటివ్‌గా ప్రయోగాలు చేస్తున్నారు.. గ్రహాంతర వాసులు ఉన్నారనటానికి ఇదీ ఒక ఉదాహరణ అని వాళ్లు ఒక కంక్లూజన్‌కు ఇప్పటికే వచ్చేశారు. ఇది దేవుడి డోర్‌వే కావటానికి కారణం బెర్ముడా ట్రయాంగిల్‌లో వున్న మాగ్నటిక్ పవర్ ఇక్కడ కూడా కనిపించటమే. సైంటిఫిక్‌గా ప్రూవ్ అయిన విషయమే ఇది. దీని దగ్గరకు వెళ్లగానే ఇందులోని కీహోల్‌ను తగలగానే మాగ్నెటిక్ పవర్ మనిషిని తనలోకి లాక్కొనేందుకు ప్రయత్నిస్తోంది. ఈ పవర్ సామర్థ్యం కానీ, దీని వెనుక ఉన్న సీక్రెట్‌ను కనుక్కోవటం ఇప్పటికైతే ఎవరి తరం కాలేదు. ప్రపంచంలో మిస్టీరియస్‌గా మిగిలిపోయిన ప్రాంతాల్లో ఇదీ ఒకటి. దీని ఆనుపానులేమిటన్నది దేవుడికి మాత్రమే తెలుసు... అందుకే ఇది దేవుడి తలుపు అయింది.. ఇది తెరుచుకుంటే ఆ లోపల ఉన్నది దేవుడి ఇల్లు.. లేకుంటే.. ఒక చారిత్రక ఆనవాలు.

# దేవ రహస్యం



దేవతలు ఎవరు? మనల్ని ఈ భూమ్మీద సృష్టించింది వాళ్లేనా? నిజంగా మన సృష్టి కర్తలు దేవతలే అయితే... వాళ్లు ఎలా ఉంటారు? వాళ్ల ఉనికి ఏమిటి? ఈ ప్రశ్నలన్నీ ఎవరికీ అర్థం కాని ఓ పే..ద్ద బ్రహ్మపదార్థం లాంటివి. అన్ని దేశాల్లో అన్ని మతాల్లో రోజూ ఎక్కడో ఓ చోట.. ఏదో రకంగా జరుగుతున్న చర్చ ఇదే. మిగతా మతాల మాటెలా ఉన్నా.. మన దేవతల తీరే వేరు.. అనేక రకాల రూపాలు.. అర్థం కాని వాహనాలు.. అసాధారణమైన ఆయుధాలు.. అపూర్వమైన శక్తియుక్తులు.. చిత్రవిచిత్రమైన కథనాలతో కనిపిస్తారు.. ఒకరు కాదు.. ఇద్దరు కాదు.. ముక్కోటి మంది దేవతలు ఉన్నారని చెప్తారే.. వీళ్లంతా ఎక్కడ ఉన్నారు? అసలు ఈ మాటల్లో, పురాణాల్లో, కథనాల్లో వాస్తవం ఉందా? ఉంటే అదేమిటి? భూమ్మీద మనిషి జీవితం మొదలైనప్పటి నుంచీ దేవతల గురించిన వాదోపవాదాలు జరుగుతూనే ఉన్నాయి. మనిషికి ఊహ తెలిసినప్పటి నుంచీ చర్చ కొనసాగుతూనే ఉంది. దేవుడున్నాడనే వాళ్లు కొందరు. లేరనే వారు ఇంకొందరు.. వాదాలు.. ఉపవాదాలు. చర్చలు.. ఉప చర్చలు.. ఆధారాలు చూపే ప్రయత్నాలు.. పూజలు.. పునస్కారాలు.. నమ్మకాలు.. మూఢ విశ్వాసాలు.... అన్నీ.. దేవుడి చుట్టూనే తిరుగాడుతూ వస్తున్నాయి. ఇంకా తిరుగుతూనే ఉంటాయి. నిజానికి చాలా యుగాల క్రితమే మన పురాణాల్లో గ్రహాంతరాల్లో వేరే లోకాలు ఉన్నాయని, అందులో జీవులు ఉంటున్నారన్న

   

*వివిధ ప్రాంతాల్లో ఏలియన్‌లు వచ్చి వెళ్లారని భావిస్తున్న ఎగిరే పళ్లాలు.. ప్రాచీన చిత్రాల్లో ఆకాశం నుంచి దేవతలు వచ్చి వెళ్లినట్టున్న దృశ్యాలు*

ప్రస్తావన ఉంది.. వారి గురించి పరిశోధన చేసినట్లూ, వారితో మనుషులు కలిసినట్లూ వుంది... వాళ్లందరూ మనకన్నా చాలా రెట్లు శక్తి మంతులు.. వాళ్ల అనుగ్రహం మనపై ఉంటే మనకు అంతా మంచి జరుగుతుందని భావిస్తూ వస్తున్నాం.... వీళ్లే దేవతలా?

భూమి... లేదా భూగోళం.. ఇంకా చెప్పాలంటే భూలోకం. మనం ఉంటున్న లోకం ఇది.. ఈ లోకానికి కింది భాగాన ఏడు లోకాలు.. పై భాగాన మరో ఆరు లోకాలు వున్నట్లు మన పురాణ ఇతిహాసాలు చెప్తున్నాయి..భూమికి దిగువన అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళ లోకాలు ఉంటే, ఎగువన భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనోలోక, తపోలోక, సత్యలోకాలు ఉన్నాయని భావిస్తున్నాం.. పై లోకాల్లో యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, కింపురుష, మహర్షులు ఉన్నారని, సత్యలోకంలో బ్రహ్మదేవుడు ఉంటాడని చెప్తారు. బ్రహ్మ దేవుడి పైన క్షీరసాగరం, వైకుంఠం, కైలాసాదులు ఉన్నాయంటారు. భూమ్మీద తపస్సు చేసిన వారికి దేవతలు ఆకాశం నుంచి ప్రత్యక్షమవుతారు.. కోరిన వరాలిచ్చి ఆదుకుంటారు. గంధర్వులు, దేవ కన్యలు దివి నుంచి భువికి దిగివస్తారు. వీళ్లను మనం పూజిస్తున్నాం.. ఆలయాలను నిర్మించి ఆరాధనలు చేస్తున్నాం.. హోమాలు చేస్తున్నాం.. వీళ్లు మనను అనుగ్రహిస్తున్నారని విశ్వసిస్తున్నాం.. అయితే ఎక్కడి నుంచి మనల్ని చూస్తున్నారు. ఎలా అనుగ్రహిస్తున్నారు? బ్రహ్మదేవుడు సత్యలోకంలో వుంటాడు.. అక్కడి నుంచి ఆయన ఈ భూమ్మీద జీవులను సృష్టిస్తుంటాడు.వాళ్లను పరిపాలించే బాధ్యత.. ఆ బ్రహ్మపైన ఉన్నది విష్ణుమూర్తి. ఆయన వైకుంఠంలో పాల సముద్రంలో లక్ష్మీదేవి చెంతన ఉంటాడు. అందరి జీవితాలు ముగిసిపోయిన తరువాత తనలో లయం చేసుకునే దేవుడు పరమ శివుడు. ఆయన కైలాసంలో ఉంటాడు. అదొక వెండి కొండ.

స్వర్గం, నరకం ఇవన్నీ భూమికి ఎగువన ఉన్నాయంటున్న అనేక లోకాలు ఉన్నమాట వాస్తవమే అయితే.. అక్కడికి వెళ్లటం మనకు ఎందుకు సాధ్యం కావటం లేదు. అసలు ఇలా ఉన్నాయంటున్న లోకాల్లో ఈ దేవీ దేవతల ఆవాసం నిజమేనా? వాళ్లు ఎలా వుంటారు? ఏ రూపంలో ఉంటారు.. ఏం తింటారు? ఎలాంటి బట్టలు కట్టుకుంటారు? ఏ రకమైన వాతావరణంలో ఉంటారు? ఆయా లోకాల నుంచి మనకు తెలియకుండా.. మన ప్రమేయం లేకుండా.. మనల్ని అంటే ఈ భూమిని పరిపాలిస్తున్నారా? అన్నీ అనుమానాలే?



క్రైస్తవ, యూదు చిత్రాల్లో ఆకాశం నుంచి దేవతలు వచ్చి వెళ్లినట్టున్న దృశ్యాలు,
కోణార్క దేవాలయంలో రథ చక్రం

అసలు దేవుడు లేనే లేనప్పుడు డిస్కషనే వేస్టంటారు హేతువాదులు. వాస్తవమే.. కళ్లముందు కనిపించని దాని గురించి ఉన్నదని కానీ, లేదని కానీ, ఎలా చెప్పగలం? ఎలా చర్చించగలం? కానీ, మనిషి తనకు ఊహకైనా తెలియకుండా ఒక విషయం గురించి కానీ, ఒక వ్యక్తి గురించి కానీ, ఒక శక్తి గురించి కానీ, భావన చేయటం సాధ్యమేనా? ఏదైనా విషయం గురించి ఆలోచిస్తున్నాడంటే, చర్చిస్తున్నాడంటే.. అందుకు సంబంధించి ఏదో ఒక చిన్న ఘటన కానీ, తనకు అనుభవంలోకి వచ్చి ఉండాలి.. అందుకు సంబంధించిన అనుభూతి కలిగి ఉండాలి. దాన్నుంచే ఆ ఘటన గురించి కానీ, కలిగిన అనుభూతి గురించి కానీ ఆలోచన మొదలవుతుంది. దాని నిజానిజాలు.. వ్యక్తావ్యక్తాల గురించిన భావనకు బీజం పడుతుంది. తన సృష్టికి కారణం ఎవరన్న దానిపై మనిషి తపన మొదలై ఉండాలి. మనిషి మేధస్సును తొలిచి వేస్తున్న దేవతల గురించిన ఆలోచన కూడా ఈ విధంగా వచ్చిందే కావచ్చు. దేవతలకు సంబంధించిన కథలు, బొమ్మలు హిందూ పురాణాల్లో, ఇతిహాసాల్లో, ఆలయాల పైనా చాలానే కనిపిస్తాయి. వేల ఏళ్ల నాటి నిర్మాణాలపైనా చిత్రాల రూపంలో దేవీ దేవతల కథలు ఉంటాయి. రకరకాల రూపాల్లో, రథాలపైనా, గుర్రాల పైనా, యుద్ధం చేసుకుంటున్న బొమ్మలు ఎన్నెన్నో ఉన్నాయి. మన ఇతిహాసాల్లో ఆకాశవాణి పలుకుతుంది.. భవిష్యవాణి చెప్తుంది. దేవుడు ఆగ్రహిస్తే, మబ్బులు

ఉరుముతాయి.. మెరుపులు మెరుస్తాయి.. దివి నుంచి గంగ భువికి దిగి వస్తుంది.. భూమి సస్యశ్యామలమవుతుంది.. ఇవన్నీ ఆకాశం నుంచే జరుగుతున్నాయి. అంటే భూమికి ఎగువన ఉన్న లోకాల నుంచి.. ఇలాంటి కథనాలు మన హిందూయిజం లోనే కాదు.. క్రైస్తవ చరిత్రలోనూ ఇది మనకు చాలా క్లియర్‌గా కనిపిస్తుంది. అతీంద్రియ శక్తులు వున్నట్లు క్రిస్టియానిటీకి చెందిన ప్రాచీన పెయింటింగ్‌లలో మనకు కనిపిస్తుంది. ఏసుక్రీస్తు బాప్టిజం తీసుకున్న సందర్భంలో ఆకాశం నుంచి దివ్యమైన వెలుగు ఆయనపై ప్రసరించినట్లు కథనం ఉంది. అంతే కాదు క్రీస్తును శిలువ వేస్తున్న సందర్భంలో దేవతలు భూమిపైకి వచ్చి ఆ సన్నివేశానికి సాక్షులుగా నిలిచినట్లూ చెప్తారు.. ఈ కథలు, కథనాలన్నీ కూడా దేవీ దేవతల మూలాలను చెప్తున్నాయి. ఈ కథలన్నింటికీ ఆధారాలు ఏమున్నాయి..? అంటే ఇవాళ ఆధునికంగా సైన్స్ పరిశోధిస్తున్న, ప్రస్తావిస్తున్న ఏలియన్స్ ఈ కథనాలకు మూలమేమో? విశ్వంలో ఎక్కడో ఏదో ఒక చోట ఉన్నారని భావిస్తున్న గ్రహాంతర వాసులనే మన ప్రాచీనులు దేవతలుగా భావించి ఉండవచ్చు. స్టీఫెన్ హాకిన్స్ వంటి శాస్త్రవేత్తలు చెప్తున్నట్లుగా ఏలియన్స్ ఉన్నాయన్న మాటే వాస్తవమైతే వీళ్లను మన పూర్వీకులు చూసి వుంటారా? మనకన్నా శక్తిమంతులైన వాళ్ల నుంచి మేలు పొందారా? అన్నది సందేహం.

గ్రహాంతర వాసులు ఎలా ఉండవచ్చన్నదానికి ఆధారాలు మనకు స్పష్టంగానే లభిస్తున్నాయి. ఏసుక్రీస్తుకు పూర్వం అయిదు వేల ఏళ్ల సంవత్సరాలకు పూర్వమే గ్రహాంతర వాసులను నాటి ప్రజలు గుర్తించారు. వాళ్లరూపు రేఖలను భావితరానికి అందించారు. ఇరాన్‌లో కొంతకాలం క్రితం తవ్వకాల్లో బయట పడ్డ విగ్రహాలు ఇవే. ఈజిప్ట్ పిరమిడ్లలోనూ ఇలాంటి బొమ్మలు మనకు కనిపిస్తాయి. మన దేశంలోనూ, మొహంజదారో ప్రాంతంలోనూ ఇలాంటి చిత్రవిచిత్రమైన వేషాలు ఉన్న విగ్రహాలు, చిత్రాలు కనిపిస్తాయి. సైంటిస్టుల వాదనలకు మన పురాణాలు, క్రిస్టియానిటీలోని చిత్రాలు ఆధారాలు కాకపోవచ్చు. కానీ, ఎగిరే పళ్లాల రూపంలో చాలా చోట్ల కనిపించిన స్పేస్ షిప్‌లు ఇందుకు మూలం.

ఇలాంటి ఎగిరే పళ్లాలను ప్రపంచంలో చాలా మంది చాలా చోట్ల చూశారు.. రెండు మూడేళ్ల క్రితం ప్రపంచ వ్యాప్తంగా దీనిపై కలకలమే రేగింది.. మన దేశంలోనూ కొన్ని నగరాల్లో ఫ్లైయింగ్ సాసర్లు కనిపించాయి. ఇవి నిజంగా గ్రహాంతరవాసుల వాహనాలేనా అన్నది తేలనైతే తేలలేదు. కానీ, లక్షల కిలోమీటర్ల వేగంతో దూసుకువచ్చి కనురెప్ప పాటులో మాయమైపోయే ఈ వస్తువులకు యుఎఫ్‌ఓలని పేరు పెట్టారు. వీటిపైన తీవ్రస్థాయిలోనే పరిశోధనలు జరుగుతున్నాయి. చివరకు నాసా ప్రయోగించిన చాలా ఉపగ్రహాల చుట్టూ గ్రహాంతర వాసులు తిరుగుతున్నారనే అనుమానాలు పెరుగుతున్నాయి. దీనికి సంబంధించిన దృశ్యాలు అవే ఉపగ్రహాలు తీసిన వీడియోల్లో కనిపిస్తున్నాయి.

వాస్తవానికి 1947 జూలైలో మెక్సికోలో జరిగిన ఓ విచిత్రమైన విమాన ప్రమాదం ఫ్లైయింగ్ సాసర్లపై పరిశోధనలకు నాంది పలికింది. రాస్‌వెల్క్ సమీపంలో స్పేస్‌షిప్

కూలిపోవటం, నాలుగు వింతజీవుల మృతదేహాలు అందులో ఉన్నట్లు యుఎఫాలజిస్టుల వాదన. అదే అంతరిక్ష విమానమని, మృతదేహాలు గ్రహాంతర వాసులవనీ వారి వాదన. దీనిపై అమెరికా సర్కారు ఇప్పటికీ పెదవి విప్పలేదు.. రాస్వెల్క్ ఘటనతో ప్రపంచంలో ఎగిరే పళ్లాల గురించిన చర్చ మొదలైంది కానీ, వీటి లింక్ మన పురాణాల్లోనూ కనిపిస్తుంది. విష్ణుమూర్తిని అత్యంత వేగంగా తీసుకుపోగల వాహనం గరుత్మంతుడు.. అలాగే మిగతా దేవతలకూ రకరకాల వాహనాలు ఉన్నాయి. అంతెందుకు ఎంతమంది ఎక్కినా మరొకరికి చోటునిచ్చే పుష్పక విమానమూ దేవతల దగ్గర ఉంది. ఈ వాహనాలను, పుష్పక విమానాన్ని ఎగిరే పళ్లాలు– అదే యుఎఫ్ఓలతో పోల్చుకోవచ్చా? కొంచెం స్థిమితంగా ఆలోచిస్తే ఇదీ వాస్తవమే అనిపిస్తుంది. ఎందుకంటే ఇతర గ్రహాలకు చెందిన వాళ్లు మనకంటే చాలా చాలా తెలివైన వాళ్లు, శక్తిమంతులు కదా.. పైలోకాల్లో ఉన్న దేవతలు టెక్నికల్‌గా మన గ్రహానికి చెందిన వాళ్లు కాదు కాబట్టి వాళ్లు కూడా గ్రహాంతర వాసులే.. అందుకే వాళ్ల వాహనాలు యుఎఫ్ఓలు అయ్యే అవకాశం ఉంది.. బాల యేసుతో మేరీమాత ఉన్నట్లుగా వేసిన చిత్రపటాల్లోనూ ఎగిరే పళ్లాలు కనిపిస్తాయి. ఇంతెందుకు.. ఏసుక్రీస్తుకు సంబంధించిన ప్రతి చితపటంలోనూ గాల్లో తేలే వింత వస్తువులు ఉంటాయి. క్రీస్తును శిలువ వేస్తున్న సందర్భంలో దేవతలు వచ్చింది ఫ్లయింగ్ సాసర్లలోనే అని మనం గమనించవచ్చు. ఇప్పటి పరిశోధనలు గ్రహాంతర వాసుల ఉనికిని స్పష్టం చేస్తున్నాయి.. నాటి చిత్రపటాలు, శిల్పాలు, విగ్రహాలు దేవతల ఉనికిని చాటి చెప్తున్నాయి..

ఆయుధాలు, విమానాల తయారీ గురించి మన పూర్వీకులు గ్రహాంతర వాసుల నుంచే నేర్చుకున్నారని ఊహించవచ్చు. రాతియుగం నాటి ఆనవాళ్లలో చిత్ర విచిత్ర ఆకారాలు, ఆయుధాలు కనిపించటం, వాహనాల్లో తిరగడాన్ని సూచిస్తున్నాయి. ఇప్పుడు అడపాదడపా రోదసి నుంచి భూమ్మీదకు వస్తున్నాయంటున్న ఏలియన్స్, యుఎఫ్ఓలు కూడా ఇదే విధంగా కనిపిస్తున్నాయి.. వీటి మర్మమేమిటి? అత్యంత వేగంగా జెట్ ఇంజన్‌తో రోదసిలోకి వెళ్లి రాగల విమానాలను మనవాళ్లు తయారు చేసినట్లు చూశాం.. అంటే ఆనాడే ఇతర గ్రహాలకు మనుషులు పయాణించారా? క్రిస్టియానిటీ చిత్రాలలో శాటిలైట్ వంటి యంత్రం పక్కన జీసస్ కూర్చుని ఉన్నట్లు కనిపిస్తుంది. ఈ యంత్రం అచ్చంగా స్పుత్నిక్ ఉపగ్రహం లాగానే ఉంటుంది. అంటే రోదసిలో ఉన్న గ్రహాంతర వాసులతో మొదటి నుంచి భూమి మీద ఉన్న వారికి సంబంధాలు ఉన్నాయని భావించవచ్చు. అయితే ఈ సంబంధాలు ఎప్పుడు ఎలా దెబ్బ తిన్నాయనేది అర్థం కాదు.. చాలా కాలం తరువాత తిరిగి ఏలియన్స్ కనిపిస్తున్నాయి. చాలా మంది తాము ఫ్లైయింగ్ సాసర్లను చూశామని చెప్తున్నారు. దేవతలంటే గ్రహాంతర వాసులని కొందరంటారు.. వాళ్లు గ్రహాంతర వాసులు కారు.. దేవతలేనని ఆస్తికులంటారు. అలాంటి గ్రహాంతరవాసులు మొదట్నుంచీ భూమితో చెలిమి చేస్తూ వచ్చారా? వాళ్ల జీవిత కాలానికీ, మన జీవిత కాలానికీ ఏదైనా తేడా ఉందా? వారికి ఉన్న అపురూపమైన శక్తి సామర్థ్యాలను, టెక్నాలజీని మనుషులతో

పంచుకున్నారా? అవుననే అనిపిస్తుంది.. ఎందుకంటే రామాయణ, భారత, క్రీస్తు కాలాలలో మన సమాజంలో కనిపించే అపూర్వ టెక్నాలజీకి, ఏలియన్స్ టెక్నాలజీకి దగ్గరి సంబంధం ఉన్నట్లు కనిపిస్తుంది. ఆనాటి విమానాలు కానీ, ఆయుధాలు కానీ, మన కాలానికి ఎన్నో రెట్లు అడ్వాన్స్‌డ్ స్టేజిలో ఉన్నట్లు తెలుస్తుంది. మన పురాణాల్లో ఖగోళంలో ఏ గ్రహం ఎంతకాలానికి ఎంత దూరం ఏ విధంగా ప్రయాణం చేస్తుందో లెక్కించారు.. సూర్య, చంద్ర గ్రహణాలు ఎప్పుడు వస్తాయో ఖచ్చితంగా చెప్పగలిగారు.. అంతే కాదు.. దేవతలకూ, మనుషుల జీవిత కాలాలకు సంబంధించిన లెక్కలు కట్టారు.. ఇవన్నీ ఎలా సాధ్యమయ్యాయి? ఏ ప్రాతిపదికన మన వాళ్లు ఈ లెక్కలు వేయగలిగారు? భాగవత పురాణంలో బ్రహ్మ జీవిత కాలాన్ని మనుషుల జీవిత కాలంతో పోలుస్తూ వ్యాసుడు కట్టిన లెక్కలు కనిపిస్తాయి. దీని ప్రకారం, 360 మనిషి సంవత్సరాలు దేవతలకు ఒక సంవత్సరం. 12 వేల దేవతల సంవత్సరాలు ఒక చతుర్యుగం.. అంటే కృత, త్రేత, ద్వాపర కలియుగాలన్నమాట. మన మనుషుల లెక్క ప్రకారం ఒక చతుర్యుగం అంటే 4లక్షల 32 వేల సంవత్సరాలన్నమాట. ఇలాంటి చతుర్యుగాలు 2000 పూర్తయితే బ్రహ్మకు ఒక రాత్రి, పగలు అన్నమాట.. అంటే ఒక రోజు గడిచినట్లు. బ్రహ్మకు ఇలాంటి రోజులు 360 గడిస్తే ఒక సంవత్సరం అయినట్లు. ఇలాంటి సంవత్సరాలు వంద పూర్తయితే బ్రహ్మ జీవిత కాలం ముగిసినట్లు.. అంటే మన మనుష్యుల కాలమానం ప్రకారం బ్రహ్మ జీవించే కాలం అక్షరాలా 3,11,040,000,000 రోజులన్నమాట. దీని తరువాత ప్రళయం వస్తుందని, ఆ తరువాత మళ్లీ సృష్టి మొదలవుతుందని భాగవతం చెప్తోంది. ఈ లెక్కల ప్రకారం దేవతలు అమరులనటంలో ఆశ్చర్యం లేదు.. ఎందుకంటే మనతో పోలిస్తే 36వేల సంవత్సరాలు గడిస్తే తప్ప వాళ్లకు వందేళ్లు పూర్తి కావు.. అయితే ఈ కాలమానాన్ని మన వాళ్లు ఎలా లెక్క కట్టగలిగారు అన్న ప్రశ్నకు స్పష్టమైన సమాధానం లభించకపోవచ్చు. కానీ ఖగోళ శాస్త్రాన్ని, నక్షత్రాల కదలికలను అంచనా వేయటంలో ఆరితేరిన వారు కాబట్టి ఇతర గ్రహాలలో ఉండే జీవరాశుల జీవిత కాలాన్ని ఈ విధంగా లెక్కించి వుండవచ్చు. పురాణాల్లో చెప్పినట్లు భూమికి ఎగువన ఉన్న లోకాల్లో సత్యలోకం అన్నింటి కంటే పైన ఉన్నది.. బ్రహ్మ ఉండేది కూడా సత్యలోకంలోనే. అంటే భూమి నుంచి ఎగువన ఉన్న గ్రహాల వైపు వెళ్తున్న కొద్దీ కాల గమనంలో మార్పు వస్తుందన్న మాట. రోదసి.. అనంతమైన విశ్వం.. మొదలెక్కడో తెలియదు.. తుది ఏమిటో అంతకంటే తెలియదు. ఈ విశ్వాంతరాళంలో భూమి పరిమాణం చాలా చాలా చాలా చిన్నది.. దీనికి ఎన్నో రెట్లు పెద్దవైన గ్రహాలు రోదసిలో కోట్ల సంఖ్యలో ఉన్నాయి.. వీటిలో ఎక్కడో భూమిలాంటి గ్రహం ఉండి ఉండవచ్చు. అక్కడా మనలాగే జీవరాశి ఉండనూ వచ్చు.. స్పేస్‌లో పాలపుంతలు ఒకటి కాదు.. వేల సంఖ్యలో ఉన్నాయి. సౌరమండలాలకు లెక్కలేదు.. దూరాలకు అంతే లేదు. మన సౌర మండలమే దాదాపు 14 వందల కోట్ల మైళ్ల మేర ఉంది. దాని తరువాత మిల్కీవేల గురించి చెప్పేదేముంది.. భూమి కంటే ఎంతో పెద్దవైన గ్రహాలు మన సూర్యుడి

కంటే ఎన్నో రెట్లు పెద్దవైన సూర్యుల చుట్టూ తిరుగుతూ ఉండవచ్చు.. అందుకే దేవతల కాలమానానికి, మన కాలమానానికి తేడా ఉంది. ఒక దేశానికి, ఇంకో దేశానికీ మధ్యనే టైమ్‌లో చాలా తేడా కనిపిస్తుంది మనకు. ఇక రోదసిలో గ్రహాల మధ్య కాలంలో డిఫరెన్స్ ఉండటంలో ఆశ్చర్యమేముంది? గ్రహాల మధ్య దూరం, గ్రహాల మధ్య భ్రమణాన్నిబట్టి ఆయా గ్రహాలలో ఉండే జీవరాశుల జీవిత కాలాన్ని మన వాళ్లు అంచనా వేశారు. ఈ విధంగానే వారి శక్తి సామర్థ్యాలనూ ఏ స్థాయిలో ఉంటాయో రుచి చూశారు. ఇదిగో ఇవాళ ఏలియన్‌లు తిరుగుతున్నాయంటున్న యుఎఫ్‌ఓలు, నాడు దేవతలు తిరిగారంటున్న పుష్పక విమానం ఒకటే కావచ్చని పరిశోధనలు చేస్తున్న శాస్త్రవేత్తల్లో కొందరి అభిప్రాయం. ఈజిప్ట్, ప్రపంచంలో అత్యంత ప్రాచీన నాగరికత ఉన్న దేశం.. ఇక్కడ బయటపడ్డ పిరమిడ్‌లు అనేక చారిత్రక రహస్యాలను విప్పి చెప్తాయి. ఇక్కడి కింగ్ జోసెఫ్ పిరమిడ్ నాలుగు వేల సంవత్సరాల నాటిది. ఇక్కడ తవ్వకాలు జరుపుతున్నప్పుడు చిన్న చెక్కతో తయారు చేసిన పక్షి బొమ్మ దొరికింది. అక్కడ కనిపించిన రాతల్లో ఐ వాంట్ టు ఫ్లై అన్న మాటలూ వున్నాయి. ఈ బొమ్మను నిశితంగా గమనిస్తే, దానికి పక్షిలాగా కళ్లు రెక్కలు ఉన్నాయి. కానీ, రెక్కలు సాధారణ పక్షికి ఉన్నట్లు కాకుండా విమానపు రెక్కలను తలపిస్తున్నాయి. ఆధునిక ఎయిర్‌క్రాఫ్ట్‌కు ఇది నమూనాలాగా ఉంది. అటు కొలంబియాలో దొరికిన ప్రాచీన ఆనవాళ్లలో సైతం చేప ఆకారంలో ఉన్న అనేక వస్తువులు ఉన్నాయి. ఇవన్నీ మోడర్న్ ఎయిర్ షిప్‌కు సంకేతంగా భావిస్తున్నారు. మన దేశంలో సంస్కృత గ్రంథాల్లో, శాసనాల్లో విమాన శాస్త్రం ఉంది. క్రీస్తుకు పూర్వం దాదాపు 6వేల సంవత్సరాల క్రితమే భారతీయులు విమానాన్ని తయారు చేసే ప్రక్రియను కనుక్కున్నారు. ఈ విమానాల్లో కొన్ని ఒక విధమైన జెట్ ఇంజన్‌తో నడిచేవని శాస్త్రవేత్తలు చెప్తారు.. ఈ విమానాలు గాల్లోకి ఎగిరే సమయంలో తీవ్రవేగంతో, భారీ ఇంధన వినియోగంతో, పేలుళ్లు జరిగేవని అంటారు.. ఒక్క మాటలో చెప్పాలంటే ఆధునిక యుగంలో అంతరిక్షంలోకి ప్రయోగించే ఉపగ్రహ వాహక నౌకల్లాంటివే ఇవి. ఈ విమానాల్లో ఎలక్ట్రిసిటీ పవర్ ఉండేదిట.. ఇందుకోసం మెర్క్యురీని ఇంధనంగా వాడేవారు.. ఇందులో ప్రయాణికులకు చోటు ఉన్నట్లే.. వార్‌హెడ్ కూడా ఉండేది. ఈ విమానం ద్వారా ఆయుధాన్ని కూడా ప్రయోగించే వీలుంది.. ఆధునిక మిలటరీ విమానానికి భారతీయ విమాన శాస్త్రంలో చెప్పిన విమానాలు ఎంతమాత్రం తీసిపోవని శాస్త్రవేత్తలే అంటున్నారు. పుష్పక విమానం కూడా ఇలాంటిదే.. రెండు అంతస్థుల్లో ప్రయాణికులను తీసుకుని వెళ్లగలిగే సామర్థ్యం ఉన్న అతి పెద్ద విమానం ఇది. రావణవధ తరువాత రాముడు ఇదే విమానంలో అయోధ్యకు లంక నుంచి వెళ్లాడట. ఇంత టెక్నాలజీ మన వారికి అంత ప్రాచీన కాలంలో ఎలా లభించింది.. అన్న ప్రశ్నకు జవాబే ఫ్లైయింగ్ సాసర్.. ఎలియాస్ యుఎఫ్‌ఓ. గత అర్థ శతాబ్దంలో ప్రపంచంలో చాలా చోట్ల లిప్తపాటులో కనిపించి వెళ్లిపోతున్న ఫ్లైయింగ్ సాసర్‌లోని టెక్నాలజీ, మన విమానాల్లో వినియోగించిన పరిజ్ఞానమూ దాదాపు ఒకటేనన్న అభిప్రాయం వ్యక్తమవుతుంది. ఇది పూర్తిగా నిర్ధారణ

కాకపోయినప్పటికీ ఈ దిశగా పరిశోధనలు జరుగుతున్నాయి. ఇవి రెండు ఒకటే అయితే, గ్రహాంతర వాసులతో మన ప్రాచీనులకు ఉన్న అనుబంధం స్పష్టమవుతుంది. దేవతలు అనగానే మనకు గుర్తొచ్చేది వారి చేతుల్లో ఉండే వివిధ ఆయుధాలు.. కత్తులు, గదలు, బాణాలు, ఇంకా రకరకాలు. ఈ అస్త్రాలతోనే దేవతలు బీభత్సాన్ని సృష్టించారా? అంటే అవుననే చెప్పాలి. ఇవి సాధారణ ఆయుధాలు కావు.. సామూహిక జనహననాన్ని సృష్టించే భయానక అస్త్రాలు.. 1945 జూలై 16న మెక్సికో సరిహద్దుల్లో అమెరికా అణ్వస్త్ర ప్రయోగాన్ని సక్సెస్‌ఫుల్‌గా జరిపింది. దాదాపు వంద మైళ్ల ఎత్తున అ రేడియో ధార్మికత ఎగిసిపడింది. అమెరికా అణ్వస్త్రాన్ని 1945లో ప్రయోగించింది. కానీ, దానికంటే ఎన్నో ఏళ్ల క్రితం అంటే ప్రాచీన కాలంలోనే, ముఖ్యంగా భారతదేశంలో అణ్వస్త్రాలు వున్నాయనటానికి ఆధారాలు ఉన్నాయి. కృత యుగంలో జరిగిన రావణుడితో యుద్ధం చేసిన రాముడు అతనిపై రామబాణాన్ని ప్రయోగించి వధించాడు.. అది న్యూక్లియర్ పవర్ ఉన్న బాంబుగా భావిస్తున్నారు.. ఎందుకంటే లంకలో రామ రావణ యుద్ధం ఎక్కడైతే జరిగిందని భావిస్తున్నారో, అక్కడ ఇవాళ్టికీ గడ్డి పరక కూడా మొలవదు. అంతే కాదు.. మహాభారత యుద్ధంలో మన వారి చేతుల్లో బ్రహ్మాస్త్రం ఉండేది.. అదే అణ్వస్త్రమని ఇప్పటి శాస్త్రవేత్తల అభిప్రాయం.. భారత ఇతిహాసాల్లో ఎగిరే రథాలు కనిపిస్తాయి. వాటిపై యుద్ధం చేస్తున్నవారి చేతుల్లో అపూర్వమైన ఆయుధాలు కనిపిస్తాయి. అటు క్రిస్టియానిటీ ప్రాచీన గ్రంథాల్లోనూ, బైబిల్లోనూ ఈ న్యూక్లియర్ పవర్ గురించిన ప్రస్తావన కనిపిస్తుంది. దేవతలు, గ్రహాంతర వాసులు ఒకరే. ఎందుకంటే భూమిపై నివసించని వారంతా గ్రహాంతర వాసులే. దేవతలు ఎలా ఉంటారు. వారి శక్తి సామర్థ్యాలు ఏ స్థాయిలో ఉన్నాయన్న దానిపైనా, ఖగోళ శాస్త్రంపై, గ్రహాలు, జీవరాశులపైనా ప్రాచీన కాలంలోనే అనేక పరిశోధనలు జరిగినట్లు స్పష్టమవుతోంది. ఆనాటి ఆనవాళ్లను ఆసరా చేసుకుని ముందుకు పోగలిగితే ప్రపంచానికి ఇంతవరకూ అందని సృష్టి రహస్యాన్ని ఛేదించటం కష్టమేం కాదు. గ్రహాంతర వాసులు భూమిని అంతం చేసే దిశగా ఆలోచిస్తున్నారన్న కోణంలోనే భూమిపై ప్రయోగాలన్నీ సాగుతున్నాయి. మనం ఇతర గ్రహాల గురించి ఎలా ఆలోచిస్తున్నామో.. ఇతర గ్రహాల్లో జీవరాశులు ఉంటే ఆ జీవరాశులు మన గురించి అలాగే ఆలోచించటంలో, భూమి మీదకు వచ్చి వెళ్లటంలో ఆశ్చర్యం లేదు. ఇప్పటివరకు గ్రహాంతర వాసులు భూమికి అన్యాయం చేసినట్లు కనిపించలేదు. ప్రాచీన కాలంలోనూ మనకు మేలు చేసినట్లే కథనాలు, చిత్రాలు ఉన్నాయి. అందుకేనేమో వారిని దేవతలన్నారు.. దేవతలే వారేమో.. అలాంటప్పుడు ఆ గ్రహాంతర వాసుల గురించి పాజిటివ్‌గా ఆలోచనలు చేస్తే అన్వేషణ సరైన దిశలో వెళ్తుంది. దేవతల గురించి ఇంతకాలంగా దాగి ఉన్న కీలకమైన రహస్యాన్ని ఛేదించటానికి దారి కనిపిస్తుంది.